శ్రీరస్తు.

శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః.

శ్రీమన్నారదగర్గాదిమహర్షిశ్రేష్ఠుల
మతానుసారముగ
శ్రీమదనంతయాజిపుత్రనారాయణభట్టుచే
రచియింపఁబడిన

# ముహూర్తమార్తండము.

మార్తండవల్లభాఖ్యవ్యాఖ్యానసహితము
ఈ గ్రంథము,
బ్రహ్మశ్రీ, నోరి - గురులింగశాస్త్రులవారిచే
రచియింపఁబడిన
ప్రతిపదటీకాతాత్పర్యసహితముగ
చన్నపురి
బరూరు - త్యాగరాయశాస్త్రులచే

స్వకీయ
గీర్వాణభాషారత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడెను.
౧౯౧౧ సం.







ఈ ముహూర్తమార్తండము మొదలగు జ్యోతిశ్శాస్త్ర, ధర్మశాస్త్రగ్రంథములు వలయువారలు చెన్నపట్టణము - గోవిందప్పనాయని వీధి (౨౧౬) వ-నెంబరు గల గృహమునందుండు బరూరు-త్యాగరాయశాస్త్రులపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును. దీనిక్రయము రూపాయలు ౧—౦—౦ తపాల్ ఛార్జి (౪) అణాలు.

☞ వాల్యూపేయబిల్ తపాల్ ద్వారా సహా పంపబడును.

బరూరు త్యాగరాయశాస్త్రులు.



శ్రీరస్తు.

## ముహూర్తమార్తండ విషయసూచిక.

పుటసంఖ్య. పుటసంఖ్య.





పుటసంఖ్య. పుటసంఖ్య.



(*)

ముహూర్తమార్తాండ విషయసూచిక
సమాప్తము.





శ్రీ ర స్తు.

శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః.

# ముహూర్తమార్తండము.

# ప్రతిపదటీకాతాత్పర్యసహితము.

మూ॥ మార్తండో వతువాచం నో పాదైర్జాడ్య తమోహరః।
వృత్తబద్ధ తనుస్సేవ్యో ఽభీష్టదో విశ్వలోచనః॥

అర్థద్వయవాచీ॥ తత్రప్రథమం సూర్యపక్షే॥ మార్తండః శ్రీసూర్యః - నోస్మాకంవాచం అవతురక్షతు - కింలక్షణోమార్తండః - వృత్తబద్ధతనుః - వృత్తేమండలేబద్ధాసుర్యస్యతథా ॥ తథాచస్మృతౌ ॥ సకలం ఖచక్రంరవిమండలేస్థితం ఈశేశయంకాంతమనంతమచ్యుతమిత్యాది-శ్రుతిరపి - యఏషఏతస్మిన్మండలే పురుషస్సోగ్నిరిత్యాది ॥ పునఃకింలక్షణః-పాదైః కిరణైః - జాడ్యతమోహరః - జాడ్యంపాతకంశీతంవాతిమోంధకారస్తద్ధరతీతితథా ॥ పునఃకింలక్షణః - సేవ్యః సేవితుంయోగ్యః సేవ్యః-అభీష్టఫలదాతృత్వాత్ పునఃకింలక్షణః-అభీష్టదః - సేవితస్సన్నభీష్టఫలదాయీత్యర్థః పునఃకథంభూతః - విశ్వలోచనః - విశ్వంలోచ్యతే ఽనేనేతి విశ్వలోచనః- లోకచక్షుర్మహేశ్వర ఇత్యాదిత్యహృదయే ఉక్తత్వాత్। ప్రకాశకత్వాత్ ॥ అథగ్రంథపక్షే ॥ మార్తండోముహూర్తమార్తండః- సః - వాచం అవతు - కింలక్షణః - వృత్తబద్ధతనుః - వృత్తైఃస్రగ్ధరిణీశార్దూలవిక్రీడితాదీని - తైర్బద్ధాతనుర్యస్యతథా ॥ పునఃకిం ॥ పాదైర్జాడ్యతమోహరః - పాదైర్వృత్తచరణైఃజాడ్యం మూర్ఖత్వంతదేవతమస్తద్ధరతీతితథా - పునఃకిం - సేవ్యఃనిరంతరం పఠనీయఇత్యర్థఃపునఃకిం - అభీష్టదః- యథోక్తముహూర్తవ్యుత్పత్తికరణాదభీష్టార్థసిద్ధికారీత్యర్థః। పునః కిం - విశ్వలోచనః - సమస్తప్రకాశకత్వాత్ ॥౧॥

మూ॥ కుర్వే ముహూర్తమార్తండటీకాం మార్తండవల్లభాం।
ఇయమం కల్పమేతేన ... ప్రాజ్ఞానేశ్మసు॥ ౨॥

ఇహ శాస్త్రే తావత్సంబంధాభిధేయప్రయోజనాన్యావశ్యం బహిష్కృణివిన్నస్య మిదం వేదాంగమితి సంబంధః । ఉక్తంచ నారదమునినా స్వసంహితాయాం ॥ వేదస్య నిర్మలం చక్షుర్జ్యోతిశ్శాస్త్రమనుత్తమం । అస్య శాస్త్రస్య సంబంధో వేదాంగమితి ధాతృత ఇతి । అత్రాప్యుక్తం పూర్వవాక్యార్థమాదాయ గ్రంథోఽయం రచితో లఘురితి ॥ త్యాజ్యనక్షత్రాద్యర్తు లగ్నగోచరం గర్భాధానాదిసంస్కార వివాహాగ్న్యాధానవాస్తుయాత్రామిశ్రానధ్యాయపల్లీగృహగోచర సంక్రాంతికథనమభిధేయం- తథా చ నారదః ॥ అభిధేయంచ జగతశ్శుభాశుభనిరూపణమితి ॥ అస్య ప్రయోజనం ముహూర్తే నానాకార్యసాధనం । అస్య సమ్యక్ జ్ఞానాన్మోక్షో వాప్తిరితి వా ॥ కిమేభిరుక్తైరిత్యత్రోచ్యతే । నృణాం సంబంధాభిధేయ ప్రయోజనకథనాత్ శాస్త్రే ప్రవృత్తిర్జాయతే ॥ ఉక్తంచ ॥ సిద్ధిశ్శ్రోతృప్రవృత్తీనాం సంబంధకథనాద్యతః । తస్మాత్సర్వేషు శాస్త్రేషు సంబంధః పూర్వ ఉచ్యతే ॥ కిమేవాత్రాభిధేయం స్యా దితి పృష్టస్తు కేనచిత్ । యది న ప్రోచ్యతే తస్మై ఫలం శూన్యం తు తద్భవేత్ ॥ సర్వస్యైవ హి శాస్త్రస్య కర్మణో వాపి కస్యచిత్ । యావత్ప్రయోజనం నోక్తం తావత్తత్కేన గృహ్యత ఇతి ॥ ఇహ శాస్త్రే కస్యాధికార ఇతి ప్రోచ్యతే - ద్విజస్యైవ వేదాంగత్వాత్ - యతష్షడంగో వేదో హి ద్విజైరేవాధ్యయనీయో జ్ఞాతవ్యశ్చ ॥ తథా చోక్తం ॥ భాస్కరీయ సిద్ధాంతశిరోమణౌ ॥ తస్మాద్ద్విజైరధ్యయనీయమేతత్పుణ్యం రహస్యం పరమం పవిత్రం । యో జ్యోతిషం వేత్తి నర స్స సమ్యగ్ధర్మార్థమోక్షాన్ లభతే యశశ్చేతి ॥ శిష్టాః శాస్త్రాదౌ చ శాస్త్రారంభే ॥ సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతా ఇతి శాస్త్రేణ సర్వారంభే వ్యంతరాయ ప్రాప్తా సత్యాం - ధర్మేణ పాపమపనుదతీతి శ్రుతిసిద్ధం ప్రయోజనమాస్థాయ ॥ స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవా ఇతి శ్రుతిలింగాచ్చ గ్రంథస్య నిష్ప్రత్యూహపరిసమాప్త్యై మంగళమాచరతి ॥ తస్మాదాశ్విన్యాందిస్సూనుః బ్రాహ్మణో నారాయణో నారాయణాచ్ఛాప్తమతి జ్యోతిశ్శాస్త్రసంహితాస్కంధం శిక్షిష్యర శేషప్రత్యూహోపశాంతయే అభిమత దేవతా నమస్కారలక్షణం మంగళపూర్వకం గ్రంథకరణప్రతిజ్ఞాం ప్రహర్షిణ్యాహ ॥

మూ॥ సిందూరోల్లసిత మిభేంద్రవక్త్రమంబాం శ్రీవిష్ణుం వియతి
చరాన్గురూన్ప్రణమ్య । బహ్వర్థం విబుధముదే లఘుం ముహూ
ర్తమార్తండం సుగమమహం తనోమి సిద్ధ్యై ॥ ౧॥

టీక ॥ సిందూరోల్లసితమ్ = సిందూరముచేతఁ బ్రకాశింపఁ



జేయఁబడిన, ఇభేంద్రవక్త్రమ్ = గజేంద్రముఖముకల విఘ్నేశ్వరుని, అంబామ్ = సరస్వతిని, శ్రీవిష్ణుమ్ = సంపత్కరుఁడగు నారాయణుని, వియతిచరాన్ = సూర్యాదినవగ్రహములను, గురూన్ = నిజగురువులను, (అనఁగా శాస్త్రోపదేశమును జేసిన గురువులను) ప్రణమ్య = నమస్కరించి, అహమ్ = (నారాయణుఁడను నామధేయముకల) నేను, సిద్ధ్యై = కార్యసిద్ధికొఱకును, విబుధముదే = విద్వాంసులకు సంతోషము కలుగుటకొఱకును, లఘుమ్ = అల్పమైనదియును, బహ్వర్థమ్ = విశేషములయిన యర్థములుగలదియును, సుగమమ్ = సులభముగఁ దెలియఁదగినదియును, ముహూర్తమార్తండమ్ = ముహూర్తమార్తండమను పేరుగల గ్రంథమును, తనోమి = చేయుచున్నాను.

తా ॥ సకలవిఘ్నములును నివర్తించుటకొఱకు ఇష్టదేవతా నమస్కారమనియెడు మంగళమును గ్రంథకరణప్రతిజ్ఞను ప్రహర్షిణీవృత్తముచేతఁ దెలుపుచున్నాఁడు. సిందూరముచేత ప్రకాశించుచున్న వాఁడును గజేంద్రునిదే ముఖముగాఁగలవాఁడును అయిన విఘ్నేశ్వరునకును, సరస్వతికిని, సంపత్కరుఁడగు నారాయణునకును, శాస్త్రోపదేశమును జేసిన గురువులకును, నమస్కారమును చేసి కార్యసిద్ధికొఱకును పండితులకు సంతోషము కలుగుటకొఱకును, అల్పమైనదియును అధికమైనయర్థముకలదియును, సులభముగఁ దెలియఁదగినదియును, అయిన ముహూర్తమార్తండమను గ్రంథమును చేయుచున్నానని తాత్పర్యము.

వ్యా ॥ సిందూరోల్లసితమితి ॥ సిందూరేణ ఉల్లసితం శోభాయమానం ఇభేంద్రవక్త్రం గజాననం - అంబాం - సరస్వతీం - శ్రీవిష్ణుం ప్రసిద్ధం - వియతిచరాన్ గ్రహాన్ - గురూన్ నిజగురూన్ - శాస్త్రోపదేష్టౄన్ ప్రణమ్య నమస్కృత్వా అహం నారాయణో ముహూర్తమార్తండం నామ గ్రంథం తనోమి విస్తారయామి ॥ కిమర్థం ॥ సిద్ధ్యై కార్యసాధనాయ -, పునః కిమర్థం - విబుధముదే - పండితహర్షాయ - హర్షకారణం విశేషణద్వారేణాహ - కింలక్షణం ముహూర్తమార్తండం - లఘుం - అతిశయేనాల్పం - అల్పే బహ్వర్థాభావశంకాం విశేషణద్వారా పరిహరతి - పునః కింలక్షణం - బహ్వర్థం - అర్థానాం బహుళం అల్పగ్రంథే బహ్వర్థే దుర్బోధశంకాం పరిహరతి - పునః కిం - సుగమం ప్రకటార్థమితి ॥

అథ నానా ముహూర్తార్థం స్వీయపుస్తకే వస్తుభేదకమనుక్రమణికాత్రయం త్రిభిః - శార్దూలవిక్రీడితైరాహ ॥

ర్వభవస్య=జ్యేష్ఠపుత్త్రునకు, జ్యేష్ఠమ్=జ్యేష్ఠమాసమును, పాపయుగిత్రైష్వర్క్షాణి = పాపగ్రహములతో చేరుచున్నవియును చేరినవియును చేరఁబోవుచున్నవియును అయిన నక్షత్రములను, విద్ధమ్ = (పాపగ్రహములచేత) వేధింపఁబడిన, భంచ=నక్షత్రమును, ఊనాఖ్యాధికమాసకౌ=అధికమాస క్షయమాసములను, విష్కంభావగండాంతిషు=విష్కంభము వ్యాఘాతము శూలము వజ్రము గండము అతిగండము. (అనునట్టి) యుతిషు=యోగములయందు, త్ర్యంకార్ధాంకరసర్తుపూర్వఘటికాః = మూఁడు తొమ్మిది అయిదు తొమ్మిదితొమ్మిది ఆఱుగడియలను, భానామ్=నక్షత్రములయొక్క, ఘటీః-గడియలను, శుభకర్మమునందు, సంత్యజేత్=విడిచిపెట్టవలయును.

తా॥ జన్మమాస జన్మతిథి జన్మనక్షత్ర జన్మలగ్నములను, చండాయుధమును, దుర్ముహూర్తమును, జ్యేష్ఠపుత్త్రునకు జ్యేష్ఠమాసమును, పాపగ్రహములతోఁ జేరుచున్నవియును చేరినవియును చేరఁబోవుచున్నవియును అయిన నక్షత్రములను, పాపగ్రహవిద్ధమగు నక్షత్రమును, అధికమాస క్షయమాసములను, విష్కంభము వ్యాఘాతము శూలవజ్రము గండము అతిగండము అనునట్టి యోగములయందలి మొదటివగు మూఁడుతొమ్మిది అయిదు తొమ్మిది తొమ్మిది ఆఱుగడియలను (అనఁగా ఈయోగములయందలి మొదటి యాగేసిగడియలను) నక్షత్రత్యాజ్యకాలములను శుభకర్మములందును విడిచిపెట్టవలయును.

వ్యా॥ మాసాద్యమితి॥ మాసాద్యం జనిసంభవం-జనిసంభవం-జనిరుత్పత్తిః తత్ర సంభవో యస్య తత్ ఏవంవిధం మాసాద్యం మాసప్రభృతి-జన్మమాసజన్మతిథి జన్మనక్షత్రాదిది - గ్రహణభం గ్రహణనక్షత్రం- చండాయుధం వక్ష్యమాణం - దుష్టముహూర్తో దుర్ముహూర్తః వక్ష్యమాణస్తం - జ్యేష్ఠసుప్రసవస్య ప్రథమజాతాపత్యస్య జ్యేష్ఠమాసం - పాపయుగిత్రైష్వర్క్షాణి పాపాః - పాపగ్రహాః వక్ష్యమాణాః - తేషామన్యతమేనయుక్ యదుక్తం- ఇదంగతం- భోక్ష్యంపురస్థితం - ఏతాని ఋక్షాణి నక్షత్రాణి - విద్ధంచ భం విద్ధనక్షత్రం - వక్ష్యమాణలక్షణం - ఊనాఖ్యాధికమాసకౌ - క్షయమాసాధికమాసౌ - వక్ష్యమాణలక్షణౌ - యుతిషుయోగేషు విష్కంభావగండాంతిషు - త్రి- ౩- అంక - ౯ - అర్ధ - ౫ - అంక-౯ - రస - ౬ - ఋతుః పూర్వఘటికాః విష్కంభః - వ్యాఘాతః - శూలః - వజ్రః గండః- ప్రసిద్ధః-అతిగండః - ఏషుయోగేషు క్రమేణ త్ర్యంకార్ధాంకరసర్తుసంఖ్యాకాః పూర్వఘటికాః॥ తద్యథా॥ విష్కంభే తిస్రో వ్యా



ఘాతే అంకాః నవ-శూలే-అర్ధా పంచ - వజ్రే-అంకాః-నవ - గండే రసాః-షట్-అతిగండే ఋతవః - షట్-ఇతి భానాం విషాఖ్యాః ఘటీః-భానాం అశ్విన్యాదీనాం నక్షత్రాణాం - విషాఖ్యాః ఘటీః వక్ష్యమాణలక్షణాః॥

మూ॥ లత్తాపంచకపాపవర్గ మశుభంచంద్రం దశారిష్టకం జన్మే
శేజ్యసితాస్తమంగ శశినోః క్రూరగ్రహోద్భవాంకర్తరీం।
రిష్టంగోచర సంభవంగ్రహ జనిప్రాంతోద్భవం సూత
కం దుస్స్వప్నాని మనోవిభంగ మపిచవ్యాధిం శుభేసం
త్యజేత్॥ ౮॥

టీక॥ లత్తా = లత్తయనుయోగము, పంచకపాపవర్గమ్=పంచకమునందలి పాపవర్గమును, అశుభమ్=అశుభుఁడగు, చంద్రమ్=చంద్రుని, దశారిష్టకమ్ = (జాతకశాస్త్రోక్తమగు) అరిష్టదశను, జన్మేశేజ్యసితాస్తమ్=జన్మరాశినాథుఁడును గురుశుక్రులును అస్తమయమును పొందినకాలమును, అంగశశినోః=లగ్నచంద్రులకు, క్రూరగ్రహోద్భవామ్ క్రూరగ్రహములవలనఁబుట్టిన, కర్తరీమ్=కర్తరీయోగమును, అరిష్టమ్=అరిష్టమనుయోగమును, గోచరసంభవమ్-దుష్టగ్రహాధిక్యమును, గ్రహజనిప్రాంతోద్భవమ్=గ్రహణము జననమరణములు అనువానివలనఁ బుట్టిన, సూతకమ్=ఆశౌచమును, దుస్స్వప్నాని = దుస్స్వప్నములను, అపిచ = ఇంతయేగాక, మనోవిభంగమ్ = అంతఃకరణము ప్రవర్తింపకపోవుటను, వ్యాధిమ్=వ్యాధిని, శుభే=శుభకర్మమునందు, సంత్యజేత్-విడిచిపెట్టవలయును.

తా॥ లత్తను, పంచకమునందలి పాపవర్గమును, అశుభుఁడగు చంద్రుని, జాతకశాస్త్రోక్తమైన యరిష్టదశను జన్మరాశినాథుఁడు గురుశుక్రులు అనువారు అస్తమయమును పొందినకాలమును, లగ్నచంద్రులకు క్రూరగ్రహములవలనఁ బుట్టినకర్తరీయోగమును, అరిష్టమును, పాపగ్రహాధిక్యమును, గ్రహణము జననము మరణము అనువానివలనఁ గలిగిన యాశౌచమును, క్షుతదుర్వచన శ్రవణాది దుస్స్వప్నములను, మనఃప్రసాదమును, జ్వరాదిరోగములను శుభకర్మములయందు విడిచిపెట్టవలయును. ఇక్కడఁ జెప్పఁబడిన యోగములకు లక్షణములు ఇంకమీఁదటఁ జెప్పఁబడఁబోవుచున్నవి కనుక ఇక్కడ వివరింపఁబడలేదని తెలియవలయును. ఈవిషయమంతయును జ్యోతిశ్శాస్త్రకాశమను గ్రంథమునందుఁ గూడఁ జెప్పఁబడెను. ఎట్లనిన “ శ్లో॥ జన్మాధిపవిలగ్నేశ శ్చంద్రభార్గవమంత్రిణాం। విరశ్మిత్వం జన్మమాసే జన్మభం జన్మవాసరః। దుర్ని

త్తం మనోభంగః క్షయమాసాధికమాసకౌ । మృతజాతకయోశ్చైవ సూతకం గ్రహణస్య చ। జ్వరోత్పత్తీ రజో మాతుః పిత్రోః క్షయదినం తథా। గండాంతత్రితయం కాలస్సంధిర్భస్య తిథేస్తనోః । క్రాంతిపాతో వ్యతీపాతో వైధృతిః పారిఘార్ధకమ్ । భానోస్సంక్రాంతిభోగశ్చ గుళికశ్చార్ధయామకః । క్రూరైర్ముక్తం యుతం భోగ్యం సరాహుశిఖిధూమితం । ధిష్ణ్యం గ్రహణగం పాపైర్విద్ధం సౌమ్యైశ్చ పాదతః । విష్టిః క్రూరయుతం లగ్నం లగ్నేశో రిపుమృత్యుగః । జన్మతోఽష్టస్థితశ్చంద్రో లగ్నస్థో నిధనోపగః । జన్మభాజ్జన్మలగ్నాచ్చ లగ్నలగ్నాంశకాష్టమా । పాపయోర్మధ్యగం లగ్నం క్షీణేందుః నవాంశకః । క్రూరవారే పాపహోరా దుష్టయోగా గ్రహోద్భవాః।తిథివృద్ధిక్షయోర్భానాం నాడికా విషసంజ్ఞితాః। ఏతే దోషాస్సమాఖ్యాతాశ్శుభకర్మణి గర్హితాః। దశారిష్టోద్భవాశ్చాన్యే గోచరోత్థాస్తథాపరే। లత్తైకార్గళచండాస్త్ర కాలవేలాశ్చ పంచకం। మృత్యుయోగోపగ్రహాద్యాస్స్వే స్వే దేశేతు నిందితాః ॥" (జన్మలగ్నాధిపతియును తాత్కాలిక లగ్నాధిపతియును చంద్రశుక్ర గురువులును అస్తమయమును పొందినకాలమును, జన్మమాస జన్మవార జన్మనక్షత్రములును, దుశ్శకునములును, మనోభంగమును, క్షయమాసాధిక మాసములును, జాతాశౌచ మృతాశౌచ గ్రహణాశౌచములుగల కాలమును, జ్వరోత్పత్తియైయున్నపుడును, తల్లి ఋతుమతియై యున్నకాలమును, తల్లిదండ్రుల యొక్క శ్రాద్ధదినమును, గండాంతత్రితయమును, నక్షత్రము యొక్కయును తిథియొక్కయును సంధికాలమును, క్రాంతిపాత వ్యతీపాతమును, వైధృతియును, పరిఘయోగమునందలి పూర్వార్ధమును, సూర్యసంక్రమణకాలమును, గుళికకాలమును, అర్ధయామమును, క్రూరగ్రహములచేత అనుభవింపఁబడుచున్నదియును అనుభవించి అప్పుడే విడువఁబడినదియును అనుభవింపఁబడఁబోవుచున్నదియును అయిన నక్షత్రములును, రాహుకేతు ధూమగ్రహములచేత వ్యాప్తమైన లగ్నములును, గ్రహణమును పొందిన నక్షత్రమును, పాపగ్రహవిద్ధమగు నక్షత్రమును, విష్టియును, క్రూరగ్రహయుతమగు లగ్నమును, లగ్నేశుఁడు షష్ఠాష్టమములను పొందియున్నకాలమును, జన్మలగ్నమునకు చంద్రుఁడు దుస్స్థానములయందున్నకాలమును, తాత్కాలికలగ్నమునకు అష్టమస్థానమునందు చంద్రుఁడున్నకాలమును, జన్మరాశి జన్మలగ్న తాత్కాలిక లగ్నములకును తదంశములకును అష్టమస్థానములును, పాపగ్రహమధ్య



గతమగు లగ్నమును, క్షీణచంద్రుఁడును, కునవాంశయును, క్రూరవారమును, పాపహోరయును, గ్రహములవలనఁ బుట్టిన దుష్టయోగములును, తిథివృద్ధిక్షయములును నక్షత్రములయొక్క విషగడియలును, అనునవి శుభకర్మములయందు నిందితములయినవని యెఱుఁగవలయును. మఱియు, జాతకశాస్త్రోక్త దశారిష్టములును గోచారమువలనఁ గలిగెడు నరిష్టయోగములును, లత్త, ఏకార్గళను చండాస్త్రము, పంచకము, మృత్యుయోగము, ఉపగ్రహము, మొదలగునవి అయ్యాదేశములయందు నిందితములయినవని తెలియవలయును.

వ్యా॥ లత్తేతి॥ లత్తాపంచక పాపవర్గం ఏతత్సర్వం వక్ష్యమాణం అశుభం చంద్రం వక్ష్యమాణం గోచరప్రకరణే వేద్యం దశారిష్టకం జాతకశాస్త్రగమ్యం జన్మేశేజ్యసితాస్తం- జన్మేశో రాశిస్వామీ - ఇజ్యో గురుః సితః శుక్రః ఏషాం అస్తగమనం - రవిలుప్తకరణత్వం అంగశశినోః క్రూరోద్భవాంకర్తరీం - అంగం లగ్నం-శశీ - చంద్రః - తయోః క్రూరోద్భవాం క్రూరగ్రహజనితాం కర్తరీం - వక్ష్యమాణలక్షణాం రిష్టం - గోచరసంభవం గోచరే దుష్టగ్రహాధిక్యం గోచరం వక్ష్యమాణం - గ్రహజనిపాతోద్భవం సూతకం గ్రహో గ్రహణం - జనిర్జన్మ - పాతో మరణం ఏభ్యః ఉద్భూతం సూతకం - గ్రహణసూతకం - జన్మసూతకం - మృతసూతకమితి - తేషు గ్రహణసూతకం వక్ష్యమాణం - దుశ్చిహ్నాని కార్యారంభసమయే క్షుత దుర్వచన శ్రవణాదీని మనోవిభంగః అంతఃకరణస్య ప్రవర్తనం - వ్యాధిర్జ్వరస్తమపి - రోగః పాప్మా జ్వరో వ్యాధిర్వికారో దుఃఖమామయ ఇతి వాగ్భటః॥ జ్వరితస్య మంగళం నకుర్యాదిత్యర్థః - తథా-హోక్తం జ్యోతిః ప్రకాశే॥ జన్మాధిపవిలగ్నేశ శ్చంద్రభార్గవ మంత్రిణాం- విరశ్మిత్వం జన్మమాసో జన్మభం జన్మవాసరః ॥ దుర్నిమిత్తం మనోభంగః క్షయమాసాధిమాసకౌ । మృతజాతకయోశ్చైవ సూతకం గ్రహణస్య చ॥ జ్వరోత్పత్తీ రజో మాతుః పిత్రోః క్షయదినం తథా । గండాంతత్రితయం కాలస్సంధిర్భస్య తిథేస్తనోః ॥ క్రాంతిసామ్యో వ్యతీపాతో వైధృతిః పరిఘార్ధకం । భానోస్సంక్రాంతిభోగశ్చ గుళికశ్చార్ధయామకః । క్రూరైర్ముక్తం యుతం భోగ్యం సరాహుశిఖిధూమితం ॥ ధిష్ణ్యం గ్రహణగం పాపైర్విద్ధం సౌమ్యైశ్చ పాదతః । విష్టిః క్రూరయుతం లగ్నం లగ్నేశో రిపుమృత్యుగః ॥ జన్మతోఽష్టస్థితశ్చంద్రో లగ్నస్థో నిధనోపగః । జన్మభాజ్జన్మలగ్నాచ్చ లగ్నలగ్నాంశకాష్టమా ॥ పాపయోర్మధ్యగం లగ్నం క్షీణేందు

దుఃకునవాంశకః । క్రూరవారేపాపహోరారా దుష్టయోగా గ్రహోద్భవాః॥ తిథివృద్ధిక్షయోభానాం నాడికావిషసంజ్ఞితాః ॥ ఏతేదోషాస్స మాఖ్యాతా శ్శుభకర్మణిగర్హితాః॥ దశారిష్టోద్భవాశ్చాన్యేగోచరోత్థా స్తథాపరే । లత్తైకార్గళచండాస్త్ర కాలవేలాశ్చ పంచకం॥ మృత్యుయోగోపగ్రహాద్యాస్స్వస్వేదేశేతునిందితా ఇతి॥

మూ॥ నోకుర్యాద్రవిభాద్యగేంద్ర ధృతితోయుగ్మేషు పంచాశ
యో స్స్వర్గాత్పంచ సుశోభనాని తనుయాదేషూగ్రశ
స్త్రాదికం । మాసర్త్వాయనవారయోగ తిథిభాదీనాంచ
సిద్ధాభిధాజ్ఞాతవ్యాఃపునరుక్తిరస్తి కుహచిత్సాతత్స్మృ
తిప్రాప్తయే॥ ౫॥

టీక॥ రవిభాద్యగేంద్రధృతితః = సూర్యుఁడున్ననక్షత్రమునకు అగ ఇంద్రధృతి అను సంజ్ఞలుకలవానికంటె పరముందున్న, యుగ్మేషు=యుగ్మనక్షత్రములయందును, పంచాశయోః = అయిదవ పదియవ నక్షత్రమునందును, స్వర్గాత్-ఇరువదొక్కటవ నక్షత్రముమొదలుకొని, పంచసు= అయిదు నక్షత్రములయందును, శోభనాని = శుభకర్మములను, నోకుర్యాత్=చేయఁగూడదు. ఏషు==ఈనక్షత్రములయందు, ఉగ్రశస్త్రాదికమ్= ఉగ్రశస్త్రము మొదలుగాఁగల దోషమును, తనుయాత్ = వృద్ధిఁబొందించును. మాసర్త్వాయన వారయోగతిథిభాదీనామ్ = మాసములు ఋతువులు అయనములు వారములు యోగములు తిథులు నక్షత్రములు మొదలగువానియొక్క, సిద్ధాభిధాః=శాస్త్రప్రసిద్ధములయిన, సంజ్ఞాః = గుర్తులు, జ్ఞాతవ్యాః=తెలియఁదగినవి. ఇహ=ఈగ్రంథమునందు, కుహచిత్= ఒకానొకచోట, పునరుక్తిః=చెప్పినదానినేచెప్పుట, అస్తి=కలదు. సా= అట్లుచెప్పుట, తత్స్మృతిప్రాప్తయే = ఆసంజ్ఞాదులు జ్ఞప్తికి వచ్చుటకొఱకు, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని యేడు ఎనిమిది పదునాలుగు పదునైదు పదునేనిమిది పందొమ్మిది అయిదు పది యిరువదొక్కటి యిరువదిరెండు ఇరువదిమూఁడు ఇరువదినాలుగు ఇరువదైదు నక్షత్రములయందు అనఁగా సూర్యుఁడున్ననక్షత్రము మొదలుకొని ౭-౮-౧౪-౧౫-౧౯-౫-౧౦ - ౨౧-౨౨-౨౩-౨౪-౨౫ - నక్షత్రములయందు శుభకర్మములను జేయఁగూడదు. ఇట్టి నక్షత్రములు ఉగ్రశస్త్రఘాతము మొదలుగాఁగల దోషములను వృద్ధిఁబొందించును. ఈవిషయమే గ్రంథాంతర



ములయందుఁగూడఁ జెప్పఁబడినది. ఎట్లనిన:—" శ్లో॥ విద్యుత్పంచమభే క్షితేశ్చచలనంస్యాత్సప్తమేసూర్యభాక్శూలశ్చాష్టమభేశనిశ్చ దశమేకేతుస్తథాష్టాదశే । ఇందుఃపంచదశే చతుర్దశ ఇహప్రోక్తోనిపాతోబుధై రుల్కాకాలవిదాంగణైర్నిగదితాస్త్వైకోనవింశోర్కభాత్ ॥" (సూర్యస్థితనక్షత్రమునకు అయిదవ నక్షత్రమునందు విద్యుత్తను దోషముకలదనియును, ఏడవ నక్షత్రమునందు క్షితిచలనమనియెడు దోషము కలుగుననియును, ఎనిమిదవ నక్షత్రమునందు శూలదోషముకలదనియును, పదియవనక్షత్రమునందు శనియను దోషమనియును, పదునెనిమిదవ నక్షత్రమునందు కేతుదోషమనియును, పదునైదవ నక్షత్రమునందు ఇందుదోషమనియును, పదునాల్గవ నక్షత్రమునందు నిపాత దోషమనియును, ఇరువదొకటవ నక్షత్రమునందు ఉల్కాదోషమనియును, విద్వాంసులగువారిచేతఁ జెప్పఁబడెను.) ఇటులనే దైవజ్ఞవల్లభమను గ్రంథమునందుఁ గూడఁ జెప్పఁబడెను. ఎట్లనిన:—" శ్లో॥ క్రమశో మోహనిర్ఘాతః భూకంపోవజ్రఏవచ । పరివేషశ్చవిజ్ఞేయో నక్షత్రాదేకవింశతేః । ఏతేష్విందుసమేతేషు కుర్యాత్కర్మనశోభనం । దహనాస్త్రవిషైస్సాధ్యం యత్ర సిద్ధిముపైతిచ ॥" (సూర్యుఁడున్న నక్షత్రమునకు ఇరువదొక్కటవనక్షత్రము మొదలుకొని యైదు నక్షత్రములయందు క్రమముగా మోహము నిర్ఘాతము భూకంపము వజ్రము పరివేషము అను దోషములు కలుగునని తెలియవలయును. సూర్యస్థిత నక్షత్రమునకు ఇరువదొక్కటవనక్షత్రము మొదలుకొని యైదునక్షత్రములయందు సూర్యుఁడుండఁగా శుభకర్మములను చేయఁగూడదు. చేసినయెడల దహనాస్త్ర విషదోషములు కలుగును. కావున కార్యసిద్ధి కనుకూలమగు కాలమును చూచుకొనవలయును.) ఇతరదోషములు అక్కడక్కడ ఇకమీదట వివరింపఁబడును. చైత్రాది మాసములయొక్కయును, వసంతాది ఋతువులయొక్కయును, ఉత్తరాయణాద్యయనముల యొక్కయును, సూర్యాది వారముల యొక్కయును, విష్కంభాది యోగములయొక్కయును, ప్రతిపదాది తిథులయొక్కయును, అశ్విన్యాది నక్షత్రములయొక్కయును, కరణరాశి భావాదులయొక్కయును, సంజ్ఞలు శాస్త్రాంతరములయందు సిద్ధములై యుండుటచేత ఇక్కడఁ జెప్పఁబడలేదు. ఈగ్రంథమునందు ఒకానొక చోట చెప్పినవిషయమే జ్ఞప్తికివచ్చుటకు మరలచెప్పఁబడును. కనుక పునరుక్తిదోషముగా గ్రహింపఁగూడదని తాత్పర్యము.

వ్యా ॥ అథోపగ్రహాంతర్వర్తిదోషాంతరం వృత్తార్ధేనాహ॥ నోకుర్యాదితి॥ రవిభాదిసూర్యాధిష్ఠిత నక్షత్రాది అగేంద్రధృతిమితాతయాని నక్షత్రాణి తేభ్యోయుగ్మేషు - ఏతదుక్తం భవతి ॥ సప్తమాష్టమయోః చతుర్దశపంచదశయోః అష్టాదశైకోనవింశయోరితి తథా పంచాశయోః రవినక్షత్రాత్ పంచనవదశమయోః తథాస్వర్గాత్పంచసు ఏకవింశాత్పంచసు నక్షత్రేషు - ౨౧ - ౨౨ - ౨౩ - ౨౪ - ౨౫ - శోభనానికర్మాణి నో కుర్యాత్ ॥ ఏషుఉగ్రశస్త్రఘాతాదికం తనుయాన్విస్తారయేత్ కుర్యాదిత్యర్థః ॥ ఉక్తంచ ॥ విద్యుత్పంచమభేషు తేష్వచలసంస్యాత్సప్తమే సూర్యభాత్ ఖ్యాలశ్చాష్టమభేశనిశ్చదశమే కేతుస్తథాష్టాదశే । ఇందుః పంచదశే చతుర్దశ ఇహప్రోక్తో నిపాతో బుధైరులాకాలవిదాంగణైర్నిగదితాచైకోనవింశోర్కాబాదితి ॥ దైవజ్ఞవల్లభేపి॥ క్రమశో మోహానిర్ఘాతధూకంపావజ్రఏవచ। పరివేషశ్చవిజ్ఞేయోనక్షత్రాదేకవింశతేః । ఏతేష్వేందుసమేతేషు కుర్యాత్కర్మనశోభనం ॥ దహనాస్త్రవిషైస్సాధ్యం యత్రసిద్ధిముపైతిచేత్। అన్యానపిదోషానగ్రే ప్రసంగతో వక్ష్యామి । అథాస్మిన్గ్రంథే మాసాదీనాం సంజ్ఞాలోకసిద్ధాజ్ఞేయా ఇతి । తథాపునరుక్తినిర్దూషణం వృత్తార్ధేనాహ॥ మాసర్త్వాయనేతి ॥ మాసాః చైత్రాదయః ఋతవః - వసంతాదయః- అయనే దక్షిణోత్తరే - వారాః సూర్యాదయః- యోగాః- విష్కంభాదయః- తిథయః - ప్రతిపదాదయః - భాన్యశ్విన్యాదీని - ఇత్యాదీనాంకరణరాశిభావాదీనాం - సిద్ధాభిధాః- శాస్త్రాంతరసిద్ధాః - సంజ్ఞాః జ్ఞాతవ్యాఃతథాఇహాస్మిన్గ్రంథే క్వచిత్ కుత్రచిత్ పునరుక్తిర్వర్తతే నాతస్య దూరాంతరితస్య స్మృతిప్రాప్తయేస్మరణాయేతి న దోషః॥

ఇతి త్యాజ్యప్రకరణం సమాప్తమ్॥

## ※ అథ సాధారణ నక్షత్ర ప్రకరణం. ※

మూ॥ భేశాదస్రయమాగ్నికేందుగిరిశాః ప్రోక్తా అదిత్యంగిర
స్సర్పాః కవ్యభుజోభగోర్య మరవిత్వష్టా సమీరః క్రమా
త్ । ఇంద్రాగ్నీత్వథమిత్ర ఇంద్రనిరృతీ నీరంచ విశ్వేవిధి
ర్వైకుంఠో వసుపాశ్యజైక చరణాహిర్బుధ్న్యపూషా
భిధాః॥ ౧॥

టీక ॥ దస్రయమాగ్నికేందుగిరిశాః = అశ్వినీదేవతలు, యముఁడు, అగ్ని, బ్రహ్మ, చంద్రుఁడు, అనువారును, అదిత్యాంగిరస్సర్పాః= అదితి, గురుఁడు, సర్పము, అనువారియును, కవ్యభుజః = పితృదేవతలు,



భగః = భగుఁడు, అర్యమరవిత్వష్టాః= అర్యముఁడు, రవి, త్వష్ట, అనువారును, సమీరః = వాయువు, ఇంద్రాగ్నీతు = ఇంద్రాగ్నులును, అథ= పిమ్మట, ఇంద్రనిఋఋతి = ఇంద్రుఁడును రాక్షసుడును, నీరంచ = ఉదకమును, విశ్వే = విశ్వేదేవతలును, విధిః = బ్రహ్మయును, వైకుంఠః= విష్ణువును, వసుపాశ్యజైకచరణాః = వసువులు, వరుణుఁడు, అజైకచరణుఁడు, అనువారును, అహిర్బుధ్న్యః = అహిర్బుధ్న్యుఁడు, పూషాభిధాః = పూషయనువాఁడును, క్రమాత్ = క్రమముగా, భేశాః = నక్షత్రాధిపతులు, ప్రోక్తాః = చెప్పఁబడిరి.

తా ॥ ఇంకను సాధారణ ప్రకరణమును చెప్పుచున్నాఁడు. ఇట్లు సాధారణ నక్షత్రప్రకరణమును చెప్పఁబోవుచు ముందుగా నక్షత్రదేవతలను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—అశ్వినీనక్షత్రమునకు అశ్వినీ దేవతలును, భరణికి యముఁడును, కృత్తికకు అగ్నియును, రోహిణికి బ్రహ్మయును, మృగశీర్షకు చంద్రుఁడును, ఆర్ద్రకు మహాదేవుఁడును, పునర్వసుకు అదితియును, పుష్యమికి గురుఁడును, ఆశ్లేషకు సర్పమును, మఖకుపితృదేవతలును, పూర్వఫల్గునికి భగుఁడును, ఉత్తరఫల్గునికి అర్యముఁడును, హస్తకు రవియును, చిత్తకు త్వష్టయును, స్వాతికి వాయువును, విశాఖకుఇంద్రాగ్నులును, అనూరాధకు మిత్రుఁడును, జ్యేష్ఠకు ఇంద్రుఁడును, మూలకు నిఋఋతియను రాక్షసుఁడును, పూర్వాషాఢకు ఉదకమును, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలును, అభిజిత్తునకు, బ్రహ్మదేవుఁడును, శ్రవణమునకు విష్ణుదేవుఁడును, ధనిష్ఠకు అష్టవసువులును, శతభిషకు వరుణదేవుఁడును, పూర్వాభాద్రకు అజైకచరణుఁడును, ఉత్తరాభాద్రకు అహిర్బుధ్న్యుఁడును, రేవతికి పూషయును, అధిపతులని యెఱుఁగవలయును. నక్షత్రజ్ఞానముకొఱకును శాంతికార్యములయందు యజనమును చేయుటకొఱకును దేవతలు ప్రయోజనకారులని యెఱుఁగవలయును.

వ్యా ॥ అథ సాధారణ నక్షత్రప్రకరణం వివక్షుర్రాదౌనక్షత్రదేవతాః వృత్తేనైకేనాహ ॥ అస్మిన్ప్రకరణే సర్వాణిశార్దూలవిక్రీడితాని॥ భేశా ఇతి ॥ అశ్విన్యాస్సకాశాత్ క్రమేణ భేశా బుధైః ప్రోక్తా ఇత్యన్వయః। భానాం నక్షత్రాణాం ఈశాః స్వామినః - దస్రౌ అశ్విన్యాః - యమో భరణ్యాః - అగ్నిః కృత్తికాయాః - కో బ్రహ్మా రోహిణ్యాః - ఇందుర్మృగస్య - గిరిశో మహాదేవః ఆర్ద్రాయాః - అదితిః పునర్వసోః - అంగిరాః గురుః పుష్యస్య - సర్పాః - ఆశ్లేషాయాః - కవ్యభుజః పితరో మఘాయాః

భగః పూర్వఫల్గున్యాః - అర్యమా ఉత్తరఫల్గున్యాః - రవిర్హస్తస్య - త్వష్టా చిత్రాయాః - సమీరణో వాయుస్స్వాత్యాః - ఇంద్రాగ్నీ దేవతాద్వయం విశాఖాయాః - మిత్రః - అనూరాధాయాః ఇంద్రో జ్యేష్ఠాయాః - నిర్‌ఋతిః రాక్షసః మూలస్య - నీరం జలం పూర్వాషాఢాయాః విశ్వే ఉత్తరాషాఢాయాః - విధిర్బ్రహ్మా అభిజితః - వైకుంఠో విష్ణుః శ్రవణస్య - వసవో ధనిష్ఠాయాః - పాశీ వరుణః శతతారకాయాః - అజైకచరణః పూర్వాభాద్ర పదాయాః - అహిర్బుధ్న్య ఉత్తరాభాద్ర పదాయాః - పూషా రేవత్యాః - దేవతా ప్రయోజనం నక్షత్ర జ్ఞానార్థం శాంతికాదౌ యజనార్థంచ॥

మూ॥ బ్రాహ్మం త్ర్యుత్తర యుఙ్ధ్రువం స్థిర మథో పూర్వా మఘా
యామ్యభం క్రూరోగ్రం శ్రవణత్రయాదితియుతా స్వాతీ
చరాఖ్యా చలా। దస్రార్కాభిజిదిజ్యభం లఘుతథా క్షి
ప్రం చ మైత్రాంత్యమేందుత్వాష్ట్రం మృదు మైత్ర మగ్నిభవి
శే మిశ్రే చ సాధారణే॥ ౨॥

టీక॥ త్ర్యుత్తరయుక్ = ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర అను మూడు నక్షత్రములతోఁ గూడుకొనిన, బ్రాహ్మమ్ = రోహిణీనక్షత్రము, ధ్రువమ్ = ధ్రువసంజ్ఞకలదనియును, స్థిరంచ = స్థిరసంజ్ఞకలదనియును, (మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను. అథః = పిమ్మట, పూర్వామఘాయామ్యభమ్ = పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మఖ, భరణి అనునట్టి నక్షత్రపంచకమును, క్రూరోగ్రమ్ = క్రూరసంజ్ఞకలదనియును, ఉగ్రసంజ్ఞకలదనియును, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను. శ్రవణత్రయాదితియుతా = శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పునర్వసు, అనువానితోఁ గూడుకొనిన, స్వాతీ = స్వాతినక్షత్రము, చరాఖ్యా = చరమను పేరుకలదనియును, చలాచ = చలసంజ్ఞకలదనియును, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను. దస్రార్కాభిజిదిజ్యభమ్ = అశ్విని, హస్త, అభిజిత్తు, పుష్యమి అను నక్షత్రసముదాయము, లఘు = లఘుసంజ్ఞకలదనియును, తథా = ఆలాగుననే, క్షిప్రంచ = క్షిప్రసంజ్ఞకలదనియును, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను. మైత్రాంత్యమేందుత్వాష్ట్రమ్ = అనూరాధ, రేవతి, మృగశీర్ష, చిత్ర, అనునాల్గును, మృదు = మృదుసంజ్ఞకలదనియును, క్షిప్రంచ = క్షిప్రసంజ్ఞకలదనియును, స్మృతమ్ = చెప్పఁబడెను. అగ్నిభవిశే = కృత్తిక విశాఖ, అను రెండును, మిశ్రే = మిశ్రములనియును, సాధారణే = సాధారణములనియును, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతే = చెప్పఁబడినవి.



తా॥ రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనునక్షత్రములు ధ్రువసంజ్ఞకలవనియును, స్థిరసంజ్ఞకలవనియును, మునీంద్రులచేతఁ జెప్పఁబడెను. పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మఖ, భరణి అను నక్షత్రములు క్రూరసంజ్ఞకలవనియును, ఉగ్రసంజ్ఞ కలవనియును, చెప్పఁబడెను. శ్రవణము, ధనిష్ఠ, శతభిష, పునర్వసు, స్వాతి, అనునక్షత్రములు చరములనియును, చలములనియును, చెప్పఁబడెను. అశ్విని, హస్త, అభిజిత్తు, పుష్యమి, అనునాలుగు నక్షత్రములును లఘుసంజ్ఞకలవనియును, క్షిప్రసంజ్ఞకలవనియును, చెప్పఁబడెను. అనూరాధ, రేవతి, మృగశీర్షము, చిత్ర అనునాలుగు నక్షత్రములును మృదుసంజ్ఞకలవనియును, మైత్రసంజ్ఞకలవనియును, చెప్పఁబడెను. కృత్తిక, విశాఖ, అను రెండునక్షత్రములును మిశ్రసంజ్ఞ కలవనియును, సాధారణసంజ్ఞ కలవనియును, చెప్పఁబడెను.

వ్యా॥ అథ నక్షత్రాణాం స్థిరచరాదిసంజ్ఞామాహ॥ బ్రాహ్మం రోహిణీ - కింలక్షణం బ్రాహ్మం - త్ర్యుత్తరయుక్ తిసౄణాం ఉత్తరాణాం సమాహారస్త్ర్యుత్తరం - తేనయుక్ యుక్తం - ధ్రువం స్థిరమితివ్యభిధానం - మునీంద్రైస్స్మృతమిత్యన్వయః - అథో పూర్వామఘాయామ్యభం పూర్వాత్రయం మఘాభరణీతి పంచకం - క్రూరోగ్రం క్రూరం ఉగ్రంచోక్తం - శ్రవణత్రయాదితియుతా స్వాతీ - శ్రవణ ధనిష్ఠా శతతారకాః - అదితిః పునర్వసుః - ఏభిస్సహితా స్వాతీ చరాఖ్యా చలాచోక్తా - శ్రవణత్రయాది పంచకం చరాఖ్యం చలంప్రోక్తమిత్యర్థః - దస్రార్కాభిజిదిజ్యభం - దస్రౌ అశ్వినీ అర్కః - హస్తః - అభిజిద్వ్యక్త్యమాణలక్షణః - ఇజ్యో గురుస్తస్యభం పుష్య ఇతి - చతుష్టయం - లఘు తథా క్షిప్రం ప్రోక్తం - మైత్రాంత్యమేందుత్వాష్ట్రం - మైత్రం అనూరాధా - అంత్యం రేవతీ ఇందుర్మృగః - త్వాష్ట్రం చిత్రా - ఏతచ్చతుష్టయం - మృదు తథా మైత్రం ప్రోక్తం - అగ్నిభవిశే - అగ్నిభం కృత్తికా - విశా విశాఖా - ఏతే ద్వే - మిశ్రే సాధారణే - ప్రోక్తే॥

మూ॥ మూలాహీంద్రభపంచ దారుణమద స్తీక్ష్ణం మునీంద్రైస్స్మృ
తం సంజ్ఞాసామ్యమిహాచరంతి సుధియః కార్యం హి సంసిద్ధ
యే। సూర్యాద్యాస్స్థిర చంచలోగ్రమిళితాః క్షిప్రో మృ
దుర్దారుణాః క్షీణేందుర్జ్ఞ- యమార రాహు శిఖినః పా

పాంబుధస్త్రైర్యుతః॥ ౩॥

టీక॥ మూలాహీంద్రశివంచ = మూల ఆశ్రేష జ్యేష్ఠ ఆర్ద్ర అనునట్టి నక్షత్రచతుష్టయము, దారుణమ్ = దారుణ సంజ్ఞకలదని, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను, అదః = ఈనక్షత్రచతుష్టయము, తీక్ష్ణంచ = తీక్ష్ణసంజ్ఞకలదనియును, స్మృతమ్ = చెప్పఁబడెను, సుధియః = విద్వాంసులు, సుసిద్ధయే = కార్యముసిద్ధించుటకొఱకు, ఇహ = ఈనక్షత్రములయందు, సంజ్ఞాతుల్యమ్ = ఆనక్షత్రముల సంజ్ఞలకుతగిన, కార్యమ్ = పనిని, ఆచరంతి = చేయుచున్నారు, సూర్యాద్యాః = సూర్యుఁడు మొదలుగాఁగలవారు, స్థిరచంచలోగ్రమిశ్రితాః = స్థిరుఁడు, చంచలుఁడు ఉగ్రుఁడు మిశ్రితుఁడు, (అనియును) క్షిప్రః = క్షిప్రుఁడనియును, మృదుః = మృదువనియును, దారుణః = దారుణుఁడనియును, మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను, క్షీణేంద్వర్కయమారాహుశిఖినః = క్షీణచంద్రుఁడు, సూర్యుఁడు, శని, కుజుఁడు, రాహువు, కేతువు, అనువారు, పాపాః = పాపులు, తైః = ఆపాపులతో, యుతః = కూడుకొనిన, బుధశ్చ = బుధుఁడును, పాపః = పాపుఁడు, (ఇతి = ఇట్లని,) మునీంద్రైః = మునిశ్రేష్ఠులచేత, స్మృతమ్ = చెప్పఁబడెను.

తా॥ మూల, ఆశ్రేష, జ్యేష్ఠ, ఆర్ద్ర, అనునట్టి నక్షత్ర చతుష్టయము దారుణ సంజ్ఞకలదనియును, తీక్ష్ణసంజ్ఞకలదనియును, చెప్పఁబడెను. మఱియును, విద్వాంసులగువారు కార్యముసిద్ధించుటకొఱకు ఈనక్షత్రములసంజ్ఞకు తుల్యమగు కార్యమును చేయుచున్నారు. అనఁగా, స్థిరనక్షత్రములయందు స్థిరకార్యమగు స్తంభప్రతిష్ఠాది కార్యములను చరనక్షత్రములయందు చరకార్యములను చేయుచున్నారు ఇటులనే అన్యాన్య సంజ్ఞలుగల నక్షత్రములయందు అన్యాన్యకార్యములను చేయుచున్నారు. మఱియును, సూర్యుఁడు స్థిరుఁడనియును, చంద్రుఁడు చంచలుఁడనియును, అంగారకుఁడు ఉగ్రుఁడనియును, బుధుఁడు మిశ్రుఁడనియును, గురుఁడు క్షిప్రుఁడనియును, శుక్రుఁడు మృదువనియును, శని దారుణుఁడనియును, తెలియవలయును. మఱియును, కృష్ణాష్టమి మొదలుకొని శుక్ల ప్రతిపత్తువఱకునుగల చంద్రుఁడు క్షీణచంద్రుఁడనియును, ఇట్టిక్షీణచంద్రుఁడును, సూర్యుఁడును, శనియును, కుజుఁడును, రాహుకేతువులును, పాపగ్రహములనియును క్రూరగ్రహములనియును చెప్పఁబడుదురు. ఈపాపులతో



గూడినబుధుఁడు పాపుఁడనఁబడును. ఇతరగ్రహములు సౌమ్యగ్రహములనఁబడుదురు. ఈక్రూరసౌమ్యసంజ్ఞలు క్రూరసౌమ్య కార్యములయందుపయోగించునని తెలియవలయును. మఱియును, ఈవిషయముజాతకోత్తమమునందుఁగూడ చెప్పఁబడియె. ఎట్లనిన:— "శ్లో॥ క్షీణేంద్వర్కారిభౌమాస్స్యుః పాపాస్సౌమ్యాపితద్యుతః । రాహుకేతూ పాపతరౌ పాపః పాపయుతస్తథా" (క్షీణచంద్రుఁడు రవిశనికుజులు పాపులనఁబడుదురు. బుధుఁడు పాపయుతుఁడయ్యేనేని పాపుఁడనఁబడును. రాహుకేతువులు అధికపాపులనియును, పాపుఁడు పాపునితోఁజేరెనేని యధికపాపుఁడనియును, తెలియవలయును.)

వ్యా॥ మూలేతి॥ మూలంప్రసిద్ధం అహిరాశ్రేషా - ఇంద్రో జ్యేష్ఠా - శివంఆర్ద్రా-ఏతచ్చతుష్టయందారుణం - అదఃఇదం-తీక్ష్ణంచోక్తం-ఇహఏషుధ్రువాదిసంజ్ఞేషునక్షత్రేషు సంజ్ఞాతుల్యంకార్యం సుధియఃపండితాః-ఆచరంతి కిమర్థం-సంసిద్ధయె - ఏతదుక్తంభవతి స్థిరనక్షత్రేషు స్థిరం స్తంభప్రతిష్ఠాదికం - చరేచరమిత్యాది కుర్వంతతిస్పష్టం అత్రసమానార్థసంజ్ఞాద్వయకరణం కవిత్వబంధనార్థం - అత్రప్రసంగేన సూర్యాదీనామపిస్థిరాది సంజ్ఞాస్సౌమ్యపాపత్వంచ వృత్తార్థేనాహ । సూర్యాద్యా ఇత్యాదిసూర్యః స్థిరఃచంద్రశ్చంచలః - భౌమః ఉగ్రః - మిశ్రితోమిశ్రః - గురుఃక్షిప్రః - శుక్రోమృదుః - శనిర్దారుణః - అథపాపసౌమ్యాన్గ్రహానాహ - క్షీణేతి - క్షీణేందుః - కృష్ణాష్టమ్యూర్ధ్వం ప్రతిపత్పర్యంతంక్షీణః- అర్కః - సూర్యః-యమః శనిః - ఆరోభౌమః - రాహుఃప్రసిద్ధః-శిఖీకేతుః - ఏతేక్షీణేంద్వాదయః - పాపాఃక్రూరాః - తైఃపాపైస్సంయుతోబుధఃపాపస్స్యాత్ - ఉక్తంచజాతకోత్తమే॥ క్షీణేంద్వర్కారిభౌమాస్స్యుః పాపాస్సౌమ్యాపితద్యుతః । రాహుకేతూ పాపతరౌ పాపః పాపయుతస్తథేతి ॥ అర్థాదన్యేసౌమ్యాః - ఏషాంప్రయోజనం క్రూరసౌమ్యకర్మసాధనే ॥

మూ॥ అహ్నస్స్యాచ్ఛివసార్పమిత్ర పితరోవస్వంబు విశ్వాభిజి
త్కంద్రేంద్రాగ్ని నిశాచరా అపిజలాధీశోర్యమాఖ్యో
భగః । రాత్రేస్స్యుస్సురహోత్రయోజ చరణాత్పంచా
శ్వితోధోదితి క్లీవోవిష్ణురినాత్త్రయ స్తిథిలవాః కస్యైషు
భోక్తృంస్స్మృతమ్ ॥ ౪॥

టీక॥ శివసార్పమిత్రపితరః = శివము, సార్పము, మిత్రము, పిత,

అనునవియును, వస్వంబువిశ్వాభిజిద్ధాత్రేంద్రేంద్రాగ్నినిశాచరాః + అపి= వసువు, జలము, విశ్వము, అభిజిత్తు, బ్రహ్మము, ఇంద్రము, ఇంద్రాగ్నులు, నిశాచరము, అనునవియును, జలాధీశః=వరుణము, అర్యమాఖ్యః= అర్యమాఖ్యము, భగః=భగము, (అనునట్టి) ఏతే=ఈ, తిథిలవాః=పదునైదగుముహూర్తములు, అహ్నః = పగటికి, స్యుః=అగును. స్మరహా=శివము, అజచరణాత్ = అజచరణము మొదలుకొని, త్రయః = మూఁడును, అశ్వితః=అశ్వి మొదలుకొని, పంచ=అయిదును, అధః=పిమ్మట, దితిః=దితియును, జీవః=జీవము, విష్ణుః=విష్ణువు, ఇనాత్=రవి మొదలుకొని, త్రయః= మూఁడును, ( అనునట్టి ) తిథిలవాః = పదునైదగు ముహూర్తములు, రాత్రేః=రాత్రికి, స్యుః=అగును. ఏషు=ఈముహూర్తములయందు, భోక్తుమ్=అనుభవించుటకొఱకు, కర్మ=కర్మము, స్మృతమ్=చెప్పంబడెను.

తా॥ ప్రసంగవశముచేత దినరాత్రి ముహూర్తసాధకులగు నక్షత్రసమాననాథులను దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:— శివాదులు పదునైదును పగటియొక్క ముహూర్తములు, ఆపదునైదు ముహూర్తములలో ఏయేముహూర్తమునకు ఏమి నామధేయమనఁగా ప్రథమముహూర్తము శివమనియును, రెండవది సార్పమనియును, మూఁడవది మిత్రమనియును, నాల్గవది పితృదేవతాకమైనదనియును, అయిదవది వసువనియును, ఆరవది అంబువనియును, ఏడవది విశ్వములనియును, ఎనిమిదవది యభిజిత్తనియును, తొమ్మిదవది బ్రహ్మమనియును, పదునొకండవది యింద్రాగ్నులనియును, పదిరెండవది నిశాచరమనియును, పదిమూఁడవది వరుణమనియును, పదునాల్గవది యర్యమమనియును, పదునైదవది భగమనియును, చెప్పంబడెను. ఇటులనే రాత్రులయందుఁగూడ మొదటిది శివమనియును, రెండవది అజచరణమనియును, మూఁడవది అహిర్బుధ్న్యమనియును, నాల్గవది పూషయనియును, అయిదవది దస్రమనియును, ఆఱవది యమమనియును, ఏడవది యగ్నియనియును, ఎనిమిదవది బ్రహ్మయనియును, తొమ్మిదవది యిందువనియును, పదియవది అదితియనియును, పదునొకండవది జీవమనియును, పదిరెండవది విష్ణువనియును, పదిమూఁడవది రవియనియును, పదునాల్గవది త్వష్టయనియును, పదునైదవది వాయువనియును, తెలియవలయును. ఈముహూర్తములయందు అనుభవించుటకొఱకు నక్షత్రోక్తమగు కర్మము మునిశ్రేష్ఠులచేతఁ జెప్పంబడెను. ఎట్లనఁగా, శివముహూర్తమునందు ఆర్ద్రానక్షత్రమునకుఁ జెప్పం



బడిన కర్మమును చేయవలసినదనియును, సార్పముహూర్తమునందు ఆశ్లేషా నక్షత్రమునకు చెప్పంబడిన కర్మమును చేయవలసినదనియును, మిత్రముహూర్తమునందు అనూరాధానక్షత్రమునకుఁ జెప్పంబడిన కర్మమును చేయవలసినదనియును, తెలియవలయును. ఇటులనే "శ్లో॥ యస్మిన్ధిష్ణ్యే యచ్చ కర్మోపదిష్టం తద్దైవత్యే తన్ముహూర్తేపి కార్యమ్" ( ఏనక్షత్రమునందు ఏకర్మము చెప్పంబడెనో ఆదేవతాకమగు ముహూర్తమునందుఁగూడ ఆకర్మమునే చేయవలసినది. ) అని రత్నమాలయను గ్రంథమునందుఁ జెప్పంబడియెను. లోకమునందు స్వామిశబ్దమును సేవకుని యందుఁగూడ ప్రయోగించుట సుప్రసిద్ధముగా కనంబడుచున్నది కనుక దేవతాశబ్దము నక్షత్ర తిథ్యాదులయందుఁగూడఁ బ్రయోగింపఁబడుచున్నది. కావుననే " శ్లో॥ నాగో ద్వాదశనాడీభిర్దిక్పంచదశభిస్తథా। భూతోష్టాదశనాడీభిర్దూషయత్యుత్తరాం తిథిమ్ " నాగము (=పంచమి) పదిరెండు గడియలచేతను, దిక్కు (=దశమి) పదునైదు గడియలచేతను, భూతము (=చతుర్దశి) పదునెనిమిది గడియలచేతను, ( ఉత్తరపుతిథిని దూషించుచున్నది. ) అనియెడు వృద్ధవచనమునందు దేవతావాచక శబ్దమునే తిథియందుఁ జెప్పంబడెనని యెఱుఁగవలయును.

వ్యా॥ అథప్రసంగేన నక్షత్రసమాననాథాన్ దినరాత్రి ముహూర్తాన్నక్షత్రోక్తకార్యసాధకాన్ వృత్తేనైకేనాహ॥ అహ్న ఇతి॥ ఏతే అహ్నః దివసస్య తిథి- ౧౫- లవాః పంచదశాంశాః ముహూర్తాః శివాదయః స్యుః ప్రథమశ్శివః- ద్వితీయస్సార్పః- తృతీయో మిత్రః- చతుర్థః పితా - పంచమో వసుః- షష్ఠోంబు- సప్తమో విశ్వే- అష్టమో ఽభిజిత్-నవమో బ్రహ్మా- దశమ ఇంద్రః- ఏకాదశ ఇంద్రాగ్నీ- ద్వాదశో నిశాచరః- త్రయోదశో జలాధీశో వరుణః- చతుర్దశో ఽర్యమాఖ్యః- పంచదశో భగః- అథ రాత్రేః ప్రథమః స్మరహా శివః- అజచరణాత్ త్రయః అజచరణో ఽహిర్బుధ్న్యః పూషాహ్వయాః క్రమేణ ద్వితీయో ఽజచరణః తృతీయో ఽహిర్బుధ్న్యః- చతుర్థః పూషా- పంచాశ్విత ఇతి- అశ్వితః పంచ- దస్రయమాగ్నికందవః - పంచమో దస్రః- షష్ఠో యమః- సప్తమో ఽగ్నిః- అష్టమః కః బ్రహ్మా- నవమ ఇందుః- అథో దితిర్దశమః- ఏకాదశో జీవః - ద్వాదశో విష్ణుః- ఇనాత్త్రయః రవిత్వష్టృ అనిలాః- త్రయోదశో రవిః- చతుర్దశస్త్వష్టా - పంచదశో ఽనిలః వాయుః- ప్రయోజనమాహ- కర్మేషు భోక్తుం స్మృతం ఏషు ముహూర్తేషు భోక్తుం నక్షత్రోక్త కర్మ స్మృతం మునీంద్రైరిత్యర్థః వ్యాకరోతి- ఏతదుక్తం

భవతి- శివముహూర్తే- ఆర్ద్రానక్షత్రోక్తం- సార్పముహూర్తే- ఆశ్రేషోక్తం- మిత్రముహూర్తే- అనూరాధోక్తం కర్మకుర్యాదిత్యాది - తదుక్తం రత్నమాలాయాం - యస్మిన్ధిష్ణ్యే యచ్చ కర్మోపదిష్టంతద్దైవత్యే తస్మిన్ముహూర్తేపి కార్యమితి- లోకేహి స్వామిశబ్దం సేవకే ప్రయుంజానాదృశ్యంతే అతో దేవతాశబ్దస్తన్నక్షత్రతిథ్యాదిషుస్మర్యతే। తథావిధవృద్ధప్రయోగదర్శనాచ్చ। నాగోద్వాదశనాడీభిర్దిక్పంచదశభిస్తథా। భూతోష్టాదశనాడీభిర్దూషయత్యుత్తరాంతిథిమితి। నాగఃపంచమీ- దిగ్దశమీ- భూతశ్చతుర్దశీతివత్॥ ఇతి నక్షత్రప్రకరణం సమాప్తమ్.

## * అథప్రథమార్తవప్రకరణం. *

ము॥ ఆద్యర్తౌ పౌషశుక్రోర్జమధుశుచినభస్యాః కుయుక్పాపవా
రారిక్తామాష్టార్కషష్ఠ్యః పరగృహకుపదే రాత్రిసంధ్యా
పరాహ్ణాః। మిశ్రోగ్రాఽమూలతీక్ష్ణం వివరమనరుణాల్పాధి
కాస్రంగరాష్టోత్పాతఃపాపస్యలగ్నం నసదరుణజరన్నీల
చిత్రాంబరంచ॥ ౧॥

టీక ॥ ఆద్యర్తౌ = ప్రథమర్తువునందు, పౌషశుక్రోర్జమధుశుచినభస్యాః = పుష్యమాసము జ్యేష్ఠమాసము కార్తికమాసము చైత్రమాసము ఆషాఢమాసము భాద్రపదమాసము అనుమాసములును, (అశుభా = శుభకరములైనవి కావు) కుయుక్ = విష్కంభాది కుయోగము, పాపవారాః = పాపగ్రహవారములు, రిక్తామాష్టార్కషష్ఠ్యః = రిక్తతిథులు అమావాస్య అష్టమి ద్వాదశి షష్ఠి అనుతిథులును, పరగృహకుపదే = ఇతరులయొక్క గృహము కుత్సితమార్గము అనునవియును, రాత్రిసంధ్యాపరాహ్ణాః = రాత్రికాలము సంధ్యాకాలము అపరాహ్ణకాలము అనునట్టి కాలములును, మిశ్రోగ్రామూలతీక్ష్ణమ్ = కృత్తికావిశాఖలు మూలతప్పఁ దక్కిన క్రూరనక్షత్రములును, వివరమ్ = తిథినక్షత్రములయొక్క సంధులును. అనరుణాల్పాధికాస్రమ్ = మిగుల నెఱ్ఱనిది కానిదియును స్వల్పమైనమెఱుపుకలదియును అధికమైనమెఱుపుకలదియును అయిన రక్తమును, గరాష్ట = గరకరణము మొదలుకొని యెనిమిదికరణములును, ఉత్పాతః = మూఁడువిధములయిన యుత్పాతమును, పాపస్య = పాపగ్రహముయొక్క, లగ్నమ్ = లగ్నమును, అరుణజరన్నీలచిత్రాంబరంచ = ఎఱ్ఱనిదియును జీర్ణమైనదియును నల్లనిదియును చిత్రవర్ణముకలదియును అయిన వస్త్రమును, సత్ = శుభకరమైనది, న = కాదు.



తా ॥ గర్భాధానాది సంస్కారప్రకరణమును చెప్పఁదలఁచినవాఁడై గర్భాధానము ఋతుసంబంధమైనదగుటవలన ముందుగా ఋతుఫలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—పుష్యమాసము జ్యేష్ఠమాసము కార్తికమాసము చైత్రమాసము ఆషాఢమాసము భాద్రపదమాసము అనునట్టి మాసములాఱును ప్రథమరజస్వలయందు శుభకరములయినవి కావు. మిగిలిన యాఱుమాసములును శుభకరములయినవి. ఈవిషయమే "శ్లో॥ ప్రథమర్తౌ మధౌ నారీ విధవా భవతిధ్రువం। వైశాఖే ధనపుత్రాఢ్యా జ్యేష్ఠే రోగాన్వితాభవేత్ । ఆషాఢేచ మృతాపత్యా శ్రావణేచ ధనాన్వితా। భాద్రపదే దుర్భగాచ అశ్వినేచ తపస్వినీ। ఊర్జేల్పాయుష్మతీనారీ మార్గశీర్షే బహుప్రజా । పుష్యేతు పుంశ్చలీనారీ మాఘే పుత్రసుఖాన్వితా । ఫాల్గునే శ్రీమతీసాధ్వీ క్రమాన్మాస ఫలంస్మృతమ్॥" (చైత్రమాసమునందు ప్రథమరజస్వలనైనయాఁడుది నిశ్చయముగ విధవయగును. వైశాఖమాసమునందు ధనపుత్రాఢ్యురాలగును. జ్యేష్ఠమాసమునందు రోగముకలదియగును. ఆషాఢమాసమునందు మృతసంతానముకలదియగును. శ్రావణమాసమునందు ప్రథమరజస్వలయయ్యేనేని ధనముకలదియగును. భాద్రపదమాసమునందు దుష్టయోనికలది (లేక) దురదృష్టురాలగును. ఆశ్వయుజమాసమునందు తపస్వినియగును. కార్తికమాసమునందు ప్రథమరజస్వలనైనయాఁడుది అల్పాయుష్యముకలదియగును. మార్గశీర్షమాసమునందు బహుసంతానముకలదియగును. పుష్యమాసమునందు వ్యభిచరించునదియగును. మాఘమాసమునందు పుత్రసుఖాన్వితురాలగును. ఫాల్గునమాసమునందు పతివ్రతయగును. ఈవిధముగ ప్రథమరజస్వలయందు మాసఫలమును దెలియవలయును.) అనిజ్యోతిర్నిబంధమను గ్రంథమునందు చెప్పఁబడెను. మఱియును, విష్కంభము అతిగండము వ్యాఘాతము వజ్రము వ్యతీపాతము పరిఘ వైధృతిఅనునట్టి యోగములు ఏడును శుభకరములుగావనియును, ఇతరములగుయోగములు శుభకరములయినవనియును, తెలియవలయును. ఈవిషయము "శ్లో॥ ఆద్యర్తౌ దుర్భగానారీ విష్కంభేచే ద్రజస్వలా । వంధ్యాచైవాతిగండేచ శూలేశూలవతీభవేత్ । గండేచ పుంశ్చలీనారీ వ్యాఘాతే చాత్మఘాతినీ । వజ్రేచ స్వైరిణీప్రోక్తా పాతేచ పతిఘాతినీ । పరిఘే మృతవంధ్యాచ వైధృతౌ పతిమారిణీ । శేషాశ్శుభావహాయోగా యథానామఫలప్రదా॥" (విష్కంభయోగమునందు ప్రథమరజస్వలనైనయాఁడుదిదు

ర్భగురాలగును. అతిగండయోగమునందు వంధ్యురాలగును. శూలయోగమునందు శూలయోగము కలదియగును. గండయోగమునందు వ్యభిచరించునట్టిదియగును. వ్యాఘాతయోగమునందు ఆత్మహత్యను జేసికొనునట్టిదియగును. వజ్రయోగమునందు స్వైరిణియగును. పాతయోగమునందు పతిఘాతినియగును. పరిఘయోగమునందు మృతవంధ్యయగును. వైధృతియోగమునందు పతినిజంపునదియగును. ఈయోగములుగాక తక్కిన యోగములు అన్యోన్యనామములకుదగిన శుభఫలమును కలుగజేయును.) అని గ్రంథాంతరమునందు జెప్పఁబడె. పాపగ్రహములగు క్షీణచంద్రరవిశనికుజవారములు ప్రథమరజస్వలయందు శుభకరములుగావు. కావుననే "శ్లో॥ ఆదిత్యే విధవా నారీ సోమేచైవ మృతప్రజా। అంగారకేస్వసుర్వ్యాంత్రీ బుధేకన్యా ప్రసూర్భవేత్। పుత్రిణీ గురువారేచ కన్యాపుత్రవతీభృగౌ। శనౌతు పుంశ్చలీనారీ ప్రథమర్తౌ విచుర్బుధాః" (సూర్యవారమునందు ప్రథమరజస్వలయైనయామెది విధవయగును. క్షీణచంద్రవారమునందు మృతసంతానముకలదియగును. అంగారకవారమునందు చెల్లెండ్రకు హానికలుగఁజేయునదియగును. బుధవారమునందు స్త్రీసంతానముకలదియగును. గురువారమునందు పుత్రసంతానము కలదియగును. శుక్రవారమునందు స్త్రీపురుషసంతానము కలదియగును. శనివారమునందు వ్యభిచారము కలదియగును.) అని కారికయందుఁగూడ ఈవిషయమే చెప్పఁబడె. మఱియును, నారదుఁడుకూడ "శ్లో॥ రోగీ పతివ్రతా దుఃఖీ పుత్రిణీ భోగభాగినీ। పతివ్రతాక్లేశభాగీ సూర్యవారాదిషు క్రమాత్॥" (సూర్యాదిసప్తవారములయందును క్రమముగరోగముకలదియును పతివ్రతయును దుఃఖముకలదియు పుత్రులుగలదియును భోగములకలదియును పతివ్రతయురాలును కష్టమును పొందునదియును అగును.) అనిచెప్పె. అయితే, నారదవచనమునకును కారికకును పరస్పరవిరోధముకలదనినలఁపక కృష్ణపక్ష సోమవారమునుగురించి కారికయందుఁ జెప్పఁబడినదనియును, శుక్లపక్ష సోమవారమునుగుఱించి నారదుఁడు చెప్పెననియును, తెలియవలయును. మఱియును, చవితి నవమి చతుర్దశి అమావాస్య అష్టమి ద్వాదశి అనునట్టి యేఁడుతిథులును శుభకరములయినవికావు. కావుననే "శ్లో॥ ఆద్యర్తౌ సుభగానారీ ప్రతిపత్సు రజస్వలా। ద్వితీయాయాం భాగ్యవతీ తృతీయాయాం సుతాన్వితా। చతుర్థ్యాం విధవా నారీ పంచమ్యాంధనదాయినీ। షష్ఠ్యాంచ క్లేశభాక్నారీ సప్తమ్యాం ధనవర్ధినీ। అష్టమ్యాం



రాక్షసీనారీ నవమ్యాం పాపవర్ధినీ। దశమ్యాం ప్రీతికృన్నారీ హ్యేకాదశ్యాం సుతాన్వితా। ద్వాదశ్యాం దుర్భగానారీ త్రయోదశ్యాంహిరణ్యదా। చతుర్దశ్యాం పుంశ్చలీస్యాత్పౌర్ణమాస్యాం సుపుత్రిణీ। యదిభద్రా నజాయేత దర్శేస్యాచ్చోరికా ధ్రువమ్॥" (పతిపత్తిథియందు ప్రథమరజస్వలయైనదిసుభగురాలగునుద్వితీయయందు అధికమైనభాగ్యముకలదియగును. తదియయందుసుతులుకలదియగును. చవితియందువిధవయగును. పంచమియందు ధనమునిచ్చునదియగును. షష్ఠియందు క్లేశమునుపొందునదియగును. సప్తమియందు ధనమును వృద్ధిపరచునది యగును. అష్టమియందు రాక్షసస్వభావము కలదియగును. నవమియందు పాపమును వృద్ధినిపొందించునదియగును. దశమియందు ప్రీతిని కలుగఁజేయునది యగును. ఏకాదశియందు పుత్రులుగలదియగును. ద్వాదశియందు దుర్భగురాలగును. త్రయోదశియందు హిరణ్యము నిచ్చునదియగును. చతుర్దశియందు వ్యభిచారిణియగును. పూర్ణిమయందు చక్కని పుత్రులుగలదియగును. అమావాస్యయందు దొంగతనమును చేయునదియగును.) అని గ్రంథాంతరమందుఁగూడఁ జెప్పఁబడియె. మఱియును, భర్తృగృహము కంటె నితరమగు గృహమునందును కుత్సితస్థానమునందును ప్రథమరజస్వలయయ్యేనేని యమంగళము కలుగునుకుటచేత ఇతరస్థానములయందు శుభములు గలుగును. ఈవిషయముకూడ గ్రంథాంతరమందు "శ్లో॥ దేవస్థానేపితృస్థానేవింధ్యస్థానేశ్మశానే। పుష్పవత్యాఃఫలంనస్యాన్నాగ్నేచండాలవేశ్మని" (దేవస్థానమునందును పితృస్థానమునందును శ్మశానమునందును వింధ్యస్థానమందును ఇతరగృహమునందును చండాలగృహమునందును ప్రథమరజస్వలయయ్యేనేని ఫలమువేదసఁబడును.) అని చెప్పఁబడును. మఱియును, రాత్రియందును, ఉభయసంధ్యాకాలములయందును అపరాహ్ణమునందును ప్రథమరజస్వలయయ్యేనేని శుభములు కలుగవు. ఈవిషయముకూడ "శ్లో॥ పుత్రిణీసుభగాపూర్వే పూర్వాహ్ణే యాజస్వలా। మధ్యాహ్నేతుశుభప్రాప్తిస్స్వైరిణీచాపరాహ్ణకే। సంధ్యయోరుభయోర్వేశ్యా నిశాయాంవిధవాభవేత్" (పూర్వాహ్ణమునందు ప్రథమరజస్వలయైనది పుత్రులుగలదియును సుభగురాలును పూర్వాహ్ణకాలమునందు అగుదురు మధ్యాహ్నమునందు శుభప్రాప్తియగును. అపరాహ్ణమునందు స్వైరిణియగును. ఉభయసంధ్యలయందును వేశ్యయగును. రాత్రియందు విధవయగును.) అని గ్రంథాంతర

మందుఁ జెప్పఁబడెను. మఱియును, కృత్తికావిశాఖలును పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర భరణీమఖలును ఆశ్రేషాజ్యేష్ఠార్ద్రలును అను పది నక్షత్రములయందును ప్రథమరజస్వలయగు నాఁడుది శుభములను పొందఁజాలదు. ఈవిషయమంతయును నారదీయ సంహితయందుఁగూడఁ జెప్పఁబడియె. ఎట్లనిన:— " శ్లో॥ శ్రీయుక్తాసుభగాపుత్త్రివతీసౌఖ్యాన్వితాస్థిరా । కులాధికామానవతీ చాశ్విన్యాంప్రథమార్తవా ॥ " (అశ్వినీనక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది శ్రీయుక్తురాలును సుభగురాలును పుత్త్రిణుకలదియును స్థిరురాలును కులాధికురాలును మానవతియును అగును.) " శ్లో ॥ దుశ్శీలాస్వైరిణీస్వస్య గర్భపాతన తత్పరా। పరప్రేష్యాకాకవంధ్యా భరణ్యాంప్రథమార్తవా॥ " (భరణియందు ప్రథమ రజస్వలయైన యాఁడుది వ్యభిచరించునదియును, గర్భస్రావము చేసికొనునట్టిదియును, పరప్రేష్యురాలును కాకవంధ్యురాలును అగును.) "శ్లో॥ అనర్థాపుంశ్చలీమధ్యా గర్భపాతనతత్పరా । ప్రేష్యా మృతప్రజావాపి వహ్నిభే ప్రథమార్తవా ॥ " ( కృత్తికానక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది అనర్థములు గలదియును, వ్యభిచరించునదియును, వంధ్యురాలును, గర్భపాతమును చేసికొనునదియును, పరప్రేష్యురాలును, మృతసంతానము కలదియును, అగును.) " శ్లో ॥ సుశీలా సుప్రజామాన్యాపతిభక్తాదృఢవ్రతా । గృహార్చనరతానిత్యం ధాతృభే ప్రథమార్తవా ॥ " (రోహిణీనక్షత్రమునందు ప్రథమ రజస్వలయైనయాఁడుది చక్కని స్వభావముకలదియును, చక్కని సంతానముకలదియును, మాన్యురాలును, పతిభక్తి కలదియును, దృఢవ్రతములు కలదియును, గృహార్చనమునం దాసక్తికలదియును, అగును.) "శ్లో॥ గుణాఢ్యా ధర్మరతా నారీసర్వసహా సతీ । పతిప్రియా సుతాఢ్యా చ చాంద్రభే ప్రథమార్తవా॥" (మృగశీర్షా నక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది గుణములు గలదియును ధర్మమునం దాసక్తికలదియును, సర్వమునుసహించునదియును, పతివ్రతయును, పతిప్రియురాలును, సుతాఢ్యురాలును, అగును.) "శ్లో॥ కులటా దుర్భగాకష్ట మృతపుత్రా ఖలాజడా । దుష్టావ్రత పరిభ్రష్టా రౌద్రభే ప్రథమార్తవా॥" (ఆర్ద్రానక్షత్రమునందు ప్రథమ రజస్వలయైన యాఁడుది వ్యభిచారముకలదియును దుర్భగురాలును, కష్టస్వభావముకలదియును, మృతపుత్రులు గలదియును, ఖలస్వభావముకలదియును, జడురాలును, దుష్టురాలును, వ్రతపరిభ్రష్టురాలును, అగును. )



" శ్లో ॥ పతిభక్తాపుత్త్రివతీ వరసంతానమోదినీ । కులాచారానురక్తాఢ్యాఽదితిభే ప్రథమార్తవా ॥ " ( పునర్వసూనక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది పతియందు భక్తికలదియును, పుత్త్రిలుగలదియును, శ్రేష్ఠమైనసంతానముచేత సంతోషించునదియును, కులాచారములయం దాసక్తికలదియును, అగును. ) " శ్లో॥ పతిప్రియాపుత్త్రివతీ నానాభోగవతీశుభా । స్వకర్మనిరతాదక్షా తిష్యభే ప్రథమార్తవా ॥ " ( పుష్యమీనక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది భర్తయందు ప్రియముకలదియును, పుత్త్రిలుగలదియును, నానావిధములగు భోగములు కలదియును, శుభకరురాలును, స్వకర్మ నిరతురాలును, సమర్థురాలును, అగును.) " శ్లో ॥ పరభర్తృరతా ప్రేష్యా కోపినీ నిర్ఘృణాఽరసా। మృషావాక్చసుదుష్పుత్త్రా భుజంగే ప్రథమార్తవా॥ " (ఆశ్రేషానక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది పరపురుషులయం దాసక్తికలదియును, ప్రేష్యురాలును, కోపములుకలదియును, దయారహితురాలును, విరసురాలును, అబద్ధములను చెప్పునట్టిదియును, దుష్పుత్త్రిలుగలదియును, అగును. ) " శ్లో ॥ నిర్ద్వేష్యా రోగసంయుక్తా సర్వదా గేయలోలుపా । పితృవేశ్మరతామాన్యా పిత్ర్యభే ప్రథమార్తవా " (మఖానక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది ద్వేష్యరహితురాలును, రోగముకలదియును, సర్వకాలములయందును గానప్రియురాలును, తండ్రిగృహమునందే యాసక్తికలదియును, మాన్యురాలును అగును.) "శ్లో॥ పరకాయరతాదీనా దుష్పుత్త్రాక్లేశభాగినీ । మలినాకర్కశాక్రుద్ధా భాగ్యర్క్షే ప్రథమార్తవా ॥ " ( పుబ్బానక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది యితరులశరీరమునం దాసక్తికలదియును, దీనురాలును, దుష్పుత్త్రిలుగలదియును, క్లేశమును పొందునదియును, మలినురాలును, కర్కశురాలును, క్రుద్ధురాలును, అగును.) " శ్లో ॥ ప్రజావతీధర్మరతానిర్వైరామిత్రపూజితా । సతీమాతృగృహాసక్తా ఽర్యమ్ణర్క్షే ప్రథమార్తవా " ( ఉత్తరానక్షత్రమునందు ప్రథమ రజస్వలయైన యాఁడుది సంతానము కలదియును, ధర్మమునం దాసక్తికలదియును, నిర్వైరురాలును, మిత్రులచేత పూజింపఁబడునదియును, పతివ్రతయును, మాతృగృహమునం దాసక్తికలదియును, అగును. ) " శ్లో ॥ నిర్లజ్జా స్యాద్భూరివిభవా పుత్త్రిణ్యాభోగభాగినీ । ప్రధానాదానకుశలా హస్తర్క్షే ప్రథమార్తవా " ( హస్తానక్షత్రమునందు ప్రథమ రజస్వలయైనయాఁడుది సిగ్గులేనిది

యును, అధికమైన వైభవముకలదియును, పుత్త్రులుగలదియును, భోగములను అనుభవించునట్టిదియును, ప్రధానురాలును దానకుశలురాలును, అగును.) " శ్లో॥ చిత్రకర్మాభోగినీచ కుశలాక్రయవిక్రయే । వికీర్ణకామాశ్లక్ష్ణాఢ్యా త్వాష్ట్రీభే ప్రథమార్తవా ॥ " (చిత్తానక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది చిత్రకర్మములను జేయునట్టిదియును, భోగములుగలదియును, క్రయవిక్రయ వ్యాపారమునందు కుశలురాలును, అధికమగు కామముకలదియును, మృదుస్వభావము కలదియును, అగును. ) " శ్లో ॥ బహువిత్తవతీనీరు కుశలాశిల్పకర్మణి । పుత్త్రపౌత్త్రవతీసాధ్వీ వాయుభే ప్రథమార్తవా ॥ " ( స్వాతి నక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది విశేషముగ ధనముకలదియును, రోగరహితురాలును, శిల్పకర్మమునందు కుశలురాలును, పుత్త్రపౌత్త్రులుగలదియును పతివ్రతయును, అగును. ) " శ్లో॥ నీచకర్మగతాదుష్టా పానాసక్తాపరప్రియా । విపుత్త్రామలినాక్రుద్ధా ద్వైదైవే ప్రథమార్తవా॥ " ( విశాఖానక్షత్రమునందు ప్రథమరజస్వలయగునాఁడుది నీచకర్మమునం దాసక్తికలదియును, దుష్టురాలును, పానమునం దాసక్తికలదియును, పరులయందు ప్రియముకలదియును, పుత్త్రరహితురాలును, మలినురాలును, కోపముకలదియును, అగును. ) " శ్లో ॥ స్వామిపక్షార్చితాస్వస్వగుణైస్సమ్యగ్విభూషితా । సుపుత్త్రాసుభగాకాంతా మిత్రభే ప్రథమార్తవా ॥ " ( అనూరాధానక్షత్రమునందు ప్రథమ రజస్వలయగునాఁడుది స్వామిపక్షపువారిచేత పూజింపఁబడునదియును, తనదు గుణములచేతఁ జక్కఁగ నలంకరింపఁబడినదియును, చక్కనిపుత్త్రులుగలదియును, సుభగురాలును, కాంతురాలును, అగును. ) " శ్లో ॥ దుశ్చరిత్రరతాక్లేశిన్యనర్థాపుంశ్చలీవ్యసుః । దుస్సంతానవతీజ్యేష్ఠా నక్షత్రే ప్రథమార్తవా ॥ " ( జ్యేష్ఠానక్షత్రమునందు ప్రథమరజస్వలయైన యాఁడుది దుశ్చరిత్రమునం దాసక్తికలదియును, క్లేశముకలదియును, అనర్థురాలును, వ్యభిచరించునట్టిస్వభావముకలదియును, ప్రాణరహితురాలును, దుష్టసంతానము కలదియును, అగును. ) " శ్లో ॥ సంతానార్థగుణైర్గాఢైర్వ్యక్తాన్యక్లేశమోచనీ । స్వకర్మనిరతానిత్యం మూలర్క్షే ప్రథమార్తవా॥ " ( మూలానక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది యధికములగు సంతానార్థగుణములతోఁగూడుకొన్నదియును, ఇతరులదుఃఖమును పోఁగొట్టునట్టిదియును, స్వకర్మనిరతురాలును అగును. ) " శ్లో ॥ ప్రచ్ఛన్నపాపాదు



ష్పుత్త్రా ప్రాణిహింసనతత్పరా । అజస్రవ్యసనాసక్తా తోయభే ప్రథమార్తవా॥ " ( పూర్వాషాఢానక్షత్రమునందు ప్రథమ రజస్వలయైన యాఁడుది ప్రచ్ఛన్నపాపము కలదియును, దుష్టులగు పుత్త్రులు గలదియును, ప్రాణులను హింసించుటయం దాసక్తికలదియును, ఎల్లప్పుడును వ్యసనమునం దాసక్తికలదియును, అగును. ) " శ్లో ॥ కార్యాకార్యేషు కుశలాసదాధర్మానువర్తినీ । గుణక్రియాభాగ్యవతీ విశ్వభే ప్రథమార్తవా ॥ " ( ఉత్తరాషాఢానక్షత్రమునందు ప్రథమరజస్వలయగునయాఁడుది కార్యాకార్యములయందు కుశలురాలును, ఎల్లప్పుడును ధర్మమును అనువర్తించునదియును, గుణములను ఆశ్రయించి యుండునదియును, భాగ్యవతియును, అగును. " శ్లో॥ పుత్త్రపౌత్త్రాన్వితాభోగ ధనధాన్యవతీసతీ । కాలానుమోదినీమాన్యా విష్ణుభే ప్రథమార్తవా, " ( శ్రవణనక్షత్రమునందు ప్రథమరజస్వలయయినయాఁడుది పుత్త్రులతోడను పౌత్త్రులతోడను గూడుకొనినదియును, ధనధాన్యములుగలదియును, పతివ్రతయును, కాలమునకుఁదగినట్లు సంతోషించునట్టిదియును, మాన్యురాలును, అగును. ) " శ్లో ॥ ధనధాన్యవతీభోగ పుత్త్రపౌత్త్రసమన్వితా । స్వకర్మనిరతాసాధ్వీ వసుభే ప్రథమార్తవా, " ( ధనిష్ఠానక్షత్రమునందు ప్రథమరజస్వలయయినయాఁడుది ధనధాన్యములుగలదియును, భోగముకలదియును, పుత్త్రపౌత్త్రసంపదకలదియును, స్వకర్మమునందాసక్తికలదియును, పతివ్రతయును, అగును. ) " శ్లో ॥ బహుపుత్త్రాధనవతీ స్వకర్మనిరతాసతీ । కాలానుమోదినీమాన్యా వారుణే ప్రథమార్తవా॥ " (శతభిషానక్షత్రమునందు ప్రథమరజస్వలయైనయాఁడుది యనేకమంది పుత్త్రులుగలదియును, ధనముకలదియును, స్వకర్మమునం దాసక్తికలదియును, కాలమునకుఁదగినట్లు సంతోషించు నట్టిదియును, మాన్యురాలును, అగును.) " శ్లో॥ బంధకీబంధువిద్వేష్యా నిత్యందుష్టగతాఖిలా । శిల్పకార్యేషు కుశలాదిజాంఘ్రిభే ప్రథమార్తవా॥ " ( పూర్వాభాద్రానక్షత్రమునందు ప్రథమరజస్వలయయినయాఁడుది చెఱసాలయందుఁ బ్రవేశించునదియును, బంధువులతో ద్వేషముకలదియును, సర్వకాలములయందును దుష్టకార్యములయం దాసక్తిగలదియును, దుర్మార్గురాలును, శిల్పకార్యములయందు నిపుణురాలును, అగును. ) " శ్లో ॥ ఆఢ్యాపుత్రవతీమాన్యా సుప్రసన్నాపతిప్రియా । బంధుపూజ్యాధర్మవత్యహిర్బుధ్న్యే ప్రథమార్తవా॥ " (ఉత్తరాభాద్రానక్షత్రమునందు ప్రథమ రజస్వలయైనయాఁడుది ఆఢ్యురాలు

గ్రహైఽత్ర అష్టకాదీత్యర్థః - ఇందుశ్చంద్రః - అఖిలఃపూర్ణః - అజ్ఞే లగ్నేఽష్టమః - అన్నప్రాశనేపూర్ణశ్చంద్రోలగ్నే శుభ ఇత్యర్థః - అన్యలగ్న బలంపూర్వవత్ ॥ అత్ర నారదః ॥ షష్ఠేమాస్యష్టమేవాపి పుంసాం స్త్రీణాంతు పంచమే । సప్తమేమాసివా కార్యం నవాన్నప్రాశనం శిశోః॥ రిక్తాం దినక్షయం నందాం ద్వాదశీమష్టమీ సమాం। త్యక్త్వాన్యతిథయశ్శ్రేష్ఠాః ప్రాశనే శుభవాసరా ఇతి ॥ జ్యోతిర్నిబంధే ॥ జన్మర్క్షేత్రితయం విద్యాత్కర్మక్షేత్రం చాతిసౌఖ్యకృత్ । ఆధానర్క్షేచబాలానాం ప్రాశనే రోగనాశనం ॥ వృద్ధనారదః ॥ జీవసౌమ్యసితానాంతు దృక్కాణా దివసాంశకాః। బాలాన్నప్రాశనే శస్తా నచంద్రారార్కజాస్సజామితి ॥ అన్యత్ర ॥ గోఽశ్వః సమ్భస్తులాకన్యా సింహః కర్కి మృగోఘటః । ఏతాశ్చరాశయశ్శస్తా నమేషవృషవృశ్చికా ఇతి ॥ నారదః ॥ చరస్థిర మృదుక్షిప్ర నక్షత్రేషు నైధనే ఇతి॥ దశమేలగ్నేకుక్షిత్యాహ॥ ఇత్యన్నప్రాశనప్రకరణం సమాప్తం.

—* అథగర్భాధానాదిషుగురుశుక్రాస్తదోషాభావాదీని. (*)—

మూ॥ గర్భాద్యన్నాశనాంతేషున గురుసితయోర్బాల్యవార్ధక్య
చమౌఢ్యం జహ్యాత్కాలస్యరోధాద్ధరిగురుమయనంయా
మ్యమూనాధిమాసౌ । ఏతచ్చౌలాదిషూజ్ఝేదథ గురుసిత
యోర్బాల్యవార్ధక్యేనగాహే శాఖోశాఖేశమౌఢ్యేవ్రత
మపినిగమారంభమార్గోన్యనకుర్యాత్॥ ౭॥

టీక ॥ గర్భాద్యన్నాశనాంతేషు = గర్భాధానము మొదలుకొని అన్నప్రాశనము వఱకునుగల కర్మములయందు, కాలస్య = కాలముయొక్క, రోధాత్ = నియమమువలన, గురుసితయోః = గురుశుక్రులయొక్క, బాల్యవార్ధక్యేచ = బాల్యవార్ధక్యములను, మౌఢ్యమ్ = మూఢత్వమును, నజహ్యాత్ = విడువఁగూడదు, హరిగురుమ్ = సింహస్థగురువును, యామ్యమ్ = దక్షిణమైన, అయనమ్ = అయనమును, ఊనాధిమాసౌ = క్షయమాసాధికమాసములను, నజహ్యాత్ = విడువఁగూడదు, ఏతత్ = ఈ గురుశుక్రాస్తాదికమును, చౌలాదిషు = చౌలము మొదలుగాఁగల కర్మములయందును, ఉజ్ఝేత్ = విడువవలయును, అథ = పిమ్మట, గురుసితయోః = గురుశుక్రులయొక్క, బాల్యవార్ధక్యే = బాల్యవార్ధక్యములు, నగాహే = ఏడుదినములుగలవి, అథ = పిమ్మట, శాఖేశమౌఢ్యే = శాఖేశునియొక్క మూఢత్వమునందు, వ్రతమపి = వేదవ్రతమును, నిగమారంభమ్ = వేదారంభమును, అన్యత్ = పూర్వోక్తము, నకుర్యాత్ = చేయఁగూడదు.



తా ॥ ఇఁకను గర్భాధానాదులయందు గురుశుక్రాస్తదోషము లేదనుట మొదలగు దానిని ఈశ్లోకము చేతఁ దెలుపుచున్నాఁడు. అనఁగా, ఈ యీసంస్కారములయందు గురుశుక్రాస్తాది దోషము లేదనియును, ఈ యీకర్మలయందు గురుశుక్రాస్తాది దోషములుగలవనియును, బాలవృద్ధత్వపరిమితకాలమిదియనియును, శాఖేశుఁడు మూఢత్వమును బొందియుండఁగా నేమిచేయఁగూడనిదియును, ఈశ్లోకము చేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః—గర్భాధానము మొదలుకొని యన్నప్రాశనము వఱకునుగల కర్మములయందు కాలనియమము చేయఁబడుటవలన గురుశుక్రులయొక్క బాల్యవార్ధక్యములను మూఢత్వమును విచారింపనక్కఱలేదు. "శ్లో॥ నిత్యయానే గృహేజీర్ణే ప్రాశనాంతేషు సప్తసు । వధూప్రవేశమాంగల్యే నమౌఢ్యం గురుశుక్రయోః" (=నిత్యయానమునందును జీర్ణగృహమునందును, అన్నప్రాశనము వఱకునుగల కర్మములయందును, వధూప్రవేశ మాంగల్యమునందును, గురుశుక్రులయొక్క మౌఢ్యమును విచారింపనక్కఱలేదు.) అని మాండవ్యమునివరుఁడు చెప్పె. ఇప్పుడు చెప్పఁబడిన కర్మములకు కాలనియమము చేయఁబడియుండుటవలనను గురుశుక్రమౌఢ్యము కలదుకదా యని యోచించినయెడల సకాలము మిగిలిపోవునుగనుక గురుశుక్రులయస్తమానాదులను విచారింపనక్కఱలేదని యెఱుఁగవలయును. మఱియు నిటులనే సింహస్థగురువును దక్షిణాయనమును క్షయమాసాధికమాసములను గూడ విచారింపనక్కఱలేదు. అన్నప్రాశనము ఆఱవమాసమునందైనను ఏడవమాసమునందైనను చేయవలసినదని చెప్పఁబడియుండుటవలన ఈ రెండుమాసములలో ఏమాసమునందు గురుశుక్రాస్తాదిదోషము లేకపోవునో యామాసమునందుఁ జేయవలయును. రెండుమాసములయందును గురుశుక్రాస్తాది దోషము కలిగియున్నయెడల విచారింపనక్కఱలేదు. "శ్లో॥ అనన్యగతికం కుర్యాన్నిత్యంనైమిత్తికంతథా" (వేఱువిధమగు ఉపాయము లేని కర్మములను ఏదోషమున్నను విచారింపనక్కఱలేదు.) అనియెడు స్మృతిప్రమాణముచేతఁగూడ కాలనియమముగల కర్మములయందు గురుశుక్రాస్తాది దోషములను విచారింపనక్కఱలేదని యెఱుఁగవలయును. "శ్లో॥ గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనంతతః। జాతకర్మాభిధేయంచ నిష్క్రమప్రాశనే క్రమాత్ । చూడోపనయనంవేదవ్రతానాంచచతుష్టయం। గోదానసమేఖలోగ్నిర్గో వివాహ షోడశక్రియాః" (=గర్భాధానము పుంసవనము సీమంతోన్నయనము జాతకర్మ నిష్క్రమము అన్నప్రాశనము చూడాక

ర్మము ఉపనయనము నాలుగగు వేదవ్రతములు గోదానము మేఖలము అగ్నికము వివాహము అనునవి పదునారును కర్మములు ఇవియే షోడశకర్మములనఁబడును.) ఈశ్లోకమునందుఁ జెప్పఁబడిన క్రమమును అనుసరించి గర్భాధానము మొదలుకొని యన్నప్రాశనము వఱకును అని చెప్పఁబడెనని తెలియవలయును. "శ్లో॥ మాసప్రయుక్తకార్యేషు మూఢత్వే గురుశుక్రయోః। నదోషకృత్తదా మాస లక్షణో బలవానితి" (మాసలక్షణము బలవత్తరమైనదికనుక మాసప్రయుక్తకార్యములయందు గురుశుక్రులయొక్క మూఢత్వము దోషము కలదికాదు.) అని బృహస్పతి చెప్పె. "శ్లో॥ గర్భే వార్ధుషికే భృత్యే శ్రాద్ధకర్మణి మాసికే। సపిండీకరణే నిత్యే నాధిమాసం వివర్జయేత్" (గర్భమునందును వడ్డియందును భృత్యునియందును శ్రాద్ధకర్మమునందును, మాసికమునందును, సపిండీకరణమునందును, నిత్యకర్మమునందును అధికమాసమును విడువఁగూడదు.) అని భృగువు చెప్పె. "శ్లో॥ సీమంతజాతకాదీని ప్రాశనాంతాని చక్రమాత్। కర్తవ్యానినదోషోస్తి పంచాననగతే గురౌ॥" (=గురుఁడు సింహరాశియందున్నప్పటికిని సీమంతము జాతకము మొదలుకొని జాతకాంతము వఱకును గల సకలకర్మములను చేయుటవలన దోషము లేదని తెలియవలయును.) అని కాత్యాయనస్మృతియందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ గర్భాధానాదికాః అన్నప్రాశనాంతామలిమ్లుచే। ఆకర్ణవేధాః కర్తవ్యా నాన్యా ఇత్యాహ భాస్కరః॥" గర్భాదానము మొదలుకొని అన్నప్రాశనాంతమగు కర్మములను అనఁగా కర్ణవేధము వఱకును గల కర్మములను మలమాసమునందుఁ జేయుటవలన దోషము లేదు.) అని భాస్కరుఁడు చెప్పె చూడాకర్మము మొదలుగాఁగల కర్మములను గురుశుక్రుల మౌఢ్యములయందుఁ జేయఁగూడదు. గురుశుక్రులు ఉదయించిన దినము మొదలుకొని యేడుదినములవఱకును బాలురనియును, అస్తమానమున కేడుదినములున్నవి మొదలుకొని వృద్ధులనియును, తెలియవలయును, ఈ బాల్యవృద్ధత్వములయందు అనేకపక్షములు గలిగియున్నను ఇక్కడ ముఖ్యపక్షము మాత్రమంగీకరింపఁబడినదని యెఱుఁగవలయును, వేధాధిపతి యస్తమయమును పొందియుండఁగ మౌంజీబంధము వేదారంభము అనువానిని జేయఁగూడదు. అట్టి కాలములయందు వ్రతాదికము చేయఁబడెనేని వటుఁడు మూర్ఖుఁడగును. మఱియును, అయితే, వేదపతియగుటవలన వేదారంభమునందు మూర్ఖత్వము కలిగినఁగలుగనిమ్ము? వ్రతమునందు మూర్ఖత్వము కలుగుననుటయుచితమాయని యనఁగూడదు. ఏలయనినః—వ్రతబంధము వేదాధ్య



యనముకొఱకుఁ జేయఁబడుచున్నదికనుక వ్రతబంధమునందుఁగూడ మూర్ఖత్వము కలుగుననుటయుచితమేయని యెఱుఁగవలయును. "శ్లో॥ ఉపనీయ గురుశ్శిష్యం మహావ్యాహృతిపూర్వకం। వేదమధ్యాపయేదేనం శౌచాచారాంశ్చ శిక్షయేత్ ॥ ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని పంచవా। గ్రహణాంతికమిత్యేకే కేశాంతశ్చైవ షోడశ ॥ యజ్ఞానాం తపసాం చైవ శుభానాం చైవ కర్మణాం। వేద ఏవ ద్విజాతీనాం నిశ్శ్రేయసకరః పరః॥" (=గురువగువాఁడు గురువునకుపనయనము చేసి మహావ్యాహృతిపూర్వకముగ వేదాధ్యయనమును చేయింపవలయును. శౌచాచారములనుగూడ నేర్పవలయును. ప్రతివేదమును బ్రహ్మచర్యమును పదిరెండుసంవత్సరములయినను అయిదుసంవత్సరములయినను అభ్యసించునట్లు చేయవలయును. యజ్ఞములు తపస్సులు శుభకర్మములు అనువానికి వేదమే ముఖ్యమనియును, బ్రాహ్మణులకు వేదము మోక్షదాయకమైనదని యెఱుఁగవలయును.) అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పె. "శ్లో॥ వేదం సమాప్య స్నాయాద్బ్రహ్మచర్యం వా ష్టాచత్వారింశకం ద్వాదశకేప్యేకే గురుణానుజ్ఞాతః" (=ఇరువదినాలుగు సంవత్సరములయినను పదిరెండుసంవత్సరములయినను వేదవ్రతబ్రహ్మచర్యములను సమాప్తిని పొందింపవలయును.) అని కాత్యాయన గృహ్యసూత్రమునందుఁ జెప్పె.

వ్యా॥ అథ తేషు సంస్కారేషు గురుశుక్రాస్తాది దోషాభావః - ఏషు దోషాః బాలత్వ వృద్ధత్వ ప్రమాణం శాఖేశస్య మౌఢ్యే కింన కార్యమితి చతుష్టయం వృత్తేనైకేనాహ ॥ గర్భాద్యన్నాశనాంతేషు - గర్భాధానాద్యన్నప్రాశనాంతేషు - కర్మసు- గురుసితయోర్బాల్యవార్ధ్యేచ - పరం మౌఢ్యం - గురుశుక్రమూఢత్వం - నజహ్యాత్-నత్యజేత్ - కస్మాద్ధేతోః కాలస్యారోధాత్ - యతశ్శాస్త్రే గర్భాధానాద్యన్నప్రాశనాంతానాం కర్మణాం కాలనిరోధః కృతోస్తి తస్మాద్ధేతోః - తథాచ మాండవ్యః॥ నిత్యాయానే గృహే జీర్ణే ప్రాశనాంతేషు సప్తసు। వధూప్రవేశమాంగల్యే న మౌఢ్యం గురుశుక్రయోరితి ॥ హరిగురుం సింహస్థితం బృహస్పతిం - యామ్యాయనం దక్షిణాయనం - ఊనాధిమాసౌ - క్షయమాసాధిమాసౌ - నత్యజేత్ - కాలస్యారోధాదిత్యే తత్పదం బుద్ధ్యావగంతవ్య - తద్యథా-ప్రసూతిసమయ ఏవ జాతకర్మవిహితం - తత్ర కాల నిరోధాత్ మౌఢ్యాస్తాదికం నచింత్యం. అన్నప్రాశనాంతపదం [illegible] షష్ఠే అష్టమే [illegible] విహితం - తత్ర యస్మిన్మాసే మౌఢ్యాదికం [illegible] - కాల

పంచకేచౌలం హిత్వాక్షీణవిధుంమధుమ్,, ( = క్షీణచంద్రుఁడు కలకాల
మును చైత్రమాసమునువదలి తక్కిన మాఘాదిపంచకమునందు చూడా
కర్మమును చేయవలయును. ) అని నారదుఁడుచెప్పె. మఱియును, రెం
డవ మూడవ అయిదవ సంవత్సరములయందు చేయువారు వారివారికు
లాచారక్రమముగ చూడాకర్మమును చేయవలయును. ,, సాంవత్సరిక
స్యచూడాకరణం తృతీయేవాప్రతిహతే షోడశవర్షస్యకేశాంతో యథా
మంగళంవాసర్వేషామ్ ,, (=అతిక్రాంతసంవత్సరముకలవానికి చూడాక
ర్మమును మూడవసంవత్సరమునందు చేయవలయును. పదునాఱవసంవ
త్సరమున కేశాంతము మంగళానుసారముగఁ జేయవలయును. ) అని
కాత్యాయన గృహ్యసూత్రమునందుఁ జెప్పఁబడె. శ్లో॥ ఆద్యేబ్దే కుర్వతే
కేచి త్పంచమేప్యేద్వితీయకే । ఉపనీత్యాసహైవేతి వికల్పఃకులధర్మతః,,
(=చూడాకర్మమును కొందఱు మొదటిసంవత్సరమునందు చేయుచున్నా
రు. కొందఱు రెండవ సంవత్సరమునందుఁగాని యైదవ సంవత్సరమునం
దుఁగాని చేయుచున్నారు. మఱికొందఱు ఉపనయనముతోఁగూడ చూడా
కర్మమును చేయుచున్నారు. కావున కులాచారానుసారముగఁ జేయవ
లయును.) అని షడ్గురుశిష్యుఁడు చెప్పె. మఱియును, ఇప్పుడు చెప్పఁబ
డిన రెండు మూఁడు అయిదు సంవత్సరములయందు తల్లి గర్భవతియై
యుండెనేని చూడాకర్మమును చేయఁగూడదని చెప్పుటచేత అయిదుసం
వత్సరములకు పిమ్మట తల్లి గర్భవతియై యున్నప్పటికిని చేయవలసినద
నుట అర్థాత్సిద్ధమైయున్నదని యెఱుఁగవలయును. ,,శ్లో॥ సూనోర్మాత
రిగర్భిణ్యాం చూడాకర్మనకారయేత్ । పంచాబ్దాత్ప్రాగథోర్ధ్వంతుగ
ర్భిణ్యామపికారయేత్,, (=పిల్లవానితల్లి గర్భవతియైయుండఁగా చూడా
కర్మమును చేయఁగూడదు. అయిదుసంవత్సరము లతిక్రమించినపిమ్మట
తల్లిగర్భవతియైనను చూడాకర్మమును చేయవచ్చును.) అని నారదుఁడు
చెప్పె. ఉపనయనముతోఁగూడ చూడాకర్మమును చేయు విషయము
నందు దోషమేమియునులేదని యెఱుఁగవలయును. ,, శ్లో ॥ సహోపనీ
త్యాకుర్యాచ్చే త్తదాదోషానవిద్యతే,, (=ఉపనయనముతోఁగూడ చూ
డాకర్మమును చేయుటవలన దోషములేదు. ) అని నారదుఁడుచెప్పె.
బాలునితల్లి రజస్వలయయ్యేనేని శుద్ధిదినముపఱకును చూడాకర్మమును
వేదవ్రతమును వివాహమును చేయఁగూడదు. ,,శ్లో॥ ఉద్వాహవ్రతచూ
డాసు మాతాయదిరజస్వలా । తదానమంగళంకార్యం శుద్ధౌ కార్యంశు



భేచ్ఛుభిః ॥ ,, ( బాలునితల్లి రజస్వలయయియుండఁగా వివాహముచూ
డాకర్మము వేదవ్రతము మొదలగు కార్యములను చేయఁగూడదు.) అని
మనుస్మృతియందుఁ జెప్పఁబడెను. ,, శ్లో ॥ అలాభేసు ముహూర్తస్య
రజోదోషేతుసంస్థితే । శ్రియంసంపూజ్యకుర్యాద్వృత్రహత్యాభ
యంకరీం । హైమీంమాషమితాంపద్మాం శ్రీసూక్తవిధినార్చయేత్ ।
ప్రత్యృచంపాయసంహుత్వా ఽభిషిచ్య శుభమాచరేత్ । సూతకోదక్య
యోశ్శుద్ధా గాందద్యాద్ధేమపూర్వకం । ప్రాప్తేకర్మణిశుద్ధస్స్యా ద్దితర
స్మిన్నశుద్ధ్యతి॥ ,, ( సుముహూర్తము మఱియొకటి లభింపనికాలము
నందు తల్లిరజస్వలయయ్యేనేని లక్ష్మినిపూజించి వృత్రహత్యచేత భయం
కరురాలయినదియును మాషపరిమాణము కలదియును అయిన సువర్ణల
క్ష్మిని చేయించి శ్రీసూక్తప్రకారముగఁ బూజింపవలయును. మఱియు
ను, ప్రతిఋక్కునందును పాయసమును హోమమును చేయవలయు
ను. ఇట్లుచేసినయెడల ప్రసవించినదానికిని రజస్వలయయినదానికిని పరి
శుద్ధతకలుగును. మఱియును, పరిశుద్ధత కలుగుటకొఱకు సువర్ణసహిత
ముగ గోదానమును చేయవలయును. ఇవ్విధముగ నేకర్మమునుగుఱించి
చేయఁబడునో యాకర్మమునందుమాత్రమే పరిశుద్ధత కలుగునుగాని
యితరకర్మములయందు పరిశుద్ధత కలుగనేరదు.) అని కారికానిబంధ
మను గ్రంథమునందు చెప్పఁబడియె.

వ్యా॥ అథచౌలంసనిర్ణయం వృత్తేనైకేనాహ ॥ కార్యం వర్ణైరి
రితి ॥ చౌలంఅగ్రిమశ్లోకేనాన్వయః - చూడాకరణం - మఘాదిపఞ్చసు
మాసేషుఅమధుషు - చైత్రరహితేషు - గదితముక్తం ॥ తథాచోక్తంనా
రదేన ॥ శ్లో ॥ మాఘాది పఞ్చకేచౌలం హిత్వాక్షీణ విధుంమధుమితి॥
ద్విత్రి పఞ్చస్మి న్నేఽబ్దే- ద్వితీయేతృతీయేపఞ్చమేవర్షేవా- ఆచారాద్వా
స్వకులాచారతోవా॥ ఉక్తం చకాత్యాయనగృహ్యే- సాంవత్సరికస్యచూ
డాకరణం తృతీయేవాప్రతిహతే షోడశవర్షస్య కేశాన్తోయథామంగళం
వాసర్వేషామితి ॥ సాంవత్సరికస్య - అతిక్రాంతాబ్దస్యేతి హరిహరమి
శ్రైర్వ్యాఖ్యాతం కృతం- తథాచషడ్గురుశిష్యః ॥ ఆద్యేఽబ్దేకుర్వతేకేచి
త్పఞ్చమేప్యేద్వితీయకే । ఉపనీత్యాసహైవేతివికల్పఃకులధర్మత ఇతి॥ సగ
ర్భాయదిభవతిజనన్యత్రనోకార్యమేతత్ ॥ అత్ర - ఉక్తవర్షేషు - ద్విత్రిప
ఞ్చాబ్దకేషు - జననీ - కుమారస్యమాతాయదిసగర్భాభవతి - స్యాత్త
దా - ఏతచ్చౌలంనోకార్యం - పఞ్చవర్షాదూర్ధ్వం - గర్భిణ్యాంసత్యా

ముపకార్యమిత్యర్థసిద్ధం ॥ అత్రనారదః ॥ సూనోర్మాతరిగర్భిణ్యాం చూడాకర్మనకారయేత్ । పంచాబ్దాత్ప్రాగథోర్ధ్వంతు గర్భిణ్యామపికారయేత్ ॥ ఉపనయనేన సహక్రియమాణే నదోషఇత్యాహ ॥ సాకంయద్యోపనీత్యాక్రియతఇహతదాయంనిరోధోనహిస్యాదితి॥ యత్రఉపనీత్యా సాకం - ఉపనయనేనసహక్రియతే తదాఇహాస్మిన్ చైతేఅయముక్తోని రోధశ్చైత్రమాసమాతృగర్భలక్షణోనహ్యేవస్యాత్ - తదుక్తంతత్రైవ॥ సహోపనీత్యాకుర్యాచ్చేత్తదాదోషోనవిద్యతేఇతి ॥ అబ్దాత్ఊర్ధ్వేని షేధమాహ ॥ జహ్యాదబ్దాదూర్ధ్వేవేదోవ్రతముపయమనం చాపిశుద్ధేస్సుభార్తేతి ॥ అబ్దాత్ఊర్ధ్వేమాతృరజసిఅదఃఅనంతరోక్తంచౌలమిత్యర్థః - వ్రతం మౌంజీ - ఉపయమనంవివాహః - ఆవిశుద్ధేః - శుద్ధిపర్యంతం - శుభార్థినరః - ఏతత్త్రియంజహ్యాత్ - నకుర్యాదిత్యర్థః - తథాచ మనుస్మృతౌ ॥ శ్లో ॥ ఉద్వాహవ్రతచూడాసు మాతాయది రజస్వలా। నదాన మంగలంకార్యం శుద్ధౌకార్యం శుభేప్సుభిః । అస్యముహూర్తాలాభేకారికాబిబంధేశాంతికముక్తం అలాభేసు ముహూర్తస్య రజోదోషేతుసంస్థితే । శ్రియంసంపూజ్యతత్కుర్యాద్వ్రత్ర్రిహత్యాభయంకరీం॥ హైమీం మాషమితాంపద్మాం శ్రీసూక్తవిధినార్చయేత్ । ప్రత్యృచంపాయసంహుత్వాఽభిషిచ్యశుభమాచరేత్ ॥ సూతికోదక్యయోశ్శుద్ధా గాంధర్వాద్యేమపూర్వకః । ప్రాప్తేకర్మణిశుద్ధస్స్యాదితరస్మిన్నశుద్ధ్యతీతి॥ ఉదక్యారజస్వలా॥ ఇతి చౌలనిర్ణయః ప్రకరణం సమాప్తమ్.

——— ※ అథచౌలే బ్రాహ్మణాదీనాంవారనక్షత్రలగ్నబలాని. ※ ———

మూ॥ కార్యం వర్ణైరినారార్కి-శనిషునిఖిలైర్జ్ఞత్రయేశుక్లసో
మేద్యూనాంత్యాద్వ్యదిత్యశ్రవణేందుభిరినహరితస్త్రిత్రిభై
శ్చౌలకర్మ । ద్యూనేఽర్కా-రార్కి-శుక్రాగతకవినిఖి
లామృత్యుగామృత్యుదాస్స్యుర్వ్యబ్జాస్సంతోంత్యఇష్టా
స్త్వత్యజగుహశశినౌరాత్రిసంధ్యేచరిక్తాః॥ ౧౦॥

టీక ॥ వర్ణైః = బ్రాహ్మణాదినాలుగువర్ణములచేత, ఇనారార్కి-శనిషు = సూర్యకుజశని శనివారములయందు, చౌలకర్మ = చూడాకర్మము, కార్యమ్ = చేయఁదగినది, నిఖిలైః = అన్నివర్ణములవారిచేతను జ్ఞత్రయే = సూర్యగురుశుక్రవారములయందును, శుక్లసోమే = శుక్లపక్షమునందలి సోమవారమునందు, చౌలకర్మ = చూడాకర్మము, కార్యమ్ = చేయఁదగినది, ద్యూనాంత్యాద్వ్యదిత్యశ్రవణేందుభిః = రేవతి, అశ్వని



పునర్వసు, పుష్యమి, జ్యేష్ఠ, మృగశీర్ష అను నక్షత్రములచేతను, ఇనహరితః = హస్తకును శ్రవణమునకును, త్రిత్రిభైః = మూఁడుమూఁడునక్షత్రములచేతను, చౌలకర్మ = చూడాకర్మము, కార్యమ్ = చేయఁదగినది, ద్యూనే = సప్తమస్థానమునందు, అర్కా-రార్కి-శుక్రాః = రవి, కుజ, శని శుక్రులు, మృత్యుదాః = మృత్యువునిచ్చువారు, స్యుః = అగుదురు, గతకవినిఖిలాః = శుక్రరహితసకలగ్రహములును, మృత్యుగాః = అష్టమస్థానమునుపొందినవారైరేని, మృత్యుదాః = మృత్యువునిచ్చువారు, స్యుః = అగుదురు, వ్యబ్జాః = చంద్రరహితములయిన, సంతః = సద్గ్రహములు, అంత్యే = ద్వాదశస్థానమునందు, ఇష్టాః = శుభకరులు, స్యుః = అగుదురు, గుహశశినౌ = షష్ఠీపూర్ణిమలను, రాత్రిసంధ్యేచ = రాత్రిసంధ్యలను, రిక్తాః = రిక్తతిథులను, త్యజ = విడిచిపెట్టుము.

తా ॥ చౌలకర్మమునందు బ్రాహ్మణాదులకు వారలగ్నబలములను చెప్పుచున్నాఁడు. మఱియును, అన్నివర్ణములకుఁ దగినట్లు వారవిశేషమును నక్షత్రములను లగ్నబలమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—బ్రాహ్మణాది నాలుగువర్ణములవారును క్రమముగ రవి కుజ శని శనివారములయందు చూడాకర్మమును చేయవలయును అనఁగా బ్రాహ్మణులు భానువారమునందును, క్షత్రియుఁడు సోమవారమునందును, వైశ్యుఁడు శనివారమునందును, శూద్రుఁడును శనివారమునందును, చూడాకర్మమును చేయవలయును. మఱియును, "శ్లో॥ వేదోవ్రతోపనయనం మహానామ్నీ మహావ్రతం । వినాద్వాదశ శూద్రాణాం సంస్కారా నామమంత్రతః" (=వేదము,వ్రతము, ఉపనయనము, మహానామ్ని, మహావ్రతము, అనునవితప్ప శూద్రులకు పదిరెండు సంస్కారములను చేయవలయును. ఈసంస్కారములు నామమంత్రములవలన చేయవలయును.) అని శూద్రునకు పదిరెండు సంస్కారములు చేయవలయును. మఱియును, నాలుగువర్ణములవారికిని బుధ గురు శుక్రవారములును శుక్లపక్షమునందలి సోమవారమును చూడాకర్మమునందు శ్రేష్ఠములయినవి. కృష్ణపక్షమునందు చంద్రుఁడు క్షీణించినవాఁడగుటవలన కృష్ణపక్షమునందలి సోమవారము చూడాకర్మమునందు నిందితమైనదని యెఱుఁగవలయును మఱియును, "శ్లో॥ అపర్వరిక్తా తిథిషు శుక్రేజ్యజ్ఞేందువాసరే" (=పర్వములును రిక్తతిథులునుకాని తిథులయందును శుక్ర గురు బుధ సోమవారములయందును చూడాకర్మమును చేయవలయును.) అని నారదుఁడు చె

ప్పె. "శ్లో॥ సోమవారస్సితేపక్షే కృష్ణపక్షేఽతి గర్హితః। బుధవారశ్శుభః ప్రోక్తః పాపగ్రహయుతే బుధే ॥ పాపగ్రహాణాం వారాదౌ విప్రాణాం శుభదో రవిః । క్షత్రియాణాం క్షమాసూను ర్విట్ఛూద్రాణాం శనిశ్శుభః॥" (=శుక్లపక్షమునందలి సోమవారము ప్రశస్తమైనది. కృష్ణపక్షమునందలి సోమవారము మిగుల నిందితములయినవి బుధవారము శుభకరమయినది. పాపగ్రహముతోఁగూడిన బుధునివారము శ్రేష్ఠమైనదికాదు. పాపగ్రహముల వారములలో రవివారము బ్రాహ్మణులకు ముఖ్యమైనది. క్షత్రియులకు అంగారకవారమును శూద్రులకు శనివారమును శ్రేష్ఠములయినవి.) అని బృహస్పతిచెప్పె. మఱియును, రేవతి అశ్విని పునర్వసు పుష్యమి జ్యేష్ఠ, మృగశీర్ష, హస్త, చిత్త, స్వాతి, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, అను నక్షత్రములు చూడాకర్మమునందు ప్రశస్తము లయినవి. "శ్లో॥ దస్రాది తిజ్యచంద్రేంద్ర పూషభాని శుభాన్యతః । చౌలకర్మణిహస్తర్క్షాత్ త్రీణిత్రీణిచ విష్ణుభాత్" (=రేవతి అశ్విని పునర్వసు పుష్యమి జ్యేష్ఠ మృగశీర్ష హస్త చిత్త స్వాతి శ్రవణము ధనిష్ఠ శతభిషము అను నక్షత్రములు చూడాకర్మమునందు శ్రేష్ఠములయినవి.) అని నారదుఁడు చెప్పె. చూడాకర్మలగ్నమునకు సప్తమమునందు రవికుజ శుక్రులున్నయెడల మృత్యువు నిచ్చువారగుదురు. "శ్లో॥ జామిత్రే భాస్కరే శౌరే మృత్యుస్స్యాద్భూమిజే తథా । శుక్రే సౌఖ్య వినాశస్స్యా న్మందభాగ్యం శనైశ్చరే॥" (=సూర్యుఁడు సప్తమమునందుండఁగా చూడాకర్మమును చేసినయెడల మృత్యువు కలుగును. అంగారకుఁడు సప్తమమునందున్నను ఇట్టిఫలమే కలుగునని తెలియవలయును. శుక్రుఁడున్నయెడల సౌఖ్యమునశించును. శనియున్నయెడల మందభాగ్యము కలుగును.) అని వశిష్ఠుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ దారిద్ర్యాన్మరణంపరమ్" (=దారిద్ర్యముకంటె మరణము శ్రేష్ఠమయినది.) అను న్యాయానుసారముగ, సప్తమస్థానము నందున్న గ్రహములవలనఁ గలిగెడు భిన్నఫలములనువిడిచి మరణముకలుగునని చెప్పఁబడెనని యెఱుఁగవలయును, మఱియును, అష్టమస్థానమునందు శుక్రుఁడుతప్పఁ దక్కిన గ్రహములలో ఏగ్రహమున్నను మరణము కలుగును. "శ్లో॥ అష్టమస్థానగాస్సర్వే నేష్టాశ్శుక్ర వివర్జితాః । శుక్రస్తు నిధనే శ్రేష్ఠ స్సర్వసంపత్ప్రదశ్శిశోః॥" (=శుక్రుఁడుతప్పఁ దక్కిన గ్రహములు అష్టమస్థానమునందుండిరేని శుభకరులుగారు. అష్టమస్థానమునందు శుక్రుఁడుండెనేని బాలునకు సర్వసంపదలను కలుగును.) అని బృహస్పతిచెప్పె. మఱి



యును, చూడాకర్మమునందు చంద్రుఁడుతప్పఁ దక్కిన గ్రహములు ద్వాదశస్థానమునందున్నయెడల శుభముకలుగుననియును, చంద్రుఁడు ద్వాదశస్థానమునందున్నయెడల కీడుకలుగును. "శ్లో॥ క్షురాన్నప్రాశనేశస్తాస్సౌమ్యా వ్యారంధ్రవ్యయోపగాః॥" (=క్షురాన్నప్రాశనలగ్నములకు ఎనిమిది పదిరెండు స్థానములయందు శుభగ్రహములున్నయెడల శుభములుకలుగును.) అని నారదుఁడు చెప్పె. మఱియును, "శ్లో ॥ న నైధనే భే శీతాంశౌ షష్ఠాష్టాంత్య వివర్జితే" (=చంద్రుఁడు షష్ఠాష్టమ ద్వాదశస్థానములయందుండఁగా చూడాకర్మమును చేయఁగూడదు.) అనియును నారదుఁడే చెప్పె. మఱియును, ఇతరమగు లగ్నబలాదికమును పూర్వమునందుఁ జెప్పఁబడినవిధముగఁ జూచికొనవలయును. చూడాకర్మమునకు షష్ఠిపూర్ణిమరిక్తతిథులు రాత్రులు సంధ్యలు అనునవితగినవికావు. "శ్లో॥ క్రూరవారం నిశాంరిక్తాం షష్ఠ్యాం సంధ్యాంచ జన్మభం । సద్భిర్వివర్జయేదేతన్నారదస్య వచో యథా॥" (=క్రూరగ్రహవారములను రాత్రిని, రిక్తతిథిని, షష్ఠిని, సంధ్యాకాలమును, జన్మనక్షత్రమును, అనువానిని చూడాకర్మమునందు విడువవలసినదని నారదుఁడు చెప్పె.) అని స్మృతియందుఁ జెప్పఁబడెను.

వ్యా ॥ అథవర్ణవిశేషేణ వారవిశేషం తథానక్షత్రాణి లగ్నబలంచ వృత్తేనైకేనాహ ॥ వర్ణైః బ్రాహ్మణాదిభిః - యథాక్రమేణ - ఇనారార్కిశనిషు - చౌలకర్మకార్యమిత్యన్వయః - ఇనః సూర్యః - ఆరో భౌమః - అర్కిః శనిః - శనిః ప్రసిద్ధ - ఏతేష్విత్యర్థః - ఏతదుక్తంభవతి । విప్రేణరవివారే - క్షత్రియేణభౌమవారే - వైశ్యేనశనివారే - శూద్రేణాపిశనివారే - చౌలంకర్తవ్యమిత్యర్థః - శూద్రస్యద్వాదశసంస్కారా ఉక్తాః॥ శ్లో॥ వేదవ్రతోపనయనం మహానామ్నీ మహావ్రతం। వినాద్వాదశశూద్రాణాం సంస్కారా నామమంత్రత ఇతి॥ నిఖిలైరితి ॥ నిఖిలైశ్చతుర్భిర్వర్ణైః విశేషేణ - జ్ఞత్రయే - బుధత్రయే - శుక్లసోమే - శుక్లపక్షగతసోమవాసరే - కార్యం - కృష్ణపక్షే - సోమవారోఽతినిందితః క్షీణత్వాత్ - అత్రనారదః ॥ శ్లో ॥ అపర్వరిక్తా తిథిషు శుక్రేజ్యజ్ఞేందువాసరే ఇతి॥ బృహస్పతిః ॥ సోమవారస్సితేపక్షే కృష్ణపక్షేఽతి గర్హితః । బుధవారశ్శుభః ప్రోక్తః పాపగ్రహయుతే బుధే ॥ పాపగ్రహాణాంవారాదౌ విప్రాణాం శుభదో రవిః । క్షత్రియాణాం క్షమాసూను ర్విట్ఛూద్రాణాం శనిశ్శుభ ఇతి ॥ క్షైద్వ్యంత్యద్వ్యాదిత్యశాక్రేందుభిః. అంత్యాద్వేఇతిద్వ్యం

త్యం రేవత్యశ్విన్యౌ - ద్వ్యదిత్యం - పునర్వసుపుష్యౌ - శాక్రం జ్యేష్ఠా ఇందుమృగః - ఏతైః - పునఃకైః - ఇనహరితస్త్రిత్రిభైః - ఇనో హస్తః - హరిశ్శ్రవణం - తాభ్యాం త్రిత్రిభైః - హస్తాత్త్రిభిః - శ్రవణాత్త్రిభిరిత్యర్థః - తథాచ నారదః॥ శ్లో॥ దస్రాదితిజ్య చంద్రేంద్ర పూషభాని శుభాన్యతః చౌలకర్మణి హస్తర్క్షాత్త్రిణి త్రీణిచ విష్ణుభాదితి॥ ద్యూనే ఽ రాఽరార్కిశుక్రాః - అత్రచౌలే మృత్యుదాస్స్యుః - ద్యూనే - సప్తమే - అరాఽరాఽర్కిశుక్రాః - అరః - సూర్యః ఆరో భౌమః - అరస్యాఽపత్యమార్కిః - శనిః - శుక్రః ప్రసిద్ధః - ఏతే చత్వారో మృత్యుదా ఇతి - చతుర్ణాం సమానం ఫలముక్తం - వసిష్ఠే చాత్రవిశేషఫలముక్తం॥ శ్లో॥ జామిత్రే భాస్కరే క్షౌరే మృత్యుస్స్యా ద్భూమిజే తథా । శుక్రే సౌఖ్యవినాశస్స్యా న్మందభాగ్యం శనైశ్చరే ఇతి॥ అత్రచతుర్ణామపి సామాన్యేన మృత్యుఫలముక్తం॥ తత్ - దారిద్ర్యాన్మరణం వరమితి న్యాయేన న దోషః గతికవినిఖిలా మృత్యుగా మృత్యుదాస్స్యుః - గతః కవిః శుక్రో యేభ్యస్తే గతకవయః - తే చ తే నిఖిలాశ్చ శుక్రరహితాః సర్వే మృత్యుగాః - అష్టమగా మృత్యుదాస్స్యుః - అత్ర బృహస్పతిః॥ శ్లో॥ అష్టమస్థానగాస్సర్వే నేష్టాశ్శుక్రవివర్జితాః । శుక్రస్తు నిధనే క్షౌరే సర్వసంపత్ప్రదశ్శిరోరితి॥ వ్యబ్జాస్సంతో ఽన్త్యే ఇష్టాః - విగతః - అబ్జః - చంద్రో యేభ్యస్తే వ్యబ్జాః - ఏవంవిధాస్సంతః - సద్గ్రహాః - చంద్రరహితాః - సద్గ్రహాః - అంత్యే ద్వాదశే ఇష్టాః - శోభనాస్స్యుః - నారదః॥ చౌలాన్నప్రాశనే శస్తాస్సౌమ్యా రంధ్రవ్యయోపగా ఇతి॥ అన్యచ్చ॥ నవైధనే భే శీతాంశావష్టాష్టా ఽన్త్యవివర్జిత ఇతి॥ తస్యైవ వచనం। అన్యల్లగ్నబలం పూర్వవత్ - త్యజగుహాశశినా రాత్రిసంధ్యే చరిక్తాః గుహాషష్ఠీ - శశీ పూర్ణిమా॥ స్పష్టమన్యత్॥ శ్లో॥ క్రూరవారం నిశాం రిక్తాం షష్ఠీం సంధ్యాంచ జన్మభం । సద్భిర్వివర్జయేచ్చేత న్నారదస్య వచో యథేతి॥

ఇతి బ్రాహ్మణాదీనాం చౌలే వారాదీని - సమాప్తమ్.



* అథ క్షౌరనిర్ణయః. *

మూ॥ భుక్తాఽభ్యక్తోపవాసీ శ్వరజనయువతి ప్రాగ్వయస్సార్కాశ్చ యోగియాత్రాయుద్ధోన్ముఖాస్త్యక్తదినవిధయో ఽస్త్ర్య్
వ్యంబకాస్తే న ముండ్యాః। సీమంతోర్ధ్వం సపత్న్యాస్తనఖకచలవనం దూరదేశప్రయాణం వృక్షచ్ఛేదస్సముద్రాప్లుతిమృతహరణే స్యాన్న చావశ్యకార్యాత్॥ ౧౦॥



టీక॥ భుక్తాభ్యక్తోపవాసీశ్వర జనయువతి ప్రాగ్వయస్సార్కాః = భోజనమును చేసినవాఁడును అభ్యంజనమును చేసినవాఁడును, ఉపవాసమును చేసినవాఁడును, ఈశ్వరజనుఁడును, (లేక) సమర్థుఁడును, స్త్రీలు, ఏఁబదిసంవత్సరములకు లోఁబడిన వయస్సుకలవాఁడును, అనువారును, యోగీచ=యోగియును, యాత్రాయుద్ధోన్ముఖాః = యాత్రలకును యుద్ధమునకును అభిముఖులయినవారును, అస్త్ర్యంబకాః=తల్లిదండ్రులుగలవాఁడును, కృతదినవిధయః = నిత్యకృత్యమును చేసికొన్నవారును, యే=ఎవ్వరు, (సన్తి=కలరో,) తే=వారు, అవశ్యకార్యాదృతే=అవశ్యకార్యములేక, నముండ్యాః=ముండనార్హులుకారు, సీమంతోర్ధ్వమ్=సీమంతమైనపిమ్మట, పత్న్యాః=భర్తకు, నఖకచలవనమ్=గోళ్లయొక్కయును కేశములయొక్కయును ఖండనమును, దూరదేశప్రయాణమ్ = దూరదేశప్రయాణమును, వృక్షచ్ఛేదః=వృక్షచ్ఛేదము, సముద్రాప్లుతిమృతహరణే = సముద్రస్నానము శవవహనము, అవశ్యకార్యాదృతే = అవశ్యమైనకార్యము వినాగా, నస్యాత్=కూడదు.

తా॥ ప్రసంగవశమువలన క్షౌరనిర్ణయమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— భోజనమును చేసినవాఁడును, అభ్యంగనమును చేసికొన్నవాఁడును, ఉపవాసమును చేసినవాఁడును, స్త్రీలును, ఏబదిసంవత్సరములవయస్సునకు లోఁబడినవాఁడును, యోగియును, యాత్రకును యుద్ధమునకును అభిముఖుఁడైనవాఁడును, నిత్యకృత్యములను చేసినవాఁడును, తల్లిదండ్రులుగలవాఁడును, ఆవశ్యక కార్యము లేనప్పుడు ముండనమునకు అర్హులుగారు. మఱియును, సీమంతమును చేసినపిమ్మట భార్యప్రసవించువఱకును భర్తయగువాఁడు నఖకేశఖండనము, దూరదేశప్రయాణము, వృక్షచ్ఛేదము, సముద్రస్నానము, శవవహనము అనువానిని ఆవశ్యక కార్యములేక క్షౌరమును చేసికొనఁగూడదు. ఆవశ్యక కార్యమున్నయెడల దోషములేదు. దేశోపద్రవము సంభవించినపుడు దేశాంతరగమనము చేయుటవలన దోషములేదు. "శ్లో॥ మాసిమాస్యుపాసనికస్య పక్షేపక్షేగ్నిహోత్రిణః॥" (=నెలనెలకును గృహస్థుఁడును, ప్రతిపక్షమునందును ఆహితాగ్నియును ముండనమును చేసికొనవలయును.) అనిస్మృతియందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ అథ ప్రసంగాత్ క్షౌరనిర్ణయం వృత్తేనాహ॥ భుక్తః కృతభోజనః - అభ్యక్తః - కృతాభ్యంగః - ఉపవాసీ ప్రసిద్ధః - ఈశ్వరజనో రాజసేవ

కః-సమర్థోవా - యువతీస్త్రీ సౌభాగ్యవతీ - ప్రాగ్వయసః-ప్రథమ వయసః - పఞ్చాశద్వర్ష పర్యంతం పూర్వవయః- యోగీ-రాజయోగీ-గీతాదౌప్రసిద్ధః - యాత్రాయుద్ధోన్ముఖాః - యాత్రాప్రయాణం- యుద్ధంప్రసిద్ధం - తౌప్రతియే ఉన్ముఖాః ప్రచలితాః - యాత్రోన్ముఖాయుద్ధోన్ముఖాశ్చేత్యర్థః-కృతదినవిధయః - కృతా-దినవిధిః-ఆహ్నికం-యైః - తే-కృతదినవిధయః - అస్త్యప్సుకోజీవత్పితృకః-తే-నముండ్యాః - ముండనార్హానభవంతి అవశ్యకార్యాదృతే ఇత్యుత్తరార్థోక్త మత్రానుసంధేయం। యత్రావశ్యకముండనకారణంభవతి - తత్రావశ్యంముండ్యాః- అథక్షౌర నిషేధప్రసంగా ద్గుర్విణీపతే ర్నిషిద్ధంసాపవాదమాహ॥ సీమంతోర్ధ్వ మితి॥ సీమంతోర్ధ్వం - సీమంతోన్నయనాదూర్ధ్వం - పత్న్యాః-కృతసీమన్తసంస్కారాయాః పత్యుర్భర్తురవశ్య కార్యాదృతే - నఖకచలవనాదికంనస్యాత్ - నఖకచలవనం నఖకేశచ్ఛేదనం - అన్యత్సుగమం-అవశ్యకార్యాదృతేనస్యాదిత్యనేన - ఆవశ్యకేనదోష ఇత్యర్థాత్సిద్ధం - యథాపితృమరణేక్షౌరాది - దేశవిప్లవే దేశాంతర గమనమిత్యాది విచారణాయాం ఆవశ్యకేనదోషఇత్యర్థః - కృతాగ్న్యాధానస్య ముండన పక్షాంగీకారే ముండనమావశ్యకం - మాసిమాస్యుపాసనికస్య పక్షేపక్షేగ్ని హోత్రిణఇతి॥ ఇతి క్షౌరనిర్ణయప్రకరణం సమాప్తమ్.

——(*) అథ క్షౌరేనక్షత్రాదీని. (*)——

మూ॥ క్షౌరం చౌలోక్తభాదౌ గదితమథరవిక్షేత్ర గంగాధ్వరా
గ్న్యాధానే పిత్రోర్వినాశే ద్విజనృపకథనే సర్వదాక్ష్
రమిష్టమ్॥ ౧౦౫॥

టీక॥ చౌలోక్తభాదౌ = చౌలకర్మమునకు చెప్పఁబడిన నక్షత్రతిథ్యాదికాలములయందు, క్షౌరమ్=క్షురము, గదితమ్=చెప్పఁదగినది. అథ= తిమ్మట, రవిక్షేత్రగంగాధ్వరాగ్న్యాధానే=భాస్కర క్షేత్రమునందును, గంగయందును, అధ్వరమునందును, అగ్న్యాధానమునందును, పిత్రోః= తల్లిదండ్రులయొక్క, వినాశే = వినాశమునందును, ద్విజనృపకథనే=రాజాజ్ఞయందును బ్రాహ్మణాజ్ఞయందును, సర్వదా = సర్వకాలములయందును, (కాలనక్షత్రాది నియమములేకయే) క్షురమ్=క్షురకర్మము, ఇష్టమ్=శుభకరమైనది.

తా॥ ఇప్పుడు చెప్పఁబడినవారికంటె ఇతరులకు క్షురనిమిత్తము నక్షత్రాదికమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—చౌలముకొఱకు చెప్పఁ



బడిన కాలనక్షత్ర తిథ్యాదులనే క్షురకర్మమునందు ప్రశస్తములయిన వానినిగాఁ దెలియవలయును. భాస్కర క్షేత్రము గంగానది యాగము అగ్నిహోత్రము మాతాపితృమరణములు బ్రాహ్మణాజ్ఞ రాజాజ్ఞలు అనునవి కలిగినపుడు కాలాదినియమముక్షురమున కక్కర లేదని యెఱుఁగవలయును. "శ్లో॥ భుక్తాభక్తనిరాసనైః" ( భుక్తము అభ్యక్తము అనువానిని నిమిత్తముకలిగినపుడు క్షురకర్మమునందు నిషిద్ధములనుగా గ్రహింపనక్కరలేదు. ) "శ్లో॥ ఆజ్ఞయానరపతేర్ద్విజన్మనాః" (=రాజాజ్ఞయును బ్రాహ్మణాజ్ఞయును అయినపుడు క్షురమునకు కాలాదినియమమక్కరలేదు.) అని రత్నమాలయందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ రాజకార్యేనియుక్తానాం నరాణాం భూపసేవినాం। శ్మశ్రులోమనఖచ్ఛేదే నాస్తికాలవిశోధనమ్,, ( = రాజకార్యమునందు నియోగింపఁబడినవారును రాజులను సేవించుచున్నవారును అగు మానవులకు శ్మశ్రులోమనఖఖండనమునందు కాలాదినియమమక్కరలేదు. ) అని బృహస్పతిచెప్పె. "శ్లో॥ రాజయోగీపురంధ్రీచ మాతాపిత్రోశ్చజీవతోః। ముండనంసర్వతీర్థేషునకుర్యాద్గుర్విణీపతిః,, (=రాజయోగియును, కుటుంబమును భరించుస్త్రీయును, బ్రతికియుండిన తల్లిదండ్రులు కలవాఁడును, గర్భిణీపతియును, సకలతీర్థములయందును ముండనమును చేసికొనఁగూడదు.) అని జ్యోతిర్నిబంధమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ సింధుస్నానం ద్రుమచ్ఛేదం వపనంప్రేతవాహనం। విదేశగమనంచైవ నకుర్యాద్గుర్విణీపతిః,, (=గర్భిణీస్త్రీయొక్క భర్త, సముద్రస్నానమును వృక్షచ్ఛేదమును వపనమును శవవహనమును విదేశగమనమును చేయఁగూడదు. ) అని స్మృత్యంతరమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ క్షురంనైమిత్తికంకుర్యాన్నిషేధేసత్యపిధ్రువం। పిత్రోఃప్రేతవిధానంచ నదోషస్తత్రవిద్యతే,, (=నిషేధము కలిగియున్నప్పటికిని నైమిత్తికమగు క్షురమును తల్లిదండ్రులకు ప్రేతకార్యములను చేయుటవలన దోషములేదు.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడె. "శ్లో॥ గంగాయాం భాస్కరక్షేత్రే మాతాపిత్రోర్మృతేహని। ఆధానేసోమపానేచ షట్సుక్షురంవిధీయతే,, (=గంగయందును భాస్కరక్షేత్రమునందును తల్లిదండ్రులయొక్క మృతదినమందును ఆధానమునందును సోమపానమునందును క్షురమునుచేసికొనవలయును.) అనియును స్మృత్యంతరమునందుఁ జెప్పఁబడె. "శ్లో॥ అంతర్వత్న్యాంతుజాతాయాం తీర్థేషువపనంనకారయేత్। ప్రేతవాహ

దికంనైవ సీమంతోన్నయనాదను ॥ పంచాశద్వాయనాత్పూర్వంక్షురం నైమిత్తికంవినా । నకుర్యాత్తతఊర్ధ్వంతు స్వేచ్ఛయావపనంచరేత్ ॥ " (=భార్యగర్భవతియైయుండఁగా తీర్థమునందుక్షురమును చేసికొనఁగూడదు. సీమంతమైనపిమ్మట ప్రేతవహనాదికమును ( శవవహనాదికమును ) చేయఁగూడదు. ఏబది సంవత్సరముల వయస్సు కాకమునుపు క్షౌరము నిమిత్తములేక చేసికొనఁగూడదు. ఏబదిసంవత్సరములవయస్సు కడచినపిమ్మట నిచ్ఛానుసారముగ వపనమును చేసికొనవచ్చును. (ఇట్లనియును స్మృత్యంతరమునందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ అథోక్తేభ్యోన్యేషాం క్షౌరార్థం నక్షత్రాదికమాహ ॥ క్షురమితి॥ చౌలోక్తభాహే - క్షురకంగదితంప్రోక్తం-చౌలార్థముక్తశ్చలోక్తః - సచాసౌభాదిశ్చ తస్మిన్నక్షత్ర తిథ్యాదికాలే- క్షురంగదితం-ప్రోక్తంఅథక్షురనిమిత్తాన్యాహ ॥ రవిక్షేత్ర గంగాధ్వరాగ్న్యాధానే పిత్రోర్వినాశేఇత్యాది ॥ రవిక్షేత్రం-భాస్కరక్షేత్రం - గంగా-ప్రసిద్ధా-అధ్వరోయాగః - అగ్న్యాధానం - అగ్నిహోత్రం-తస్మిన్-పిత్రోర్వినాశోమరణం-తస్మిన్॥ ద్విజనృపకథనే ॥ బ్రాహ్మణాజ్ఞాయాం - రాజాజ్ఞాయాంచసత్యాం - సర్వదా-క్షురంఇష్టంస్యాత్ - క్షురనక్షత్రాది నియమోనాస్తీత్యర్థః॥ తదుక్తంవృత్తశతే ॥ భుక్త్వాభ్యక్త నిరాసనైరిత్యాది॥ రత్నమాలాయాం॥ ఆజ్ఞయానరపతేర్ద్విజన్మనామిత్యాది॥ బృహస్పతిః ॥ రాజకార్యేనియుక్తానాం నరాణాం భూపసేవినాం । శ్మశ్రులోమనఖచ్ఛేదేనాస్తికాలవిశోధనం॥ జ్యోతిర్నిబంధే॥ రాజయోగీ ప్రసంధీచ మాతాపిత్రోశ్చజీవతోః । ముండనంసర్వతీర్థేషు నకుర్యాద్గుర్విణీపతిః॥ స్మృత్యంతరే॥ సింధుస్నానంద్రుమచ్ఛేదం వపనంప్రేతవాహనం । విదేశగమనంచైవ నకుర్యాద్గుర్విణీపతిః॥ క్షురంనైమిత్తికంకుర్యాన్నిషేధేసత్యపిధ్రువం । పిత్రోఃప్రేతవిధానంచ సదోషనక్షత్రపద్యతే॥ గంగాయాంభాస్కరక్షేత్రే మాతాపిత్రోర్మృతేహని । ఆధానేసోమపానేచ షట్సు క్షురంవిధీయతే॥ అంతర్వత్న్యాంతుజాయాయాం తీర్థేక్షురపనంనకారయేత్ । ప్రేతవాహాదికంనైవ సీమంతోన్నయనాదను ॥ పంచాశద్వాయనాత్పూర్వం క్షురంనైమిత్తికంవినా। నకుర్యాత్తతఊర్ధ్వంతు స్వేచ్ఛయావపనంచరేదితి॥ ఇతిక్షురగేనక్షత్రాదిని సమాప్తమ్.

(*) అథాక్షరారమ్భః. (*)

మూ॥ మిత్రత్ర్యర్కాదితీందాంత్యమహరితురగైః పఞ్చమే



శైవ్రతాత్ప్రాగ్విద్యారంభోక్తకాలే ఽక్షరవిధిరఘటే
సౌమ్యసంజ్ఞేయనేఽర్కే॥ ౧౧॥

టీక॥ విద్యారంభోక్తకాలే = విద్యారంభమునకు చెప్పఁబడినకాలమునందు, ( అనఁగా ) సౌమ్యసంజ్ఞే + అయనే=ఉత్తరాయణమునందు, అర్కే=సూర్యుఁడు, అఘటే = కుంభమునందు లేనివాఁడగుచుండగా, వ్రతాత్ప్రాక్ = ఉపనయనమునకు పూర్వమునందు, పంచమే=అయిదవదైన, అబ్దే=సంవత్సరమునందు, మిత్రత్ర్యర్కాదితీందాంత్యమహరితురగైః=అనూరాధ, హస్తచిత్త, స్వాతి, పునర్వసు, జ్యేష్ఠ, రేవతి, శ్రవణము, అశ్విని, అను నక్షత్రములచేత, అక్షరవిధిః = ప్రథమాక్షరారంభము, (శుభకరః=మేలునుకలుగఁజేయునది, స్యాత్=అగును.)

తా॥ ఇఁకను అక్షరారంభవిధిని తెలుపుచున్నాఁడు. ఎట్లనిన:— అయిదవసంవత్సరమునందు అనఁగా ఉపనయనమునకు పూర్వమునందు ఉత్తరాయణమునందు సూర్యుఁడు కుంభమునం దుండనికాలమునందు అనూరాధ హస్త చిత్త స్వాతి పునర్వసు జ్యేష్ఠ రేవతి శ్రవణము అశ్విని నక్షత్రములలో అయిదవసంవత్సరమున ప్రథమాక్షరారంభము శుభకరమైనది. " శ్లో ॥ ద్వితీయ జన్మతఃపూర్వ మారభేతాక్షరాన్సుధీః " (=రెండవజన్మమునకు) ( ఉపనయనమునకు ) (పూర్వమునందు విద్వాంసుఁడగువాఁడు బాలునకు అక్షరారంభమును చేయవలయును. ) అని బృహస్పతి చెప్పెను. " శ్లో ॥ అక్షరస్వీకృతిఃప్రోక్తా ప్రాప్తేపంచమహాయనే । ఉత్తరాయణగేసూర్యే కుంభమాసంవివర్జయేత్ " (=అయిదవసంవత్సరమునందలి యుత్తరాయణమునందు అక్షరాభ్యాసమును చేయవలయును. సూర్యుఁడు కుంభమునందుండఁగా మాత్రము అక్షరాభ్యాసమును చేయఁగూడదు. ) అని నృసింహుఁడు చెప్పె.

వ్యా॥ అథాక్షరారమ్భం వృత్తార్థేనాహ ॥ మిత్రత్ర్యర్కేతి ॥ మిత్రాదిభిర్నక్షత్రైః - పంచమేబ్దే జన్మతఃపంచమేవర్షే వ్రతాద్వ్రతబంధాత్ప్రాక్ - ప్రథమం - విద్యారమ్భోక్తకాలే - వక్ష్యమాణలక్షణే- అక్షరవిధిః - ప్రథమాక్షరారమ్భవిధిః- శుభస్స్యాదిత్యధ్యాహారః-కస్మిన్ సతి॥ సౌమ్యసంజ్ఞేఽయనేఽర్కే-సతి ॥ కథంభూతే సౌమ్యసంజ్ఞేఽయనే-అఘటే-నవిద్యతేఘటోయస్మిన్తథా - తస్మిన్ - కుమ్భంహిత్వా ఉత్తరాయణాస్థితః - బ్రహ్మతుల్యేఽయనలక్షణం ॥ కర్కటాద్యాగాదిషట్కేతేచాయనేదక్షిణసౌమ్యాయనే స్తఇతి ॥ మిత్రమనూరాధా - త్ర్యర్కం-హస్త

త్రయం అదితిః పునర్వసుః - ఇందో జ్యేష్ఠా - అంతిమం రేవతీ - హరిశ్రవణం - తురగోఽశ్వినీ - శేషం ప్రథమమేవవ్యాఖ్యాతం - వ్రతాత్ప్రాగిత్యనేన వ్రతబంధాదుపరినిషేధోఽర్థసిద్ధః - పంచమేవర్షే పఠనరుచ్యావ్రతబంధమగ్రేవక్ష్యతి ॥ తథాచోక్తంబృహస్పతినా ॥ శ్లో ॥ ద్వితీయజన్మతఃపూర్వమారభేతాక్షరాన్సుధీరితి॥ నృసింహః ॥ అక్షరస్వీకృతిఃప్రోక్తా ప్రాప్తే పంచమహాయనే । ఉత్తరాయణగేసూర్యే కుంభమాసం వివర్జయేదితి॥ ఇత్యక్షరారంభః సమాప్తమ్.

— అథ బ్రహ్మక్షత్ర విశాంముఖ్యం గౌణంచ వ్రతబంధకాలం వృత్తేనైకేనాహ. —

మూ॥ విప్రాదేర్గర్భతోఽబ్దేఽష్టశివరవిమితేజన్మతో వా వ్రతంస్యా
దత్రానిష్టేపిజీవేఽనిమిషరవిమథా కార్యమబ్దస్య దార్ఢ్యా
త్। స్వాబ్దాదూర్ధ్వం క్రమాత్స్యాద్ద్విగుణితశరదో నింద్య
మబ్దక్రమేణ పంచాష్టాంకాబ్దతో వా ప్రపఠనరుచితశ్శస్తమే
షాంతదాహుః॥ ౧౭॥

టీక॥ గర్భతః = గర్భాధానము మొదలుకొనిన్యైనను, జన్మతో వా = జన్మకాలము మొదలుకొనిన్యైనను, అష్టశివరవిమితే = ఎనిమిది తొమ్మిదవది పదిరెండవది, (అయిన) అబ్దే = సంవత్సరమునందు, వ్రతమ్ = ఉపనయనము, విప్రాదేః = విప్రులు మొదలగువారికి, స్యాత్ = అగును. అత్ర = ఈనియమితకాలమునందు, జీవే = బృహస్పతి, అనిష్టేపి = అనిష్టుడైయున్నప్పటికిని, అనిమిషరవిమథా + అపి = మీనచైత్రమైనప్పటికిని, అబ్దస్య = సంవత్సరముయొక్క, దార్ఢ్యాత్ = దార్ఢ్యమువలన, వ్రతమ్ = ఉపనయనము, కార్యమ్ = చేయదగినది. స్వాబ్దాత్ = వారివారి సంవత్సరముకంటె, ఊర్ధ్వమ్ = పిమ్మట, క్రమాత్ = క్రమముగా, ద్విగుణితశరదః = రెట్టింపగు సంవత్సరములు, అబ్దక్రమేణ = అబ్దక్రమముచేత, నింద్యమ్ = నిందింపదగినది. స్యాత్ = అగును. ఏషామ్ = వీరికి, ప్రపఠనరుచితః = అధ్యయనమునందలి యాసక్తిచేత, పంచాష్టాంకాబ్దతో వా = అయిదవదియును ఎనిమిదవదియును తొమ్మిదవదియును అయినసంవత్సరమునందు, తత్ = ఆయుపనయనమును, శస్తమ్ = ప్రశస్తమైనదానినిగా, ఆహుః = చెప్పుచున్నారు.

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ముఖ్యగౌణములగు వ్రతబంధకాలమును అనగా ఉపనయనకాలమును ఈశ్లోకముచేత చెప్పుచున్నాడు. ఎట్లనిన: — గర్భాధానము మొదలుకొనిన్యైనను జన్మకాల



ము మొదలుకొనిన్యైనను బ్రాహ్మణున కెనిమిదవ సంవత్సరమునందును క్షత్రియునకు పదునొకండవ సంవత్సరమునందును వైశ్యునకు పడిరెండవ సంవత్సరమునందును ఉపనయనమును చేయవలయును, ఇట్లు నియమితములయిన సంవత్సరములయందు గురుడు అనిష్టస్థానమునందున్నను మీనచైత్రమైనను ఉపనయనమును చేయుటవలన దోషమేమియును లేదని యెఱుంగవలయును, పరిమితమగు కాలమునందుc జేయునప్పుడు ఏకార్యమును దోషయుతమైనది కానేరదు కనుక ఉపనయనమునందుంగూడ దోషములేదని యెఱుంగవలయును. “ శ్లో ॥ శుద్ధిర్నవిద్యతేయస్య వర్షే ప్రాప్తేష్టమేయది । చైత్రేమీనగతేభానౌ తస్యోపనయనంశుభమ్ । జన్మభాదష్టకేసింహే నీచేవాశత్రుభేగురౌ । మౌంజీబంధశ్శుభఃప్రోక్తశ్చైత్రేమీనగతేరవౌ॥ అశుభస్థైగ్రహాస్సర్వే శుభగోచరగాఅపి । శాంతిభావాచ్ఛుభం నైవ యాత్యష్టకాలవ్యత్యయాత్॥ ,, (ఎనిమిదవసంవత్సరమునందు గురుశుద్ధి లేకపోయినను మీనచైత్రమయినను ఉపనయనమును చేయుటవలన శుభముకలుగును. జన్మాదిగ నెనిమిదవసంవత్సరమునందు గురుడు సింహమునందున్నను నీచయందున్నను మీనచైత్రమైనను మౌంజీబంధము (ఉపనయనము) శుభకరమైనదగును. అశుభసంవత్సరమునందు సకలగ్రహములును శుభస్థానములను పొందియున్నప్పటికిని శాంతినిజేయుక శుభముకలుగనేరదు.) బ్రాహ్మణునకు ఎనిమిదవసంవత్సరము మొదలుకొని పదునాఱవసంవత్సరము వఱకును, క్షత్రియునకు పదునొకండవ సంవత్సరముమొదలుకొని యిరువదిరెండవ సంవత్సరము వఱకును, వైశ్యునకు పడిరెండవసంవత్సరము మొదలుకొని యిరువదినాల్గవసంవత్సరము వఱకును ఉపనయనమును చేయవచ్చును. అయినను తొమ్మిదవ సంవత్సరముకంటె పదియవసంవత్సరమును పదియవసంవత్సరముకంటె పదునొకండవ సంవత్సరమును పదునొకండవ సంవత్సరముకంటె పదిరెండవసంవత్సరమును పదిరెండవసంవత్సరముకంటె పదిమూడవసంవత్సరమును పదిమూడవ సంవత్సరముకంటె పదినాల్గవసంవత్సరమును పదునాలగవసంవత్సరముకంటె పదునైదవసంవత్సరమును పదునైదవసంవత్సరముకంటె పదునాఱవసంవత్సరమును ఉపనయనము నింద్యమగును. ఇటులనే క్షత్రియవైశ్యులకును తెలియవలయును. ఇట్లు చెప్పుటచేత ఈగౌణకాలమగు పదునాఱు ఇరువదిరెండు ఇరువదినాలుగు సంవత్సరములు గడచినపిమ్మట నుపనయనమును చేయంగూడదు.

"శ్లో॥ నృపా౧౬కృతి౨౨జినా౨౪బ్దాంతం నాతికాలస్తతఃపరం । పాతిత్యం స్యాదగ్రజాదౌ వ్రాత్యస్తోమోవిశోధనమ్॥" (=పదునారుసంవత్సరములవఱకును బ్రాహ్మణునకును ఇరువదిరెండు సంవత్సరముల వఱకును క్షత్రియునకును ఇరువదినాలుగు సంవత్సరములవఱకును వైశ్యునకును ఉపనయనమును చేయవచ్చును. అనంతరమందు బ్రాహ్మణాదులకు పాతిత్యముకలుగును. కావున అట్టివారికి వ్రాత్యస్తోమమును ప్రాయశ్చిత్తార్థముగఁ జేయవలయును.) అని సంగ్రహమునందుఁ జెప్పఁబడెను.

"ఆషోడశాద్బ్రాహ్మణస్య అనతీతః కాలోభవత్యాద్వావింశాద్రాజన్యస్య ఆచతుర్వింశాద్వైశ్యస్య అతఊర్ధ్వం పతితసావిత్రీకాభవంతి నైనానుపనయేయుర్నాధ్యాపయేయుర్నయాజయేయుర్నైభిర్వ్యవహరేయుః కాలాతిక్రమేని యతవత్త్రిపూరుషం పతితసావిత్రీకాణామపత్యేసంస్కారోనాధ్యాపనం తేషాంసంస్కారేప్సుర్వ్రాత్యస్తోమేనేష్ట్వా కామమధీయీరన్వ్యవహార్యాభవంతి" (=పదునాఱు సంవత్సరముల వఱకును బ్రాహ్మణునకును ఇరువదిరెండు సంవత్సరములవఱకును క్షత్రియునకును ఇరువదినాలుగు సంవత్సరములవఱకును వైశ్యునకును ఉపనయనకాలమతిక్రమించి పోనేరదు. అనంతరమందు ఈమూఁడుజాతులవారును పతితసావిత్రికలవారగుచున్నారు. కావున నిట్టివారికి ఉపనయనము చేయఁగూడదు. అధ్యయనమును చెప్పఁగూడదు. ఇట్టివారిచేత యజ్ఞములను చేయింపఁగూడదు. ఇట్టివారితో సవ్యవహారమును చేయఁగూడదు. ఇట్లు పతితులైన సావిత్రికలవారియొక్క సంతానమునకు ఉపనయనాధ్యయనములను చేయఁగూడదు. అట్టివారికి ఉపనయనాదులను చేయఁదలంచినయెడల వ్రాత్యస్తోమమును చేయించి యనంతరము దుపనయనాధ్యయనాదులను చేయవలయును.) అని కాత్యాయన గృహ్యమునందుఁ జెప్పఁబడెను.

మఱియును, అన్యోన్యవర్ణములవారికి ఉపనయనకాలమునకు పూర్వమునందే యధ్యయనసామర్థ్యము కలిగియున్నయెడల బ్రాహ్మణులకు అయిదవ సంవత్సరమునందును క్షత్రియునకు ఎనిమిదవసంవత్సరమునందును వైశ్యునకు తొమ్మిదవ సంవత్సరమునందును ఉపనయనమును చేయవలయును.

"శ్లో॥ బ్రహ్మవర్చసమూర్జశ్చ విద్యాయుఃశ్రీర్యశస్సుఖం । విప్రాదేరుపనీతస్య పంచాష్టాంకాబ్దితఃఫలమ్" (=బ్రాహ్మణాదులకు అయిదవసంవత్సరమునందును క్షత్రియులకు ఎనిమిదవసంవత్సరమునందును వైశ్యులకు తొమ్మిదవసంవత్సరమునందును ఉపనయనమును చేయుటవలన బ్రాహ్మ



ణాదులకు బ్రహ్మవర్చస్సు ఊర్జస్సు విద్య ఆయుస్సు సంపద యశస్సును సుఖము అనునవి కలుగునని సంగ్రహమునందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ విప్రాదేరితి॥ గర్భతః - గర్భాధానాజ్జన్మతో వా - అష్టశివరవిమితే - అబ్దే - విప్రాదేర్వ్రతంస్యాత్ - క్షత్రస్యాష్టమే - క్షత్రియస్యశివమితే - ఏకాదశేవర్షేస్యాత్ - వైశ్యస్యరవిమితే - ద్వాదశే వర్షే స్యాత్ - అత్రస్వస్వవర్గే - జీవే - గురౌ - అష్టే - అశుభేసత్యపి వ్రతంకార్యం - క్వ - అనిమిషరవిమధౌ - అనిమిషేరవిః - అనిమిషరవిః - అనిమిషరవినావిశిష్టోమధుః - అనిమిషరవిమధుః - తస్మిన్ - రవౌమీనస్థేసతిచైత్రేవ్రతంకర్తవ్యమిత్యర్థః - అబ్దస్యదార్ఢ్యాత్ - వర్షబలాత్ - తదుక్తంసంగ్రహే॥ శ్లో॥ శుద్ధిర్నవిద్యతేయస్య వర్షేప్రాప్తేష్టమేయది। చైత్రేమీనగతేభానౌ తస్యోపనయనంశుభం॥ జన్మభాదష్టకేసింహేనీచేవా శత్రుభేగురౌ । మౌంజీబంధశ్శుభఃప్రోక్తశ్చైత్రేమీనగతేరవౌ॥ అశుభస్థే గ్రహాస్సర్వే శుభగోచరగా అపి। శాంతిభావాచ్ఛుభంనైవ యాత్యష్టః కాలసృత్యువదితి॥ అథగౌణకాలఫలమాహ॥ స్వాబ్దాదూర్ధ్వం క్రమాదితి॥ స్వాబ్దాత్స్వవర్షాదూర్ధ్వంక్రమాద్ద్విగుణితశరదః - ద్విగుణితాచాసౌశరచ్చ - ద్విగుణితశరద్వర్షం - తాంసూర్యాదీకృత్యేతి - అథతస్యాః - అబ్దక్రమేణనింద్యంతద్యథా॥ బ్రాహ్మణస్యాష్టమంవర్షంముఖ్యం తద్ద్విగుణితంషోడశం - అష్టమవర్షాత్షోడశవర్షపర్యంతం బ్రాహ్మణస్య ఏకాదశవర్షాద్ద్వావింశవర్షపర్యంతం క్షత్రియస్య - ద్వాదశవర్షాచ్చతుర్వింశతివర్షపర్యంతంవైశ్యస్య - అబ్దక్రమేణోత్తరోత్తరంనింద్యం - అర్థాదతఊర్ధ్వంఅనధికారిణోభవంతి - తదుక్తంసంగ్రహే॥ శ్లో॥ నృపా౧౬కృతి౨౨జినా౨౪బ్దాంతంనాతికాలస్తతఃపరం। పాతిత్యంస్యాదగ్రజాదౌ వ్రాత్యస్తోమో విశోధనమితి॥ తథాచకాత్యాయనగృహ్యే॥ ఆషోడశాద్బ్రాహ్మణస్యానతీతః కాలోభవత్యాద్వావింశాద్రాజన్యస్యాచతుర్వింశాద్వైశ్యస్యాత ఊర్ధ్వంపతితసావిత్రీకాభవంతినైనానుపనయేయుర్నాధ్యాపయేయుర్నయాజయేయుర్నైభిర్వ్యవహరేయుః కాలాతిక్రమేని యతవత్త్రిపూరుషం పతితసావిత్రీకాణామపత్యే సంస్కారో నాధ్యాపనంతేషాం సంస్కారేప్సుర్వ్రాత్యస్తోమేనేష్ట్వా కామమధీయీరన్వ్యవహార్యాభవంతీతి వచనాని॥ [illegible] అధ్యయనసామర్థ్యేనుపనయనకాలమాహ॥ పంచాష్టా [illegible] - [illegible] బ్రహ్మక్షత్రవిశాంక్రమేణ [illegible]

రుచితః వేదాదిపఠనరుచ్యా - తత్ప్రశంస స్తమాహుర్మునయః ॥ ఉక్తంచ సంగ్రహే॥ శ్లో॥ బ్రహ్మవర్చ సమూర్జశ్చ విద్యాయుః శ్రీర్యశస్సుఖం। విప్రాదే రుపనీతస్య పంచాష్టాబ్దా ద్భవేత్ఫలం॥

ఇతి విప్రాదీనాముక్త్యోగాద్యశ్చ వ్రతబంధకాలః సమాప్తమ్.

※ అథాత్రగురుబలాబలంవృత్తేనైకేనాహ. ※

మూ॥ రాశేష్షట్త్ర్యాద్యష్టస్థో గురురపి శుభదః పూజయా స్యాత్తథాపి
ప్రాంత్యోఽంబుస్థోఽష్ట మో నో యది నిజగృహగస్తుంగ
గో వాతికస్తః। ఏవంకన్యార్కతస్స్యాదతితరగుణినో ల
బ్ధమేవాతికాలే నిష్టోపీహద్విరోష్ట్యష్టశుభవనగతశ్శో
భనస్స్యాత్త్రిరర్చ్యః॥ ౧౩॥

టీక ॥ రాశేః = జన్మరాశికి, షట్త్ర్యాద్యష్టస్థః = ఆఱు మూఁడు ఒకటి పదిస్థానములయందున్న, గురుః = గురుఁడు, అపి = ఈయుపనయనమునందు, పూజయా = పూజచేత, శుభదః = శుభము నిచ్చువాఁడు, స్యాత్ = అగును, ప్రాంత్యోఽంబుస్థః = పండ్రెండు నాలుగు స్థానముల యందున్నవాఁడును, అష్టమస్థః = ఎనిమిదవస్థానము నందున్నవాఁడును, (అయిన) గురుః = గురుఁడు, తథాపి = అప్పూజచేత గూడ, శుభదః = శుభము నిచ్చువాఁడు, నస్యాత్ = కాఁడు, అత్ర = ఈచెప్పఁబడ్డ యనిష్టస్థానములయందు, నిజగృహగః = స్వక్షేత్రమును బొందినవాఁడును, తుంగగః = ఉచ్చస్థానమును బొందినవాఁడును, స్యాచ్చేత్ = అయ్యెనేని, అతిశస్తః = మిగుల శుభకరుఁడు, స్యాత్ = అగును, ఏవం = ఇట్లే, కన్యార్కతః = కన్యారాశిస్థుఁడగు సూర్యునివలన, స్యాత్ = అగును, అతితరగుణినః = అత్యధికమయిన గుణములుగల వరునియొక్క, లబ్ధమే = ప్రాప్తించినదైనను, అతికాలేవా = కాలాతిక్రమణమునందైనను, ఇహ = ఈయుపనయన విషయమునందు, గురుః = గురుఁడు, అనిష్టోపి = అనిష్టస్థానములయందున్నప్పటికిని, ద్విః = రెండుపర్యాయములు, అర్చ్యః = పూజింపఁదగినవాఁడు, అష్టమశుభవనగతః = అష్టమస్థానమును పొందినగురుఁడు, త్రిః = మూఁడుపర్యాయములు, అర్చ్యః = అర్చింపఁదగినవాఁడై, శోభనః = శుభకరుఁడు, స్యాత్ = అగును.

తా॥ ఇఁక నుపనయనవిషయమై గురుబలాబలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనఁగా — జన్మరాశికి ఆఱు మూఁడు ఒకటి పది స్థానములయందుండెనేని పూజచేత శుభము నిచ్చువాఁడగును. పండ్రెండు



లనే నాలుగు ఎనిమిది స్థానములయందున్నపుడుకూడ పూజచేతశుభముని చ్చువాఁడుకాఁడు. ఒకవేళ ఇప్పుడు చెప్పఁబడిన యనిష్టస్థానములయందున్నగురుఁడు స్వక్షేత్రములయందైనను ఉచ్చయందైనను ఉన్నయెడల మిగుల మంచివాఁడగును. "శ్లో॥ అజవృషభమృగాంగనాకుళీరా ఝషవణిజౌ చదివాకరాదితుంగాః। దశశిఖిమనుయుక్తిథీంద్రియాంశై స్త్రినవకవింశతిభిశ్చ తేఽస్తనీచాః॥" (= మేషవృషభ మకరకన్యాకర్కాటక తులా మీనములు సూర్యాది సప్తగ్రహములకును ఉచ్చస్థానములనియును, తులావృశ్చిక కర్కాటకమీన మకర మేషకన్యలు సూర్యాదిసప్తగ్రహములకును నీచరాసులనియును, చెప్పఁబడును. మఱియును, సూర్యునకు మేషమునందు పదిభాగ లుచ్చభాగలనియును, పదియవభాగము పరమోచ్చభాగయనియును, చంద్రునకు వృషభమునందలి మూఁడు భాగలుచ్చభాగలనియును, మూఁడవభాగము పరమోచ్చభాగయనియును, కుజునకు మకరమునందు ఇరువదెనిమిది భాగలుచ్చభాగలనియును, ఇరువదెనిమిదవభాగము పరమోచ్చభాగయనియును, బుధునకు కన్యయందు పదునైదుభాగ లుచ్చభాగములనియును, పదునైదవభాగము పరమోచ్చభాగయనియును, గురునకు కర్కాటకమునందలి నైదుభాగలుచ్చభాగ లనియును, అయిదవభాగము పరమోచ్చభాగయనియును, శుక్రునకు మీనమునం దిరువదేడుభాగ లుచ్చభాగలనియును, ఇరువదేడవభాగము పరమోచ్చభాగయనియును, శనికి తులయందు ఇరువదిభాగ లుచ్చభాగలనియును, ఇరువదవభాగము పరమోచ్చభాగయనియును, తెలియవలయును. మఱియు నిటులనే ఆయాగ్రహములయొక్క నీచరాసులయందుఁగూడ నీచపరమనీచభాగలనుకూడ నెఱుఁగవలయును) అని బృహజ్జాతకమునందు చెప్పఁబడియుండుటచేత గురునకు కర్కాటకము ఉచ్చస్థానమనియును, షష్ఠాష్టమస్థానమైనప్పటికిని కర్కాటకమునందు గురుఁడున్నయెడల శుభుఁడే యగుననియును, తెలియవలయును. కన్యారాశియందున్నగురుఁడుకూడ ఇటులనే శుభాశుభ సంజ్ఞకలవాఁడగును. మఱియును, ఉక్తకాలము రాకమునుపే యుపనయనము చేయఁదలఁచినను కాలాతిక్రమణమైనను గురుఁడు అనిష్టస్థానములయందుండెనేని రెండుపర్యాయములు పూజించుటచేత శుభుఁడగును. ఇప్పుడు చెప్పఁబడిన కాలములయందు గురుఁడు అష్టమస్థానమునం దుండెనేని మూఁడు పర్యాయములు పూజించుటచేత శుభుఁడగును. "శ్లో॥ ఝషచాపకుళీరస్థో

జీవోప్యశుభగోచరః । అతిశోభనతాం దద్యాద్వివాహోపనయాదిషు॥ ప్రతేజన్మత్రిభారిస్థో జీవోపిష్టోర్చనంసకృత్ । శుభోతికాలస్తుర్యాష్టవ్యయస్థో ద్విగుణార్చనాత్॥ ,, ( = ధనుర్మీనకటకములయందున్న గురుఁడు అశుభస్థానములయం దున్నప్పటికిని వివాహోప నయనాదులయందు అత్యంతశుభములను కలుగఁజేయును. ఒకానొకప్పుడు గురుఁడుపనయనకాలమున ఒకటి మూఁడు పది ఆరుస్థానములయందుండెనేని పూజచేత శుభుఁడగును. నాలుగు ఎనిమిది పదిరెండు స్థానములయందున్నగురుఁడు ద్విగుణార్చనముచేత శుభముల నిచ్చువాఁడగును. ) అని బృహస్పతి చెప్పె. ,, శ్లో॥ కన్యార్థాద్వివసుతాద్యునాయనవమే శ్రేష్ఠో గురుశ్చాన్యథాపూజ్యోష్టాంత్య సుఖేతికాల ఇహతుపాగ్జైర్ద్విర్చ్యశ్శుభః । రింఫాంబుత్రిదినాథభాగ్యాదిగ్రహైః శ్శేషోపివిద్ధోద్యసన్వామాద్విద్ధ ఇహేష్టవోనిధనే వేధత్రిరర్చ్యశ్శుభః ॥ ,, (=కన్యారాశియందును రెండవ అయిదవ తొమ్మిదవ స్థానములయందున్న గురుఁడు శ్రేష్ఠుఁడగును. ఇట్లు కాదేని గురుఁడు ఎనిమిది పదిరెండు చతుర్థస్థానములయందుండెనేని ద్విగుణతపూజచేత శుభమునుకలుగును. పదిరెండు నాలుగు మూఁడు పదస్థానములయందు గ్రహములతోఁ గురుఁడుండెనేని శ్రేష్ఠుఁడైనప్పటికిని విద్ధుఁడగును. అష్టమస్థానమునందు గురుఁడుండెనేని మూఁడుపర్యాయములు పూజించుటచేత శుభుఁడగును.) అని యుద్వాహతత్త్వము నం దు చెప్పఁబడెను.

వ్యా॥ రాశేరితి॥ రాశేర్జన్మరాశేస్సకాశాత్ - షట్త్రిద్యఖస్థో గురుః - ఇహ - అస్మిన్వ్రతబంధే - పూజయాశుభదః స్యాత్ - షట్ - షష్ఠం - త్రి - తృతీయం - ఆద్యం జన్మరాశిః - ఖందశమం - ఏషుతిష్ఠతీతి తథా - తయాపి - పూజయాపి - ప్రాంత్యోద్వాదశః - అమ్బుశ్చతుర్థః - అష్టమః - నశుభదః - స్యాత్ - పూజయాపి అశుభదస్స్యాదిత్యర్థః - స యదినిజగృహగః - స్వగృహగః - ధనుర్మీనగ ఇత్యర్థః - తుంగగోవాయది భవతి - తదాఅత్ర - దుష్టస్థానేషు వర్తమానః శస్తస్స్యాత్ - అస్య తుఙ్గంకర్కటః॥ తదుక్తంబృహజ్జాతకే॥ అజవృషభమృగాఙ్గనాకుళీరా ఝషవణిజౌచదివాకరాదితుంగః । దశశిఖిమనుయుక్ తిథీంద్రియాంశైస్త్రినవక వింశతిభిశ్చతేస్తనీచాః॥ అర్కాదుక్తస్థానేభ్యో స్వస్థానగశ్శుభదస్స్యాత్ - ఏవంకన్యాత్ర జాతస్స్యాత్ - కన్యేతికన్యారాశేః సకాశాత్ - ఏవముక్తశుభాశుభస్స్యాత్ అతితర



గుణినోవరస్యలభ్యమే - అతికాలేవా - అనిష్టోపిగురుర్ద్వాదశ చతుర్థాష్టమగోపిద్విరర్చ్యః - షట్త్రిద్యఖస్థస్త్వశస్తోపి యాపూజోక్తాతత్పాత్రేణతోద్విరర్చ్యః - తేనద్విగుణార్చనేన శోభనస్స్యాత్ - ఏవంసామాన్యేనోక్త్వా అష్టమగస్యవిశేషమాహ ॥ అష్టమభవనగతః త్రిరర్చ్యః- తేనశోభనస్స్యాత్ - అత్రబృహస్పతిః ॥ ఝషచాపకుళీరస్థో జీవోప్యశుభగోచరః । అతిశోభనతాం దద్యాద్వివాహోపనయాదిషు ॥ ప్రతేజన్మత్రిభారిస్థో జీవోపిష్టోర్చనంసకృత్ । శుభోఽతికాలస్తుర్యాష్టవ్యయస్థో ద్విగుణార్చనాత్ ॥ ఉద్వాహతత్త్వే ॥ కన్యార్థాద్వివసుతాద్యునాయ నవమే శ్రేష్ఠో గురుశ్చాన్యథాపూజ్యోష్టాంత్య సుఖేతికాల ఇహతు పాగ్జైర్ద్విరర్చ్యశ్శుభః - రింఫాంబుత్రి దినాథభాగ్యాదిగ్రహైః శ్శేషోపి విద్ధోద్యసన్వామాద్విద్ధ ఇహేష్టదోనిధనే వేధత్రిరర్చ్యశ్శుభ ఇతి॥ ఇతి గురుబలాబలే సమాప్తమ్.

—(*) అథ గురోర్వామవేధముపనయనే మాసాదీంశ్చాహ. (*)—

మూ॥ ద్వ్యేష్వాయాఙ్గాంకసంస్థోవ్యయజలనిధనత్ర్యేభగ్రైశ్చేన్న విద్ధశ్శస్తోనిష్టోపి వామంశుభ ఇహఖచరైర్వేధితోనోష్టమస్థః । శుక్లే మాఘాదిపఞ్చస్వినశుభ దివసే ప్రాగ్దలే హ్న్యుత్తరత్రం సత్త్యక్త్వానధ్యాయ రిక్తాతిథిమనిమిదనాంశ్చన్న రిభాగం ప్రదోషమ్॥ ౧౪॥

టీక॥ ద్వ్యేష్వాయాఙ్గాంకసంస్థః = రెండు అయిదు పదునొకండు ఏడుతొమ్మిది అనునట్టిస్థానములయందున్న, గురుః=గురువు, వ్యయజలనిధనత్ర్యేభగ్రైః=పదిరెండు నాలుగు ఎనిమిది మూఁడు పది అనునట్టి స్థానములయందున్న గ్రహములచేత, విద్ధః=వేధింపఁబడినవాఁడు, నస్యాచ్చేత్=కాకపోయెనేని, శస్తః=ప్రశస్తుఁడు, స్యాత్=అగును. గురుః=గురుఁడు, ఖచరైః=పైనచెప్పఁబడిన గ్రహములచేత, వామమ్ = వామముగా, వేధితః=వేధింపఁబడినవాఁడు, స్యాచ్చేత్=అయ్యెనేని, ఇహ = ఈయుపనయనమునందు, శుభః=శుభుఁడు, స్యాత్=అగును. అష్టమస్థః=ఎనిమిదవ స్థానమునందున్న, గురుః=గురువు, శుభైః=శుభగ్రహములచేత, వేధితోపి=వేధింపఁబడినప్పటికిని, శుభః=శుభుఁడు, న=కాఁడు. మాఘాదిపంచసు=మాఘమాసము మొదలుకొని పైదుమాసములయందు, శుక్లే=శుక్లపక్షమునందు, ఇనశుభదివసే=సూర్యశుక్లపక్ష చంద్ర గురు బుధ శుక్ర వారములయందు, అహ్నః దగటియొక్క, ప్రాగ్దలే = పూర్వభాగము

నందు, అనధ్యాయ రిక్తాతిధిమునిమదనాక్=అనధ్యయనతిథులనురిక్తతిథుల నుసప్తమిని త్రయోదశిని, చంద్రభాగమ్ = కరకాటకాంశమును, ప్రదోష మ్=ప్రదోషమును, త్యక్త్వా-విడిచి, వ్రతమ్=ఉపనయనము, సత్=శుభ మైనది. స్యాత్=అగును.

తా॥ గురువునకు వాను వేధను ఉపనయమునందలి మాసాదు లను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— రెండు అయిదు పదునొకండు ఏడు తొమ్మిదిస్థానములయందున్న గురుఁడు పదిరెండునాలుగు ఎనిమిది మూఁడు పదిస్థానములయందున్న గ్రహములచేత వేధింపఁబడక పోయినయెడల ప్రసిద్ధుఁడగును. మఱియును గురుఁడు పైనచెప్పఁబడిన స్థానములకు వ్యతిరిక్తములయిన స్థానములయందున్నప్పటికిని రెండు అయిదు పదు నొకండు ఏడు తొమ్మిది స్థానములయందున్న గ్రహములచేత వామము గా వేధింపఁబడెనేని శుభుఁడు అగును. అష్టమస్థానమునందున్న గురుఁడు వామముగా వేధింపఁబడినప్పటికిని శుభుఁడుకాఁడని యెఱుఁగవలయును. అష్టమస్థానమునందున్న గురుఁడు కాలాతిక్రమదోషము కలిగియున్న పుడు త్రిగుణితమగు పూజచేత శుభకరుఁడు అగును. “శ్లో॥ రజస్వ లాయదాకన్యా గురుశుద్ధింనచారయేత్ । అష్టమేపిప్రకర్తవ్యో వివాహ స్త్రిగుణార్చనాత్” (=కన్యరజస్వలయై యుండు సమయమయ్యెనేని గురుశుద్ధిని విచారింపనక్కఱలేదు. అట్టికాలమునందు గురుఁడు అష్టమ స్థానమునందున్నప్పటికిని త్రిగుణితమగు పూజచేత శుభకరుఁడగును.) అని బృహస్పతిచెప్పె. మాఘమాసము మొదలుకొని యైదుమాసము లలో శుక్లపక్షమునందు సూర్యశుక్లపక్ష చంద్రబుధ గురుశుక్రవారము లుగల దివసముయొక్క పూర్వభాగమునను ఉపనయనము శుభకరమై నదగును. మఱియును, ఉపనయనమునందు అనధ్యయనములును, రిక్తతి థులును సప్తమియును, త్రయోదశియును, కర్కాటకాంశయును, ప్రదో షమును తగినవి కావని యెఱుఁగవలయును.

వ్యా॥ ద్వేష్విత్తి॥ ద్వేష్వాయగాంకసంస్థో గురుస్సదాశుభస్స్యా త్-తదాకదాయదాయ్యయజలనిధనత్రిభిర్గ్రహైః - ఖచరైః సవిద్ధస్స్యాత్- ద్వి-ద్వితీయం-ఇషు-పఞ్చమం - ఆయః ఏకాదశం-అగస్సప్తమం - అఙ్కః- నవమం- ఏతత్సంస్థో గురుః - వ్యయం-ద్వాదశం - జలం-చతుర్థం - నిధనం- అష్టమం-త్రి-తృతీయం - అస్తందశమం - ఏతత్సంస్థైః - ఖచరైః - యది నోవిద్ధో భవతి - తదాశుభస్స్యాత్ - ౨-౫-౧౧-౭-౯-౧౨-౪-౮-౩-౧౦-



వేధితశ్చేదశుభఇత్యర్థః - అనిష్టోపి వ్యయజలనిధన వ్యత్రిగోపివామం విద్ధ స్సన్ ద్వేష్వాయగాంకసంస్థైః - ఖచరైః - వేధితస్సన్నిత్యర్థః ఇహా- అస్మిన్వ్రతబంధేవివాహేవాశుభః - నోష్టమస్థః - అష్టమస్థో వేధితోనశు భదస్స్యాదిత్యర్థః - సో ఽతికాలాదౌత్రిగుణార్చనే నైవశుభస్స్యాత్- తథాచబృహస్పతిః ॥ శ్లో ॥ రజస్వలాయదాకన్యా గురుశుద్ధింనచింతయే త్ - అష్టమేపిప్రకర్తవ్యోవివాహస్త్రిగుణార్చనాత్ ॥ అథోపనయనేమా సాదీనాహ ॥ శుక్లఇతి ॥ శుక్లే-శుక్లపక్షే - మాఘాదిపంచమాసేషు - జ్యేష్ఠాంత్యేషు- ఇనశుభదివసే - ఇనస్సూర్యః శుభః - వర్ధమానేందుః- గురుబుధశుక్రాః - ఏషాందివసః - తస్మిన్ - అహ్నఃపూర్వార్ధే - దివసస్య పూర్వార్ధేవ్రతముపనయనం - సత్-శుభంస్యాత్ - కింకృత్వా- అనధ్యా యరిక్తాతిథి మునిమదనాంశ్చన్ద్రభాగంప్రదోషం - త్యక్త్వా- అనధ్యాయాః వక్ష్యమాణాః - రిక్తాతిథయః చతుర్థీ నవమీ చతుర్దశ్యః - మునిస్సప్తమీ- మదనస్త్రయోదశీ - ఏతాన్ - చన్ద్రభాగః - కర్కాంశః-పాపాంశాది కంపూర్వైరనిషేధితం - ప్రదోషః - అనధ్యాయప్రకరణోక్తః - తంత్యక్త్వా॥ ఇతి గురోర్వామవేధ ముపనయనేమాసాదీని సమాప్తమ్.

——— (*) అథవ్రతబన్ధే నక్షత్రాణి లగ్నగోచరశ్చాహ. (*) ———

మా॥ శస్తోద్వీశాగ్ని కాలత్రిపూర్వ పిత్ర్యరహితైస్సర్వభైర్మౌంజి

బంధో వేదేశేజ్ఞేబలాఢ్యే గురుసితకుజవిత్సంజ్ఞకావేదపా

స్స్యుః । స్వర్క్షోచ్చాంశేషు సౌమ్యాశ్శ్రుతిపతిరపిచేత్కేంద్ర

త్రికోణస్థితాస్స్యుస్స్వర్క్షే వేదార్థవేత్తా పశుగృహధనవా

నత్రమన్దేన్త్యసేవీ॥ ౧౨॥

టీక॥ ద్వీశాగ్నికాలాన్తక పిత్ర్యరహితైః = విశాఖ, కృత్తిక, జ్యేష్ఠ, భరణి, మఘ, అను పైనక్షత్రములును తప్పతక్కిన, సర్వభైః= సకలనక్షత్రములచేతను, మౌంజిబంధః = ఉపనయనము, శస్తః=ప్రశస్త మైనది. వేదేశే=వేదాధిపతియగు, జ్ఞే=బుధుఁడు, బలాఢ్యేసతి=బలముకల వాఁడగుచుండఁగా, మౌంజిబంధః=ఉపనయనము, శస్తః = ప్రశస్తమై నది, గురుసితకుజవిత్సంజ్ఞకాః=గురువు శుక్రుఁడు కుజుఁడు బుధుఁడు అను వారు, వేదపాః=వేదాధిపతులు, స్స్యుః=అగుదురు. సౌమ్యాః శుభగ్రహ ములును, శ్రుతిపతిః అపి=వేదాధిపతియును, స్వర్క్షోచ్చాంశేషు = స్వక్షేత్ర స్వోచ్చస్వనవాంశములయందు, స్థితాస్సన్తః- ఉన్నవారగుచుండఁగా, కే=అసౌమ్యాఃఅను వేదాధిపతియును, కేంద్రత్రికోణస్థితాశ్చేత్=కేంద్రకో

ణములయందుండకేని, వర్ణీ=బ్రహ్మచారి, వేదార్థవేత్తా = వేదార్థమును దెలిసినవాఁడును, పశుగృహధనవాన్=పశుగృహధనములు గలవాఁడును, స్యాత్=అగును. అత్ర = ఈకేంద్రకోణములయందు, మందేసతి=శనియున్నవాఁడగుచునుండఁగా, అంత్యసేవీ = చండాలురను సేవించువాఁడు, స్యాత్=అగును.

తా॥ ఉపనయనమునకు తగిన నక్షత్రములను లగ్నగోచరమును జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—"శ్లో॥ మఘాచభరణీజ్యేష్ఠా విశాఖా చైవ కృత్తికా । నక్షత్రపంచకంప్రాజ్ఞైర్నగ్రాహ్యం వ్రతబంధనే ॥" (=మఖ భరణి జ్యేష్ఠ విశాఖ కృత్తిక, అను నక్షత్రములైదును ఉపనయనమునకు ప్రాజ్ఞులచేత గ్రహింపఁదగినవికావు.) అను స్మృతిప్రమాణానుసారముగ విశాఖ, కృత్తిక, జ్యేష్ఠ, భరణి, మఖ, అను నైదునక్షత్రములును తప్పఁదక్కిన నక్షత్రములన్నియును ఉపనయనమునందు ప్రశస్తములయినవి. ఉపనయనమునకు వేదాధిపతి బలవంతుఁడై యుండవలయును. గురువు ఋగ్వేదమునకును శుక్రుఁడు యజుర్వేదమునకును, కుజుఁడు సామవేదమునకును, బుధుఁడు అథర్వణవేదమునకును అధిపతులనఁబడుదురు. శుభగ్రహములును వేదాధిపతియును స్వక్షేత్రస్వోచ్చస్వనవాంశములయందుండి కేంద్రకోణములయందుండెనేని బ్రహ్మచారి వేదార్థమును దెలిసినవాఁడును పశుగృహధనాదులు కలవాఁడును అగును. శని కేంద్రకోణములయందుండెనేని చండాలురను సేవించువాఁడగును. "శ్లో॥ కేంద్రస్థితైరినాద్యైర్నృపసేవీవిట్క్రియోశ్వవృత్తిశ్చ। వేదాభ్యాసీయజ్వాక్రతుకర్తాహీనసేవకోభవతి ॥" (= సూర్యుఁడు కేంద్రమునందున్నయెడల రాజసేవకుఁడగును. సోమవారమునందున్న వైశ్యవృత్తికలవాఁడగును. మంగళవారమునందుపనయనమును జేసికొన్నవాఁడుశ్వవృత్తికలవాఁడగును. బుధవారమునందు వేదాభ్యాసము కలవాఁడగును. గురువారమునందు సోమయాజియగును. శుక్రవారమునందు క్రతుకర్తయగును. శనివారమునందు హీనసేవకుఁడగును. ) అని సంగ్రహమునందుఁ జెప్పఁబడె.

వ్యా॥ అథవ్రతబంధే నక్షత్రాణ్యాహ॥ స్పష్టం॥ ఉక్తంచ॥ శ్లో॥ మఘాచభరణీజ్యేష్ఠా విశాఖాచైవకృత్తికా । నక్షత్రపంచకంప్రాజ్ఞైర్నగ్రాహ్యంవ్రతబంధనే॥ వేదేశేవేదపతౌ - జ్ఞైబుధే - బలాఢ్యేసతి-స్థానాదిసాంబలసమృద్ధేసతి - తేకే - గురుసితకుజవిత్సంజ్ఞకాః - క్రమాద్వేద



పాః - వేదాధిపతయస్స్యుః - గురుః ఋగ్వేదస్య - శుక్రోయజుర్వేదస్య - కుజస్సామవేదస్య - విత్ - బుధోఽథర్వణవేదస్య - పతిరిత్యర్థః॥ లగ్నగోచరమాహ॥ స్వర్క్షాచ్చాంశేషు సౌమ్యాఇతి ॥ సౌమ్యాః - స్వోచ్చస్వభాగాంశేషు వర్తమానాః - శ్రుతిపతిరపి - వేదపతిరపి - స్వోచ్చస్వభాగాంశే వర్తమానశ్చేత్ - యదికేంద్రత్రికోణేస్థితాస్స్యుః-వర్ణీ-బ్రహ్మచారీ - వేదార్థవేత్తాస్యాత్ - నకేవలంవేదార్థవేత్తాస్యాత్- అపితుపశుగృహధనవాన్ స్యాత్ - అత్రకేంద్రత్రికోణే - శనౌమందేసతి-అంత్యసేవీ - అంత్యసేవకస్స్యాత్ - తస్మాత్కేంద్రకోణే - శనిర్నభవితవ్యః - ఉక్తంచసంగ్రహే॥ శ్లో॥ కేంద్రస్థితైరినాద్యైర్నృపసేవీవిట్క్రియోశ్వవృత్తిశ్చ। వేదాభ్యాసీయజ్వాక్రతుకర్తాహీనసేవకోభవతి॥

ఇతివ్రతబంధేనక్షత్రాదీనిసమాప్తమ్.

## ※ అథలగ్నభంగవిద్యారంభౌ. ※

మూ॥ చంద్రక్రూరావిలగ్నేశశిసితతనుపాష్షష్ఠగేహేసితోంత్యే
సర్వేరంధ్రేవటుఘ్నాః క్వచతనుగ ఇనశ్శ్రేష్ఠ ఉచ్చేందు
రేకే । విద్యాంమౌంజ్యుక్తకాలేస్థిరచరహరిజత్ర్యుత్తర
బ్రాహ్మహీనేమౌంజ్యా ఊర్ధ్వంగణేశంగిరమపివిధివ
త్పూజయిత్వారభేత॥ ౧౬॥

టీక ॥ చంద్రక్రూరాః = చంద్రుఁడును క్రూరులును, విలగ్నే= లగ్నమందును, శశిసితతనుపాః= చంద్రశుక్రలగ్నాధిపతులు, షష్ఠగేహే= షష్ఠస్థానమునందును, సితః = శుక్రుఁడు, అంత్యే = ద్వాదశస్థానమునందును, సర్వే = అందఱును, రంధ్రే = అష్టమస్థానమునందును, స్థితాశ్చేత్ = ఉన్నయెడల, వటుఘ్నాః = వటువునునశింపఁజేయువారు, భవంతి = అగుచున్నారు, క్వచ = ఒకానొకప్పుడు, తనుగః= లగ్నమునుపొందిన, ఇనః = రవి, శ్రేష్ఠః = శ్రేష్ఠుఁడు, స్యాత్ = అగును, ఏకే=కొందఱు, తనుగః = లగ్నమును పొందిన, ఉచ్చేందుః= ఉచ్చచంద్రుఁడు, శ్రేష్ఠః= శ్రేష్ఠుఁడు, స్యాత్ = అగును, మౌంజ్యాః = ఉపనయనమునకు, ఊర్ధ్వమ్ = పిమ్మట, గణేశమ్ = విఘ్నేశ్వరుని, గిరమపి = సరస్వతిని, విధివత్ = శాస్త్రోక్తప్రకారముగ, పూజయిత్వా=పూజించి, స్థిరచరహరిజత్ర్యుత్తరబ్రాహ్మహీనే = చరస్థిరలగ్నములును ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రోహిణులకంటె వేరయిన, మౌంజ్యుక్తకాలే = ఉక్తకాలమునందు, విద్యామ్ = వేదవిద్యను, ఆరభేత = ఆరంభింపవలయును.

తా॥ చంద్రుఁడును క్రూరగ్రహములును లగ్నమునందును, చంద్రశుక్రలగ్నాధిపతులు షష్ఠమునందును శుక్రుఁడు ద్వాదశమునందును, సర్వగ్రహములును అష్టమస్థానమునందును ఉన్నయెడల వటుఁడు నశించునని యెఱుఁగవలయును, ఒకానొకప్పుడు సూర్యుఁడు లగ్నమునందున్నయెడల శ్రేష్ఠుఁడగును. కొందఱు ఉచ్చచంద్రుఁడు లగ్నమునందున్నయెడలనుత్తమఫలము కలుగునని చెప్పుచున్నారు. "శ్లో॥ శుభదో బలవాన్భానుర్లగ్నే శౌ దశమే తథా। సర్వశాఖాధిపో యస్మాత్సర్వేషాం వ్రతబంధనే॥ సర్వశాఖాధిపో భానుః కేచిదూచుర్మహర్షయః। తస్మాద్గత్యంతరాభావే లగ్నస్థోఽర్కః ప్రశస్యతే॥" (=సూర్యుఁడు సర్వశాఖాధిపతి యగుటవలన లగ్నమునందైన దశమమందున్నయెడల శుభము నిచ్చువాఁడగును. కొందఱు ఋషులు సూర్యుని సర్వశాఖాధిపునిగాఁ జెప్పుచున్నారు. కావున గత్యంతరము లేనపుడు లగ్నమునందలి సూర్యుఁడు ప్రశస్తుఁడగుచున్నాఁడు.) అని మౌంజీపటలమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ చంద్రోదయే భిశస్తస్స్యాత్ క్షయరోగీ సితేతరే। సితేపక్షే భవేద్యోగ్యా స్వగేహేఽపి విశేషతః॥" (=కృష్ణపక్షమునందు చంద్రుఁడు లగ్నమునందున్నయెడల అభిశస్తుఁడును క్షయరోగము కలవాఁడును అగును. చంద్రుఁడు శుక్లపక్షమున లగ్నమునందున్నయెడల సోమయాజి యగును. ఆలగ్నమునందున్న చంద్రునకా రాశి యుచ్చమైనను స్వక్షేత్రమైనను అయ్యెనేని విశేషముగ యజ్ఞాది సత్కర్మములను చేయువాఁడగును.) అని స్మృతులయందుఁ జెప్పఁబడెను. మఱియును, ఈశ్లోకము పునరుపనయన విషయమును బోధించుచున్నది. ఏలయనినః—కృష్ణపక్షమున నుపనయనమును జేయునపుడు లగ్నచంద్రునకు ఫలము చెప్పఁబడినది. ఆకాలమున లగ్నములో చంద్రుఁడుండుట కృష్ణపక్షమునందుఁ గాని సంభవింపదు. పగటియందలి కర్మములకు లోపము కలుగునని యెడు భయమువలన రాత్రియందు పునరుపనయన సంస్కారము విధింపఁబడినది. ప్రథమోపనయనము సకలగ్రంథకర్తలచేతను పగటియందే చెప్పఁబడినది కాని రాత్రులయందుఁ జెప్పఁబడలేదు. కావున "శ్లో॥ చంద్రోదయేభిశస్తః" అను శ్లోకము పునరుపనయన విషయమునే బోధించుచున్నది. పునస్సంస్కార నిమిత్తములు ధర్మశాస్త్రప్రసిద్ధములైయున్నవి. ఎట్లనినః—"శ్లో॥ త్రిషడ్గోఽర్కః స్త్రీస్సనవాస్తకర్మగశ్చంద్రస్త్రిషష్ఠాశ్శనిరాహుభౌమాః। సర్వేచలాభేచ త్రికోణకేంద్రగాశ్శుభాశ్శుభాస్స్యుర్వ్రతబంధకాలే" (=వ్రతబంధకాలమునందు సూర్యుఁడు మూఁడు ఆరు పది



స్థానములయందును చంద్రుఁడు మూఁడు రెండు ఏడు పదిస్థానములయందు చంద్రుఁడును శని రాహు కుజులు మూఁడు ఆరు స్థానములయందును, సకలగ్రహములును లాభ కేంద్రకోణములయందును శుభములు కలుగును.) అని రత్నమాలయందుఁ జెప్పఁబడెను. ఉపనయనలగ్నమునకు మూఁడు ఆఱు స్థానములయందు సూర్యుఁడుండుట రాత్రికాలమునందుఁ దప్ప సంభవింపదు. నారదుఁడు లగ్నస్థచంద్రుఁడు శుభకరుఁడు గాఁడని నిందింపఁబడెను. ఎట్లనినః—"శ్లో॥ స్వోచ్చసంస్థోఽపి శీతాంశుర్వ్రతినో యది లగ్నగః। తంకరోతి శిశుంనిస్స్వం సతతం క్షయరోగిణమ్" (=లగ్నమునందున్న చంద్రుఁడుచ్చయందున్నప్పటికిని వటునకు దారిద్ర్యమును క్షయరోగమును కలుగఁజేయును.) అని నారదుఁడు చెప్పె. ఇతరమగు లగ్నబలమును పూర్వమునందుఁ జెప్పఁబడినవిధముగఁ జూచికొనవలయును. మఱియును, మౌంజీబంధనమైనపిమ్మట మౌంజీబంధమునకు శుభకరమని చెప్పఁబడిన కాలమునందు గణేశుని సరస్వతిని పూజించి విద్యారంభమును చేయవలయును, మఱియును, విద్యారంభమునకు చరస్థిరలగ్నములును ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రోహిణి అను నక్షత్రములును పనికిరావని యెఱుఁగవలయును. మఱియును మౌంజీబంధనమైనపిమ్మట వేదవిద్యారంభము చేయవలసినదని చెప్పుటచేత మౌంజీబంధము కాకమునుపు వేదవిద్యారంభమును చేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ జాడ్యం స్థిరే ద్వ్యంగలగ్నే మునిర్విద్యాక్షితిశ్చరే భ్రమః" (=విద్యారంభమును స్థిరలగ్నమునందుఁ జేసినయెడల జాడ్యము కలుగుననియును, ద్విస్వభావలగ్నమునందు చక్కనివిద్య కలుగుననియును, చరలగ్నమునందు భ్రాంతి కలుగుననియును తెలియవలయును.) అని యీస్మృత్యర్థమును దెలిసికొనవలయును.

వ్యా॥ అథలగ్నభంగమాహ॥ చంద్రఇతి॥ చంద్రః - క్రూరాః - క్రూరగ్రహాః - విలగ్నే తనౌ - శశిసితతనుపాః - షష్ఠగేహే - శశీ-చంద్రః - సితః - శుక్రః - తనుపః లగ్నపః - షష్ఠగేహే - సితః - శుక్రః - అంత్యే - ద్వాదశస్థానే - శేషంసుగమం - సర్వే రంధ్రే అష్టమస్థానే - ఏతే ప్రత్యేకంవటుఘ్నాః - వటుమారకాభవంతి - కించక్వచిత్ - అన్యలగ్నాభావే తనుగః - లగ్నగః - ఇనః - రవిః - శ్రేష్ఠః॥ ఉక్తంచమౌంజీపటలే॥ శ్లో॥ శుభదోబలవాన్భానుర్లగ్నే శౌదశమస్తథా। సర్వశాఖాధిపోయస్మాత్సర్వేషాంవ్రతబంధనే॥ సర్వశాఖాధిపోభానుః కేచిదూచుర్మహర్షయః। తస్మాద్గత్యంతరాభావే లగ్నస్థోఽర్కః ప్రశస్యతే॥ ఉచ్చేందురేక ఇతి॥

నీకేమునయోః ఉచ్చేందుః ఉచ్చస్థచంద్రః - తనుగశ్చ శ్రేష్ఠ ఇతివదంతి- తద్వాక్యం॥ శ్లో॥ చంద్రోదయేభిశస్తస్స్యాత్ క్షయరోగీసితేతరే । సితేపక్షే భవేద్విద్వాన్ స్వభేతుంగేవిశేషతఇతి॥ అస్యార్థః॥సితేతరే- కృష్ణపక్షే-చంద్రోదయే- చంద్రయుక్తలగ్నే సతి- వ్రతీ- అభిశస్తస్స్యాత్ - క్షయరోగీచ స్యాత్- అభిశస్తోనామ- మిథ్యాభిశస్తః- మిథ్యాభిశంసీ- అనేనేదంపాతకం కృతమితియోఽలం కామిథ్యాంవదతిసోభిశస్తః - క్షయరోగీస్యాదితి- కృష్ణపక్షేలగ్నస్థచంద్రఫలముక్తం ॥ సితపక్షేభవేద్విద్వానితి వాక్యంస్పష్టం- అయంశ్లోకః పునస్సంస్కారవిషయఇవభాతి యతఃకృష్ణపక్షేవ్రతబంధేలగ్నస్థచంద్రఫలముక్తం- తస్యాదివా అసమ్భవాత్- పునస్సంస్కారస్యతుఅహః కర్మలోపభయాత్- రాత్రావపిసంస్కారో విహితోనాన్యస్యప్రథమవ్రతబంధేతు సర్వైర్గ్రంథకారైర్దివైవ పూర్వాహ్ణేవిహితోనరాత్రౌ అతః కారణాదిదం వచనం- పునస్సంస్కారనిమిత్తాని ధర్మశాస్త్రప్రసిద్ధాని- తాదృశ్యంవాక్యం రత్నమాలాయాం॥ శ్లో॥ త్రిషట్కగోరంధ్రత్రిధనాస్తకమగా గశ్చంద్రస్త్రిషష్ఠాశ్చరాహుర్జ్ఞామాః । సర్వేచలాభేచత్రికోణకేంద్రగాశ్చశుభాస్స్యుర్వ్రతబంధకాలఇతి॥ అత్రతృతీయస్యషష్ఠస్య సూర్యస్య గాత్రగత లగ్నేసంభవః- నాగవేనతు లగ్నస్థచంద్రోనిందితఏవ- తద్వాక్యమేవం॥ శ్లో॥ స్వోచ్చసంస్థోపి శీతాంశుర్వ్రతినోయదిలగ్నగః। శంకరోతిశిశుంనిస్వం సతతంక్షయరోగిణమితి॥ అన్యలగ్నబలంపూర్వవత్॥ అథవిద్యారమ్భంవృత్తార్ధేనాహ॥ విద్యాంమౌంజ్యుక్తకాలఇతి॥ మౌంజ్యాఊర్ధ్వం మౌంజ్యుక్తకాలేవిద్యామారభేత- మౌంజ్యర్థముక్తః- మౌంజ్యుక్తః- సచాసౌకాలశ్చతస్మిన్ విద్యాంవేదం- ఆరభేత-మౌంజ్యాఊర్ధ్వమిత్యనేన మౌంజ్యాః ప్రాగనధికారసూచితః- కింకృత్వా- గణేశం- గిరమపిసరస్వతీమపి- విధివత్- విధ్యుక్తమార్గేణ - పూజయిత్వా- కథంభూతేమౌంజ్యుక్తకాలే- స్థిరచరహరిజత్ర్యుత్తరబ్రాహ్మహీనే- స్థిరచరహరిజం- స్థిరలగ్నం- చరలగ్నం- తిస్రోనాముత్తరాణాంసమాహారస్త్ర్యుత్తరం- బ్రాహ్మం- రోహిణీ- ఏభిర్హీనే- రహితే- మౌంజ్యర్థమేతానిగృహీతాని-విద్యారమ్భే-అగ్రాహ్యాణీత్యర్థః-జాడ్యంస్థిరేష్వంగలగ్నే సువిద్యాప్తిశ్చరేభ్రమణశ్రవణాత్॥ఇతిలగ్నఫలంవిద్యారంభోసమాప్తం.

అథకేశాంతమౌంజీవిమోక్షౌనరాణాం
ఛురికాబంధంచ వృత్తేనాహ॥

మూ॥ కేశాంతంచౌలవత్స్యాన్నృపమితశరదీత్యాహురార్యా



వ్రతోక్తేకాలే మౌంజీవిమోకం గురుబలమనయోర్నావ
లోక్యంసుధీభిః। శూద్రాణాం మౌంజ్యభావాత్తదుదితతిథి
భేనస్తథామేజ్యశుక్రే వ్యారేవారేలవేమాస్యుపయమవి
హితే ఛురికాబంధమాహుః ॥ ౧౪॥

ఇతి ముహూర్తమార్తండే సంస్కారప్రకరణం సమాప్తమ్.

టీక॥ కేశాంతమ్=కేశాంతమనుకర్మము, నృపమితశరది = పదునాఱవసంవత్సరమునందు, చౌలవత్=చూడాకర్మమువలె, స్యాత్=అగును. ఇతి=ఇట్లని, ఆర్యాః=పూజ్యులు, ఆహుః = చెప్పుచున్నారు. వ్రతోక్తే=వ్రతమునకుఁ జెప్పఁబడిన, కాలే=కాలమునందు, మౌంజీవిమోకమ్=మౌంజీవిమోక్షణమును, స్యాత్=అగును. అనయోః=ఈకేశాంతమౌంజీవిమోక్షణములయందు, సుధీభిః=విద్వాంసులచేత, గురుబలం=గురుబలము, నావలోక్యమ్=చూడఁదగినదికాదు. శూద్రాణామ్=శూద్రులకు, మౌంజ్యభావాత్=మౌంజిలేకపోవుటవలన, తదుదితతిథిభే = ఆయుపనయనమునకుఁ జెప్పఁబడిన తిథినక్షత్రములయందును, అనస్తథామేజ్యశుక్రే = కుజగురుశుక్రులు అస్తమానమును పొందనికాలమునందును, వ్యారే=అంగారకరహితమైన, వారే=వారమునందును, లవే=నవాంశయందును, ఉపయమవిహితే=వివాహమునకుఁ జెప్పఁబడిన, మాసి=మాసమునందును, ఛురికాబంధమ్=ఛురికాబంధమును, ఆహుః=చెప్పుచున్నారు.

తా॥ కేశాంత మౌంజీవిమోక్షములను ఛురికాబంధమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః—చూడాకర్మమువలె కేశాంతమను కర్మమును పదునాఱవసంవత్సరమునందు చేయవలయును. ఉపనయనమునకుఁ జెప్పఁబడినకాలమునందు మౌంజీవిమోక్షణమును చేయవలయును. ఈకేశాంతమౌంజీవిమోక్షణములయందు గురుబలమును చూడనక్కఱలేదు. మఱియును, శూద్రులకు మౌంజీబంధము లేదుకనుక ఉపనయనమునకుఁ జెప్పఁబడిన తిథినక్షత్రములయందును కుజగురుశుక్రులు అస్తమానమును పొందనికాలమునందును అంగారక వారముగాని వారములయందును అంగారక నవాంశకాని నవాంశలయందును వివాహమునకు తగిన మాసములయందును ఛురికాబంధమును కటిప్రదేశమునందు చేయవలసినదని పెద్దలు చెప్పుచున్నారు. “ శ్లో ॥ శూద్రాణాం రాజపుత్రాణాం మౌంజ్యభావేఽస్త్రబంధనం। మౌంజీబంధోక్తతిథ్యాదౌ కార్యంభౌమవివర్జితం॥” (=శూద్రులకును రాజపుత్రులకును మౌం

జీబంధము లేకపోవుచుండఁగా మవుంజీబంధమునకుఁ జెప్పఁబడిన తిథ్యాదులయందు అంగారకవారమువిడిచి యస్త్రబంధమును చేయవలయును.) అని సంగ్రహమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ ఛురికాబంధనం వక్ష్యే నృపాణాంప్రాక్కరగ్రహాత్ । వివాహోక్తేషుమాసేషు శుక్లేపక్షేప్యనస్తగే॥ జీవేశుక్రేచభూపుత్రే ౹ చంద్రతారాబలాన్వితే । మవుంజీబంధర్క్ష తిథిషు కుజవర్జితవాసరే । తేషాంనవాంశకేకర్తు రష్టమోదయవర్జితే॥ శుద్ధేష్టమేవిధౌలగ్న షడష్టాన్త్యవివర్జితే। ధనత్రికోణకేంద్రస్థైశ్శుభైస్త్ర్యాయారిగైఃపరే। ఛురికాబంధనంకార్య మర్చయిత్వా సురాన్పితౄన్ । అర్చయేచ్ఛురికాంసమ్య గ్దేవతానాంచసన్నిధౌ ॥ తతస్సులగ్నేబధ్నీయాత్కట్యాంలక్షణసంయుతాం । తస్యాస్తులక్షణంవక్ష్యే యదుక్తంబ్రహ్మణాపురా। సమ్మితంఛురికాయామం విస్తారేణైవ తాడయేత్। భాజితంగజసంఖ్యైశ్చ అంగులాన్పరికల్పయేత్ । శేషంచైవఫలంవక్ష్యే ధ్వజాయేధనవాన్భవేత్ ।ధూమాయేమరణంసింహే జయశ్చాయే౽తిరోగితః । ధనలాభోవృషేత్యంతం దుఃఖీభవతిగర్దభే । గజాయేత్యన్తసంప్రీతి ర్ధ్వాంక్షేవిత్తవినాశనమ్ ॥ " (= ఛురికాబంధనమును చెప్పుచున్నాను. రాజులకు కరగ్రహణమునకు పూర్వమునందు వివాహమునకు చెప్పఁబడిన మాసములయందు శుక్లపక్షమున గురుశుక్రకుజులు అస్తమానమును పొందకయుండఁగా చంద్రతారాబలములుగల దినమునందు ఉపనయనమునకు చెప్పఁబడిన తిథ్యాదులలో భౌమవారము భౌమనవాంశమును విడిచిపెట్టి యష్టమశుద్ధిఁజూచి చంద్రుఁడు లగ్నషడష్టములయందు లేకయుండఁగను ధనత్రికోణకేంద్రములయందు శుభులుండఁగను మూఁడు ఆరు పదునొకండు స్థానములయందు పాపులుండఁగను దేవతలను పితృదేవతలను పూజించి దేవతాసన్నిధియందు ఛురికాబంధమును చేయవలయును. మఱియును, ఆఛురికను శుభలగ్నమునందు కటిప్రదేశమున బంధింపవలయును. ఛురికాలక్షణమును చెప్పెదను. ఎట్లనిన:—ఛురికయొక్క ఆయామమును విస్తారముచేత హెంచి దానిని యెనిమిదిచేత భాగింపఁగా మిగిలినదానిని అంగుళములనుగాఁ గల్పింపవలయును. ఇట్లుచేయఁగా మిగిలినవానికి ఫలమును చెప్పెదను. ఎట్లనిన:— ధ్వజాయమునందు ధనవంతుఁడును ధూమాయమునందు మరణమును సింహాయమునందు జయమును వృషభాయమునందు ధనలాభమును గర్దభాయమునందు దుఃఖమును గజాయమునందు అత్యంతప్రీతియును ధ్వాంక్షాయమునందు ధననాశమును అగును.) అని నారదుఁడు చెప్పె. ఇక్కడఁ జెప్పఁబడిన విషయమునేగాక త్యాజ్యప్రకరణమునందుఁ జెప్పఁబడిన విషయములనుగూడఁ జూచికొనవలయును.



వ్యా॥ అథకేశాంతం మవుంజీమోక్షంచ వృత్తార్ధేనాహ ॥ కేశాన్తమితి॥ కేశాంతంకర్మ-నృపమితశరది-షోడశేవర్షే - చౌలవత్స్యాదిత్యార్యాఆహుః - సర్వంచౌలోక్త మత్రగ్రాహ్య మిత్యర్థః - వ్రతోక్తేకాలే మవుంజీవిమోక్షమాహుః - స్పష్టం - అనయోఃకేశాంత మవుంజీవిమోక్షయోగఃగురుబలం - సుధీభిర్నావలోక్యం॥ అథశూద్రాణాం మవుంజ్యభావాత్ - ఛురికాబంధంవృత్తార్ధేనాహ ॥ శూద్రాణాంమవుంజ్యభావాత్-తదుదితతిథిభే - మవుంజ్యుక్తతిథినక్షత్రే - అనస్తభౌమేజ్య శుక్రైః-ఉదితైః - భౌమగురుశుక్రైః-వ్యారే-వారే-ఆరోభౌమః - తద్రహితవారే-లవే-నవాంశే - యత్రకుత్రాపిలగ్నే భౌమనవాంశవర్జితే ఇత్యర్థః - ఉపయమనిహితేమాసి - వివాహోక్తమాసే - వివాహోపయమవాసమావిత్యమరః - ఆరోభౌమవారః - ఛురికాబంధంకటిప్రదేశే ఛురికాబంధనమాహుః - తథాచసంగ్రహే ॥ శ్లో॥ శూద్రాణాంరాజపుత్రాణాం మవుంజ్యభావే౽స్త్రబంధనం । మవుంజీబంధోక్తతిథ్యాదౌ కార్యం భౌమదినంవినా ॥ నారదః ॥ ఛురికాబంధనంవక్ష్యేనృపాణాంప్రాక్కరగ్రహాత్ । వివాహోక్తేషుమాసేషు శుక్లపక్షేప్యనస్తగే ॥ జీవేశుక్రేచభూపుత్రేచన్ద్రతారాబలాన్వితే । మవుంజీబంధర్క్ష తిథిషుకుజవర్జితవాసరే॥ తేషాంనవాంశకేకర్తురష్టమోదయవర్జితే॥ శుద్ధేష్టమేవిధౌలగ్నషడష్టాంత్యవివర్జితే । ధనత్రికోణకేంద్రస్థై శ్శుభైస్త్ర్యాయారిగైఃపరే॥ ఛురికాబంధనంకార్య మర్చయిత్వాసురాన్పితౄన్ । అర్చయేచ్ఛురికాంసమ్య గ్దేవతానాంచసన్నిధౌ ॥ తతస్సులగ్నేబధ్నీయాత్కట్యాంలక్షణసంయుతాం । తస్యాస్తులక్షణంవక్ష్యే యదుక్తం బ్రహ్మణాపురా॥ సమ్మితంఛురికాయామం విస్తారేణైవతాడయేత్ । భాజితంగజసంఖ్యైశ్చ అంగులాన్పరికల్పయేత్ । శేషంచైవఫలంవక్ష్యే ధ్వజాయే ధనవాన్భవేత్॥ ధూమాయేమరణంసింహే జయశ్చాయే౽తిరోగితః । ధనలాభోవృషేత్యంతం దుఃఖీభవతిగర్దభే ॥ గజాయేత్యంతసమ్ప్రీతి ర్ధ్వాంక్షేవిత్తవినాశనమితి । సర్వత్రత్యాజ్యప్రకరణోక్తం విలోక్యం - అస్మిన్ప్రకరణేకర్ణవేధవృత్తం వినాసర్వాణి స్రగ్ధరావృత్తాని॥ ఇతి గర్భాధానాదిసంస్కారప్రకరణం సమాప్తం॥

(*) అథ వివాహప్రకరణేవర్ణాదీనాంక్రమోవర్ణలక్షణంచ. (*)

మూ॥ శుద్ధాంగోత్రకులాదిభిర్గుణయుతాం కాంతాం వరశ్చోద్వ
హేద్వర్ణోవశ్య భయోని ఖేచరగణాః కూటంచ నాడీక్ర
మాత్ । వర్ణాద్యాబలినోయథోత్తర మహీదూర్ధ్వంగు
ణైక్యంశుభంవర్ణావిప్రముఖా ఝషాదిహవరోవర్ణోత్తమ
స్స్యాచ్ఛుభః॥ ౧॥

టీక॥ గోత్రకులాదిభిః = గోత్రముకులము మొదలగువానిచేత, శుద్ధామ్=పరిశుద్ధురాలును, గుణయుతామ్ = గుణములతోఁ గూడినదియును, కాంతామ్=రమణీయురాలును ( అయిన ) ( కన్యామ్ = కన్యకను,) వరః=వరుఁడు, ఉద్వహేత్ = వహింపవలయును. వర్ణః=వర్ణము, వశ్యభయోని ఖేచరగణాః = వశ్యము, నక్షత్రము, యోనిఖేచరము గణము అనునవియును, కూటంచ=కూటమును, నాడీచ=నాడియును, క్రమాత్=క్రమముగా, ( పశ్యేత్=చూడవలయును. ) వర్ణాద్యాః=వర్ణము మొదలగునవి. యథోత్తరమ్=ఉత్తరోత్తరము, బలినః=బలముకలవి యగును. అహీదూర్ధ్వమ్=అష్టాదశాధికమైన, గుణైక్యమ్=గుణములయేకత్వము, యథోత్తరమ్=ఉత్తరోత్తరము, శుభమ్ = శుభము, స్యాత్ = అగును. ఝషాత్సకాశాత్=మీనము మొదలుకొని, విప్రముఖాః=బ్రాహ్మణత్వము మొదలుగాఁగల, వర్ణాః=వర్ణములు, స్యుః=అగును. ఇహ=ఈరెండువిషయమై, వర్ణోత్తమః=శ్రేష్ఠమైనవర్ణము, వరః = శ్రేష్ఠమైనదియును, శుభః=శుభమును, స్యాత్=అగును.

తా॥ ఇఁకను వివాహప్రకరణమును చెప్పఁదలఁచినవాఁడై సంఘటన చేయఁబడిన గుణవిచారమును అనఁగా వివాహప్రకరణమునందు వర్ణాదులయొక్క క్రమమును వర్ణలక్షణమును ఈశ్లోకము మొదలుకొని పదిరెండుశ్లోకములచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—గోత్రకులాదుల చేత పరిశుద్ధుఁడును గుణవంతుఁడును మనోహరుఁడును అగువరుఁడు గోత్రకులాదులచేత పరిశుద్ధురాలును గుణములు గలదియును కమనీయురాలును అయినకన్యను వివాహము చేసికొనవలయును. గోత్రశుద్ధిని గ్రంథాంతరమువలనఁ దెలిసికొనవలయును. కులమునుగూడ గ్రంథాంతరమువలన దెలిసికొనవలయును. మఱియును, వర్ణము వశ్యము నక్షత్రము యోనిఖేచరము గణము కూటము నాడి అనునవి యొకదానికంటె నొకటి యుత్తరోత్తరము బలముకలవియగును. మఱియును, అష్టా



దశాధికమైన గుణైక్యము యథోత్తరము శుభకరమైనది యగును. మఱియును, మీనము బ్రాహ్మణుఁడనియును మేషము క్షత్రియుఁడనియును వృషభము వైశ్యుఁడనియును మిథునము శూద్రుఁడనియును, ఇటులనే కర్కటాదిగాఁ దెలిసికొనవలసినదనియును, తెలియవలయును. మఱియును, ఇట్లు రాసులయొక్క జాతులను దెలిసికొని కన్యకజాతికంటె వరునిజాతిమేలైనదైయుండవలసినదిగాఁ జూచికొనవలయును. మఱియును, కన్యకయొక్క జాతికంటె వరునిజాతిమేలైనదయ్యేనేని శుభములు విశేషముగఁ గలుగును.

వ్యా॥ అథ వివాహప్రకరణం వివక్షుస్తావద్ఘటిత గుణవిచారం ద్వాదశభిర్వృత్తైరాహ । ఇతఃపరం అత్రగ్రంథేసర్వాణి శార్దూలవిక్రీడితాని । వరఃగోత్రకులాదిభిః - శుద్ధాంకాంతాం - కమనీయాంకన్యాం-ఉద్వహేత్ - చకారాద్వరోప్యేవంవిధోభావ్యః - గోత్రశుద్ధింగ్రంథాంతరాజ్జ్ఞాత్వా - కులమపివశ్చసప్తనిర్ణయమపి-ఏతద్గ్రంథాంతరాజ్జ్ఞాత్వా- అన్యదత్రాలోకయేత్- అథయథోత్తరంబలిష్ఠం । ఘటితక్రమమాహ- వర్ణఇతి॥ వర్ణః- ౧- వశ్యం- ౨- భం- ౩- యోనిః- ౪ - ఖేచరః- ౫ - గణః- ౬- కూటం- ౭- నాడీ- ౮- క్రమాద్యథోత్తరంబలినః- స్యుః- అహీదూర్ధ్వం- అష్టాదశాధికం- గుణైక్యం- యథోత్తరం స్యాచ్ఛుభం-తత్రాదౌవర్ణలక్షణమాహ॥ ఝషాత్- మీనాత్సకాశాత్- విప్రముఖాః - బ్రాహ్మణాదయోవర్ణాః- పునర్గణనయాజ్ఞేయాః- తద్యథా - మీనోబ్రాహ్మణః- మేషఃక్షత్రియః- వృషోవైశ్యః- మిథునశ్శూద్రః- పునఃకర్కోబ్రాహ్మణః- సింహః- క్షత్రియ ఇత్యాది- ఇహాస్మిన్ రాశిమేళనేవర్ణోత్తమోవరః శుభస్స్యాత్- నాన్యథేత్యర్థాత్సిద్ధం॥

ఇతివర్ణానాంక్రమోవర్ణలక్షణంచసమాప్తమ్.

* అథవశ్యభయోనియోనివైరాణి. *

మూ॥ నృభృత్యా జలజావశా విహరయో వశ్యావినార్వృశ్చికే
రే దస్యాత్ప్రిష్ణశుభోను దక్షహరయో నేష్టాస్స్యురన్యజ్జ
నాత । ఖగశ్వేభజహ్వా తేమిషస్త్ర్యగశరాశ్వేషం నస
చ్ఛాశ్వీఖా దశ్వేభావ్య హిభోగినశ్వవృకభు జ్మేషాఖుభు
గ్వ్యాంమరాః॥ ౨॥

టీక ॥ నృః = మనుష్యరాశికి, జలజాః = జలచరరాసులు, భక్ష్యాః = భక్షింపదగినవి, తస్యైవ = ఆమనుష్యరాశికే, విహరయః = సింహరహితములైన సర్వరాసులును, వశ్యాః = స్వాధీనములైనవి

హారేః = సింహమునకు, వికౌర్ప్యాః = వృశ్చికరహితములయిన సర్వరాసులును, వశ్యాః = స్వాధీనములయినవి, అస్య = ఈసింహమునకు, అలిః = వృశ్చికము, నశుభః = శుభకరమైనదికాదు, నుః = మనుష్యరాశికి, అబ్జహరయోః = జలచరములును, సింహమును, ఇష్టాః = ఇష్టములైనవి, నస్యుః = కావు. జనాత్ = జనమువలన, అన్యత్ = ఇతరమైనభక్ష్యాదికము, జ్ఞేయమ్ = తెలియఁదగినది, మిథః = పరస్పరమును, భే = స్త్రీపురుషనక్షత్రములు, గణ్యే = లెక్కింపఁబడినవగుచు, అంకహృతేసతి = తొమ్మిదిచేత భాగింపఁబడినవగుచునుండఁగా, శేషమ్ = శేషము, త్ర్యగశరాః = మూఁడు ఏడు అయిదు, స్యుశ్చేత్ = అయ్యెనేని, సత్ = శుభము, నస్యాత్ = కాదు, అశ్విభాత్ = అశ్వినీనక్షత్రము మొదలుకొని, అశ్వేభాజ్యహిభోగినః = అశ్వము, గజము, మేక, సర్పము, సర్పము అనునవియును, శ్వవృకభుజ్మేషాఖుఘ్నస్వ్యందురాః = కుక్క, ఉందురమను జంతువును (ఎలుకను) తినునట్టిపిల్లి, మేక, మార్జారము ఎలుకలు అనునవి, స్యుః = అగును.

తా॥ ఇఁకను వశ్యమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః—మనుష్యరాశికి జలచరరాసులు భక్ష్యములగును. ఆమనుష్యరాశికే సింహరాశితప్పఁ దక్కినరాసులు స్వాధీనములు. సింహరాశికి వృశ్చికరాశితప్పఁదక్కినరాసులు స్వాధీనములయినవి. సింహరాశికి వృశ్చికరాశిమాత్రము శుభకరమైనదికాదు. అనఁగా సింహమునకు వృశ్చికముశత్రువు. మనుష్యరాశికి జలచరరాసులును సింహమును శుభకరములయినవికావు. కావున ఇట్టిరాసులవారికి పరస్పరమేళనము సరియైనదికాదని యెఱుఁగవలయును. మఱియు నిటులనే అన్యోన్య రాసులకు వశ్యాదులను జనులవలనఁ దెలిసికొనవలయును. ఎట్లనినః — పురుషునకు గోవువశ్యమైనది. కావున ఈరెంటికిని పరస్పర మిత్రత్వము చూడఁ బడుచున్నది. కావున ఈరెంటికిని మేళనముశుభకరమైనదగును. ఇదియేమ్లేచ్ఛజాతీయ వధూవరులకు శుభముకలుగనేరదు. ఏలయనిన మ్లేచ్ఛులకు గోవుభక్ష్యమగును. కావున ఈవిషయమును లోకప్రచారమువలన తెలిసికొనవలయును. "శ్లో॥ మత్స్యౌఘటీనృమిథునం సగదంసవీణం చాపీనరోఽశ్వజఘనో మకరో మృగాస్యః। తౌలీససస్యదహనా ప్లవగాచకన్యా శేషాస్స్వనామసదృశాః ఖచరాశ్చసర్వే॥" (మీనరాశియు భయోదయమగుటవలన అన్యోన్యపుచ్ఛాభిముఖమగుటవలన మత్స్యద్వయమనఁబడును. కుంభరాశిస్కంధాస



క్తరిక్తఘటధారియగు పురుషుఁడనఁబడును. మిథునము స్త్రీపురుషయుగ్మరూపమైనది. ఆమిథునరాశి గదసహితమయినదియును వీణాసహితమైనదియును అగును. ధనుస్సు పురుషరాశియనియును తురగముజఘనముగాఁగల పురుషస్వరూపము కలదియనియును చెప్పఁబడును. అనఁగా చతుష్పాత్తనఁ బడుననుట. మకరము మృగముయొక్క ముఖమువంటి మృగముకలదియనఁబడును. తులారాశి తులనుధరించిన పురుషుఁ డనఁబడును. కన్యారాశి వివాహముగానిదియును ఓడయందున్నదియును అయినకన్యకయేస్వరూపముగాఁగలది. ఆకన్యారాశి సస్యదహనములతోఁగూడుకొనినది. మిగిలినరాసులనఁగా మేష వృషభ కర్కట సింహ వృశ్చికములుతమన్నామములకు సమానములగు రూపములుగలవి.) అని బృహజ్జాతకమునందు రాసులయొక్క స్వరూపములు చెప్పఁబడెను. మఱియును, వరుని నక్షత్రము మొదలుకొని వధూనక్షత్రమువఱకును వధూనక్షత్రము మొదలుకొని వరనక్షత్రమువఱకును లెక్కించి తొమ్మిదిచేత భాగింపఁగా మూఁడు అయిదు ఏడు మిగిలెనేని శుభముకాదని యెఱుఁగవలయును. అశ్వినీనక్షత్రము మొదలుకొని సకలనక్షత్రములకును అశ్వాదులు యోనులగుచున్నవి. ఎట్లనినః.. అశ్వినికి అశ్వము, భరణికి ఇభము, (ఏనుఁగు) కృత్తికకు మేక రోహిణికి సర్పము, మృగశీర్షకు సర్పము, ఆర్ద్రకు శ్వానము, ఆర్ద్రకు వృకము, పునర్వసువునకు మార్జారము, పుష్యమికి మేషము, ఆశ్రేషకు మార్జారము, మఖాపూర్వఫల్గునిలకు ఎలుకలు అనఁగా మఖకు ఎలుక పుబ్బకును ఎలుక, యోనులని తెలియవలయును.

వ్యా॥ అథవృత్తార్ధేనవశ్యమాహ॥ నుః- నృరాశేః- మనుష్యరాశేః- జలజాజలచరా భక్ష్యాః- తస్యైవవిహరయః- సర్వేవశ్యాః - విగతః హరిః సింహోయేభ్యః తేవిహరయః సింహరహితాస్సర్వేవశ్యా ఇత్యర్థః- హరేః- సింహస్య- వికౌర్ప్యవశ్యాః- కౌర్ప్యేవృశ్చికః - విగతః- కౌర్ప్యోయేభ్యస్తేవికౌర్ప్యాః- సింహస్యవృశ్చికరహితాః- సర్వేరాశయోవశ్యాః- అథానంతరోక్తస్యహరేః- అళిర్వృశ్చికోనశుభః- వైరిత్వాత్- నుః- మనుష్యరాశేః॥ అబ్జహరయోనేష్టాస్స్యుః- అబ్జాః - జలజాః - హరిః- సింహః- ఏతేనేష్టాః- మేలనంనకర్తవ్యమిత్యర్థః- అన్యజ్జనాత్-అన్యత్- అస్య భక్ష్యాదికంజనాజ్జ్ఞేయం- తద్యథా- నుః పురుషస్య-గౌర్వశ్యాభవతి। అత్రపరస్పరంమిత్రత్వందృశ్యతే- తస్మాదనయోర్మేళనంశుభం స్యాత్ - ఇదమేవమ్లేచ్ఛజాతీయవధూవరయోర్నశుభం - మ్లేచ్ఛానాంగో

ర్భత్వం- ఇత్యేవంలోకప్రచారతోవిచారణీయమిత్యర్థః - రాశిస్వరూపం బృహజ్జాతకవశాదవగంతవ్యం- బృహజ్జాతకే॥ శ్లో ॥ మత్స్యౌఘటీనృమిథునం సగదంసవీణంచాపీనరోఽశ్వజఘనోమకరోమృగాస్యః । తౌలీససస్యదహనాప్లవగాచకన్యాశేషాస్స్వనామసదృశాఃఖచరాశ్చసర్వే॥ అథభయోనీద్వావపివృత్తేనైకేనాహ॥ భేగణ్యేతి॥ మిథఃపరస్పరం- వధూవరయోర్యైనక్షత్రే- వధూనక్షత్రాద్వరనక్షత్రంగణ్యం- వరనక్షత్రాత్కన్యానక్షత్రం గణ్యంఉభేఅపిఅఙ్కహృతేనవభిర్భాజితేకార్యం- శేషంత్ర్యగశరాః- త్రిసప్తపఞ్చభవతితదానసత్స్యాత్- అథయోనిమాహ॥ అశ్విభాదితి॥ అశ్విభాత్సకాశాత్- భానాం- నక్షత్రాణాం - అశ్వాదయోయోనయోభవంతి। అశ్వోఽశ్విన్యాః- ఇభోభరణ్యాః - అవిర్మేషః - కృత్తికాయాః- అహిస్సర్పో రోహిణ్యాః- భోగీసర్పోమృగస్య- శ్వా - శ్వానః- ఆర్ద్రాయాః- వృకం- ఉందురంభునక్తీతివృకభుక్- మార్జారఃపునర్వసోః- మేషఃప్రసిద్ధః పుష్యస్యఆఖుభుక్మార్జారఆశ్లేషాయాః- ద్వ్యందురౌ- మఘాపూర్వఫల్గున్యోః॥

మూ॥ గౌఃకాళీ పశుభుఙ్మహిష్యథపశు ద్విడ్ద్వౌమృగౌశ్వాకపి
ర్ద్వౌబభ్రూకపిసింహ వాజిహరిగోనాగాః క్రమాద్యోన
యః । సింహేభంమహిషాశ్వమోతుఖనకం శ్వైణంచకీ
శాఽవిగో వ్యాఘ్రంబభ్రుఫణీతిభీరువరయోః ప్రేష్యేశ
యోశ్చత్యజేత్॥ ౩॥

టీక ॥ గౌః = గోవు, కాళీ = బఱ్ఱె, పశుభుక్ = వ్యాఘ్రము, మహిషీ = బఱ్ఱె, అథ = పిమ్మట, ద్వౌ = రెండు, మృగౌ = మృగములు, (జింకలు) శ్వా = కుక్క, కపిః = కోతి, ద్వౌ = రెండు, బభ్రూ=నకులములు (ముంగిసలు) కపిసింహవాజి హరిగోనాగాః = వానరముసింహము గోవు ఏనుగు, (అనునవి) క్రమాత్ = క్రమముగా, యోనయః= యోనులు, సింహేభమ్ = సింహగజములను, మహిషాశ్వమ్ = బఱ్ఱెగుఱ్ఱము అనువానిని, ఓతుఖనకమ్= మార్జారమూషికములను, శ్వైణంచ= కుక్క జింక అనునట్టి ద్వంద్వమును, కీశావి = కోతి మేక అనుద్వంద్వమును, గోవ్యాఘ్రమ్ = గోవ్యాఘ్రములను, బభ్రుఫణీ = నకులసర్పములు, ఇతి = ఇట్లని, భీరువరయోః = వధూవరులను, ప్రేష్యేశయోః = సేవకప్రభువులకును, త్యజేత్ = విడువవలయును.

తా॥ ఉత్తరఫల్గునికి గోవు, హస్తకు బఱ్ఱె, చిత్తకు వ్యాఘ్రము,



స్వాతికి మహిషము, విశాఖకు వ్యాఘ్రము, అనూరాధా జ్యేష్ఠలకుజింకలు, మూలకు శ్వానము, పూర్వాషాఢకు వానరము, ఉత్తరాషాఢాభిజిత్తులకు నకులములు, శ్రవణమునకు వానరము, ధనిష్ఠకు సింహము, శతభిషమునకు అశ్వము, పూర్వాభాద్రకు సింహము, ఉత్తరాభాద్రకుగోవు, రేవతికి ఏనుగు, అనునవి యోనులనఁబడును. మఱియును ఇఁకను యోనివైరమును చెప్పెదను. ఎట్లనిన:—సింహగజములకును, మహిషాశ్వములకును, మూషికమార్జారములకును, శ్వానమృగములకును, వానరమేషములకును, గోవ్యాఘ్రములకును, నకులసర్పములకును, పరస్పరవైరముకనుక వధూవరులయొక్కయును, స్వామిసేవకులయొక్కయును రాసులు ఇట్లుపరస్పరవైరముకలవై యుండుటతగదని యెఱుఁగవలయును.

వ్యా॥ గౌరుత్తరఫల్గున్యాః-కాలీమహిషీహస్తస్య- పశుభుగ్వ్యాఘ్రః-చిత్రాయాః- మహిషస్స్వాత్యాః- పశుద్విట్వ్యాఘ్రఃవిశాఖాయాః- ద్వౌమృగౌ అనూరాధా జ్యేష్ఠయోః- శ్వామూలస్య - కపిర్వానరః పూర్వాషాఢాయాః- ద్వౌబభ్రూఉత్తరాషాఢాభిజితోః- బభ్రూనకులౌ కపిర్వానరః- శ్రవణస్య- సింహోధనిష్ఠాయాః - వాజీ అశ్వశ్శతతారకాయాః- హరిఃసింహః పూర్వాభాద్రపదాయాః- గౌఃఉత్తరా భాద్రపదాయాః- నాగోహస్తీ రేవత్యాః- ఇతియోనిమభిధాయ- యోనివైరమాహ॥ సింహశ్చఇభశ్చసింహేభం- సింహగజం- మహిషాశ్వంఓతుఖనకంమార్జారోందురం శ్వైణంశ్వానమృగౌ- కీశాఽవివానరమేషం - గోవ్యాఘ్రం- బభ్రుఫణం- నకులసర్పం- ఇతివైరం- భీరువరయోః-వధూవరయోః ప్రేష్యేశయోః- ప్రేష్యః- సేవకః- ఈశః- స్వామీ - ఏతయోశ్చత్యజేత్- వర్జయేత్॥ ఇతి వశ్యాదీనిసమాప్తమ్.

* అథ రాశినాథానాం గ్రహవైరంచాహ. *

మూ॥ భేశాః కుశుబుచంరబుశుకుగుశశ్శగుః క్రియాత్స్యుర
వేర్మిత్రాణిజ్యకుజేన్దవశ్శనిసితౌశత్రూవినోర్నారిపుః। మి
త్రేసూర్యబుధావుజస్త్వవిదరి సూర్యేన్దుజనాపి తౌ జ్ఞ
స్యార్కస్ఫుజితౌహితావిధువరిస్సూర్యేన్దుసోమాత్మజాః॥౪॥ మి
త్రాణ్యర్కకుజేన్దవోథభృగుజస్యార్కీరవీందూహితౌ పస్న
జ్ఞౌచశ సేంకుజేందురవయోసేస్త్వాస్సితజ్ఞాపిహా॥ ౪౫॥

టీక ॥ క్రియాత్ = మేషము మొదలుకొని, కుశుబుచంరబుశు
కుగుశశ్శగుః = కుజుఁడు, శుక్రుఁడు, బుధుఁడు, చంద్రుఁడు, రవి, బు, శు,

కుజుఁడు, గురువు, శని, అనువారును, శోగుః = శని గురువు అనువారును భేశాః = నక్షత్రాధిపతులు, స్యుః = అగుదురు. రవేః = సూర్యునకు, ఇజ్యకుజేందవః = గురు కుజ చంద్రులు, మిత్రాణి = మిత్రములు, శనిసితౌ = శని శుక్రులు, శత్రూ = శత్రువులు, విధోః = చంద్రునకు, రిపుః = శత్రువు, నో = లేదు, సూర్యబుధౌ = సూర్యబుధులు, మిత్రే = మిత్రములు, కుజస్య = కుజునకు, విత్ = బుధుఁడు, అరిః = శత్రువు, సూర్యేందుజీవాః = సూర్యచంద్ర గురువులు, హితాః = మిత్రులు, జ్ఞస్య = బుధునకు, అర్కస్ఫుజితౌ = సూర్యశుక్రులు, హితౌ = హితులు, విధుః = చంద్రుఁడు, అరిః = శత్రువు, సూరేః = గురువునకు, సితజ్ఞౌ = శుక్రబుధులు, అరీ = శత్రువులు, అర్కకుజేందవః = రవికుజచంద్రులు, మిత్రాణి = మిత్రములు, అథ = పిమ్మట, భృగుజస్య = శుక్రునకు, రవీందూ = రవిచంద్రులు, అరీ = శత్రువులు, మందజ్ఞౌ = శనిబుధులు, హితౌ = హితులు, శనేః = కుజేందురవయః = కుజచంద్రసూర్యులు, ఇష్టాః = మిత్రులు, న = కారు, సితజ్ఞౌ = శుక్రబుధులు, హితౌ = హితులు.

తా ॥ గ్రహవైరమును చెప్పఁబోవుచు ముందుగా రాశినాథులను జెప్పుచున్నాఁడు. ఎట్లనినః—మేషమునకుకుజుఁడు, వృషభమునకుశుక్రుఁడు, మిథునమునకు బుధుఁడు, కర్కటకమునకు చంద్రుఁడు, సింహమునకు సూర్యుఁడు, కన్యకు బుధుఁడు, తులకు శుక్రుఁడు, వృశ్చికమునకుకుజుఁడు, ధనుస్సునకు గురుఁడు, మకరమునకు శని, కుంభమునకు శని, మీనమునకు గురుఁడు, అధిపతులని తెలియఁగవలయును. మఱియును, సూర్యునకు గురుకుజచంద్రులుమిత్రులు. శనిశుక్రులు శత్రువులు. చంద్రునకు శత్రువులులేరు. సూర్యబుధులుమిత్రులు, కుజునకుబుధుఁడుశత్రువు సూర్యచంద్ర గురువులుమిత్రులు బుధునకు సూర్యశుక్రులుహితులు. చంద్రుఁడుశత్రువు. గురునకు శుక్రబుధులు శత్రువులు. సూర్యకుజచంద్రులుమిత్రులు. శుక్రునకు రవిచంద్రులుశత్రువులు. శనిబుధులుహితులు. శనికికుజచంద్రసూర్యులు శత్రువులు. శుక్రబుధులుశత్రువులు. ఇట్లు చెప్పఁబడిన శత్రుమిత్రులుగాక తక్కినవారందఱును ఉదాసీనులని తెలియఁగవలయును.

వ్యా ॥ అథగ్రహవైరమాహ॥ రాశివైరంవివక్షుస్తావద్రాశినాథానాహ॥ క్రియాస్మేషాత్- భానాం- రాశీనాం- ఈశాః- భేశాః- ఏతేక్రమేణస్యుః- మం- మఙ్గలః మేషస్య- శు- శుక్రః వృషభస్యేత్యాద్యపిస్పష్టం- రవేసూర్యస్య- ఇజ్యకుజేన్దవోమిత్రాణి. శనిశుక్రౌ గురుః- కుజో ... ఇందు



శ్చన్ద్రః- ఏతేమిత్రాణి- శుభదాః- శనిసితౌశత్రూ- శనిః- ప్రసిద్ధః - సితః- శుక్రః- ఏతౌశత్రూవైరిణౌ అర్థాదన్యేఉదాసీనాఃవిధోశ్చన్ద్రస్య- రిపుర్నాస్తి- సూర్యబుధౌమిత్రే- అన్యేసర్వేఉదాసీనాః- కుజస్యభౌమస్య- విదరిః- విత్- బుధోఽరిఃసూర్యేందుజీవాః- హితాః-మిత్రాణి- అన్యేసమాః- జ్ఞస్యబుధస్య- అర్కస్ఫుజితౌ-రవిశుక్రౌ- హితౌ - మిత్రే- విధుశ్చన్ద్రః- అరిఃవైరీ- అన్యేసమాః- సూరేఃగురోః। సితజ్ఞౌశుక్రబుధౌ- అరీవైరిణౌ- అర్కకుజేన్దవః- రవిభౌమచంద్రాః- మిత్రాణి అన్యేసమాః- భృగు భువః। భృగోఃభవతీతి భృగుభూః- తస్యభృగుభువః- శుక్రస్య రవీందూసూర్యచంద్రౌ- శత్రూ- మందజ్ఞౌ - శనిబుధౌ-హితౌమిత్రే అన్యేసమాః- శనేఃకుజేందురవయః- అరయఃసితజ్ఞౌహితౌ-మిత్రే- అన్యస్సమః। ఇతి రాశినాథగ్రహవైరాణి సమాప్తమ్.

## —— (*) అథ గణకూటః. (*) ——

మూ॥ పూర్వార్ద్రాభరణీతకోత్తరంనరిసురే రాక్షంత్యాదితిజ్యాని
లేందుశ్రుత్యశ్విమిత్రమన్యదసురే దైత్యైర్నృణాంస్యా
న్మృతిః॥ ౫ ॥ స్యాద్దేవాసురయోః కలిర్నృసురయోర్మ
ధ్యంస్వయోస్సౌహృదం వైరస్యాంద్వివ్యధికేపరిష్టసువిప
ద్దైన్యంత్ర్యర్థాంకకే। శేషేష్వావిపధాహ్యభికచరణే భిన్న
త్రిరాశ్యేకకంభిన్నాంశైక్యకభమేతయోర్గణఖగా
నాడీనృమారంనచ॥ ౬॥

టీక ॥ పూర్వార్ద్రాభరణీతకోత్తరమ్ = పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్రలు, ఆర్ద్ర, భరణి, రోహిణి, ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, అను తొమ్మిదియును, నరి = మనుష్యగణమునందు, స్యాత్ = అగును. అరాక్షంత్యాదితిజ్యానిలేందుశ్రుత్యశ్విమిత్రమ్ = హస్త, రేవతి, పునర్వసు, పుష్యమి, స్వాతి, మృగశీర్ష, శ్రవణము, అశ్విని, అనూరాధ, అను నట్టి తొమ్మిది నక్షత్రములును, సురే = దేవగణమునందు, స్యాత్ = అగును. అన్యత్ = ఇతరమగు నక్షత్రనవకము, అసురే = రాక్షస గణమునందు, స్యాత్ = అగును. దైత్యైః = రాక్షసగణమునందలి నక్షత్రములచేత, నృణామ్ = మనుష్యులకు, మృతిః = మరణము, స్యాత్ = అగును. దేవాసురయోః = దేవాసురగణములకు, కలిః = వైరము, స్యాత్ = అగును. నృసురయోః = మానవదేవతలకు, మధ్యమ్ = మధ్యమము, స్యాత్ = అగును. స్వయోః = స్వగణములకు, సౌహృదమ్ = స్నేహము, స్యా

త్ = అగును. ద్విర్ద్వాదశకే = రెండు పదిరెండు రాసులయందు, నైస్స్వ
మ్ = నిర్ధనత్వము, షడష్టసు = ఆరు ఎనిమిది రాసులయందు, విపత్ = ఆప
ద, స్యాత్ = అగును. అథాంశకే = పంచమ నవమములయందు, నైపు
త్ర్యమ్ = సంతానరాహిత్యము, స్యాత్ = అగును. శేషే = మిగిలినరా
సులయందు, వివిధాః = నానావిధములైన, అర్థాః = సంపదలు, స్యుః =
అగును. విశ్వైకచరణే = ఏకచరణముగాని, (ఏకర్క్షే = ఏకనక్షత్రమునం
దున,) వివిధాః = నానావిధములయిన, అర్థాః = సంపదలు, స్యుః =
అగును. భిన్నర్క్షరాశ్యైక్యకమ్ = భిన్నసక్షత్రముకల ఏకరాశిని, భిన్నాంఘ్ర్యేకభమ్ = భిన్నపాదముకల యేకరాశిని, (స్యాత్ = చూడవలయు
ను.) ఏతయోః = వీనియందు, గణఖగౌ = గణఖగములను, నాడీ = నా
డిని, నృదూరమ్ = నృదూరమును, నచ = లేదు.

తా॥ గణకూటములను చెప్పుచున్నాడు. ఎట్లనిన:—పుబ్బపూ
ర్వాషాఢ పూర్వాభాద్రలు, ఆర్ద్ర, భరణి, రోహిణి, ఉత్తర ఉత్తరా
షాఢ ఉత్తరాభాద్ర, అనునక్షత్రములు మానవగణమనంబడును. హస్త,
రేవతి, పునర్వసు, పుష్యమి, స్వాతి, మృగశీర్ష, శ్రవణము, అశ్విని, అనూ
రాధ, అనునక్షత్రములు తొమ్మిదియును దేవగణనక్షత్రములనంబడును.
కృత్తిక, ఆశ్రేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, ధనిష్ఠ, మూల, శతభిష
ము, అనునక్షత్రములు తొమ్మిదియును రాక్షసగణనక్షత్రములని యెఱుఁగ
వలయును. వధూవరులకు మానవరాక్షస గణములయినయెడల మరణ
ముగలుగును. దేవమానవగణములయినయెడల మధ్యమఫలముగలుగును.
సమానగణములయినయెడల స్నేహముకలుగును. వధూవరులరాసులుప
రస్పరమును రెండు పది రెండయ్యెనా దారిద్ర్యముకలుగును. షష్ఠాష్టము
లయినయెడల విపత్తులుగలుగును. నవమ పంచమములయినయెడలసంతా
నరాహిత్యమగును. మఱియును, తృతీయైకాదశములయందును చతుర్థద
శములయందును ఉభయసప్తములయందును, ఏకనక్షత్రమునందును నానా
విధములయిన సంపదలుగలుగును. ఏకనక్షత్రమునందేకపాదము శుభక
రముకాదనియెఱుఁగవలయును. "శ్లో॥ ఏకరాశౌ శుభోద్వాహ ఏకభాం
శే మృతప్రదః" (=ఏకరాశియందు వివాహము శుభకరమైనదనియును,
ఏకనవాంశయందు మరణముకలుగుననియును, తెలియవలయును.) అని ఏ
కనక్షత్రమునందలి యేకపాదము శుభకరముకాదని యెఱుఁగవలయును.
ఏకనక్షత్రమునందు నాలుగుభేదములుగలవు. ఎట్లనిన:—ఏకరాశియును



భిన్ననక్షత్రమనియును, ఏకనక్షత్రమును భిన్నరాశియనియును, ఏక
రాశి నక్షత్ర భిన్నచరణమనియును, ఏకరాశి నక్షత్ర చరణమనియును,
అనినాల్గుభేదములు. ఏకరాశి నక్షత్రచరణము నిందితమైనదని యెఱుఁగవ
లయును. ఇంక కూటములను చెప్పెదను. ఎట్లనిన:— భిన్నర్క్ష రాశియొకటి
రాశ్యైకత్వము భిన్నపాదముగల యేకనక్షత్రము అనువానియందు గణఖ
గములను నాడిని ఇకమీఁద చెప్పఁబడఁబోయెడు నృదూరమును విచారిం
పనక్కరలేదని యెఱుఁగవలయును. భిన్నపాదముగల యేకనక్షత్రమను
చోట రెండుభేదములు వచ్చుచున్నవి. ఎట్లనిన:—ఏకర్క్ష భిన్నరాశికమని
యును ఏకరాశి నక్షత్రభిన్నచరణమనియును రెండువిధములు. కావున
ఏకరాశి నక్షత్ర చరణమును విడిచి మిగిలిన మూఁడు భేదములయందును
గణాదికమును ఆలోచింపవలయును. అక్కడ గణాదిదోషమున్నప్పటి
కిని శుభముకలుగునని యెఱుఁగవలయును. "శ్లో॥ ఏకరాశౌ పృథగ్ధిష్ణ్యే
పృథగ్రాశౌ త్వథైకభే । గణనాడీ నృదూరంచ గ్రహవైరం నచింతయే
త్॥" (ఏకరాశియై పృథక్కుగానుండు నక్షత్రమునందును, పృథగ్రాశి
గానుండు యేకనక్షత్రమైనప్పుడును, గణమునాడి నృదూరము గ్రహవై
రము అనువానిని విచారింపనక్కరలేదు.) అని బృహస్పతిచెప్పె. "శ్లో॥
దంపత్యో రేకనక్షత్రే భిన్నపాదే శుభావహం । దంపత్యోరేకపాదేతు
వర్షాంతే మరణం ధ్రువమ్॥" (=దంపతుల నక్షత్ర మొక్కటియై యుం
డఁగా భిన్నపాదమయ్యెనేని శుభము కలుగును. దంపతులకొక్కటియే
నక్షత్రమై పాదముకూడ ఒక్కటియే యైనయెడల వర్షాంతమందు
మరణముకలుగును. అని కాలనిర్ణయమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ అథగణమాహ॥ పూర్వాస్తిస్రః - ఆర్ద్రాప్రసిద్ధా-అంతకో
భరణీ - కః రోహిణీ - ఉత్తరాస్తిస్రః - ఏవం నక్షత్రనవకం - నరిభవతి-
నృగణమిత్యర్థః - అర్కోహస్తః-అంత్యం రేవతీ అదితిః పునర్వసుః - ఇజ్యః
పుష్యః - అనిలః స్వాతీ - ఇందుర్మృగః - శ్రుతిః శ్రవణః - అశ్వినీప్రసిద్ధా-
మైత్రం అనూరాధా - ఏతన్నక్షత్రనవకం సురేదేవేభవతి - దేవగణమి
త్యర్థః - అన్యత్ - కృత్తికాశ్లేషామఘాచిత్రా విశాఖా జ్యేష్ఠా ధనిష్ఠా
మూలశతతారకా ఏతన్నక్షత్రనవకం అసురేభవతి - రక్షోగణమిత్య
ర్థః-దైత్యైర్నృణాం మృతిర్భవతి - దేవాసురయోర్వైరత్వాత్ కలి
స్స్యాత్ - నృసురయోః నృదేవయోర్మధ్యం స్యాత్ - స్వయోః స్వలనే సౌ
హృదం స్యాత్ - అథకూటమాహ॥ ద్విర్ద్వాదశే ద్విర్ద్వాదశే నైస్స్వ్యం-

నిస్స్వస్యభావో నైస్స్వ్యం నిర్ధనంస్యాత్-షడష్టసువిపత్ - షష్ఠే అష్టమే-విపత్స్యాత్ - వైపుత్ర్యం మర్థాజరకే - పఞ్చమేనవమే - వైపుత్ర్యం అనపత్యంస్యాత్ - శేషే ఉక్తవ్యతిరిక్తే తృతీయైకాదశే - చతుర్థదశమే-ఉభయసప్తమే - ఏకర్క్షే వివిధార్థాః - ధనపుత్రాద్యాదయఃస్యుః - కథం భూతే శేషే - విభైకచరణే - విగతంభైక చరణం - నక్షత్రైకచరణం-యస్మాత్తథాతస్మిన్నక్షత్రేచరణే - కూటే అనిష్టంఫలంశ్రూయతే॥ ఏకరాశౌశుభోద్వాహ ఏకభాంశేమృతప్రద ఇతి॥ ఏకస్యర్క్షస్యచత్వారోభేదాః - ఏకరాశిర్భిన్నర్క్షం - ఏకర్క్షంభిన్నరాశిః - ఏకరాశి నక్షత్రం భిన్నచరణం - ఏకరాశినక్షత్రచరణంచేతి - చత్వారోభేదాః - తత్ర ఏకరాశినక్షత్రచరణంనిందితం - విభైకచరణఇతి - అథఖకూటేయద్భిన్నర్క్షరాశ్యైకకంరాశ్యైకత్వం - యచ్చభిన్నాంఘ్య్రేకభం - ఏతయోర్గణ ఖగౌనాడీ నృదూరంచన - అత్రకిమపినావలోక్యం శుభమిత్యర్థః - నృదూరంవక్ష్యమాణం - భిన్నాంఘ్య్రేకభమిత్యత్రభేద ద్వయమాగతం భవతి - ఏకర్క్షభిన్నరాశికం - అపరం ఏకరాశినక్షత్రం భిన్నచరణం - తస్మాత్-ఏకరాశినక్షత్రచరణంత్యక్త్వా - త్రిషుభేదేషుగణాదికంనచిన్తయేత్ - తత్ర గణాదిదోషే సత్యపిశుభంస్యాదిత్యర్థః॥ ఉక్తంచబృహస్పతినా ॥శ్లో॥ ఏకరాశౌపృథగ్ధిష్ణ్యే పృథగ్రాశౌతథైకభే । గణనాడీనృదూరంచ గ్రహవైరంనచింతయేత్॥ కాలనిర్ణయే॥ దమ్పత్యోరేకనక్షత్రే భిన్నపాదేశుభావహం । దంపత్యోరేకపాదేతు వర్షాన్తేమరణంధ్రువమితి॥ ఇతి గణకూటాసమాప్తమ్.

(*) అథ గ్రాహ్యషట్కాష్టకద్విర్ద్వాదశే. (*)

మూ॥ షట్కాష్టే సమభంచ షష్ఠసహితం చేచ్ఛోభనం స్యాత్సమం । భంద్విర్ద్వాదశకేద్వితీయసహితం శ్రేష్ఠంస్త్రియా
యుగ్ఘరిః॥ ౬౪॥

టీక॥ షట్కాష్టే సతి=ఆఱు ఎనిమిది యగుచుండఁగా, సమభంచ=సమరాశి, షష్ఠసహితంచేత్ = ఆఱుతోఁ గూడుకొనియుండెనేని, శోభనమ్=శుభము, స్యాత్=అగును. ద్విర్ద్వాదశకేసతి=రెండుపది రెండగుచుండఁగా, సమం=సమమైన, భమ్=నక్షత్రము, ద్వితీయసహితంచేత్=ద్వితీయముతోఁ గూడుకొన్నదయ్యేనేని, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైనది, స్యాత్ = అగును. హరిః=సింహము, స్త్రియా=కన్యారాశితో, యుక్=కూడనది. స్యాచ్చేత్=అయ్యేనేని, శుభమ్=శుభము, స్యాత్=అగును.



తా॥ ఇఁకను గ్రాహ్యమగు షట్కాష్టమమును ద్విర్ద్వాదశములను ఈ శ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—వధూవరులయొక్క రాసులు ఆఱు ఎనిమిది యగుచుండఁగా సమరాశి షష్ఠరాశి యయ్యెనేని శుభము కలుగును. ఎట్లనిన:—సమరాశియగు వృషభము ఆఱవదియగు తులారాశితోఁ గూడుకొనియుండెనేని శుభములు కలుగునని యెఱుఁగవలయును. పరస్పరమైత్రిలేదు కనుక సమరాశి అష్టముతోఁ గూడుకొనియుండెనేని శుభములు గలుగవని యెఱుఁగవలయును. మఱియును, ద్విర్ద్వాదశకమందు సమరాశి ద్వితీయమయ్యేనేని యప్పుడు శుభములు గలుగును. ఇట్లుకానియపుడు శుభములు కలుగవని యెఱుఁగవలయును. సింహముమాత్రము విషమరాశియే యైనప్పటికిని కన్యతోఁ గూడినపుడు శుభములే కలుగునని యెఱుఁగవలయును.

వ్యా॥ అథ గ్రాహ్యషట్కాష్టకం ద్విర్ద్వాదశంచాహ ॥ షట్కాష్టేతి॥ షట్కాష్టేసతి॥ సమభంకర్కకన్యాదిచేద్యది షష్ఠసహితంస్యాత్తదాశోభనంస్యాత్ - గ్రాహ్యంస్యాదిత్యర్థః - తద్యథా - వృషస్సమభం-తస్మాత్సకాశాత్షష్ఠేనతులాధరేణసహితం యదిభవతి తదాగ్రాహ్యం స్యాదిత్యర్థః - తతఃస్వామినోర్మైత్ర్యభావాత్ - సమభం అష్టమేనసమం నగ్రాహ్యం - ఏవమేవగ్రాహ్యాగ్రాహ్యం విలోకయేత్ - అథగ్రాహ్యం ద్విర్ద్వాదశంచాహ । ద్విర్ద్వాదశకేసమభం ద్వితీయసహితం యదాభవతి - తదాశ్రేష్ఠంశోభనంస్యాత్ - విపరీతం అసత్ - తత్రసింహోవిశేషమాహ॥ స్త్రియాయుగ్ఘరిరితివిషమోపి సింహః స్త్రియాకన్యయాయుక్ -యుక్తఃశ్రేష్ఠః॥ ఇతి గ్రాహ్యషట్కాష్టకద్విర్ద్వాదశే సమాప్తమ్.

—— (*) అథ నాడీమాహ. (*) ——

మూ॥ మూలేంద్రార్క్ష్యభపాశ్యజైకచరణాదిత్యార్యమేశా
శ్విభైర్యామ్యాగ్న్యజ్యభమిత్రభాగ్యవసుభత్వాష్ట్రా
హ్యహిర్బుధ్న్యభైః॥౭॥ అన్త్యైర్మాద్య ఇహైకనాడినవ
కేస్యాత్తాం ద్విభేచేన్మృతిర్గోదాదక్షిణతఃక్వచిన్నృప
ముఖేహ్యైక్యకనాడీహితా॥ ౭౪॥

టీక॥ మూలేంద్రార్క్ష్యభపాశ్యజైకచరణాదిత్యార్యమేశాశ్విభైః=మూల, జ్యేష్ఠ, హస్త, శతభిషము, పూర్వాభాద్ర, పునర్వసు, ఉత్తరఫల్గుని, ఆర్ద్ర, అశ్విని, అను నక్షత్రములచేతను, యామ్యాంద్విజ్యభమిత్రభగ్యవసుభత్వాష్ట్రాహిర్బుధ్న్యభైః = భరణి, మృగ

ద్భిః స్త్రీన్నృగణావరోఽస్రపగణః స్యాత్కూటమైత్ర్యోస్తదా॥
౮॥ రక్షః స్త్రీన్నృపుమాన్యదావశముఖైష్షడ్భిర్యుతంశోభనం
స్త్రీభాన్నానికటేన్నృదూరమశుభం ఖేటోడుమైత్ర్యోశ్శు
భం। ద్వ్యర్కే తామ్రసువర్ణమష్టరిపుకేగోయుగ్మమర్థా
ఙ్కకే రౌప్యంకాంస్యమథైకనాడియుజిగో స్వర్ణాదిద
త్త్వోద్వహేత్॥ ౯॥

టీక ॥ మైత్ర్యా = గృహమైత్రిచేత, ద్విర్ద్వ్యయమ్ = రెండు పది రెండుస్థానములును, అర్థనందమపి = అయిదు తొమ్మిదిస్థానములును, సత్ = శుభము, స్యాత్ = అగును, వశ్యాద్యైః = వశ్యవర్గము మొదలుకొని, షడ్భిః = ఆఱుచేత, షట్కాష్టకమ్ = ఆఱు ఎనిమిదిస్థానములు, సత్ = యోగ్యము, స్యాత్ = అగును. కూటమైత్ర్యోః = కూటమిత్రతలు గలుగుచునుండఁగా, తదా = అప్పుడు, నృగణా = మానవగణముగల, స్త్రీ = ఆడుదియును, అస్రపగణః = రాక్షసగణమైన, వరః = వరుఁడును, సత్ = శుభము, స్యాత్ = అగును. రక్షః స్త్రీ = రాక్షసగణముకలయాఁడుదియును, నృపుమాన్ = మానవగణముగల పురుషుఁడును, యదా = ఎప్పుడు, వశముఖైః = వశ్యముమొదలుగాఁగల, షడ్భిః = ఆఱింటితో, యుతమ్ = కూడినది, స్యాత్ = అగునో, తదా = అప్పుడు, శోభనమ్ = శుభము, స్యాత్ = అగును, స్త్రీభాత్ = స్త్రీనక్షత్రముకంటె, నా = పురుషుడు, నికటే = సమీపమునందు, స్యాచ్చేత్ = అయ్యేనేని, నృదూరమ్ = నరదూరము, అశుభమ్ = అమంగళమైనది, భవతి = అగుచున్నది. నృదూరమ్ = నృదూరము, ఖేటోడుమైత్ర్యోః = గ్రహములకును నక్షత్రములకును మిత్రత్వముకలుగుచునుండఁగా, శుభమ్ = శుభము, స్యాత్ = అగును. ద్వ్యర్కే = రెండు పదిరెండుస్థానములయందు, తామ్రసువర్ణమ్ = తామ్రసువర్ణములను, అష్టరిపుకే = షష్టాష్టమములయందు, గోయుగ్మమ్ = గోవులజంటను, అర్థాఙ్కకే = అయిదు తొమ్మిదిస్థానములయందు రౌప్యమ్ = వెండిని, కాంస్యమ్ = కంచును, దత్త్వా = ఇచ్చి, ఉద్వహేత్ = వివాహమును చేసికొనవలయును, అథ = పిమ్మట, ఏకనాడియుజి = ఏకనాడిని పొందినవానివిషయమై, గోస్వర్ణాది = గోస్వర్ణాదికమును, దత్త్వా = ఇచ్చి, ఉద్వహేత్ = వివాహమును చేసికొనవలయును.

తా ॥ ఇదివఱకుఁ జెప్పఁబడిన ద్విర్ద్వాదశాదులకు శుభత్వమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:... గృహమైత్రిచేత రెండు పది రెండుస్థానములును అయిదు తొమ్మిదిస్థానములును శుభమును కలుగఁజేయును. వశ్యవర్గము మొదలుగాఁగల యాఱువర్గములు సమముగానుండెనేని షష్టాష్టకము శుభమగును. స్త్రీనక్షత్రము మానవగణమును పురుషనక్షత్రము రాక్షసగణమును అయినపుడు కూటమిత్రత్వములు గలుగుచునుండఁగా శుభముకలుగును. స్త్రీనక్షత్రము రాక్షసగణమును పురుషనక్షత్రము మానవగణమును అయినయెడల వశ్యభయోని ఖేచరకూటనాడులు శుభములైయున్నపుడు మేలుగలుగునని యెఱుఁగవలయును. స్త్రీనక్షత్రమునకుపురుషనక్షత్రము సమీపమందున్నయెడల నృదూరమనఁబడును. ఈనృదూరము గ్రహనక్షత్రములకు మిత్రత్వము కలుగుచునుండఁగా శుభకరమైనదగును. దుష్టకూటములయందుఁ జేయఁదగిన దానమును చెప్పుచున్నాఁడు. వధూవరులయొక్క రాసులు రెండు పది రెండయ్యెనేని తామ్ర సువర్ణాదికము నిచ్చి వివాహమును చేసికొనవలయును. షష్టాష్టములయ్యెనేని గోయుగ్మమును దానము చేయవలయును. పంచమ నవమరాసులయ్యెనేని రౌప్య కాంస్యములనిచ్చి వివాహము చేసికొనవలయును. ఏకనాడియందు గోస్వర్ణాదికమునిచ్చి వివాహమును చేసికొనవలయును. అనఁగా, ఏకనాడీయోగమునందు గోస్వర్ణాన్నవస్త్రములను విశేషముగ దానముచేసి వివాహమును చేసికొనవలయును. "శ్లో ॥ షడష్టకే గోమిథునం ప్రదద్యాత్కాంస్యం సరౌప్యం నవపంచమే చ। నాడ్యాంతు ధేన్వన్నసువర్ణవస్త్రం ద్విర్ద్వాదశే బ్రాహ్మణతర్పణం చ॥" (=షడష్టకమునందు గోమిథునము నీయవలయును. నవమ పంచమరాసులయందు కాంస్యరౌప్యములనీయవలయును. ఏకనాడియందు ధేన్వన్నసువర్ణములను దానముచేయవలయును ద్విర్ద్వాదశములయందు బ్రాహ్మణసంతర్పణమును జేయవలయును.) అని రాజమార్తండమను గ్రంథమునందుఁ జెప్పఁబడె. "శ్లో॥ తామ్రం హేమ ధనవ్యయే గజశయే కాంస్యం శరాంకే వృషం। గాం దద్యాచ్చ షడష్టకే ద్విజభుజం స్వర్ణం చ నాడీయుతే" (=ధనవ్యయములయందు తామ్రహేమములను దానముచేయవలయును. అయిదు తొమ్మిదిరాసులయందు రజత కాంస్యములను దానముచేయవలయును. షడష్టకములయందు గోవృషభములను దానముచేయవలయును. మఱియును, ఏకనాడియందు బ్రాహ్మణసంతర్పణమును సువర్ణమును దానముచేయవలయును॥

వా ॥ అథపూర్వోక్తానాం ద్విర్ద్వాదశానాం శుభత్వమాహ। మైత్ర్యేతి॥ మైత్ర్యాగృహమైత్ర్యా ద్విర్ద్వ్యయం ద్విర్ద్వాదశం అర్థనందం-పఞ్చమ

నవమం- సత్ శుభంస్యాత్- వశ్యాదిషడ్భిః- షట్కాష్టకంశుభంస్యాత్-వశ్యభయోనిఖేచరకూటనాడీభిః- షడష్టకంశుభంస్యాదిత్యర్థః- అథయదా స్త్రీనృగణౌ- వరోస్రపగణోరక్షోగణః- స్యాత్తదాతస్మిన్నంసత్-కూటమైత్ర్యోః- సతోర్యోఃశుభంస్యాత్॥ ౮॥ అథయదారక్షస్త్రీరక్షోగణా స్త్రీ-నృపుమాన్- నృగణః పురుషః స్యాత్- తదా- వశముఖైష్షడ్భిః - వశ్యభయోనిఖేచరకూటనాడీ త్యేత్రైః షడ్భిర్యుతంతస్మిన్నశుభంస్యాత్॥ అథనృదూరంసాపవాదమాహ॥ స్త్రీభాత్- స్త్రీనక్షత్రాత్- నాయది- నృనక్షత్రంయది- నికటేసమీపేభవతితదానృదూరంస్యాత్ - కథంభూతం నృదూరం- అశుభం- అశుభఫలదం-ఇదంనృదూరంఖేటోడుమైత్ర్యోఃసతోర్యోః శుభంస్యాత్- ఉడుమైత్రీ- నక్షత్రమైత్రీ- యోని మైత్రీతియావత్॥ అథసజ్యోషేడష్టకూటాం దోదానమాహ॥ ద్వ్యర్కేతి॥ ద్వ్యర్కే- ద్విద్వాదశే- తామ్రసువర్ణాదిదత్వోద్వహేత్- అష్టరిపుకే షడష్టకే- గోయుగ్మం గోమిథునందత్వా- ఉద్వహేత్- అథాజ్యకే పఞ్చమనవమే- రౌప్యం-కాంస్యంచదత్వా ఉద్వహేత్॥ అ ఏకనాడ్యాం దానమాహ॥ ఏకనాడీయుజిగోస్వర్ణాదిదత్వో ద్వహేత్- ఏకనాడీయోగేగోస్వర్ణాన్నవస్త్రాణిబహూనిదత్వోద్వహేత్॥ రాజమార్తండే॥ శ్లో॥ షడష్టకేగోమిథునంప్రదద్యాత్కాంస్యంస రౌప్యంనవపఞ్చమేచ । నాడ్యాంతు ధేన్వన్నసువర్ణవస్త్రంద్విద్వాదశే బ్రాహ్మణతర్పణంచ॥ ఉద్వాహతత్త్వే॥ తామ్రంహేమధనవ్యయేరజతయుక్కాంస్యంశరాఙ్కే-వృషం గాందద్యాచ్చషడష్టకేద్విజభుజింస్వర్ణంచనాడీయుతావితి॥

ఇతిద్విద్వాదశాదీనాంశుభత్వాదీని సమాప్తమ్.

## ※ అథవశ్యభయోనిగుణవిచారః ※

మూ॥ భూవర్ణైక్యే వరోత్తమేథవశభక్ష్యేర్ధంద్వయం విత్రయోః
ఖంవైరాశనకే ధరారివశకే భోసద్భయో రగ్నయః ।
మిశ్రేతచ్చకలం త్వథాతిసుహృదో ర్వేదాస్త్రయో
మిత్రయో ర్వ్యేకస్స్యాద్ద్విషతో స్స్వభావగుణయో
ర్ద్వౌఖంమహద్వైరిణోః॥ ౧౦॥

టీక॥ వర్ణైక్యవరోత్తమే=ఏకవర్ణమునందును వరునకు ఉత్తమవర్ణముకలిగినపుడును, భూ=ఒకగుణము, స్యాత్=అగును. అథ=పిమ్మట, వశభక్ష్యే=వశ్యములగు జంతువులు భక్ష్యములగుటయందు, అర్ధమ్=సగముగుణము, స్యాత్=అగును. మిత్రయోః=మిత్రములగుచునుండఁగా, ద్వయమ్=రెండుగుణములు, స్యాత్=అగును. వైరాశనకే=వైరభక్ష్యమునందు, ఖమ్=శూన్యగుణము, స్యాత్=అగును. అరివశకే=శత్రుత్వముకలదైన భక్ష్యమునందు, ధరా=ఒకటిగుణము, స్యాత్=అగును. అథః=పిమ్మట, సద్భయోః=యోగ్యనక్షత్రములయందు, అగ్నయః = మూడుగుణములు, స్యుః=అగును. మిశ్రే = మిశ్రనక్షత్రములయందు, తచ్చకలమ్= ఆమూటిలోసగము, స్యాత్=అగును. అథ=పిమ్మట, అతిసుహృదోః=అధికమిత్రులయందు, వేదాః=నాలుగు గుణములు, స్యుః = అగును. మిత్రయోః=మిత్రములయందు, త్రయః=మూడుగుణములు, ద్విషతోః=శత్రువులకు, ఏకః=ఒకటిగుణము, స్యాత్=అగును. స్వభావగుణయోః=స్వభావగుణములయందు, ద్వౌ=రెండుగుణములు, మహద్వైరిణోః= అధికవైరులయందు, ఖమ్=గుణశూన్యము, స్యాత్=అగును.



తా॥ ఇంకను గుణవిచారమును మూడు శ్లోకములచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—వధూవర నక్షత్రరాసులకు వర్ణైక్యము కలిగినను వరునినక్షత్రరాసులు వధూనక్షత్రరాసులకంటె నుత్తమవర్ణమైనను ఒకటిగుణముకలదని తెలియవలయును. "శ్లో॥ ఏకోగుణస్సమేవర్ణే తథావర్ణోత్తమేవరే । హీనవర్ణే గుణాశ్శూన్యం కేచిదాహుస్సదృశేబలమ్ ॥" (=సమానవర్ణమునందును వరుఁడు అధికవర్ణము కలవాఁడగుటయందును ఒకటిగుణము కలిగియుండును. హీనవర్ణమునందు గుణములు శూన్యములగునని కొందఱు చెప్పుచున్నారు.) అని జ్యోతిర్నిబంధమను గ్రంథమునందుఁ జెప్పఁబడి యుండుటచేత హీనవర్ణమునందు గుణములులేవని యెఱుఁగవలయును. మనుష్యులకు జలజంతువులు వశభక్ష్యములు కనుక వధూవరనక్షత్రములు పరస్పరవశభక్ష్యములయ్యెనేని అర్ధగుణముకలదనియును, ఇది బ్రాహ్మణాదివిషయమనియును, తెలియవలయును. మఱియును, ద్విజాదులు ఒకానొకప్పుడు శ్రాద్ధములయందు పాఠీనజాతీయ మత్స్యములను భక్షింతురు. అయినను అందఱకును భక్ష్యములు గావు. కావున వధూవరులజాతులను విచారించి యోజనచేయవలయును. హీనజాతియందు గుణశూన్యమని యెఱుఁగవలయును. మఱియును, ఇటులనే సింహమునకు సర్వజంతువులును భక్ష్యములగును. అయినను మనుష్యులు మాత్రము సింహమునకు వైరభక్ష్యము లనఁబడును. వృశ్చికము సింహమునకు శత్రువు. ఇతర జంతువులు వశ్యభక్ష్యములనఁబడును. వధూవర నక్షత్రరాసులు పరస్పరమిత్రములయి వశగములుండఁగా రెండుగుణము

ఉంగలిగియుండును. ఈవిషయమునందుఁ గొంచెము విచారింతము. ఎట్లనినః... స్వజాతియందు మిత్రత్వము స్పష్టమైనది. మనుష్యులకు మేషవృషాశ్వమృగములతోఁగూడ మిత్రత్వముకలుగును. అయినను మనుష్యులలో హీనజాతివారికి పశువులు వశభక్ష్యములగును. కావున అట్టి నక్షత్రరాసులయందు సగముగుణము కలిగియుండవలయును. ఇతరమునందు రెండుగుణములగును. శత్రువశ్యమునం దొక్కగుణము కలిగియుండును. మనుష్యులకు వృశ్చికము అరివశ్యమని యెఱుఁగవలయును. సింహవృశ్చికములకు నిత్యవైరము. కావున వృశ్చికదష్టమైన సింహము మరణమును పొందునని లోకప్రసిద్ధికలదు. కావున ఈవిషయమునందు గుణములేదని యెఱుఁగవలయును. ముందుగా వశభక్షణయందు జనముకంటె ఇతరము చెప్పఁబడినదికనుక బుద్ధిమంతులచేత విచారించి చెప్పఁదగినదని యెఱుఁగవలయును. ఈవశ్యవిచారణమునందు నాకీవిధముగా బుద్ధిస్ఫురించుచున్నది. ఎట్లనినః... ఇక్కడఁ జెప్పఁబడిన దురుక్తము విద్వాంసులచేత శోధింపఁదగినది. మఱియును, అయితే, వశ్యభక్షణయందు వృశ్చికము సింహమునకు వశ్యముకాదని చెప్పఁబడెనుగదా? సింహమునకు మనుష్యులు వైరిభక్ష్యములని యెట్లు చెప్పితివని యెదపేని చెప్పెదను. వినుము. ఈశ్లోకమునందు సర్వసామాన్యముగఁ జెప్పఁబడినది. కావుననే జనముకంటె ఇతరము అనియెనని యెఱుఁగవలయును. సింహమునకు నరగజాదిమారణమునందు అత్యుత్సాహము కలదనియును, ఇతరములు సమానములుకావు కనుక ఉదాసీనబుద్ధికలదనియును, తెలియవలయును. "శ్లో॥ వైరవశ్యే గుణాభావో ద్వయోస్సంఖ్యేగుణద్వయం। వశవైరేగుణస్త్వేకో వశభక్ష్యేగుణార్ధకమ్ ॥" (=వైరవశ్యమునందు గుణాభావమనియును, ఇద్దఱకును సఖ్యము కలుగుచునుండఁగా రెండుగుణములు కలుగును, వశవైరమునం దొక్కగుణమనియును, వశభక్ష్యమునందర్ధగుణమనియును, తెలియవలయును.) అని స్మృతియందుఁ జెప్పఁబడెను. ఇకను తారాగుణవిచారమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః... వధూవరులనక్షత్రములు శుభములయినవగుచునుండఁగా మూఁడు గుణములు కలుగును. "శ్లో॥ భేగణ్యేంకహృతే" (=నక్షత్రములను లెక్కించి తొమ్మిదిచేత హరింపఁబడుచుండఁగా) అను న్యాయానుసారముగ వధూవరుల నక్షత్రములు శుభనక్షత్రములయినపుడు మూఁడుగుణములు గలవనియును, మిశ్రనక్షత్రములయినపుడు ఒకటిన్నరగుణమనియును, గ్రహింపవల



యును. మఱియును, శుభములును మిశ్రములును కానియెడల గుణమేమియునులేదు. "శ్లో॥ ఏకతో లభ్యతే తారా శుభాచైవా శుభాన్యతః। తదాసార్ధగుణశ్చైక స్తారాశుద్ధామిథస్త్రయః। ఉభయోర్నశుభా తారా తదాశూన్యంసమాదిశేత్ ॥" (=వధూవరులనక్షత్రములలో ఒకరినక్షత్రము శుభనక్షత్రమును మఱియొకరిది యశుభనక్షత్రమును అయినయెడల ఒకటిన్నరగుణముకలదనియును, ఇరువురినక్షత్రములును శుభనక్షత్రములయినయెడల మూఁడుగుణములనియును, ఇరువురి నక్షత్రములును శుభకరములు గానియెడల గుణశూన్యమనియును గ్రహింపవలయును.) అని స్మృతియందుఁ జెప్పఁబడియె. ఇకను యోనిగుణవిచారమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః... అధిక స్నేహితులగువారికి నాలుగుగుణములుకలవు మిత్రులకు మూఁడుగుణములు. వధూవరనక్షత్రములు శత్రువులగుచుండఁగా ఒక్కగుణమగును. స్వభావగుణములు కలవగుచునుండఁగా ఒక్కగుణము కలిగియుండును. అధికవైరముకలవగుచునుండఁగా గుణశూన్యమని తెలియవలయును. మఱియును, ఈవిధముగా యోనిగుణములను తెలిసికొనవలయును. ఇరువదెనిమిదినక్షత్రములకును అశ్వాదులన్నియును పదునాలుగు యోనులనఁబడును. మహిషాశ్వములకును వానరమేషములకును మహావైరముకలదు. ఏకయోనియగువానియందు కొన్నిటికి అతిమిత్రత్వముకలదు. ఏకయోనియగువానియందుఁగూడ గజములకును శ్వానములకును మార్జాలములకును వ్యాఘ్రములకును సింహములకును పరస్పరశత్రుత్వమని యెఱుఁగవలయును. మఱియును, ఈగజాదులు పరస్పరకలహము కలవగుటవలన ఇప్పుడు చెప్పఁబడినజంతువైదును అధికమైన వైరమునందున్నవని యెఱుఁగవలయును. మహిషాశ్వములు వానరమేషములు అనునట్టి యుగ్మసప్తకమును స్వభావగుణముకలదని యెఱుఁగవలయును. వ్యాఘ్రము సర్పమూషిక నకులములయందు ఉదాసీనమైనదని యెఱుఁగవలయును. సింహముకూడ ఇటులనే యుదాసీనమైనదగును. అప్పుడు ఈవ్యాఘ్రసింహములు ఇతరములకు వైరముకలవియని యెఱుఁగవలయును. సర్పమార్జాలములకు వైరము. శ్వానమేషములకు మిత్రత్వము. గోమహిషములకు మిత్రత్వము. మూషికసర్పములకు వైరము. ఈవిధముగా శత్రుమిత్రాదికమును ఉదాసీనత్వమును విచారించి చెప్పఁబడినగుణములను తెలియవలయును. ఔదాసీన్యమునందు స్వభావగుణములను గ్రహింపవల

యును ఉదాసీనములకు విచారింపఁగా గుణములు చెప్పఁబడలేదు. అయినప్పటికిని స్వభావగుణముకల మహిషాశ్వములయందును మేషవానరములయందును ఔదాసీన్యము కనఁబడుచున్నది. కావున ఈ రెండును ఉదాసీనునియందు గుణగ్రహణము చేయఁదగినది. "శ్లో॥ మహావైరేచ వైరేచ స్వభావేచయథాక్రమం । మైత్రేచైవాతిమైత్రేచ ఖేందుద్విత్రిచతుర్గుణాః" ( = మహావైరమునందును వైరమునందును స్వభావమునందును మిత్రత్వమునందును మహామిత్రత్వమునందును క్రమముగ గుణశూన్యము ఒకటిగుణము రెండుగుణములు మూఁడుగుణములు నాలుగుగుణములుకలవని తెలియఁగవలయును. ) -అని స్మృతియందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ అథగుణవిచారం త్రిభిర్వృత్తైరాహ॥ భూరితి॥ వర్ణైక్యవరోత్తమేభూరేకోగుణోజ్ఞేయః । వర్ణయోరైక్యంయస్మిన్ ఘటితేతద్వర్ణైక్యం - వరఉత్తమో యస్మిన్ తద్వరోత్తమంచ ఉభయత్రాపి ఏకైకోగుణోజ్ఞేయః - అర్థాద్ధీనవర్గేగుణాభావః - ఉక్తంచజ్యోతిర్నిబంధే॥ శ్లో॥ ఏకోగుణస్సమేవర్గే తథావర్గోత్తమేవరే । హీనవర్గే గుణాశ్శూన్యం కేప్యాహుస్సద్మశేబలమిత్యాది॥ అథవశ్యగుణవిచారమాహ॥ వశభక్ష్యే అర్ధఏకస్స్యాద్గుణః । వశభక్ష్యం యథామనుష్యాణాం జలజావశాభక్ష్యాశ్చతత్రఅర్ధగుణోగ్రాహ్యః - ఏతత్తు ద్విజాదావ్యాజ్ఞేయం - ద్విజాదయస్తుకదాచిద్బ్రాహ్మణాః పాఠీనజాతీయ మత్స్యభక్ష్యాభవంతి - నసర్వేషాం- తస్మాద్వర్ణావరజాతివిచార్యయోజనీయం - హీనజాతౌశూన్యం - యతః ఖంవైరాశనకే ఇత్యస్మిన్నేవశ్లోకేఉక్తత్వాత్ - ఏవమేవసింహస్యసర్వేవశ్యాః - భక్ష్యాశ్చభవంతి - తత్రమనుష్యాః వైరభక్ష్యం॥ వృశ్చికస్తువైరీ-అన్యేవశభక్ష్యం - అథమిత్రయోఃపరస్పరంసుహృదోః ద్వయంగుణద్వయంజ్ఞేయం తత్రవిచారః - స్వజాతౌ మిత్రత్వంప్రకటం - మనుష్యాణాం మేషవృషాశ్వమృగైస్సహమిత్రత్వం - తత్రహీనజాతీయానాం పశవోవశభక్ష్యం - తత్రఅర్ధగుణః - అన్యత్రద్వయం - అథారివశకేఖరాంఏకోగుణః - అరివశ్యకం యథామనుష్యాణాం వృశ్చికః - సింహవృశ్చికయోర్నిత్యం వైరం - వృశ్చికదష్టసింహోమరణమాప్నోతీతి లోకప్రసిద్ధం - తస్మాదత్ర గుణాభావః ప్రథమంవశభక్ష్యేఅన్యజ్జనాదిత్యుక్తం - తస్మాత్సుబుద్ధిభిర్విచార్యవక్తవ్యం - మయాత్రదన్యవిచారణేబుద్ధిసంస్ఫురితా - అత్రయద్గురుక్తం తద్బుద్ధిమద్భిశ్శోధనీయం. నను వశ్యభక్ష్యే ఖరాప్నోసపశ్యోహగౌరిత్యేవోక్తం- త్వయాకథముక్తం॥సింహస్యమనుష్యావైరిభక్ష్యమితి-సత్యం-



తచ్ఛ్లోకోక్తలక్షణంసర్వంసామాన్యమస్తి- అతఏవోక్తంగ్రంథకర్త్రా-అన్యజ్జనాదితి- సింహస్తునరగజాదిప్రతాపమారణేఽత్యుత్సుకః- అన్యేషాంమారణే ఉదాసీనః- అసదృశత్వాత్- ఉక్తంచ॥ శ్లో॥ వైరవశ్యేగుణాభావో ద్వయోస్సఖ్యేగుణద్వయం । వశవైరేగుణశ్చైకో వశభక్ష్యేగుణార్ధకమితి॥ అథతారాగుణవిచారమాహ॥ సద్భయోః ఉభయతః సత్తారయోః- సతోః- అగ్నయఃత్రయోగుణాః- ఏతదుక్తంభవతి - భేగణ్యేజన్మ-హృతే ఇత్యనేనప్రకారేణఉభయతోఽపి యదిసత్తారేభవతఃతదాత్రయోగుణాఇత్యర్థః- మిశ్రేతచ్ఛకలమితి॥ మిశ్రేఏకతఃశుభాతారాఏకతః- అశుభా- ఏవంవిధేమిశ్రేసతితచ్ఛకలం- తేషాం- త్రయాణాంశకలం - సార్ధైకోగుణఇత్యర్థః- అన్యథాగుణాభావఇత్యర్థాత్సిద్ధం- ఉక్తంచ॥ ఏకతోలభ్యతేతారా శుభాచైవాశుభాన్యతః- తదాసార్ధోగుణశ్చైక స్తారాశుద్ధామిథస్త్రయః॥ఉభయోర్నశుభాతారాతదాశూన్యంసమాదిశేత్॥ అథయోనిగుణవిచారమాహ॥ అతిసుహృతోవేదాశ్చత్వారోగుణాః - మిత్రయోస్త్రయః- ద్విషతోర్వైరిణోరేకః- స్వభావగుణయోర్ద్వౌ-మహావైరిణోః- ఖంశూన్యంగుణః- స్యాత్- ఏవంపంచప్రకారేణయోనిగుణాః-అస్యవివేకః - అష్టావింశతినక్షత్రాణాం అశ్వాదయస్సర్వాశ్చతుర్దశయోనయః- తత్రసింహేభం మహిషాశ్వమిత్యాదియదుక్తంతన్మహావైరం- తత్రాపిమహావైరే మహిషాశ్వవానరమేషకం - ఏతద్ద్వయముదాసీనం- స్వభావగుణంపరస్పరం ఘాతాభావాత్- అథైకయోనిషుఅతిమిత్రత్వంజ్ఞేయం- ఏకయోనిష్వపి గజయోఃశ్వానయోః- మార్జారయోః - వ్యాఘ్రయోః- సింహయోః- ఏకయోనిత్వేపినమిత్రత్వం- పరస్పరకలహకారణాత్ ఏతద్వ్యాఘ్రపఞ్చకముత్తమమహావైరస్థం- మహిషాశ్వంవానరమేషం ఏతద్ద్వయమిత్యేతద్వ్యాఘ్రసప్తకంస్వభావగుణం - వ్యాఘ్రస్తుసర్పోందురనకులేషూదాసీనః- సింహస్యైవమేవోదాసీనః - తదాఏతౌవ్యాఘ్రసింహౌ అన్యేషాంవైరిణౌ- సర్పమార్జారయోర్వైరం - శ్వమేషయోర్మైత్రం- గోమహిష్యోర్మైత్రంహి- ఉందురసర్పయోర్వైరం- ఏవంశత్రుమిత్రాదికం ఉదాసీనత్వంచవిచార్యఉక్తవద్గుణాజ్ఞాతవ్యాః- ఔదాసీన్యేస్వభావగుణవద్గుణగ్రహణంఉదాసీనానాం గుణాయద్యపినోక్తాస్తథాపిస్వభావగుణేమహిషాశ్వేమేషవానరేచ ఔదాసీన్యందృశ్యతే - తస్మాదేతద్ద్వయముదాసీనేగుణగ్రహణంకర్తవ్యమిత్యర్థాత్జ్ఞాయతే॥ ఉక్తంచ॥ శ్లో॥ మహావైరేచవైరేచ స్వభావేచయథాక్రమం । మైత్రేచైవాతిమైత్రేచ

ఖేందుద్విత్రిచతుర్గుణా ఇతి॥ ఇతివశ్యభయోనీనాంగుణవిచారః సమాప్తమ్.

—— (*) అథ ఖేచరగణయోర్గుణవిచారః. (*) ——

మూ॥ ఏకేశోభయమిత్రయోశ్శరమితా అర్ధం సమారాతికే చత్వా
రస్సమమిత్రకే రిపుహితే భూమిర్ద్వ్యుదాసే త్రయః। నా దే
వో మనుజో వధూరిహ రసాస్తద్వైపరీత్యే శరాః షట్సామ్యే
ఽస్రపపూరుషస్సురవధూరత్రైకకోఽన్యత్ర ఖం॥ ౧౧॥

టీక ॥ ఏకేశోభయమిత్రయోః = ఏకాధిపతికలవియును మిత్రములును అగు నక్షత్రములయందు, శరమితాః = అయిదుగుణములు, స్యుః = అగును, సమారాతికే = సమశత్రుత్వమునందు, అర్ధమ్ = సగముగుణము సమమిత్రకే = సమమిత్రులయందు, చత్వారః = నాలుగుగుణములు, రిపుహితే = శత్రుమిత్రములయందు, భూమిః = ఒక్కగుణము, ద్వ్యుదాసే = రెండును ఉదాసీనములగుటయందు, త్రయః = మూడుగుణములు, ఇహ = ఈగణవిచారమునందు, నా = పురుషుఁడు, దేవః = దేవగణము, వధూః = స్త్రీ, మనుజః = మానవగణము, స్యాచ్చేత్ = అయ్యేనేని, రసాః = ఆఱుగుణములు, స్యుః = అగును, తద్వైపరీత్యే = స్త్రీ దేవగణము పురుషుఁడు మానవగణము, స్యాచ్చేత్ = అయ్యేనేని, శరాః = అయిదుగుణములు, స్యుః = అగును, సామ్యే = వధూవరగణములకు సమత్వము కలుగుచుండఁగా, షట్ = ఆఱుగుణములు, స్యుః = అగును. అస్రపపూరుషః = రాక్షసగణముగలపురుషుఁడు, సురవధూః = దేవగణముగల స్త్రీయును స్యాచ్చేత్ = అయ్యేనేని, అత్ర = ఈవిషయమునందు, ఏకః = ఒక్కగుణము, స్యాత్ = అగును, అన్యత్ర = స్త్రీగణము రాక్షసగణము పురుషగణము మానవగణమును అయినయెడల, ఖమ్ = గుణశూన్యము, స్యాత్ = అగును.

తా ॥ ఇఁకను ఖేచరగణమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—వధూవరనక్షత్రరాసులు ఏకదైవము కలవియును మిత్రత్వము కలవియును అయినయెడల అయిదుగుణములు గలిగియుండును. వధూవరనక్షత్రరాశ్యధిపతిస్వరూపములలో నొకటికొకటి సమమును శత్రువును అయినయెడల సగము గలిగియును, ఆరెండును సమమిత్రములయినయెడల నాలుగు గుణములు గలిగియుండును. రిపుహితులైనయెడల ఒక్కగుణము కలిగియుండును. రెండును పరస్పరమును ఉదాసీనములయిన వయ్యేనేని మూడుగుణములు కలిగియుండును. "శ్లో॥ యత్రైకాధిపతిత్వేచ మిత్రత్వేగుణపంచకం। చత్వారస్సమమిత్రేచ ద్వయోస్సామ్యేత్రయోగుణాః। మి



త్రవైరేగుణశ్చైక స్సమవైరేగుణార్ధకం। పరస్పరం ఖేటవైరే గుణశూన్యం సమాదిశేత్" (=ఏకాధిపత్యమును మిత్రత్వమును గలనక్షత్రాదులయందు గుణపంచకము కలదు. సమమిత్రమునందు నాలుగుగుణములు, సామ్యమునందు మూఁడుగుణములు కలవు. మిత్రవైరమునం దొక్కగుణము కలదు. సమవైరమునందు అర్ధగుణము కలదు. పరస్పర ఖేటవైరమునందు గుణశూన్యము.) అని స్మృతియందుఁ జెప్పఁబడియె. ఇఁకను గణవిచారమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఈగణవిచారమునందు పురుషుఁడు దేవగణముకలవాఁడును స్త్రీ మనుష్యగణముకలదియును అయినయెడల ఆఱుగుణములు కలిగియుండును. స్త్రీనక్షత్రాదులు దేవగణములోనివియును, పురుషనక్షత్రాదులు మానవగణములోనివియును, అయినయెడల అయిదుగుణములు గలిగియుండును. గణసామ్యము కలిగియున్నయెడల ఆరుగుణములు కలిగియుండును. పురుషునిది రాక్షసగణమును ఆఁడుదానిది మానవగణమును అయినయెడల ఒక్కగుణము కలదు. ఆఁడుదానిది రాక్షసగణమును పురుషునిది మానవగణమును అయినయెడల గుణములు లేవని యెఱుఁగవలయును.

వ్యా ॥ అథ ఖేచరగుణమాహ॥ ఏకః ఈశో యస్మిన్ తదేకేశం ఉభయత్ర మిత్రే యస్మిన్ తదుభయమిత్రం। ఏకేశంచ ఉభయమిత్రంచ ఏకేశోభయమిత్రే- తయోశ్శరమితాః పంచగుణా గ్రాహ్యాః - ఉభయత్రాపి పంచ పంచ గ్రాహ్యా ఇత్యర్థః అర్ధం సమారాతికే- సమః ఉదాసీనః అరాతిశ్శత్రుః ఏవం యస్మిన్ స్మేలే తత్సమారాతికం తత్ర- అర్ధం ఏకస్యార్ధం గుణః- ఏవం సమమిత్రకే చత్వారో గుణాస్స్యుః- రిపుహితే అరిసుహృదిభూమిరేకః- ద్వ్యుదాసే త్రయః- ద్వౌ ఉదాసీనౌ యస్మిన్ తత్ర త్రయో గుణాః - అనుక్తే గుణాభావః॥ ఉక్తంచ॥ శ్లో॥ యత్రైకాధిపతిత్వేచ మిత్రత్వే గుణపఞ్చకం। చత్వారస్సమమిత్రేచ ద్వయోస్సామ్యే త్రయో గుణాః ॥ మిత్రవైరే గుణశ్చైకస్సమవైరే గుణార్ధకం। పరస్పరం ఖేటవైరే గుణశూన్యం సమాదిశేదితి॥ అథ గణవిచారమాహ॥ నా దేవ ఇతి॥ యత్ర నా నరో దేవగణః- వధూర్మనుజా మనుష్యగణా భవతి- ఇహ రసాః షడ్గుణా గ్రాహ్యాః- తద్వైపరీత్యే తయోర్వైపరీత్యం తద్వైపరీత్యం- తస్మిన్ శరమితాః- పఞ్చ గుణా గ్రాహ్యాః- ఏతదుక్తం భవతి యత్ర నరో దేవగణః- వధూర్మనుష్యగణా - అత్ర పంచగుణా గ్రాహ్యా ఇత్యర్థః- షట్సామ్యే గుణసామ్యే - గణాష్షడ్గుణా గ్రాహ్యాః యత్ర అస్రపపూరుషః- దైత్యగణః పురుషః- సురవధూః - దేవగణా స్త్రీ భవ

తిఅత్రైకః ఏకగుణో గ్రాహ్యః- అన్యత్రఉక్తాదన్యత్రఖం శూన్యంస్యాత్॥
ఇతిఖేచరగణయోర్గుణవిచారఃసమాప్తమ్.

(*) అథకూటనాడ్యోర్విచారః. (*)

మూ॥ దుష్కూటే యదియోనిమైత్రమబలా దూర తదామ్భో
ధయో చేత్సంత్వనయో ర్యద్యేకమిహాభూ ర్భాంఘ్ర్యై
క్యకేఖంగుణాః । సత్కూటేవరదూరతాభరిపుతా షడ్భి
న్నరాశ్యేకభే పంచాస్యత్ర సకూటకేచగిరయో థోనా
డిభేదేగజాః॥ ౧౨॥

టీక ॥ దుష్కూటేసతి = దుష్కూటము కలుగుచునుండఁగా, యోనిమైత్రమ్=యోనిమిత్రతయును, అబలాదూరమ్ = స్త్రీదూరమును, స్యాద్యది=అయ్యెనేని, తదా=అప్పుడు, అంభోధయః = నాలుగుగుణములు, స్యుః=అగును. నోచేత్ = (దుష్కూటముకలిగియుండఁగా యోనిమిత్రతయును స్త్రీదూరమును ) లేకపోయెనేని, ఖమ్ = గుణశూన్యము, స్యాత్=అగును. అనయోః = ఈయోనిమిత్రతా స్త్రీదూరములలోపల, ఏకమ్=ఒకటే, స్యాద్యది=అయ్యెనేని, తదా=అప్పుడు, ఇహ=ఈవిషయమునందు, ఏకమ్=ఒక్కగుణము, స్యాత్=అగును. భాంఘ్ర్యైక్యకే=నక్షత్రపాదమునకు ఏకత్వము కలుగుచునుండఁగా, ఖమ్ = గుణశూన్యము, స్యాత్=అగును, అథ=పిమ్మట, సత్కూటేసతి = మంచికూటము కలుగుచునుండఁగా, వరదూరతా=పురుషదూరత్వము, భరిపుతా = నక్షత్రశత్రుత్వము, స్యాత్=అయ్యెనేని, తదా=అప్పుడు, షట్ = ఆఱుగుణములు, స్యుః=అగును. భిన్నరాశ్యైకభే-భిన్నరాశియును ఒక్కనక్షత్రమును అగుచునుండఁగా, సకూటకేచ = సమానకూటము కల్గుచునుండఁగా, గిరయః=ఏడుగుణములు, స్యుః=అగును. నాడిభేదేసతి = నాడిభేదముకలుగుచునుండఁగా, గజాః=ఎనిమిదిగుణములు, స్యుః=అగును.

తా॥ కూటనాడులయందలి గుణవిచారమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః—ఇక్కడ చెప్పఁబడని విషయములయందు గుణములులేవని తెలియఁగవలయును. దుష్కూటము కలుగుచునుండఁగా అనఁగా వధూవరులరాసులు ద్విర్ద్వాదశాదులగుచునుండఁగా యోనిమిత్రతయును స్త్రీదూరమునుగలిగెనేని అప్పుడు నాలుగుగుణములుకలవని తెలియఁగవలయును. దుష్కూటముకలుగుచునుండఁగా యోనిమిత్రతయును స్త్రీదూరమును లేకపోయెనేని గుణములేమియును లేవని తెలియవలయును. షష్ఠి



యును, ఈయోనిమిత్రతా స్త్రీదూరకూటములలోపల ఏదోయొకటి మాత్రము కలిగియుండెనేని యొక్కగుణముకలదని తెలియఁగవలయును. నక్షత్రపాదముల కైక్యము కలుగుచునుండఁగా గుణములేవియును లేవని తెలియఁగవలయును. సత్కూటము కలుగుచునుండఁగా స్త్రీదూరతయును నక్షత్రశత్రుత్వమును కలిగియున్నయెడల రెండింటికిని యోనివైరమయ్యెనేని అప్పుడు ఆఱుగుణములుకలుగునని తెలియఁగవలయును. భిన్నరాశియును ఏకనక్షత్రమును కలిగియుండెనేని యైదుగుణములు గ్రహింపఁదగినవి. సత్కూటము కలుగుచునుండఁగా ఏడుగుణములు గలిగియుండును. నాడిభేదముకలుగుచునుండఁగా ఎనిమిదిగుణములు కలుగును. ఇక్కడఁజెప్పఁబడని విషయమునందు గుణములులేవని తెలియఁగవలయును.

వ్యా॥ అథకూటేగుణవిచారమాహ॥ దుష్కూటేష్వితి ॥ అనుక్తేగుణాభావః - దుష్కూటేద్విర్ద్వాదశాదౌ సతి యదియోనిమైత్రం అబలాదూరం స్త్రీదూరంస్యాత్ - తదాఅమ్భోధయశ్చత్వారో గుణాగ్రాహ్యాః - నోచేత్-యోనిమైత్రమబలాదూరం నస్యాత్తదాఖం శూన్యంగుణఃస్యాత్ అనయోర్యోనిమైత్ర స్త్రీదూరయోర్మధ్యే యత్రైకంస్యాత్- ఇహాభూరేకోగుణః - భాంఘ్ర్యైక్యకేనక్షత్రైక్యేచరణే - ఖంశూన్యంగుణాఃగ్రాహ్యాః - అథసత్కూటేసతి- యదివరదూరతా - భరిపుతా- ఉభయోశ్శత్రుత్వంయోనివైరంచస్యాత్ - తదారసాష్షడ్గుణాః గ్రాహ్యాః- భిన్నరాశ్యేకభేఇచ్ఛ భిన్నరాశిశ్చఏకభతాచ అత్రపంచగుణాగ్రాహ్యాః- ఉర్వరితేసత్కూటే గిరయః సప్తగుణాగ్రాహ్యాః॥ అథ నాడీవిచారమాహ ॥ అథోనాడీతి॥ నాడిభేదేగజా అష్టౌగుణాగ్రాహ్యాః - అనుక్తేగుణాభావః॥ఇతికూటనాడ్యోర్విచారఃఇతి ముహూర్తమార్తండే ఘటితం.

(*) అథ స్త్రీపుంసోర్వివాహకాలః. (*)

మూ॥ స్త్రీణామష్టమవర్షతస్త్రిషు నృణాంత్ర్యబ్దవ్రతానామయు
గ్మాబ్దేష్వత్రచరాధమాఘ యుగయోర్మార్గే వివాహశ్శు
భః । జ్యేష్ఠం పూర్వజమాస్యజేద్ధిమరుచిజ్జైజ్యేస్య
ఖేటాన్వితం యన్మాసాదిజనుష్షువం ప్రథమకేగర్భేజ్యజే
న్నానుజే॥ ౧౩॥

టీక॥ స్త్రీణామ్=స్త్రీలకు, అష్టమవర్షతః=ఎనిమిదవసంవత్సరము మొదలుకొని, త్రిషు=మూడుసంవత్సరములయందు, వివాహః = వివాహము, శుభః శుభకరమైనది, స్యాత్=అగును. త్ర్యబ్దవ్రతానామ్ = వేదవ్రత

మును పూర్తిచేసిన, నృణామ్=మనుష్యులకు, అయుక్షు = చేసివయిన, అబ్దేషు=సంవత్సరములయందు, వివాహః = వివాహము, శుభః=మేలయినది. స్యాత్=అగును. అత్రచ = ఈవిషయమునందు, రాధమాఘయుగయోః = వైశాఖ జ్యేష్ఠ మాఘ ఫాల్గున మాసములయందును, మార్గే= మార్గశీర్ష మాసమునందు, వివాహః=వివాహము, శుభః = శుభమైనది, స్యాత్=అగును పూర్వజయోః=మొదటపుట్టినవారికి, జ్యేష్ఠమ్=జ్యేష్ఠమాసమును, త్యజేత్=విడువవలయును. జ్ఞేజ్యోన్యఖేటాన్వితమ్=బుధగురువుల కంటె ఇతరులతోఁగూడిన, హిమరుచిమ్=చంద్రుని, త్యజేత్=విడువవలయును. జనుర్భవమ్=జన్మకాలమునందలి, మాసాది = మాసతిథివారాదికము, యత్=ఏది, అస్తికలదో, తత్=దానిని, ప్రథమకే = మొదటదైన, గర్భే=సంతతియందు, త్యజేత్=విడువవలయును. అనుజే=రెండవమారు పుట్టినసంతతియందు, నత్యజేత్=విడువఁగూడదు.

తా॥ ఇకను స్త్రీలకు వివాహకాలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—స్త్రీలకు ఎనిమిదవ సంవత్సరము మొదలుకొని మూడుసంవత్సరములయందనఁగా ఎనిమిది తొమ్మిది పది సంవత్సరములయందు స్త్రీలకు వివాహము శుభకరమైనది. "శ్లో॥ అష్టవర్షా భవేద్గౌరీ నవవర్షా చరోహిణీ । దశవర్షా భవేత్కన్యా ద్వాదశే వృషలీమతా ॥ గౌరీ దానాన్నాకలోకే వైకుంఠే రోహిణీందదత్ । కన్యాదానాద్బ్రహ్మలోకే రౌరవంతు రజస్వలామ్" (=ఎనిమిది సంవత్సరములుగల కన్నియ గౌరియనియును, తొమ్మిది సంవత్సరములుగల కన్నియ రోహిణియనియును, పది సంవత్సరములుగల కన్నియ కన్యయనియును, పదిరెండు సంవత్సరములుగల కన్నియ వృషలి (రజస్వల) అనియును, చెప్పఁబడును. గౌరీదానమును చేసినవాఁడు స్వర్గలోకమునందును, రోహిణీదానమును చేసినవాఁడు వైకుంఠమునందును, కన్యాదానమును చేసినవాఁడు బ్రహ్మలోకమునందును, రజస్వలాదానమును చేసినవాఁడు రౌరవమనియెడు నరకమునందును నివసించును.) అని సంవర్తుఁడు చెప్పె. "శ్లో॥ షడబ్దమధ్యేనోద్వాహ్యా కన్యావర్షద్వయంయతః । సోమోభుంక్తేతతస్తద్వద్గంధర్వశ్చతథానలః" (=ఆరుసంవత్సరములలోపల స్త్రీలకు వివాహమును చేయఁగూడదు. ఏలయనిన:—స్త్రీలను జననాది రెండుసంవత్సరముల కాలము సోముఁడును పిమ్మట రెండు సంవత్సరముల కాలము గంధర్వుఁడును, పిమ్మట రెండు సంవత్సరముల కాలము అనలుఁడును భుజించును. కావున



స్త్రీలకు ఆరుసంవత్సరములలోపల వివాహమును చేయఁగూడదు.) అని కారికయందుఁ జెప్పఁబడియె. "శ్రు॥ సోమఃప్రథమోవివిద ఇత్యుపక్రమ్య-సోమోదదద్గంధర్వాయ గంధర్వోదదదగ్నయే" (=చంద్రుఁడు ముందుగా అనుభవించి గంధర్వునికిచ్చును. గంధర్వుఁడు అగ్నికొఱకు ఇచ్చెను.) అనునట్టి శ్రుతిపై కారికకు సహాయముగనున్నదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ చతుర్థాద్వత్సరాదూర్ధ్వం యావన్నదశమాత్యయః । తావద్వివాహఃకన్యాయాః పిత్రాకార్యఃప్రయత్నతః" (=నాలుగుసంవత్సరములకు మీదట పదిసంవత్సరములలోపల కన్నియకు తండ్రియగువాఁడు ప్రయత్నించి వివాహమును చేయవలయును.) అని బ్రహ్మపురాణాంతర్గత గౌతమీ మాహాత్మ్యమునందలి భానుతీర్థవర్ణనమున పిప్పిభానుసంవాదమునందుఁ జెప్పఁబడెనుగదా? కావున ఇప్పుడు చెప్పఁబడిన వచనములకు పరస్పరవిరోధము రాదా? అనియనఁగూడదు. ఏలయనిన:—బ్రహ్మపురాణవాక్యము శూద్రాదివిషయమును ఇతరవచనములు శ్రౌతస్మార్తబ్రాహ్మణాది విషయమనియును తెలియవలయును. ఏడవసంవత్సరము విషమమైనదగుటవలన నారదాదులు స్త్రీలకువివాహమును చేయుట యుచితము కాదనిరి. కావున సర్వవర్ణములవారికిని విరోధములేకుండునట్లు ఎనిమిదవసంవత్సరము మొదలుకొనియని చెప్పఁబడెనని యెఱుఁగవలయును. మఱియును, ఒకానొకప్పుడు ఇప్పుడు చెప్పఁబడినకాలముకంటె పిమ్మట వరుఁడు దొరకకపోయినయెడల సమవర్షములయందనఁగా పదిరెండు పదునాలుగు సంవత్సరములయందు వివాహమును చేయవలసినదని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడెను. మఱియును, కాలనిర్ణయదీపికావివరణమునందు స్వయంవరముకొఱకు రెండు కాలములు చెప్పఁబడినవి. జీవించియున్న తండ్రికలయెడ దానికి ఋతువైనపిమ్మట మూడుసంవత్సరముల కనంతరము తండ్రి దానముచేయనియెడల స్వయంవరకాలమనఁబడును. ఇఁకను పురుషులకు వివాహకాలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:...వేదవ్రతమును పూర్తిచేసిన మానవులకు బేసి సంవత్సరములయందు వివాహము శుభకరమైనది. ఇప్పుడు చెప్పఁబడిన సంవత్సరములయందే వివాహమును చేయవలయును. ఈవిహితములగు సంవత్సరములయందు మాఘఫాల్గునములు వైశాఖజ్యేష్ఠములు మార్గశీర్షము అను మాసములయందు వివాహమును చేయుటచేత శుభములు కలుగును. ఈయైదుమాసములును వివాహమునకుమిగులశుభ

కరములయినవి. తొలుతటిపుట్టువైన అనఁగా జ్యేష్ఠసంతతియైనవధూవరు లకు జ్యేష్ఠమాసమునందువివాహముశుభకరమైనదికాదు. వధూవరులలో పల ఒకరుమాత్రము జ్యేష్ఠసంతతియయ్యేనేని జ్యేష్ఠమాసమునందువివా హమును చేయుటవలన దోషములేదని యెఱుఁగవలయును. వివాహకా లమునందు గురుబుధులకంటె ఇతరగ్రహములతోఁగూడిన చంద్రునివిడిచి పెట్టవలయును. ఇట్లుచేయనియెడల అనిష్టఫలము కలుగును. మఱియును జన్మదిన మాసవారాదులు పనికిరావని చెప్పినమాట ప్రథమసంతతివారి విషయమేకాని పిమ్మటిసంతతి విషయముకాదని యెఱుఁగవలయును.

వ్యా ॥ అథస్త్రీయోవివాహకాలమాహ ॥ స్త్రీణామితి ॥ స్త్రీణా మష్టమవర్షతః సకాశాత్ త్రిషువర్షేషు- వివాహః శుభస్స్యాత్ అష్టమనవ దశమేషుశుభస్స్యాదిత్యర్థః॥ తథాచసంవర్తః॥ శ్లో॥ అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాచరోహిణీ । దశవర్షాభవేత్కన్యా ద్వాదశేవృషలీమతా॥గౌ రీదానాన్నాకలోకే వైకుంఠేరోహిణీంవదత్ । కన్యాదానాద్బ్రహ్మలో కే రౌరవంతురజస్వలామితి॥ రజస్వలేతివృషలీ పర్యాయః॥ తథాచకారి కాయాముక్తం॥ షడబ్దమధ్యేనోద్వాహ్యా కన్యావర్షద్వయంయతః । సో మోభుఙ్క్తేతతస్తద్వ ద్గన్ధర్వశ్చ తథానలఇతి ॥ అస్యవాక్యస్య సహాయినీ శ్రుతిరపి॥ శ్రు॥ సోమః ప్రథమోవివిదఇత్యుపక్రమ్య- సోమోదదద్గన్ధర్వా యగన్ధర్వోఽదదదగ్నయే ఇత్యంతా॥ నన్వస్యవిరోధోబ్రహ్మపురాణే గౌత మీమాహాత్మ్యే భానుతీర్థవర్ణనేవిష్టిభానుసంవాదే దృశ్యతే॥ విష్టిభానురు వాచ॥ చతుర్థాద్వత్సరాదూర్ధ్వంయావన్నదశమాత్యయః తావద్వి వాహః కన్యాయాః పిత్రాకార్యః ప్రయత్నత ఇతి- సత్యం- అత్రపురాణ వాక్యం శూద్రాదివిషయం- శ్రౌతస్మార్తబ్రాహ్మణాది విషయ మిత్యవిరో ధః- సప్తమవర్షం విషమత్వాన్నారదాదిభిః స్త్రీవివాహేనాంగీకృతంత స్మాత్సర్వవర్ణానాము విరుద్ధమేవోక్తం స్త్రీణామష్టమవర్షతస్త్రిష్వితి-కథి తకాలామార్ధ్వంకదాచిద్వరాలాభనిమిత్తాదౌ సమవర్షేషు ద్వాదశచతు ర్దశషోడశేషు వివాహోగ్రంథాంతరేఉక్తః ॥ కాలనిర్ణయదీపికావివరణే స్వయంవరార్థం కాలద్వయముక్తం - జీవత్పితృకాయాః ఋతౌవర్షత్ర యానంతరం స్వయంవరకాలం అదాస్యకాయాః అపి॥ అథపుంసాంవివా హకాలమాహ॥ స్నాతానాంతీర్ణ వ్రతానాం కృతవిసర్గాణాం - అయుక్షుబ్దే షు-అయుగ్మేషు వర్షేషు వివాహః శుభస్స్యాత్ - విశేషత ఉక్తవర్షేషు కర్తవ్యఇత్యాహ ॥ అత్రరాధమాఘయుగయోః - అత్రవిషమవర్షేషు-రా



ధోవైశాఖః - మాఘఃప్రసిద్ధః - అనయోర్యుగేయుగళే - రాధయుగం- మాఘయుగం-వైశాఖజ్యేష్ఠౌ - మాఘఫాల్గునావిత్యర్థః మార్గేమార్గశీర్షే వివాహఃశుభస్స్యాత్ ఏతేపఞ్చమాసాః బహుసమ్మతాః - ఏషుజ్యేష్ఠం జ్యేష్ఠమాసం పూర్వజయోః - ప్రథమజాతయోర్వధూవరయోస్త్యజేత్-అర్థా దేకతరేజ్యేష్ఠే సతినత్యజేత్ - దోషాన్తరమాహ ॥ హిమరుచించంద్రం- జ్ఞేజ్యేన్యఖేటాన్వితం - బుధగురురహితాన్యగ్రహయుక్తం - శుక్రాణామ న్వితమయుక్తంత్యజేత్ - అనిష్టఫలశ్రవణాత్ - మాసాద్యం జనిసంభవ మితి త్యాజ్యప్రకరణోక్తం యత్తస్యవిశేషనిర్ణయమాహ - యన్మాసా దితిస్పష్టార్థం॥ ఇతి స్త్రీపుంసోర్వివాహకాలః సమాప్తమ్.

——(*) అథ వివాహేనక్షత్రాణి వేధశ్చ. (*)——

మూ॥ మూలాంత్యారకమఘాస్థిరేంద్వనిలయుఙ్మైత్రం వివా
హేశుభం పాపత్యక్తమనిందుభుక్ఖలయుతం భోగ్యంచ
విద్ధంనభమ్ । విశ్వేందోర్యమమిత్రయోర్ద్వికభయోః
చైత్రర్క్షహర్యోర్మిథోంత్యార్యమ్ణోః పునరస్రపోర్వరుణ
భస్వాత్యోరుభాహస్తయోః॥ ౧౪॥

టీక॥ మూలాంత్యారకమఘాస్థిరేంద్వనిలయుక్=మూల, రేవతి, హస్త, మఘ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మృగ శీర్ష, స్వాతి, అనునక్షత్రములతోఁ గూడుకొనిన, మైత్రమ్=అనూరాధ, (ఈనక్షత్రములు) వివాహే=వివాహమునందు, శుభమ్=శుభకరమైనవి. పాపత్యక్తమ్=పాపులచేత విడువఁబడినదియును, అనిందుభుక్ = చంద్రు నిచేత అనుభవింపఁబడనిదియును, ఖలయుతమ్ = పాపులతోఁ గూడినది యును. భోగ్యంచ=పాపులచేత భుజింపఁదగినదియును, విద్ధమ్=పాపుల చేత అవేధింపఁబడినదియును, ( అయిన ) భమ్=నక్షత్రము, నశుభమ్= శుభకరమైనదికాదు. విశ్వేందోః = ఉత్తరామృగశీర్షలకును, యమమిత్ర యోః - భరణ్యనూరాధలకును, ద్వికభయోః = రోహిణ్యభిజిత్తులకును, చైత్రర్క్షహర్యోః=మఖాశ్రవణాలకును, అంత్యార్యమ్ణోః= రేవత్యుత్తరాఫల్గు నీలకును, పునరస్రపోః = పునర్వసూ మూలలకును, వరుణభస్వాత్యోః= శతభిషాహస్తలకును, ఉభాహస్తయోః = ఉత్తరాభాద్రాహస్తలకును, ( వేధః=వేధము, స్యాత్=అగును. )

తా॥ ఇఁకను వివాహయోగ్యములగు నక్షత్రములను చెప్పుచు న్నాఁడు. ఎట్లనిన:—మూల, రేవతి, హస్త, మఖ, రోహిణి, ఉత్తర,

ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మృగశీర్ష, స్వాతి, అనూరాధ, అను నక్షత్రములయందు వివాహము శుభమైనదగును. పాపులచేత విడువఁబడిన దియును, చంద్రునిచేత అనుభవింపఁబడనిదియును, పాపగ్రహములతోఁ గూడినదియును, పాపగ్రహములచేత అనుభవింపఁదగినదియును, పాపగ్రహములచేత విధింపఁబడినదియును, అయిననక్షత్రము శుభకరమైనది కాదని యెఱుఁగవలయును. మఱియును, ఉత్తరామృగశీర్షలకును భరణ్యనూరాధలకును రోహిణ్యభిజిత్తులకును, మఘాశ్రవణములకును, రేవత్యుత్తరాఫల్గునీలకును, పునర్వసూమూలలకును, శతభిషాస్వాతులకును, ఉత్తరాభాద్రాహస్తలకును, పరస్పరమును వేధకలదని యెఱుఁగవలయును.

వ్యా॥ అథ వివాహనక్షత్రాణ్యాహ॥ మూలాంత్యారేతి॥ మూలంప్రసిద్ధం - అంత్యం రేవతీ - అరోహస్తః-మఘాప్రసిద్ధా - ధ్రువాణి రోహిణ్యుత్తరాత్రయః - ఇందుర్మృగః - అనిలంస్వాతీ - ఏభిస్సహిత మైత్రంఅనూరాధా - వివాహేశుభం - శుభఫలం - అథఏతేషూక్తేషు నిన్ద్యమాహ॥ పాపత్యక్తంఅసత్ - అస్తుభుక్ చంద్రాభుక్తంనశుభం- ఏతదుక్తంభవతి - పాపగ్రహత్యక్తం నక్షత్రం చంద్రభుక్తిరహితం నశుభంస్యాత్ ॥ అథవేధమాహ ॥ విశ్వేందోః ఉత్తరామృగయోః యమమిత్రయోః - భరణ్యనూరాధయోః - ద్వికభయోః - కస్యభే-కభే - ద్వేకభే ద్వికభే - రోహిణ్యభిజితౌ - తయోః-మైత్రగ్నహర్యోః-మఘాశ్రవణయోః- మిథఃపరస్పరం - అంత్యార్యమ్ణోః - రేవత్యుత్తరాఫల్గున్యోః - పునరస్రపోః-పునర్వసుమూలయోః - వరుణభస్వాత్యోః - ఉభాహస్తయోః-ఉత్తరాభాద్రపదాహస్తయోః మిథః పరస్పరంవేధఃస్యాత్ - ఇత్యుత్తరశ్లోకేనాన్వయః॥ ఇతి వివాహేనక్షత్రాణివేధశ్చ సమాప్తమ్.

——(*) అథ వేధనిర్ణయమాహ. (*)——

మూ॥ వేధోఽయంకరపీడనేనిగదితో నాన్యేషు తేషుస్మృతో
వేధస్సప్తశలాకకే శివదిశః కార్శాన వాద్యైర్యుతే ।
వేధోంత్యాదిమయోర్ద్వికత్రిమితయోరంఘ్ర్యోర్మిథస్స
ద్గ్రహైర్విద్ధభే చరణంత్యజేత్ఖల ఖగైస్సర్వంత్విహాంఘ్రిం
క్వచిత్॥ ౧౫॥

టీక॥ కరపీడనే=వివాహమునందు, అయమ్ = ఈ, వేధః=వేధ, నిగదితః=చెప్పఁబడినది. అన్యేషు = ఇతరకర్మములయందు, ననిగదితః= చెప్పఁబడలేదు. తేషు=ఆయితరకర్మములయందు, శివదిశః = ఈశాన్యదిక్కు-మొదలుకొని, కార్శాన్యవాద్యైః = కృత్తికానక్షత్రము మొదలుగాఁగల నక్షత్రములతో, యుతే=కూడుకొనిన, సప్తశలాకకే=సప్తశలాకచక్రమునందు, వేధః=వేధ, నిగదితః=చెప్పఁబడినది. అంత్యాదిమయోః=కడపటిదియును మొదటిదియును, ద్వికత్రిమితయోః=రెండవదియును మూడవదియును, (అయిన) అంఘ్ర్యోః=పాదములకు, మిథః=పరస్పరమును, వేధః=వేధ, స్యాత్ = అగును. సద్గ్రహైః = సద్గ్రహములచేత, విద్ధే= వేధింపఁబడిన, భే=నక్షత్రమునందు, చరణమ్=పాదమును, త్యజేత్=విడువవలయును. ఖలఖగైః = దుష్టగ్రహములచేత, విద్ధే=వేధింపఁబడిన, భే= నక్షత్రమునందు, సర్వమ్= (నక్షత్రమును) సర్వమును,త్యజేత్=విడువవలయును. క్వచిత్=ఒకానొకప్పుడు, ఇహ = ఈపాపగ్రహవేధయందు, అంఘ్రిమ్=పాదమును, త్యజేత్=విడువవలయును.

తా॥ కర్మవిశేషముచేత వేధనిర్ణయమును దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—వివాహమునందు ఈవేధ చెప్పఁబడినదిగాని యితరకర్మములయందు ఈవేధ చెప్పఁబడలేదు. మఱియును, వివాహముకంటె ఇతరములగు కర్మములయందు సప్తశలాకవేధను చెప్పవలయును. సప్తశలాకవేధ యెటువంటిదనఁగా ఈశాన్యదిక్కు-మొదలుకొని కృత్తికా నక్షత్రముమొదలుగాఁగల నక్షత్రములతోఁ గూడియున్నదని యెఱుఁగవలయును. మఱియును, వివాహముకంటె ఇతరములగు కర్మములయందు సప్తశలాకచక్రమునందలి వేధము చూడఁదగినదని యెఱుఁగవలయును. మఱియును, ప్రథమచతుర్థపాదములకును రెండవ మూడవ పాదములకును పరస్పరమును వేధయగును. సద్గ్రహములచేత వేధింపఁబడిన నక్షత్రమునందు ఒక్క-పాదమును విడువవలయును. పాపగ్రహములచేత వేధింపఁబడిన నక్షత్రమునందు నక్షత్రమును సర్వమును విడువవలయును. ఒకానొకప్పుడు అనఁగా ఇతరముహూర్తము లభింపనికాలమునందు పాపగ్రహవేధకల నక్షత్రమునందు ఒక్క-పాదమునుమాత్రము విడువవలయును.

వ్యా॥ అథ కర్మవిశేషేణ వేధనిర్ణయమాహ ॥ వేధోఽయమితి ॥ అయంవేధఃకరపీడనే వివాహేపూర్వం మునిభిర్నిగదితః - నాన్యేషుఅన్యేషుకర్మసు వేధోనోక్త ఇత్యర్థః - తేషువివాహాన్యకర్మసు - సప్తశలాకకేస్మృతః - కథంభూతే సప్తశలాకకే చక్రేశివదిశః - ఈశాన్యాస్సకాశాత్ - కార్శానవాద్యైర్యుతే - కృశానుఃదేవతాయస్యేతి కార్శానవం-

కృత్తికా - సాభిజ్యమేషాంతాని - త్రైస్యతే - ఈశాన్యాది ప్రదక్షిణం కృత్తికాది నక్షత్ర యుక్తమిత్యర్థః - వివాహాద్యుతే - సర్వకర్మసు - సప్తశలాకాచక్రే వేధోవలోకనీయ ఇతి ॥ అథపాదవేధమాహ ॥ వేధోంత్యాదిమయోరితి ॥ అంత్యాదిమయోః - చతుర్థప్రథమయోః అంఘ్ర్యోశ్చరణయోః - మిథఃపరస్పరంవేధఃస్యాత్ ॥ అథాస్యనిర్ణయమాహ ॥ సద్గ్రహైః - శుభగ్రహైః - భే - నక్షత్రేవిద్ధేసతి - చరణంత్యజేత్ - ఖలఖగైః - పాపగ్రహైః - విద్ధేసతి - సర్వనక్షత్రంత్యజేదిత్యర్థః - ఇహాస్మిన్పాపవిద్ధే - క్వచిదన్యమహూర్తాలాభేసతి - అంఘ్రించచరణం విద్ధంత్యజేదిత్యర్థః ॥ ఇతి వేధనిర్ణయః సమాప్తమ్ ॥

—— (*) అథ వేధభంగం లత్తాంచాహ. (*) ——

మూ॥ లగ్నేశే భవగే ధవాశశినిసద్దృష్టే శుభేవాంగగేహో
రాయాంచ శుభస్యవా వ్యధభయం నాస్తీతి పూర్వేజ
గుః । భౌమాత్త్ర్యాక్రుతిషడ్గినాష్టనఖభం సూర్యగ్రహో ల
త్తయాఖేటోర్కోఽర్కమితంశశీ మునిమితం పూర్ణోపస
న్మాళవే॥ ౧౬॥

టీక॥ లగ్నేశే = లగ్నాధిపతి, భవగేసతి = ఏకాదశస్థానమునుపొందినవాఁడగుచునుండఁగను, అథవా = ఇట్లుగాకేని, సద్దృష్టేసతి = శుభగ్రహములచేతఁ జూడఁబడినవాఁడగుచునుండఁగను, శుభే = శుభుఁడు, అంగగేసతి = లగ్నమును పొందినవాఁడగుచునుండఁగను, శుభస్య = శుభగ్రహముయొక్క, హోరాయామ్ = హోరయందును, వ్యధభయమ్ = వేధయొక్కభయము, నాస్తీతి = లేదని, పూర్వే = పూర్వులు, జగుః = చెప్పుదురు. భౌమాత్ = అంగారకుఁడుమొదలుకొని, ఖేటః = రాహువువఱకునుగల గ్రహాలకు, త్ర్యాక్రుతిషడ్గినాష్టనఖభమ్ = మూఁడు, ఇరువదిరెండు, ఆఱు, పదునాలుగు, ఎనిమిది, ఇరువది, అను సంఖ్యగలనక్షత్రము, అగ్రతః = ముందుగా, లత్తయా = లత్తయనుదోషముచేత, హన్తి = చంపుచున్నది. అర్కః = సూర్యుఁడు, అర్కమితమ్ = పదిరెండవనక్షత్రమును, పూర్ణః = పూర్ణుఁడైనను, శశీ = చంద్రుఁడు, మునిమితమ్ = ఏడవనక్షత్రమును, లత్తయా = లత్తయనుదోషముచేత, హంతి = చంపుచున్నాఁడు. ఇదమ్ = ఈయోగము, మాళవే = మాళవదేశమునందు, సత్ = యోగ్యమైనది. న = కాదు,

తా॥ ఇఁకను వేధభంగమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ల



గ్నాధిపతి ఏకాదశస్థానమందుండెనేని వేధయొక్క దోషము నశించిపోవును. చంద్రుఁడు శుభగ్రహముచేతఁ జూడఁబడెనేని వేధయొక్కదోషము పోవును. శుభగ్రహము లగ్నమునందున్నపుడుకూడ వేధయనుదోషము పోవును. శుభగ్రహముయొక్క హోరవేధయను దోషమును పోఁగొట్టును. మఱియును, ఇందలియొక్కొక్కటియును వేధయొక్కదోషమునుపోఁగొట్టునని ప్రాచీనులగు మునులు చెప్పుచున్నారు. “శ్లో॥ లగ్నేశుభస్సౌమ్యయుతే క్షితోవాలగ్నాధినాథో భవగస్తథావా । కాలాఖ్యహోరాచతథాశుభస్యభవేద్ధిదోషస్య తథాభిభంగః॥” (లగ్నమునందు శుభుఁడు శుభగ్రహములతోఁ గూడుకొనిగాని శుభులచేతఁ జూడఁబడిగానియున్నను, లగ్నాధిపతి శుభగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధముగలవాఁడైయున్నను, శుభగ్రహముయొక్క హోరనైయున్నను వేధయొక్కదోషము పోవునని యెఱుఁగవలయును.) అని వసిష్ఠుఁడు చెప్పె. “శ్లో॥ సద్యోగ్దృక్తనుగే శుభే వ్యధభయంనోవాయలగ్నేగ్రహే । హోరాయాంచశుభస్యవాశశినిసద్దృష్టేపిచార్యైరుడోః॥” (= శుభగ్రహము శుభగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధములుకలవాఁడై లగ్నమునందున్నను, లగ్నాధిపతి శుభగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధము కలవాఁడై పదునొకండవయింటియందున్నను, శుభగ్రహముయొక్క హోరయైయున్నను, చంద్రుఁడు శుభగ్రహములయొక్క దృగ్యోగాదిసంబంధములుకలవాఁడైనను, వేధభయము లేదని యెఱుఁగవలయును.) అనియుద్వాహతత్త్వమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. ఇఁకను లత్తయను దోషమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—అంగారకునకు మూఁడవ నక్షత్రమును, బుధునకు ఇరువదవనక్షత్రము, గురునకు ఆఱవనక్షత్రము, శుక్రునకు ఇరువదినాల్గవనక్షత్రము, శనికి ఎనిమిదవనక్షత్రము, రాహువునకు ఇరువదవనక్షత్రము, లత్తయనుదోషమును కలుగఁజేయును. మఱియును, సూర్యునకు పదిరెండవనక్షత్రమును, పూర్ణచంద్రునకు ఏడవనక్షత్రమును లత్తయను దోషమును కలుగఁజేయును. ఈలత్తయను దోషము కీడును కలుగఁజేయునని యును, ఈదోషము మాళవదేశమునందు ముఖ్యమనియును, తెలియవలయును. “శ్లో॥ లత్తామాళవకేషుదేశే పాతఃకోసలకేతథా। ఏకార్గళంతుకాశ్మీరే వేధస్సర్వత్రవర్జయేత్” (= మాళవకదేశమునందు లత్తయనుదోషమును కోసలదేశమునందు పాతను, కాశ్మీరదేశమునందు ఏకార్గళమును దోషమును సర్వదేశములయందును వేధయను దోషమునువి

డువవలయును.) అని స్మృతియందుఁ జెప్పఁబడియె.

వా ॥ అథవేధభంగమాహ॥ లగ్నేశేఇతి॥ లగ్నేశే- లగ్నస్వామి ని- భవగే- ఏకాదశగే,సతి- వేధస్యదోషోనాస్తితిఏకోభంగః- అథవాశశి ని- సద్దృష్టే సతిద్వితీయోభంగః- వాఇత్యథవాశుభే శుభగ్రహే- చష్ట్రి వర్జితే అంగేసతి- తృతీయోభంగః- శుభస్యహోరాయాంచేతిచతుర్థోభం గః- ఏషామన్యతమేసతివేధో,నాస్తితిపూర్వేమునయోజగుః- ఆహుః- త థాచవసిష్ఠః॥ శ్లో॥ లగ్నేశుభస్సౌమ్యయుతేక్షితోవాలగ్నాదినాథోభవ గస్తథావా। కాలాఖ్యహోరాచతథాశుభస్యభవేద్ధిదోషస్యతథావిభం గః॥ ఇతి॥ ఉద్వాహతత్త్వేపి॥ శ్లో॥సద్యోగృక్తనుగేశుభేవ్యధభయంనోవా యిలగ్నేగ్నమే హోరాయాంచశుభస్యవాశశిని సద్దృష్టేపి చాత్రైవరు డో॥ఇతి॥ అథలత్తామాహ॥ భౌమాదితి॥ భౌమాత్సకాశాత్ - ఖేటాగ్ర హారాహుశతః- క్రమాత్- త్ర్యాకృత్యాది భం- నక్షత్రం- అగ్రతోలత్త యాహంతి- భౌమస్తృతీయం- బుధః ఆకృతిర్ద్వావింశమితం- గురుః-షష్ఠం శుక్రః జినమితం- చతుర్వింశం- శనిరష్టమం- రాహుర్నఖమితం- వింశంల త్తయాహంతి- అర్కస్సూర్యః అర్కమితం- ద్వాదశం- శశీపూర్ణచంద్ర మాః- మునిమితం సప్తమం- అగ్రతోలత్తయాహంతి- తత్ - హతంనక్ష త్రం- మాలవే- మాళవదేశే- నసత్- నశుభంస్యాత్॥ ఉక్తంచ॥ శ్లో॥ ల త్తామాళవకేదేశే పాతంకౌసలకేతథా । ఏకార్గళంతుకాశ్మీరే వేధంస ర్వత్రవర్జయేత్॥ ఇతివేధభంగలత్తేసమాప్తమ్.

## అథదోషాంతరం సూర్యాదీనాంరాశిసంక్రమణే త్యాజ్య ఘటికాశ్చాహ.

మూ॥ షణ్మాసం గ్రహణోడు చంద్రతనుగం విద్ధర్క్ష జన్మర్క్షకే
త్యాజ్యేజన్మభ లగ్నకేతనుగతే సూర్యాన్మనూడు త్యజే
త్ । దంతద్వ్యబ్జ దృశోర్కతో యుగగజా స్తర్కాః
ఖబాణేన్దవో నాడ్యస్సంక్రమణే త్యజేద్దివిషదాంప్రాయో
రవేర్దూషితాః॥ ౧౭॥

టీక॥ చంద్రతనుగమ్- చంద్రునిలగ్నమునుపొందిన, గ్రహణోడుమ్- గ్రహనక్షత్రమును, షణ్మాసమ్ - ఆఱుమాసములవఱకును, త్యజేత్ = వి డువవలయును, తనుగతే - లగ్నమునుపొందిన, విద్ధర్క్ష జన్మర్క్షకే = విద్ధ నక్షత్రమును జన్మనక్షత్రమును, త్యాజ్యే - విడువఁదగినవి, తనుగతే=ల గ్నమునుపొందిన, జన్మభలగ్నకే- జన్మరాశి జన్మలగ్నములు, త్యాజ్యే= విడువఁదగినవి, సూర్యాత్ = సూర్యునిదగ్గరనుండి, మనూడు- పదునా ల్గవనక్షత్రమును, త్యజేత్ = విడువవలయును, దివిషదామ్ = గ్రహము లయొక్క, సంక్రమణే = సంక్రమణమునందు, అర్కతః = సూర్యుఁడు మొదలుకొని, దంతద్వ్యంకదృశః = ముప్పదిరెండు, రెండు, తొమ్మిది, రెండు. (అయిన) నాడీః = నాడులను, యుగగజాః = ఎనుబదినాలుగ గు, నాడీః - గడియలను, తర్కాః = ఆఱయిన, నాడీః - గడియలను, ఖబాణేందవః = నూటయేబదగు, నాడీః = గడియలను, త్యజేత్ = విడు వవలయును, ప్రాయః = తఱచుగా, రవేః = సూర్యునియొక్క, సంక్ర మణే = సంక్రమణమునందు, నాడ్యః = (చెప్పఁబడిన) గడియలు, దూ షితాః = దూషింపఁబడినవి, స్యుః = అగును.

తా ॥ ఇఁకను దోషాంతరమును సూర్యాదులయొక్క సంక్రమ ణమునందు త్యాజ్యఘటికలను చెప్పుచున్నాఁడు. ఎట్లనినః—ఏనక్షత్రము నందు సూర్యగ్రహణ చంద్రగ్రహణములుకలుగునోయానక్షత్రము చంద్ర నక్షత్రమయినను, (అనఁగా, దిననక్షత్రమయినను,) లగ్నగతనక్షత్రమై నను వివాహమును చేయఁగూడదు. మఱియును, అయితే, గ్రహణనక్ష త్రము దిననక్షత్రమగుట సంభవించునుగాని లగ్ననక్షత్రమగుటయెట్లనియ నఁగూడదు. ఏలయనినః—అశ్వినీనక్షత్రమునందు గ్రహణముకలిగెనేనిమే షమునందు పదుమూఁడుభాగములు ఇరుపదిలిప్తలు గడచువఱకును మేష మునందు అశ్వినీనక్షత్రము కలిగియుండును కనుక అశ్వినీనక్షత్రమునందు గ్రహణము కలిగెనేని యాఱుమాసములవఱకును మేషలగ్నమునందుపది మూఁడుభాగములు ఇరువదిలిప్తలు గతించుదనుక వివాహమును చేయఁ గూడదని యెఱుఁగవలయును. పాపగ్రహ విద్ధనక్షత్రమునందును జన్మన క్షత్రమునందును వివాహమును చేయఁగూడదు. జన్మరాశిజన్మలగ్నముల యందు వివాహమును చేయఁగూడదు. సూర్యుఁడున్ననక్షత్రమునకుపది నాల్గవనక్షత్రమునందు వివాహమును చేయఁగూడదు. మఱియును, మేష సంక్రమణమునకు పూర్వము పదునాఱుగడియలను అనంతరమందుపదు నాఱుగడియలను, చంద్రసంక్రమణమున పూర్వాపరములయందు రెండే సిగడియలను, అంగారక సంక్రమణమునందును రెండేసిగడియలను,బుధ సంక్రమణమునందు తొమ్మిదిగడియలను, గురుసంక్రమణమునందు ఎనుబ దినాలుగుగడియలను. శుక్రసంక్రమణమునం దాఱుగడియలను, శనిసంక్ర మణమునందు నూటయేబది గడియలను, విడిచి మిగిలినకాలమునందు వి

వాహమును చేయవలయును.

వ్యా ॥ అథదోషాంతరమాహ॥ షణ్మాసం- షణ్మాస పర్యంతం- గ్రహణోడు- గ్రహణనక్షత్రం- చంద్ర తనుగం- చంద్రగతం - లగ్నగతం చ త్యాజ్యం- చంద్రగతమితి- యస్మిందినే చంద్రమసాయుక్తం భవతి- తచ్చన్ద్రగతం-దిననక్షత్రమితి యావత్- తనుగం యథా- అశ్విన్యాం గ్రహణేజాతే సతి త్ర్యంశత్రయోదశ భాగాంత మేష లగ్నే సతి - అశ్వినీలగ్నస్థా స్యాత్- ఏవంభరణ్యాద్యపి గ్రహణోడు ఇత్యనేనైవ అన్యాన్యప్యుడూని దుష్టాని త్యాజ్యాని- విద్ధక్షం- విద్ధనక్షత్రం- జన్మనక్షత్రం - ఏతేఉభేతనుగే త్యాజ్యే- భంచలగ్నంచభలగ్నే- జన్మనిభలగ్నే జన్మభలగ్నే తఏవజన్మభలగ్నకే- జన్మరాశిజన్మలగ్నేతనుగే త్యాజ్యే - లగ్నాంతర్గతనక్షత్రజ్ఞానాయస్వకల్పితసూత్రం- నవఘ్నంతమవేదాప్తం సైకంస్యాత్తారకంతనోః అర్కనక్షత్రాత్స్వనక్షత్రాన్మనూడు చతుర్దశనక్షత్రం త్యజేత్॥ అథసూర్యాదీనాం రాశిసంక్రమణే త్యాజ్యఘటికా ఆహ- త్యాజ్యా ఇతి ॥ రవిచంద్రకుజసౌమ్య గురుశుక్రమందానాం సంక్రమణే సంఖ్యాంకదృష్ట్యాఘ్యస్త్యాజ్యాః- తద్యథా- రవిసంక్రమణే రదనాడ్యోద్వాత్రింశత్ ఘటికావర్జ్యాః- సంక్రమణకాలాత్పూర్వం ...ః- షోడశఘటికాః- పరతష్షోడశఘటికాః-ఏవం ద్వాత్రింశద్ఘటికాస్త్యాజ్యా ఇత్యర్థః- తథాచసంక్రమణే ద్వేనాడ్యౌ చంద్రసంక్రమణే ...నాడ్యౌ భౌమసంక్రమణే నవ ఘటికాః బుధసంక్రమణే ద్వేఘటికే త్యాజ్యే గురోః సంక్రమణే అబ్ధ్యష్టౌ చతురశీతిఘటికాః - శనేః సంక్రమణే ఖత్రియః- ౧౫౦ - పంచాశదధిక శతఘటికాః- శుక్రస్యదశనాడికాస్త్యాజ్యా ఇత్యర్థః॥ ఇతిదోషాంతరాదీనిసమాప్తమ్.

—(*) అథసంధిదోష ముత్పాతవర్జ్యకాలం భద్రాకాలంచాహ (*)—

మూ॥ షట్షష్టి ఋతుసంధితః తిథిభయుక్సంధౌ ద్వినాడ్యౌగ్ర
హాత్ తత్పాదైర్దివసాం స్త్రివేద షడిభాక్ ప్రాగర్థి
తాక్ సంత్యజేత్ । ఉత్పాతే త్ర్యహముద్గమంచ శిఖినో
రాకాష్టమీప్రాగ్దళే విట్ప్రాంత్యే కృతరుద్రయోః బహు
లేకృష్ణే నిరేకేష్విహ॥ ౧౮॥

టీక ॥ ఋతుసంధితః = ఋతుసంధియందు, షట్షష్టిః = అరువదారు గడియలను, సంత్యజేత్ = విడువవలయును, తిథిభయుక్సంధౌ = తిథినక్షత్రయోగములయొక్క సంధియందు, ద్వినాడ్యౌ = రెండుగడియలను, సంత్యజేత్ = విడువవలయును, గ్రహాత్ = గ్రహణముకంటె,



ఉపరి = పిమ్మట, తత్పాదైః = ఆగ్రహణపాదములచేత, త్రివేదషడిభాక్ = మూడు నాలుగు ఎనిమిదియగు, దివసాన్ = దినములను, సంత్యజేత్ = విడువవలయును, గ్రహాత్ = గ్రహణముకంటె, ప్రాక్ = పూర్వమునందు, అర్థితాక్ = పైనజెప్పఁబడిన సగముకాలమును, సంత్యజేత్ = విడువవలయును, ఉత్పాతే = ఉత్పాతమునందు, త్ర్యహమ్ = ఏడుదినములను, సంత్యజేత్ = విడువవలయును, శిఖినః = కేతువుయొక్క, ఉద్గమంచ = ఉదయమును, సంత్యజేత్ = విడువవలయును, రాకాష్టమీప్రాగ్దళే = పూర్ణిమాష్టమీతిథులయొక్క, ప్రాగ్దళే = పూర్వభాగమునందు, విట్ = విష్టియనుదోషము, స్యాత్ = అగును, కృతరుద్రయోః = చతుర్థియొక్కయును ఏకాదశియొక్కయును, ప్రాంత్యే = అంత్యమునందు, విట్ = విష్టి, స్యాత్ = అగును, (ఏతత్ = ఈభద్రాచతుష్టయము,) అబహులే = శుక్లపక్షమునందు, స్యాత్ = అగును, కృష్ణే = కృష్ణపక్షమునందు, నిరేకేషు = చెప్పఁబడిన తిథులలో ఒక్కొక్కటి తక్కువగు తిథులయందు, విట్ = విష్టి, స్యాత్ = అగును.

తా ॥ ఇంకను సంధిదోషమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః—వసంతాదిఋతువులు ప్రవర్తించునపుడు అరువదారుగడియలు సంధికాలముకనుక అట్టి సంధికాలమునందు వివాహాది శుభకార్యములను చేయఁగూడదని యెఱుఁగవలయును. "శ్లో॥ మృగాదిరాశి ద్వయభానుభోగ షట్కర్తవస్స్యు శ్శిశిరోవసంతః । గ్రీష్మశ్చవర్షాశ్చ శరచ్చతద్వద్ధేమంతనామా కథితోత్రషష్ఠః॥" (మకరాదిగ రెండేసి రాసులకొక్క ఋతువనఁబడును. ఈక్రమముచేతనే శిశిరము వసంతము గ్రీష్మము వర్షర్తువు శరదృతువు హేమంతర్తువు అని ఋతువులారని యెఱుఁగవలయును.) మఱియును, తిథినక్షత్ర యోగములయొక్క సంధులయందు రెండుగడియలనువిడిచిపెట్టవలయును. మఱియును, సూర్యచంద్రగ్రహణములువచ్చినపిమ్మట పూర్ణగ్రహణమునకు ఎనిమిదిదినములవఱకును, త్రిపాదగ్రహణమునకు ఆరుదినములవఱకును, రెండుపాదముల గ్రహణమునకు నాలుగుదినములవఱకును, ఏకపాదగ్రహణమునకు మూడుదినములవఱకును వివాహాది శుభకార్యములను చేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, ఇటులనే పాదగ్రహణమునకు పూర్వము ఒకటిన్నరదినమును అర్థగ్రహణమునకుపూర్వము రెండుదినములును, త్రిపాదగ్రహణమునకుపూర్వము మూడుదినములును పూర్ణగ్రహణమునకుపూర్వము నాలుగుదినములును వివా

హాది శుభకర్మములయందు త్యాజ్యములని యెఱుంగవలయును. "శ్లో॥ సర్వగ్రాసే దినాన్యష్టౌ శుభకార్యేషు వర్జయేత్ । త్రిభాగోనే షడ్దివసానర్ధగ్రాసే చతుర్దినం । చతుర్థాంశే త్రిరాత్రంతు గ్రహణే చంద్రసూర్యయోః॥" (=చంద్రసూర్యులయొక్క గ్రహణములు సర్వగ్రాసములయ్యెనేని ఎనిమిదిదినములదనుక వివాహాదిశుభకార్యములను చేయఁగూడదు. మూఁడుపాదముల గ్రహణములయందు ఆఱుదినములదనుక శుభకార్యములను చేయఁగూడదు. అర్ధగ్రాసమునందు నాలుగుదినములదనుక శుభకార్యములను చేయఁగూడదు. పాదగ్రాసమునందు మూఁడుదినములదనుక శుభకార్యములను చేయఁగూడదు.) అని శార్ఙ్గీయ వివాహపటలమునందుఁ జెప్పఁబడెను. మఱియును, ఈపాదాది గ్రాసముల కధికన్యూనములు కలిగినపుడు అనుపాతమును చేసికొనవలయును. "శ్లో॥ గ్రహణాత్త్రిదినం పూర్వం పరతో దినసప్తకమ్" (గ్రహణమునకు పూర్వమునందు మూఁడుదినములును పరమునందు ఏడుదినములును శుభకార్యమును చేయఁగూడదు) అని ఆర్ష్టిషేణుఁడు చెప్పినమాట సర్వగ్రహణవిషయమని యెఱుంగవలయును. "శ్లో॥ ఖగ్రాససర్వపాదోన ఖండాంఘ్రిష్వేతు వాసరాః । గజాశ్వేష్వబ్ధిరామాబ్జా సేష్టాస్స్యుః ప్రాగ్దశే గ్రహే॥" (=పూర్ణాధిక గ్రహణమునందు ఎనిమిదిదినములును, పూర్ణగ్రహణమునందు ఏడుదినములును, త్రిపాదగ్రహణమునం దైదుదినములును, అర్ధగ్రహణమునందు నాలుగుదినములును, పాదగ్రహణమునందు మూఁడుదినములును, పాదన్యూనగ్రహణమునం దొకదినమును శుభకార్యములు చేయఁగూడదు.) అని జ్యోతిఃప్రకాశమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. ఇఁకను ఉత్పాతమునందు వర్జ్యకాలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—భూకంపసిద్ధోత్థ మహోల్కానిపాతాదికమునందు ఏడుదినములను విడిచి పిమ్మట శుభకార్యములను చేయవలయును. కేతూదయమగు వఱకును శుభకర్మములను చేయఁగూడదు. "శ్లో॥ పరంసప్తాహముత్పాతే త్యజేత్కేతూదయంశుభమ్" (=ఉత్పాతమునం దేడుదినములను విడువవలయును. కేతూదయమును విడిచిపెట్టవలయును.) అని ఆర్ష్టిషేణుఁడు చెప్పె. పూర్ణిమాష్టమీతిథుల యొక్క ప్రాగ్దళమునను విష్టియనుదోషము కలిగియుండును. చవితియొక్కయును ఏకాదశియొక్కయును అంత్యమునందు విష్టియనుదోషము కలిగియుండును. ఈభద్రాచతుష్టయమును శుక్లపక్షమునం దగును. కృష్ణపక్షమునం దీతిథులు ఒకటిరహితములగుచుండఁగా విష్టియగును.



వ్యా॥ అథసంధిదోషమాహ॥ ఋతుసంధితః - వసంతాదిఋతుప్రవృత్తేః షట్షష్టిః- షడ్భిరధికాషష్టిః- ౬౬- ఘటీనాంషట్షష్టిః త్యాజ్యేత్యర్థః- ఋతుప్రవృత్తిలక్షణం రత్నమాలాయాం॥ శ్లో॥ మృగాదిరాశిద్వయభానుభోగష్షట్చర్తవస్స్యుశ్శిశిరోవసంతః । గ్రీష్మశ్చవర్షాశ్చ శరచ్చతద్వద్ధేమంతనామాకథితోత్రషష్ఠః॥ ఇతి॥ తిథిభయుక్సంధౌతిథినక్షత్రయోగానాంసంధౌ ద్వినాడ్యౌ పృథగ్ద్వేద్వే ఘటికే త్యాజ్యే - అథపూర్వముక్తం గ్రహజనిత్రాంతోద్భవంసూతకమితి॥ తత్రగ్రహణ సూతకే లక్షణమాహ॥ గ్రహాదితి॥ గ్రహాత్ గ్రహణతః- సకాశాత్- ఉపరి -తత్పాదైస్సచ్ఛన్నైః- గ్రహపాదైః- త్రివేద షడిభాన్- ౩- ౪- ౬- ౮- దివసాన్ త్యజేత్- ఏతదుక్తం భవతి॥ పాదైక మాత్ర గ్రహణే త్రీన్ దివసాన్ త్యజేత్- అర్ధ గ్రహణే చతురో దివసాన్ త్యజేత్-త్రిపాద్గ్రహణే షడ్దివసాన్ త్యజేత్- సర్వగ్రహణే అష్టదివసాన్ త్యజేత్- ప్రాగ్గ్రహణాత్ ప్రాక్ప్రథమతః- అద్రితాన్- త్రివేదాదీన్ దివసాన్ త్యజేత్- ఏతదుక్తంభవతి॥ పాదగ్రహణే త్రయాణామర్ధం- తద్యథా - పాదగ్రహణే గ్రహణాత్పూర్వం సార్ధైకదివసం- ౯౦- నవతిఘటికా స్త్యాజ్యాః అర్ధగ్రహణే చతుర్ణామర్ధం- ద్వౌదివసౌ- పాదత్రయగ్రహణే షణ్ణామర్ధంత్రీన్ - సర్వగ్రహణే అష్టానామర్ధం చతురో దివసాన్- గ్రహణాత్పూర్వంత్యజేత్॥ ఉపరాగే గ్రహో రాహుగ్రస్తే త్వింధౌచపూర్ణే చేత్యమరః- శార్ఙ్గీయవివాహపటలే॥ శ్లో॥ సర్వగ్రాసే దినాన్యష్టౌ శుభకార్యేషు వర్జయేత్ । త్రిభాగోనే షడ్దివసాన్ అర్ధగ్రాసే చతుర్దినం॥ చతుర్థాంశే త్రిరాత్రంతుగ్రహణే చంద్రసూర్యయోరితి॥ అత్రాప్యంతరాలేతు పాతో జ్ఞేయః॥ తథార్ష్టిషేణః॥ గ్రహణాత్త్రిదినం పూర్వంపరతో దినసప్తకమితి-సర్వగ్రహణవిషయం. జ్యోతిఃప్రకాశేపి॥ ఖగ్రాససర్వపాదోన ఖండాంఘ్రిష్వేతు వాసరాః। గజాశ్వేష్వబ్ధిరామాబ్జా సేష్టాస్స్యుః ప్రాగ్దశే గ్రహేఇతి॥ అథోత్పాతేవర్జ్యకాలమాహ॥ ఉత్పాతేద్ర్యహమితి॥ ఉత్పాతేభూకంపసిద్ధోత్థమహోల్కానిపాతాదికే- అద్ర్యహం - అద్రిమితానాం అహ్నాంసమాహారః అద్ర్యహంసప్తాహమిత్యర్థః- ఉత్పాతేజాతేసతి- సప్తాహంశుభకర్మణిత్యజేదిత్యర్థః- దోషాంతరమాహ॥ ఉద్గమంచశిఖినః- శిఖినః- కేతోః- ఉద్గమం ఉదయంత్యజేత్- యావత్కేతూదయస్తావన్మంగలంనకుర్యాదిత్యర్థః - తథాచార్ష్టిషేణః॥ శ్లో॥ పరంసప్తాహముత్పాతే త్యజేత్కేతూదయంశుభమితి॥ భద్రాకాలమాహ॥ రాకాష్టమీప్రాగ్దలేవిష్టిస్స్యాత్-రాకా-పూర్ణా

ర్ణిమా- అష్టమీ- ప్రసిద్ధా- అనయోస్తిథ్యోః- ప్రాగ్దళేపూర్వార్ధే- విట్ విష్టిః- స్యాత్- కృతరుద్రయోః ప్రాంత్యే కృతం- చతుర్థీ- రుద్ర ఏకాదశీ అనయోః ప్రాంత్యేవిట్స్యాత్- ఏతద్భద్రాచతుష్టయం- అబహులే-శుక్లపక్షేస్యాత్- కృష్ణేనిరేకేష్వివ- ఉక్తేషుతిథిషు- నిరేకేషు- ఏకరహితేషు- కృష్ణే- కృష్ణపక్షే- విట్స్యాత్- భద్రాపవాదశ్శాస్త్రజ్ఞైయ వివాహపటలే దూషితః॥ఇతిసంధిదోషాదినిసమాప్తమ్.

### అథ నక్షత్రతిథిలగ్న గండాంతం చండాయుధమేకార్గళంచాహ.

మూ॥ సార్పేంద్రాంత మఘాంతతోఽబ్ధిఘటికం పూర్ణాంతతోఽబ్ధ్యర్ధకం కీటాంత్యాళివిరామతః కుఘటికం గండాంతమూర్ధ్వాధరం। సావైశూవ్యహగాఖ్యయోగవిరతౌ భం తత్రచండాయుధం దుర్యోగేదినభాచ్చసాఽభిజిదయుగ్భేఽర్కః స్థితశ్చేదేకార్గళః॥ ౧౯॥

టీక ॥ సార్పేంద్రాంతిమభాంతతః = ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి, అనునక్షత్రములయొక్క అంతమందు, ఊర్ధ్వాధరం = పూర్వపరములయందు, అబ్ధిఘటికం = నాలుగుగడియలు, గండాంతం = గండాంతసంజ్ఞకలది, స్యాత్ = అగును, పూర్ణాంతతః = పంచమి, దశమి, పూర్ణిమ, అనుతిథులయొక్క యంతమందు, అబ్ధ్యర్ధకం = రెండుగడియలు, ఊర్ధ్వాధరం = పూర్వాపరములయందు, గండాంతం = గండాంతమనుదోషము, స్యాత్ = అగును, కీటాంత్యాళివిరామతః = కర్కటకము మీనము వృశ్చికము అనురాసులయొక్క యంతమందు, కుఘటికం = ఒక్కగడియను, ఊర్ధ్వాధరం = పూర్వోత్తరములయందు, గండాంతం = గండాంతమనుదోషము, స్యాత్ = అగును, సావైశూవ్యహగాఖ్యయోగవిరతౌ = సాధ్యయోగము, వైధృతియోగము, శూలయోగము, వ్యతీపాతము, హర్షణయోగము, గండయోగము, అనుయోగములయొక్క యంతమందు, యత్ = ఏ, భం = నక్షత్రము, అస్తి = కలదో, తత్ = ఆ, భం = నక్షత్రము, చండాయుధం = చండాయుధమను దోషము, స్యాత్ = అగును, దుర్యోగేసతి = దుర్యోగముకలుగుచునుండగా, దినభాచ్చ = దిననక్షత్రముకంటె, సాభిజిదయుగ్భే = అభిజిత్తుతోఁగూడుకొనిన బేసినక్షత్రమునందు, అర్కః = సూర్యుఁడు, స్థితశ్చేత్ = ఉండెనేని, తదా = అప్పుడు, ఏకార్గళః = ఏకార్గళమనుదోషము, స్యాత్ = అగును.



తా ॥ ఇఁకను నక్షత్రతిథి లగ్నగండాంతదోషమును చంద్రాయుధమను దోషమును ఏకార్గళమను దోషమును తెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి, అను నక్షత్రములకు పూర్వమునందు రెండుగడియలును ఉత్తరమునందు రెండుగడియలును నక్షత్రగండాంతకాలమనఁబడును. పూర్ణిమ, పంచమి, దశమి, అను తిథులయొక్క యంతమునకు పూర్వమునందు రెండుగడియలును ఉత్తరమునందు రెండుగడియలును తిథిగండాంతమనఁబడును. మఱియును, సాధ్యయోగము, వైధృతియోగము, శూలయోగము, వ్యతీపాతము, హర్షణయోగము, గండయోగము అను యోగములయొక్క అంతమందున్న నక్షత్రము చండాయుధమనఁబడును. విష్కంభాతి గండశూల గండవ్యాఘాత వజ్రవ్యతీపాత పరిఘవైధృతములుతొమ్మిదియును దుర్యోగములనఁబడును. ఈతొమ్మిదియోగములలో ఏదో యొకటికలిగియుండఁగా దిననక్షత్రమునకు బేసినక్షత్రమునందు (ఈబేసినక్షత్రమును అభిజిత్తుతోఁగూడ లెక్కింపవలయును.) సూర్యుఁడున్నయెడల ఏకార్గళమనఁబడును. ఈయేకార్గళమనుదోషము శుభములను పోఁగొట్టునని యెఱుఁగవలయును.

వ్యా॥ అథ గండాంతలక్షణమాహ॥ సార్పం-ఆశ్లేషా-ఇంద్రో జ్యేష్ఠాఅంతిమభం - రేవతీ-ఏషామంతః - తస్మాత్కాలాత్పూర్వపరం - పూర్వపరతః-అబ్ధిఘటికం - గండాంతికంస్యాత్ - అబ్ధయశ్చ తస్రోఘటికా యస్మిన్నిత్యబ్ధిఘటికం - చతుర్ఘటిమిత్యర్థః - ఏతదుక్తంభవతి ॥ ఉక్తనక్షత్రాంతాత్పూర్వతః ఘటికాద్వయం పరతోఘటికాద్వయం - ఏవంఘటికాచతుష్టయంనక్షత్రగండాంతం॥ అథతిథిగండాంతమాహ॥ పూర్ణాంతతోఽబ్ధ్యర్ధకం - పూర్ణాః పంచమీదశమీపూర్ణిమాః తాసామంతః - అబ్ధ్యర్ధకం - ఘటికం - గండాంతం-పూర్వపరతఃస్యాత్ ॥ అథలగ్నగండాంతమాహ॥ కీటాన్త్యాళివిరామతఃకుఘటికం - కీటః-కర్కటకః - అంత్యోమీనః-అళిర్వృశ్చికః-ఏషాంవిరామోఽవసానం - తస్మాత్కుఘటికం-పూర్వార్ధఘటికా- పరతోర్ధఘటికా-ఏవమేకఘటికం - లగ్నగండాంతంస్యాత్॥ అథచండాయుధమాహ॥ సావైతి॥ సా-సాధ్యయోగః-వై-వైధృతిః-శూ-శూలః-వ్య-వ్యతీపాతః-హ - హర్షణః-గ-గండః - ఏతదాఖ్యయోగానాం విరతిరవసానం - తత్రయద్భంనక్షత్రం-తస్మాచ్చండాయుధంస్యాత్ చండం-ప్రచండంమహత్ - ఏవంవిధంఆయుధంస్యాత్ - ఆయుధంఘాతకం స్యాత్-తస్మాత్తన్నక్షత్రంవర్జ్యమిత్యర్థః - అథైకార్గళమాహ ॥ దుర్యో

గేదినభాదితి॥ విష్కుమ్భాతి గండశూలగండవ్యాఘాత వజ్రవ్యతీపాతపరిఘవైధృతయోగానవదుర్యోగాః - ఏషాఇన్యతమేసతిదినభాదీ దినసక్షత్రాణి దినాఽభిజిదయుగ్మే - అభిజితాసహ అయుగ్మే విషమనక్షత్రేయదార్కః సూర్యోభవతితదాఏకార్గళః - స్యాత్ - ఏకార్గళౌశుభావరోధనీయస్మిన్నిత్యేకార్గళః - శుభఫలావరోధకమిత్యర్థః॥ ఇతి నక్షత్రగండాంతాదీని సమాప్తమ్.

(*) అథవారదోషం గుళికాదీంశ్చాహ. (*)

మూ॥ సూర్యాద్యామదళందివైవ నిగమాద్యాశ్విషు నాగత్రిష
ట్సంఖ్యాకం గుళికం దివేంద్ర రవిదిజ్నాగర్తు వేదద్వికం ।
వ్యేకంతన్నిశిషోడశాంశ ఇ పరేతిథ్యంశముజ్ఝంతితైఃకాలం
కటకమైనిఘంటమమరేజ్యజ్ఞాస్ఫుజిద్భ్యఃక్రమాత్॥ ౨౦॥

టీక॥ సూర్యాత్=సూర్యవారముమొదలుకొని, దివైవ = పగటియందే, నిగమాద్యాశ్విషు నాగత్రిషట్సంఖ్యాకమ్=నాలుగు ఏడు రెండు అయిదు ఎనిమిది మూడు ఆఱు అనియెడు సంఖ్యలుగల, యామదళమ్= అర్ధయామమును, ఉజ్ఝంతి = విడిచిపెట్టుచున్నారు. దివా=పగటియందు, ఇంద్రరవిదిజ్నాగర్తువేదద్వికమ్ = పదునాలు పదిరెండు ఎనిమిది ఎనిమిది ఆఱు నాలుగు రెండు అను సంఖ్యలుగల ముహూర్తమయిన, గుళికమ్= గుళికకాలమును, ఉజ్ఝంతి=విడిచిపెట్టుచున్నారు. తత్ = ఆగుళికకాలమును, నిశి=రాత్రియందు, వ్యేకమ్=ఒక్కసంఖ్యను తక్కువైనదానినిగా, ఉజ్ఝంతి=విడిచిపెట్టుచున్నారు. అపరే= మఱికొందఱు, తిథ్యంశమ్=పదునాఱవభాగమును, ఉజ్ఝంతి=విడిచిపెట్టుచున్నారు. అపరే = మఱికొందఱు, తిథ్యంశమ్=పదునైదవభాగమును, ఉజ్ఝంతి = విడిచిపెట్టుచున్నారు. తైః = ఆముహూర్తములచేత, అమరేజ్యజ్ఞాస్ఫుజిద్భ్యః = గురుఁడు బుధుఁడు శుక్రుఁడు మొదలగువారివలన, క్రమాత్ = క్రమముగా, కంటకమ్=కంటకమనియెడు, కాలమ్=కాలమును, ఐనిఘంటకమ్=యమకంటక కాలమును, ఉజ్ఝంతి = విడిచిపెట్టుచున్నారు.

తా॥ వారదోష గుళికాదోషములను చెప్పుచున్నాఁడు. ఎట్లనినః సూర్యవారముమొదలుకొని సకలగ్రహములయొక్కయును వారములయందు క్రమముగ అర్ధయామమును విడిచిపెట్టవలయును. అనఁగా ఆదివారమునందు నాల్గవయర్ధయామమును, సోమవారమునందు ఏడవ యర్ధయామమును, మంగళవారమునందు రెండవయర్ధయామమును, బుధ



వారమునందు అయిదవయర్ధయామమును, గురువారమునందు ఎనిమిదవ యర్ధయామమును, శుక్రవారమునందు మూడవ యర్ధయామమును, శనివారమునందు మూడవయర్ధయామమును, విడిచిపెట్టవలయును. ఈనియమము పగటియందేగాని రాత్రియందక్కఱలేదని యెఱుఁగవలయును. మఱియును సూర్యాదివారములయందు పగటియందు పదునాఱవభాగము గుళికకాలమనఁబడును. రాత్రులయందు పదునైదవభాగము గుళికకాలమనఁబడును. ఇట్టికాలములను శుభకార్యములయందు పరిత్యజింపవలయును. మఱియును, గురుబుధశుక్రవారములచేత కంటక యమఘంటక కాలములను తెలిసికొని యీకాలములనుగూడ శుభకార్యములయందు విడిచిపెట్టవలయును.

వ్యా॥ అథవారదోషమాహ ॥ సూర్యాత్సకాశాత్ - వారేషు-క్రమేణనిగమాదికంయామదళం - యామార్ధకముజ్ఝంతి - త్యజంతి-మునయ ఇతి శేషః - యుగమితంరవౌ - సప్తమితంసోమే - అశ్వినౌద్వౌ-తస్మితంభౌమే ఇషుమితంబుధే-నాగాఃఅష్టవ్-తస్మితంగురౌ - త్రిమితంశుక్రేషణ్మితంశనౌ - ఏతద్యామదళందివైవఉజ్ఝంతినరాత్రౌ - అథగుళికాదీనాహ॥ ఇనాదౌ-సూర్యాదౌ-వారే - దివా-ఇంద్రాదికం-షోడశాంశం - దినమానస్య షోడశాంశోగ్రాహ్యః - తేనగణ్యంతే షోడశాంశగ్రాహ్య ఇత్యర్థః - తంకుళికముజ్ఝంతి - అపరేతిథ్యంశం పంచదశాంశం-కుళికముజ్ఝంతి-తన్నిశి-తద్రాత్రౌ-తైరేవ్యేకరహితం - ఇంద్రాదికం - షోడశాంశం-పంచదశాంశముజ్ఝంతి - తద్యథా-రవౌదివా - ఇంద్రమితం చతుర్దశం - తద్రాత్రౌత్రయోదశం - సోమేదివాద్వాదశం - తద్రాత్రావేకాదశమిత్యాది - అథతైరేవఇంద్రాదిభిర్ముహూర్తైః-అమరేజ్యజ్ఞాస్ఫుజిద్భ్యః సకాశాత్ క్రమాత్కాలం కంటకం - ఐనిఘంటం - ఇనస్యాపత్యంపుమానైనిర్యమః - తస్యఘంటోయమఘంటఇత్యర్థః - తముజ్ఝంతి - ఏతదుక్తంభవతి॥ అమరేజ్యోగురుః తస్మాత్సకాశాత్తైరేవ ఇంద్రాదిభిర్ముహూర్తైః - కాలముజ్ఝంతి - జ్ఞాద్బుధాత్తైరేవేంద్రాదిభిఃకంటకం - ఆస్ఫుజిచ్ఛుక్రః-తస్మాత్సకాశాత్ తైరేవేంద్రాదిభిర్ముహూర్తైః - ఐనిఘంటం-యమఘంటకముజ్ఝంతి॥ ఇతి వారదోషోగుళికాదయశ్చ సమాప్తమ్.

అథ ముహూర్తాక్ పాతసంభవకాలం
వ్యతీపాతయోగంచాహ.

మూ॥ శుక్రేంద్విజ్యగురుః మేషగోంకరని భూతుల్యోముహూర్తాది

వాదుష్టాస్స్యుః కుజనిశ్యగో౽య ఇతరే సంత్యర్ధయామా
దిషు । ప్రేత్యస్సంప్రతివృద్ధితుర్య చరణే బ్రహ్మద్వితీయేప
మఃసూర్యాద్యా అనువిశ్వవాశి యమలేంద్వహ్యర్కభై
ర్మృత్యుదాః॥ ౫౧॥

టీక॥ శుక్రేంద్విజ్యయమేషు = శుక్రచంద్ర గురుశనివారములయం దు, గోంకరవిభూతుల్యాః=పది, తొమ్మిది, పదిరెండు, ఒక్కటి, అను వానికి సమములయిన, ముహూర్తాః = ముహూర్తములు, దివా= పగటి యందు, దుష్టాః=దోషముకలవి. స్యుః=అగును. కుజనిశి=అంగారకవార ముయొక్క రాత్రియందు, అగః = ఏడవముహూర్తము, దుష్టః=దోష ముగలది. స్యాత్=అగును. ఇతరే=ఇతరములయిన దుర్ముహూర్తములు, యే=ఏవి, సంతి=కలవో, తే=అవి, సర్వే=అన్నియును, అర్ధయామాది దుష్టకాలములయందు, సంతి=కలవు. సంప్రతి=ఇప్పుడు, వృద్ధితుర్యచ రణే = వృద్ధియోగముయొక్క నాల్గవపాదమునందును, బ్రహ్మద్వితీయే= బ్రహ్మయోగముయొక్క ద్వితీయచరణమునందును, అపమః=పాతయను దోషము, ప్రేక్ష్యః=చూడఁదగినది. సూర్యాద్యాః=సూర్యవారము మొద లగువారములు, అనువిశ్వవాశి యమలేంద్వహ్యర్కభైః = అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషము, అశ్విని, మృగశీర్ష, ఆశ్లేష, హస్త,అనునక్ష త్రములతో, యుతాః=కూడినవై, మృత్యుదాః = మృత్యువు నిచ్చునట్టివి. స్యుః=అగును.

తా॥ ఇఁకను ముహూర్తములను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— శుక్రవారమునందు పదియవముహూర్తము, సోమవారమునందు తొమ్మి దవముహూర్తము, గురువారమునందు పదిరెండవముహూర్తము, శని వారమునందు ప్రథమముహూర్తమును, దుర్ముహూర్తము లనఁబడును. అంగారకవారమునందు రాత్రికాలమునందలి యెనిమిదవముహూర్తము దుర్ముహూర్త మనఁబడును. మఱికొందఱు ఇంకను అనేకవిధములగు దుష్టకాలములుకలవని చెప్పుచున్నారు. అవియన్నియును, అర్ధయామాది దుష్టకాలములయందు అంతర్భావమును పొందియున్నవి కనుక గ్రంథవి స్తరభయముచేత ఇక్కడ చెప్పఁబడలేదని యెఱుఁగవలయును. ఇఁకను పాతసంభవకాలమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:...ఇప్పుడు వృద్ధియో గముయొక్క నాల్గవపాదమునందును బ్రహ్మయోగముయొక్క ద్వితీయ చరణమునందును, పాతయనుదోషము చూడఁదగినది. అనఁగా బ్రహ్మ



సిద్ధాంతాదులయందుఁ జెప్పఁబడినవిధముగా జూడఁదగినదని యెఱుఁగవ లయును. సూర్యాదులు క్రమముగా అనూరాధాదినక్షత్రములతోఁగూడి యుండఁగా మృత్యుయోగమనఁబడును. అనఁగా, అనూరాధానక్షత్రము తోఁగూడిన యాదివారమును, ఉత్తరాషాఢానక్షత్రముతోఁగూడినసోమ వారమును, శతభిషానక్షత్రముతోఁగూడిన మంగళవారమును, అశ్వినీనక్ష త్రముతోఁగూడిన బుధవారమును, మృగశీర్షానక్షత్రముతోఁగూడిన గురు వారమును, ఆశ్లేషానక్షత్రముతోఁగూడిన శుక్రవారమును, హస్తానక్ష త్రముతోఁగూడిన శనివారమును,మృత్యుయోగములని యెఱుఁగవలయును.

వ్యా॥ అథముహూర్తానాహ॥ శుక్రఇతి॥ శుక్రః ప్రసిద్ధః- ఇందు శ్చన్ద్రః- ఇజ్యోగురుః- యమశ్శనిః- ఏషుక్రమేణగోంకరవిభూతుల్యా ము హూర్తాఃదివాదుష్టాస్స్యుః- దుర్ముహూర్తాఇత్యర్థః - కుజనిశిఅగస్స ప్తమోముహూర్తోదుర్ముహూర్తః- గ్రంథాంతరే-అర్యమ్ణైరాక్ష-కుహి నకిరణే రాక్షసబ్రాహ్మ సంజ్ఞాః ఇత్యాదిబహవోదుర్ముహూర్తాః ఉ క్తాః అత్రస్వల్పాఉక్తాస్తేషాంపరిహారమాహ॥ యఇతరే ముహూర్తాః గ్రంథాంతరేపఠితాస్తేసర్వే అర్ధయామాదిషుసంతి - అతోఽత్రమయా నోక్తాః- అతః అర్ధయామాదీనాంత్యాగే తేపిత్యక్తాస్స్యుః- కింగ్రంథవిస్త రేణేతిభావః- ఏతత్తుసుజ్ఞాజ్ఞాస్యంతి- యథారవౌచతుర్దశో ముహూర్తో దుర్ముహూర్తః- కులికోపిచతుర్దశోముహూర్తః- తయోరేకత్రసద్భావఇ త్యన్యేతివిచారణగమ్యాః- నన్వేవంచేత్తర్హిపూర్వైర్వ్యర్థంపఠితం- మై వం- తైస్త్వనధికాధికదోషవివక్షయోక్తమితినదోషః - అథపాతసంభవ కాలమాహ॥ ప్రేక్ష్యఇతి- సంప్రతిసాంప్రతంవృద్ధితుర్యచరణే - వృద్ధియో గస్యచతుర్థచరణే తథాబ్రహ్మద్వయే- బ్రహ్మయోగస్యద్వితీయచరణే అ పమఃక్రాంతిః పాతోవిలోక్యః- బ్రహ్మసిద్ధాంతాద్యుక్తప్రకారేణవిలోక్య ఇత్యర్థః- అథమృత్యుంసప్వైత్రవర్జ్యమేదిత్యుక్తత్వాత్ - మృత్యుయోగమా హ॥ అర్కాద్యాఇతి ॥ అర్కాద్యాః- సూర్యాదయఃక్రమేణఅన్వాదిభిర్న క్షత్రైః సహమృత్యుదాస్స్యుః - అను- అనూరాధా- విశ్వేఉత్తరాషా- షాఢా- శతతారకా- యమలా- అశ్వినీ- ఇందుర్మృగః- అహిరాశ్లేషా-అ ర్క-భంహస్తః- ఏతదుక్తంభవతి- అర్కః - అనూరాధయాసహయుక్తో మృత్యుదః- సోమఉత్తరాషాఢయా-భౌమశ్శతతారకయా- బుధఅశ్విన్యా- గురుర్మృగేణ- శుక్రఆశ్లేషయా- శనిర్హస్తేనసహితోమృత్యుదస్స్యాదిత్య ర్థః॥ ఇతి ముహూర్తాదయః సమాప్తమ్.

—— (*) అథనక్షత్రేషువిషఘటికా ఆహ (*) ——

మూ॥ పంచాశ ౫౦ జ్జిన ౨౪ ఖాగ్నయశ్చ ౩౦ ఖకృతా ౪౦
ఆఖండలా ౧౪ మూర్ఛనా ౨౧ స్త్రింశ ౩౦ ద్ద్వింశ ౨౦
రదాః ౩౨ ఖరామ ౩౦ నఖ ౨౦ ధృత్యే ౧౮ కాశ్వి
నా ౨౧ వింశతిః ౨౦॥ శక్రే ౧౪ న్ద్రా ౧౪ దశ ౧౦ వా
సవా ౧౪ రసశరా ౫౬ స్సిద్ధాః ౨౪ నఖా ౨౦ శా
౧౦ దిశో ౧౦ ధృత్యే ౧౮ ష్టి ౧౬ జిన ౨౪ ఖాగ్నయో
౩౦ ఽశ్వితఇమాభ్యోఽగ్రేఽబ్ధి ౪ నాడ్యోవిషం॥ ౨౨॥

తా ॥ (ఈశ్లోకమునకు టీకవ్రాసినను తాత్పర్యమువలె సులభముగా తెలియదుకనుక టీకనువ్రాయక తాత్పర్యమునుమాత్రము వ్రాయుచున్నాను.) అశ్వినీనక్షత్రమునందు ౫౦ ఏబదిగడియలకు పిమ్మటను భరణీనక్షత్రమునందు ౨౪ ఇరువది నాలుగుగడియలకుపిమ్మటను కృత్తికానక్షత్రమునందు ౩౦ ముప్పది గడియలకుపిమ్మటను, రోహిణియందునలుబది ౪౦ గడియలకుపిమ్మటను, మృగశీర్షయందుపదునాలుగు ౧౪ పదునాలుగు గడియలకుపిమ్మటను, ఆర్ద్రయందు ఇరువదియొక్క ౨౧ గడియలకు పిమ్మటను, పునర్వసునందు ముప్పది ౩౦ గడియలకుపిమ్మటను, పుష్యమియందు ఇరువది ౨౦ గడియలకుపిమ్మటను, ఆశ్లేషయందుముప్పదిరెండు ౩౨ గడియలకుపిమ్మటను, మఖయందు ముప్పది ౩౦ గడియలకు పిమ్మటను, పుబ్బయందు ఇరువది ౨౦ గడియలకుపిమ్మటను, ఉత్తరయందుపదునెనిమిది ౧౮ గడియలకుపిమ్మటను, హస్తయందు ఇరువదొక్క ౨౧ గడియలకుపిమ్మటను చిత్తయందు ఇరువది ౨౦ గడియలకుపిమ్మటను, స్వాతియందు పదినాలుగు ౧౪ గడియలకుపిమ్మటను, విశాఖయందుపదునాలుగు ౧౪ గడియలకుపిమ్మటను, అనూరాధయందు పది ౧౦ గడియలకుపిమ్మటను, జ్యేష్ఠయందు పదునాలుగు ౧౪ గడియలకు పిమ్మటను, మూలయందు ఏబదారు ౫౬ గడియలకు పిమ్మటను, పూర్వాషాఢయందుఇరువదినాలుగు ౨౪ గడియలకుపిమ్మటను, ఉత్తరాషాఢయందు ఇరువది ౨౦ గడియలకుపిమ్మటను, శ్రవణమునందు పది ౧౦ గడియలకుపిమ్మటను, ధనిష్ఠయందు పది ౧౦ గడియలకుపిమ్మటను, శతభిషమునందు పదునెనిమిది ౧౮ గడియలకుపిమ్మటను, పూర్వాభాద్రయందు పదునారు ౧౬ గడియలకుపిమ్మటను, ఉత్తరాభాద్రయందు ఇరువదినాలుగు ౨౪గడియలకు పిమ్మటను, రేవతియందు ముప్పది ౩౦ గడియలకుపిమ్మటను నాలుగుగడియలకాలము విషగడియలనియును, ఈవిషగడియలయందు ఏకార్యమును చేయఁగూడదనియును, తెలియవలయును.



వ్యా ॥ అథవిషఘటికా ఆహ॥ పంచాశదితి ॥ అశ్వితస్సకాశాత్-నక్షత్రేషుఇమాభ్యః- పంచాశజ్జినేత్యాదిభ్యోఘటికాభ్యోఽగ్రేపరతోఽబ్ధి నాడ్యశ్చతుర్నాడ్యోవిషంస్యాత్- ఏతదుక్తంభవతి అశ్విన్యాఃపంచాశద్ఘటికాభ్యోనంతరం- చతుర్నాడ్యోవిషం- ఏవమన్యత్ - అత్రాంకన్యాస ఏవవ్యాఖ్యానం॥ ఇతినక్షత్రేషువిషఘటికాః సమాప్తమ్.

—— అథైషాంధ్రువకాణాంస్పష్టీకరణంవిషఘటికాపవాదంచాహ. ——

మూ॥ నక్షత్రస్యగతైష్యయోగగుణితస్స్వస్వధ్రువష్షష్టిహృ
త్స్యాత్తస్సాద్యదతఊర్ధ్వమబ్ధిఘటికాస్స్యుస్స్ఫుటాస్స్యురేవం
కృతాః చంద్రస్సౌమ్యభగోథవాశుభసుహృద్దృష్టోథవా
స్వాంశగః కోణా ౫-౯ స్తా ౭ భ ౧౦ సుఖే ౪ ష్వా విషభ
యంహంతీహసాంగేంఽగపః॥ ౨౩॥

టీక ॥ స్వస్వధ్రువః = అశ్విన్యాదినక్షత్రములయొక్క ధ్రువము, నక్షత్రస్య = నక్షత్రముయొక్క, గతైష్యయోగగుణితః = గతముయొక్కయును ఏష్యముయొక్కయును సంబంధముచేత గుణింపఁబడినదగుచు, షష్టిహృత్ = అరువదిచేత అపహరింపఁబడినది, స్యాత్ = అగును. అతఊర్ధ్వమ్ = దీనికంటెపిమ్మట, అబ్ధిఘటికాః = నాలుగుగడియలు, విషమ్= విషము, స్యాత్ = అగును. ఏవమ్ = ఇప్పుడుచెప్పఁబడినవిధముగా, కృతాస్సత్యః = చేయఁబడినవగుచు, స్ఫుటాః = స్ఫుటము చేయఁబడినవి, స్యుః = అగును, చంద్రః = చంద్రుఁడు, సౌమ్యభగః = శుభగ్రహరాశిని పొందినవాఁడగుచును, అథవా = ఇట్లుకాచేని, శుభసుహృద్దృష్టః= శుభులచేతను మిత్రులచేతను చూడఁబడినవాఁడగుచును, అథవా = ఇట్లుకాదేని, స్వాంశగః = స్వనవాంశమునుపొందినవాఁడగుచును, విషభయమ్= విషనాడులయొక్క భయమును, హంతి = నశింపఁజేయుచున్నాఁడు, కోణా ౫-౯-స్తా ౭ భ ౧౦ సుఖే ౪ షు = లగ్నమునకు అయిదుతొమ్మిది పది నాలుగు స్థానములయందు, (వర్తమానోవా = ఉన్నవాఁడైనను అగుచు,) విషభయమ్ = విషనాడులయొక్క భయమును, హంతి = నశింపఁజేయుచున్నాఁడు. అంగపః = లగ్నాధిపతి, సాంగే= లగ్నముతోఁగూడుకొనిన, కోణాస్తాభ్రసుఖేషు = అయిదు తొమ్మిది యేడు నాలుగుస్థానములయందు, వర్తమానస్సన్ = ఉన్నవాఁడగుచు, విషభయమ్ = విషనా

షులయొక్క భయమును, హంతి = నశింపఁజేయుచున్నాఁడు.

తా ॥ ఇఁకను ఈధ్రువకములకు స్పష్టీకరణమును విషఘటికాపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—అశ్విన్యాదినక్షత్రములయొక్క ధ్రువకమును నక్షత్రములయొక్క గతైష్యములయొక్క సంబంధముచేత గుణింపఁబడినదై యరువదిచేత భాగహరింపఁబడఁగా మిగిలినది స్పష్టమగును. ఈయరువదిగడియలకును పిమ్మట నాలుగుగడియలు విషగడియలగును. ఈవిధముగాఁ జేసినయెడల స్పష్టమగును. మఱియును, చంద్రుఁడు శుభగ్రహరాసులయందున్నను శుభులచేతను మిత్రులచేతను జూడఁబడినను స్వాంశను పొందినను, అయిదు తొమ్మిది యేడు పదినాలుగుస్థానములయందున్నను విషభయమును పోఁగొట్టుచున్నాఁడు. లగ్నాధిపతిలగ్నము అయిదు తొమ్మిది యేడు పది నాలుగు స్థానములయందుండెనేని విషనాడుల భయమును హరించును. మఱియును, అయితే, వివాహలగ్నమునకు సప్తమమందు గ్రహముండఁగూడదని నిర్ణయింపఁబడియుండఁగా సప్తమమందున్న చంద్రుఁడు విషభయమును పోఁగొట్టునని చెప్పితివి కదా? ఇట్లు చెప్పనగునా? అనియెదవేని చెప్పెదను. వినుము. ఇక్కడఁ జెప్పఁబడినది సామాన్యవిషయమనియును, కేవలవివాహవిషయము కాదనియును, తెలియవలయును. మఱియును, "శ్లో॥ చంద్రో విషఘటీదోషం హంతి కేంద్రత్రికోణగః । లగ్నం వినా శుభైర్దృష్టః కేంద్రే వా లగ్నపేతథా॥" (=లగ్నము తప్పఁ దక్కిన కేంద్రత్రికోణములయందున్న చంద్రుఁడు విషభయమును పోఁగొట్టును. శుభులచేత చూడఁబడినచంద్రుఁడుకూడ విషభయమును పోఁగొట్టును. లగ్నాధిపతి కేంద్రములయందుండెనేని విషభయమును పోఁగొట్టును.) అని బృహస్పతి చెప్పె. "శ్లో॥ విషనాడ్యుత్థితం దోషం హంతి సౌమ్యర్క్షగశ్శశీ । మిత్రదృష్టోథవా స్వీయవర్గస్థో లగ్నపోపిచ॥" (=చంద్రుఁడు సౌమ్యనక్షత్రమునందున్నవాఁడైనను, మిత్రులచేఁ జూడఁబడినవాఁడైనను, స్వర్గమునందున్నను, విషనాడులవలనఁ బుట్టినదోషమును నశింపఁజేయును. లగ్నాధిపతియును, సౌమ్యనక్షత్రములయందున్నను మిత్రులచేతఁ జూడఁబడినను, స్వవర్గములయందున్నను, విషనాడులవలన బుట్టినదోషమును నశింపఁజేయుచున్నాఁడు.) అనిఫలప్రదీపమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ నక్షత్రస్యేతి॥ నక్షత్రస్య గతైష్యయోగేన గుణితః- స్వస్వధ్రువః షష్టిహృత్ స్పష్టస్స్యాత్- అతఊర్ధ్వం స్పష్టధ్రువానంతరం- అబ్ధిఘటికాశ్చతుర్నాడ్యః విషం స్యాత్- ఏవముక్తప్రకారేణ కృతాస్సత్యస్స్పష్టాస్స్యుః- ఏతదుక్తం భవతి- ధ్రువవచ్చతుర్నాడ్యోపి నక్షత్రగతైష్యయోగగుణితాః కార్యాః- షష్టిహృతాః కార్యాః- తాః స్పష్టాస్స్యుః- స్పష్టానంతరం చతుర్నాడ్యో విషాఖ్యా జ్ఞేయాః॥ అథ విషఘటీనామపవాదమాహ చంద్ర ఇతి॥ చంద్రః సౌమ్యభగః- శుభగ్రహరాశిగస్సన్ విషభయం హంతి అథవా శుభసుహృద్దృష్టః శుభైశ్చ సుహృద్భిశ్చ దృష్టస్సన్ విషభయం హంతి- అథవా స్వాంశగః- స్వనవాంశే వర్తమానస్సన్ విషభయం హంతి వా ఇత్యథవా కోణాస్తాభ్రసుఖగోపి చంద్రో విషభయం హంతి- కోణే- పంచమనవమే ౫-౯ అస్తభం- సప్తమం- అభ్రం- దశమం- సుఖం- చతుర్థం ఏతత్స్థానగోపి చంద్రో విషభయం హంతీత్యర్థః- అస్మిన్ కోణాదిస్థానేషాం గేలగ్నేవర్తమానః- అంగపో లగ్నపో విషభయం హంతీత్యర్థః - ఏవం షష్ఠ్యాం భంగాస్సంతి- ననుసప్తమఖేటో వివాహే నిందితః - కథమత్ర చంద్రో గృహీతః- సత్యమిదం వాక్యం సర్వకర్మసాధారణం - తస్మాన్నిందితం స్థానం వర్జయిత్వాన్యత్ర గ్రాహ్యాః- తథా చ బృహస్పతిః॥ శ్లో॥ చంద్రో విషఘటీదోషం హంతి కేంద్రత్రికోణగః । లగ్నం వినా శుభైర్దృష్టః కేంద్రే వా లగ్నపేతథా॥ ఫలప్రదీపే॥ విషనాడ్యుత్థితం దోషం హంతి సౌమ్యర్క్షగశ్శశీ । మిత్రదృష్టోథవా స్వీయవర్గస్థో లగ్నపోపిచ॥ ఇతి ధ్రువకస్పష్టీకరణవిషఘటికాపవాదౌ.

——(✻) అథ వివాహలగ్నే ఇష్టానిష్టగ్రహానాహ. (✻)——

మూ॥ లగ్నే చంద్రఖలారిపౌ శశిసితౌ సర్వే వ్యయే నేఖే బుధో
జ్ఞాఽన్త్యే గురుస్సుఖగోష్టమాః కుజశుభా శ్శుక్రస్తృతీయశ్శుచే । లాభే సర్వఖగాశ్శుభా అఖిలగా స్త్రిష్వష్టారి గా
స్సూర్యఖలా శ్చంద్రస్త్ర్యమ్బుధనే త్రియేం శభదృగేట్స్వాయే
స్సూర్యస్యేష్టారిగః॥ ౨౮॥

టీక ॥ చంద్రఖలాః = చంద్రుఁడును పాపగ్రహములును, లగ్నే = లగ్నమునందు, (వర్తమానాస్సంతః = ఉన్నవారగుచు) శుచే = దుఃఖము కొఱకు, భవంతి = అగుచున్నారు, రిపౌ = షష్ఠస్థానమునందు, శశిసితౌ = చంద్రశుక్రులు, (వర్తమానౌసంతౌ = ఉన్నవారగుచు,) శుచే = దుఃఖము కొఱకు, భవతః = అగుచున్నారు, సర్వే = గ్రహములన్నియును, వ్యయే = సప్తమస్థానమునందు, (వర్తమానాస్సంతః = ఉన్నవారగుచు,) శుచే = దుఃఖముకొఱకు, భవంతి = అగుచున్నారు, ఖే = దశమస్థానమునందు, బుధః = బుధుఁడు, (స్థితస్సన్ = ఉన్నవాఁడగుచు,) శుచే = దుఃఖము

కొఱకు, భవతి = అగుచున్నాఁడు, అబ్జః = చంద్రుఁడు, అంత్యే = ద్వాదశమందు, వర్తమానస్సన్ = ఉన్నవాఁడగుచు, శుచే = దుఃఖముకొఱకు, భవతి = అగుచున్నాఁడు, అగుః = రాహువు, సుఖగస్సన్ = నాల్గవస్థానమును పొందినవాఁడగుచు, శుచే = దుఃఖముకొఱకు, భవతి = అగుచున్నాఁడు, అష్టమాః = ఎనిమిదవస్థానమునందున్న, కుజశుభాః = కుజుఁడును, శుభులును, శుచే = దుఃఖముకొఱకు, భవంతి = అగుచున్నారు, తృతీయః = మూఁడవస్థానమునందున్న, శుక్రః = శుక్రుఁడు, శుచే = దుఃఖముకొఱకు, భవతి = అగుచున్నాఁడు, లాభే = లాభస్థానమునందు సర్వఖగాః = అన్నిగ్రహములు, శ్రియై = సంపదకొఱకు, భవంతి = అగుచున్నారు, శుభాః = శుభులు, అఖిలగాః = నింద్యస్థానముతప్పఁదక్కిన స్థానమును పొందినవారై, శ్రియై = సంపదకొఱకు, భవంతి = అగుచున్నారు, ఖలాః = దుర్మార్గులు, త్ర్యష్టారిగాః = మూఁడు ఎనిమిదిఆరుస్థానములను పొందినవారు, స్యుశ్చేత్ = అయిరేని, శ్రియై = సంపదకొఱకు, భవంతి = అగుచున్నారు, ఖలాః = దుష్టులు, త్ర్యష్టారిగాః = మూఁడు ఆఱు ఎనిమిది స్థానములనుపొందినవారు, స్యుశ్చేత్ = అయిరేని, శ్రియై = సంపదకొఱకు, భవంతి = అగుచున్నారు, చంద్రః = చంద్రుఁడు త్ర్యంబుధనే = మూఁడు నాలుగు రెండు స్థానములయందు, స్థితస్సన్ = ఉన్నవాఁడగుచు, శ్రియై = సంపదకొఱకు, భవతి = అగుచున్నాఁడు, అంశభదృగేట్ = నవాంశలగ్నద్రేక్కాణములకు అధిపతియగువాఁడు, అష్టారిగః = ఎనిమిది ఆఱు స్థానములను పొందినవాఁడై, మృత్యవే = మృత్యువుకొఱకు, స్యాత్ = అగును.

తా॥ ఇఁకను వివాహలగ్నమునందలి యనిష్టగ్రహములను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—చంద్రుఁడు క్రూరగ్రహములును లగ్నమునందుండిరేని దుఃఖమునుకలుగఁజేయుదురు. షష్ఠస్థానమునందు చంద్రశుక్రులుండిరేని దుఃఖమును కలుగఁజేయుదురు. క్రూరగ్రహములయినను సౌమ్యగ్రహములయినను సప్తమమందుండిరేనిదుఃఖమును కలుగఁజేయుదురు. బుధుఁడు పదియవస్థానమునందుండెనేని దుఃఖమును కలుగఁజేయును. చంద్రుఁడు ద్వాదశమందుండెనేని దుఃఖమును కలుగఁజేయును. రాహువు చతుర్థస్థానమునందుండెనేని దుఃఖముఁ కలుఁగును. అష్టమమందు శుభగ్రహములును కుజుఁడును కలిగియుండిరేని దుఃఖమును కలిగింతురు. మూఁడవస్థానమునందున్న శుక్రుఁడు దుఃఖమును కలిగించును. ఇఁకను ఇష్టగ్రహ-



ములను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఏకాదశస్థానమునందు శుభగ్రహములుండిరేని శుభమును కలుగఁజేయుదురు. సకలశుభగ్రహములునునింద్యస్థానమునువదలి సకలస్థానములయందును శుభమునుకలుగఁజేయుదురు. పాపగ్రహములు మూఁడు ఆఱు పదునొకండు స్థానములయందుండిరేని శుభములను కలుగఁజేయుదురు. అంగారకుఁడుతప్పఁదక్కిన పాపగ్రహములు అష్టమస్థానమునందుండిరేని శుభములను కలుగఁజేయుదురు. చంద్రుఁడు మూఁడు నాలుగు రెండుస్థానములయందుండిరేని శుభములనుకలుగఁజేయుదురు. నవాంశీయును, లగ్నాధిపతియును,నవాంశాధిపతియును, ద్రేక్కాణాధిపతియును, అష్టమస్థాన షష్ఠస్థానములయందుండిరేని మృత్యువును కలిగింతురు.

వ్యా॥ అథవివాహలగ్నేఽనిష్టాన్ గ్రహానాహ॥ చంద్ర ఖలాశ్చేతి చంద్రఖలాః- లగ్నేవర్తమానాః- శుచే- శోకాయభవంతి- తథారిపౌష్ఠే- విధుసితౌ- చంద్రశుక్రౌ- తథాసర్వేక్రూరసౌమ్యాఃద్యూన్యే - సప్తమే- తథాఖే- దశమే- బుధః- తథాఽబ్జశ్చంద్రోంత్యే- అగుః- రాహుః- సుఖగశ్చతుర్థగః- నవిద్యంతేగావః కిరణాః యస్యేత్యగుః- తమోగుశ్చేతి-బృహజ్జాతకే- రాహునామాని- తథాఽష్టమాః- అష్టమస్థాః- కుజశుభాః- కుజశ్చశుభాశ్చతేతథా- శుక్రస్తృతీయ ఇతిస్పష్టార్థః- ఏతేప్రత్యేకంఉక్తస్థానగాః- శుచే- శోకాయ- భవంతి- అథఇష్టానాహ ॥ లాభేఏకాదశే- సర్వఖగాః- తథాసౌమ్యాః- శుభగ్రహాః- అఖిలగాః - నింద్యంవినాసర్వస్థానగాః- తథాఖలాః- క్రూరాః- అరిష్టగాః- తృతీయాష్టషష్ఠగాః-తత్ర అష్టమభౌమో నిందితః- తంవినాపాపా అష్టగాహ్యాః- చంద్రస్త్ర్యంబుధనే- తృతీయచతుర్థద్వితీయేచంద్రః- ఏతేప్రత్యేకంశ్రియై- లక్ష్మ్యైశ్వర్య- భవంతి-శ్రీకారకాఇత్యర్థః- ఏవంశుభాశుభగ్రహానుక్త్వాతత్రవిశేషమాహాఽంశభదృగేట్- అష్టారిగస్సన్మృత్యవేస్యాత్- అంశోనవాంశః - భంలగ్నం దృక్కోఽ-దృగణః- ఏషామిట్స్వామీ- నవాంశస్వామీ- లగ్నస్వామీదృక్కాణస్వామీ ఏతేప్రత్యేకం అష్టషష్ఠగాః - మృత్యుహేతవో భవంతీత్యర్థః॥ ఇతివివాహలగ్నే ఇష్టానిష్టగ్రహాః సమాప్తమ్.

అథభృగుషష్ఠాపవాదం కుజాష్టమదోషాపవాదంద్వాదశషష్ఠచంద్రాపవాదం సగ్రహచంద్రదోషాపవాదంచాహ.

మూ॥ కన్యాతౌలిక శత్రు గేహగభృగు ష్షష్ఠోపినో భంగకృ
ద్భౌమోమృత్యుగతోఽపిశత్రుశశినోర్గేహస్థితో వారక-

గః । శుక్లేంత్యాది విధుస్సువర్గ దృగిత స్సోఽవ్యాజోయుజే
జ్యేతనౌ శుక్రేవా శుభదోథకంటకనిజాంశేజ్యేక్షితస్స
గ్రహః॥ ౨౫॥

టీక ॥ కన్యాతౌక్షికశత్రుగేహగః = కన్య, ధనుస్సు, శత్రువులగృహములగు కటక సింహములు అనువానిని పొందిన, భృగుః = శుక్రుఁడు, షష్ఠోపి = షష్ఠస్థానమును పొందినప్పటికిని, భంగకృత్ = భంగమునుచేయువాఁడు, నో = కాఁడు, భౌమః = అంగారకుఁడు, మృత్యుగతోపి = ఎనిమిదవయింటియందున్నప్పటికిని, శత్రుశశినోః = శత్రువగు బుధునియొక్కయును చంద్రునియొక్కయును, గేహస్థితోవా = గృహములయందున్నను, అర్కగోవా = సూర్యునిపొందినను, భంగకృత్ = భంగమునుకలుగఁజేయువాఁడు, నో = కాఁడు, శుక్లే = శుక్లపక్షమునందు, అంత్యారివిధుః = ద్వాదశ షష్ఠస్థానములయందున్న చంద్రుఁడు, సువర్గదృగితః = శుభగ్రహములయొక్క వర్గమును చూపును పొందినవాఁడై, సోఽవ్యాజోయుజి = అధికమైనబలముతోఁగూడిన, ఇజ్యేవా = గురుఁడైనను, శుక్రేవా = శుక్రుఁడైనను, తనౌ సతి = లగ్నమునందున్నవాఁడగుచునుండఁగా, శుభదః = శుభమునిచ్చువాఁడు, స్యాత్ = అగును, అథ = పిమ్మట, సగ్రహః = బుధ గురువులుతప్పఁ దక్కినగ్రహములతోఁగూడిన, (చంద్రః = చంద్రుఁడు) కంటకనిజాంశేజ్యేక్షితః = కేంద్రములయందును నిజాంశయందును ఉన్న గురునిచేతఁ జూడఁబడినవాఁడై, శుభదః = శుభమునిచ్చువాఁడు, స్యాత్ = అగును.

తా ॥ ముందుగా శుక్రషష్ఠదోషమునకు అపవాదమును చెప్పుచున్నాఁడు ఎట్లనిన:—కన్య కటక సింహములు ధనుస్సు అను స్థానములలో ఏదోయొకస్థానమునందున్న శుక్రుఁడు షష్ఠస్థానమునందున్నప్పటికిని భంగమును కలుగఁజేయువాఁడు కాఁడు. "శ్లో॥ నీచగేతత్తురీయేవా శత్రుక్షేత్రగతోపివా। భృగుష్షష్ఠోద్భవో దోషో నాస్త్యత్ర సంశయః॥" (=శుక్రుఁడు నీచయందైనను ధనుస్సునందైనను శత్రుక్షేత్రములగు కటకసింహములయందైనను ఉండఁగా షష్ఠస్థానమునందుండెనేని ఆషష్ఠస్థానమందున్నదోషము లేదనుటయందు సంశయములేదు.) అని కాశ్యపుఁడుచెప్పె. ఇఁకను కుజాష్టమ దోషాపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—అంగారకుఁడు అష్టమస్థానమునందున్నప్పటికిని శత్రువగు బుధునియొక్కగృహములగు కన్యామిథునములయందును చంద్రునియొక్క గృహమగు



కర్కటమందునుడున్నను అస్తంగతుఁడైయున్నను అష్టమ స్థానమునందున్నదోషమునుకలిగింపఁడని యెఱుఁగవలయును. "శ్లో॥ అస్తగే నీచగే భౌమ శ్శత్రుక్షేత్ర గతోపివా । కుజాష్టమో ద్భవోదోషో నకించి దవశిష్యతే॥" (=అంగారకుఁడు అస్తమయమును పొందినప్పుడును నీచయందున్నప్పుడును శత్రువగు బుధునియొక్క క్షేత్రములగుకన్యామిథునములయందున్నప్పుడును అష్టమస్థానమునందున్నందువలనఁ గలిగెడుదోషమును కలిగింపఁడు.) అని స్మృతిచెప్పుచున్నది. ఇఁకను చంద్రుఁడు షష్ఠద్వాదశములందున్నందువలనఁ గలిగినదోషముయొక్క అపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—శుక్లపక్షమునందు ద్వాదశషష్ఠములయందున్నవాఁడైశుభగ్రహములయొక్క వర్గములయందున్నను, శుభగ్రహములచేతఁ జూడఁబడినను, గురుఁడైనను శుక్రుఁడైనను బలవంతులై లగ్నమునందుండఁగా ఆ చంద్రషష్ఠద్వాదశ దోషములేదని యెఱుఁగవలయును. "శ్లో॥ కవౌ గురౌ వా బలినిస్థితే తనౌ శుభేనదృష్ట శ్శుభవర్గగశ్శశీ। వివర్ధమాన శ్శుభకృచ్చనాశుభంకరోతిత్రిష్వన్నచరిఃఫషష్ఠయోః॥" (=శుక్రుఁడైనను గురుఁడైనను బలవంతుఁడై లగ్నమునందుండఁగా శుక్లపక్షచంద్రుఁడు శుభులచేతఁజూడఁబడుచు శుభవర్గములయందుండఁగా షష్ఠద్వాదశస్థాన స్థితుఁడయ్యెనేని యశుభమును చేయఁడనియును, శుభమునేచేయుననియును, తెలియవలయును.) అని ముహూర్తదర్పణమునందుఁజెప్పఁబడెను. ఇఁకను సగ్రహచంద్రదోషాపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—గురుబుధులుతప్పఁ దక్కినగ్రహములతోఁగూడిన చంద్రుని కేంద్రనిజవర్గములయందున్న గురుఁడుచూచెనేని గురుబుధులుతప్పఁ దక్కినగ్రహములతోఁగూడిన చంద్రుఁడు శుభమును జేయువాఁడేయగునుగాని యశుభమును జేయువాఁడు కానేరఁడు. "శ్లో॥ గురుస్స్వకీయవర్గస్థో బలవాన్కంటకాశ్రితః । పశ్యన్సగ్రహశీతాంశుం తద్దోషం విలయం నయేత్॥" (=గురుఁడుబలవంతుఁడై స్వవర్గములనపొంది కేంద్రగతుఁడగుచు గ్రహములతోఁగూడినచంద్రుని జూచెనేని సగ్రహచంద్రదోషమును పోఁగొట్టును.) అని స్మృతియందుఁ జెప్పఁబడెను.

వ్యా ॥ ప్రథమం భృగుషష్ఠాపవాదమాహ॥ కన్యేతి ॥ కన్యాప్రసిద్ధా- శుక్రస్యనీచం- తౌక్షికో ధనుర్ధరః- శత్రుగేహం పూర్వోక్తం- భృగుభువశ్శత్రూ రవిందూ ఇతి॥ తత్ర రవేర్గృహం సింహః- ఇందోర్గృహం కర్కః ఏషాం కన్యాదీనాం అన్యతమ గేహగతో భృగుః- షష్ఠోపి నో భంగకృత్- ల

గ్నభంగకరోనభవతీత్యర్థః- తథాచకశ్యపః॥ శ్లో॥ నీచగేత త్తురీ మేవాశత్రుక్షేత్రగతోపివా । భృగుషష్ఠోద్భవోదోషో నాస్తీత్యత్రసంశయః॥ అథకుజాష్టమదోషాపవాదమాహ॥ భౌమోమృత్యుగతోపి అష్టమగతోపి శత్రుశశినోర్గేహస్థితోపియదిభవతివా ఇత్యథవా- అర్కగః- అస్తంగతోపియదిభవతితదానోభంగకృత్స్యాత్- అస్యశత్రుర్బుధః- కుజస్యవిదగిరి తిప్రాగుక్తః- తస్యగృహంకన్యామిధునంచ- శశిగృహంకర్కటకః, తస్యనీచం- ఏషామన్యతమశ్చ- అస్తంగతోవా- అష్టమగతోపివాలగ్నభంగకరోనభవతీత్యర్థః॥ శ్లో॥ అస్తగేనోచ్చగేభౌమ శ్శత్రుక్షేత్రగతోపివా । కుజాష్టమోద్భవోదోషో నకించిదవశిష్యతే ఇతి॥ అథద్వాదశషష్ఠచంద్రాపవాదమాహ॥ శుక్లేతి॥ శుక్లే- శుక్లపక్షే-అంత్యారివిధుః- ద్వాదశషష్ఠచంద్రః- సువర్గదృగితః- వర్గశ్చదృశశ్చవర్గదృశః- శోభనానాంవర్గదృశః - సువర్గదృశః- ఇతఃప్రాప్తః సువర్గదృగితః- శుభవర్గశుభదృష్టియుతఇత్యర్థః-ఏవంవిధోవిధుః- శుభదస్స్యాత్- కస్మిన్స- ఇజ్యేగురౌశుక్రేవా- తనౌ-లగ్నేసతి- కథంభూతేగురౌ- స్వోజోయుజి- సుతరామోజః- స్వోజః- ఉత్కృష్టంబలం- తేనయుక్తీతిస్వోజోయుక్- తస్మిన్ స్వోజోయుజి- అతిబలిష్ఠేసతీత్యర్థః- శుక్రస్యాప్యేతద్విశేషణం- ఏతదుక్తంభవతి బలిష్ఠేగురౌ శుక్రేవా లగ్నస్థేసతి శుక్లపక్షేచంద్రమాః- సువర్గదృష్టిసహితోయదిభవతితదాద్వాదశషష్ఠగోపిశుభదఇతిభంగకరోనస్యాత్ - అన్యథాన - ముహూర్తదర్పణే ॥ శ్లో॥ కవౌగురౌవాబలినిస్థితేతనౌ శుభేసదృష్టశ్శుభవర్గగశ్శశీ । వివర్ధమానశ్శుభకృచ్ఛనాశుభంకరోతినిష్ఠస్సచరిఃషష్ఠయోరితి॥ అథసగ్రహచంద్రదోషాపవాదమాహ॥ సగ్రహః- గ్రహేణ- గ్రహాభ్యాం- గ్రహైర్వాసహవర్తమానః సగ్రహః- బుధగురువర్జ్యం అన్యగ్రహయుక్త ఇత్యర్థః - యుతః పూర్వముక్తం- హిమరుచిర్జ్ఞేజ్యోనఖేటాన్వితమితి- ఏవంవిధః- విధుః- సగ్రహః కేన్ద్రనిజవర్గేజ్యేక్షితస్సన్ శుభదస్స్యాత్- కేన్ద్రం- ప్రసిద్ధం- నిజవర్గోనిజాంశః- తత్రవర్తమానోఇజ్యః- కేన్ద్రనిజవర్గేజ్యః- తేనఈక్షితః- అవలోకితః- సగ్రహః - చన్ద్రమాశ్శుభదఃభంగకరోనస్యాత్- ఉక్తంచ॥ శ్లో॥ గురుస్స్వకీయవర్గస్థో బలవాన్కంటకాశ్రితః । పశ్యన్సగ్రహశీతాంశుం తద్దోషంవిలయంనయేదితి॥ ఇతిభృగుషష్ఠాపవాదాదయస్సమాప్తమ్.

### ※ అథసామాన్యదోషాపవాదంతద్భంగంచాహ. ※

ము॥ దోషాణాం శతమిందుజ శ్శతయుగం శుక్రోగురు ర్ఘాతయే ల్లక్షంకంటక కోణగోంగమిన చంద్రౌజస్వీ పాతాది కాన్ । భంగాయేవి బలానతేత్ర సఫలా స్సన్ధ్యంశ తుల్యోఫల స్స్యాద్భావాంశ సమోగ్రహో ఖిల ఫలస్సం ధ్యార్ధ్వగస్స్యాత్పరః॥ ౨౬॥

టీక ॥ కంటకకోణగః = కేంద్రకోణములనుపొందిన, ఇందుజః = బుధుఁడు, దోషాణామ్ = దోషములయొక్క, శతమ్ = నూటిని, ఘాతయేత్ = నశింపఁజేయును, శుక్రః = శుక్రుఁడు, కంటకకోణగః = కేంద్రకోణములను పొందినవాఁడై, దోషాణామ్ = దోషములయొక్క, శతయుగమ్ = రెండునూరులను, ఘాతయేత్ = నశింపఁజేయును, కంటకకోణగః = కేంద్రకోణములను పొందిన, గురుః = గురుఁడు, దోషాణామ్ = దోషములయొక్క, లక్షమ్ = లక్షను, ఘాతయేత్ = నశింపఁజేయును, ఇనచంద్రౌజస్వీ = సూర్యచంద్రులయొక్క బలముకల, అంగమ్ = లగ్నము, పాతాదికాన్ = పాతమొదలుగాఁగల దోషములను, ఘాతయేత్ = నశింపఁజేయును, భంగాః = దోషభంగములు, యే = ఏవి, సంతి = కలవో తే = అవి, విబలాశ్చేత్ = బలరహితములయిన వయ్యేనేని, అత్ర = ఈ దోషభంగమందు, సఫలాః = సఫలములయినవి, న = కావు, సంధ్యాంశతుల్యః = సంధిభాగమునకు సమానమైనగ్రహము, అఫలః = ఫలరహితుఁడు, స్యాత్ = అగును, భావాంశసమః = భావాంశమునకు సమానమైన, గ్రహః = గ్రహము, అఖిలఫలః = సకలఫలమునిచ్చువాఁడు, స్యాత్ = అగును, సంధ్యూర్ధ్వగః = సంధిభాగలకుపిమ్మటభాగములనుపొందినగ్రహము, పరః = పిమ్మటిభావఫలమునిచ్చువాఁడు, స్యాత్ = అగును.

తా ॥ ఇఁకను సామాన్యదోషాపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—బుధుఁడు కేంద్రకోణములయందుండెనేని నూరుదోషములను నశింపఁజేయును. శుక్రుఁడు కేంద్రకోణములయందుండెనేని రెండునూరుల దోషములను నశింపఁజేయును. గురుఁడు కేంద్రకోణములయందుండెనేని లక్షదోషములను నశింపఁజేయును. లగ్నము సూర్యచంద్రులయొక్క బలముకలదయ్యేనేని పాతాదిదోషములనునశింపఁజేయును. "శ్లో॥ ఏకార్గళోప గ్రహపాతలత్తా జామిత్రకర్త ర్యుదయాదిదోషాః। నశ్యంతిచంద్రార్క బలోపపన్నే లగ్నేయథార్కాభ్యుదయేంధకారః॥" (లగ్నము సూర్యచంద్రులయొక్క బలముకలదగుచునుండఁగా ఏకార్గళము ఉపగ్రహము పాతలత్త జామిత్రకర్తరి మొదలుగాఁగల దోషములన

తోసివేసి మిగిలినదానిని ఆఱుభాగములుచేసి యొకభాగమును తోసివేసి లగ్నచతుర్థములయందు చేర్చినయెడల సంధులగును. వీనిలో ఆఱురాసులను చేర్చినయెడల ఇతరభావములగును. ఇది స్థూలమార్గమనియును, సూక్ష్మమార్గముచేత భావశోధనను సర్వార్థచింతామణియందును జాతక పారిజాతమునందును జూచికొనవలసినదనియును, ఎఱుఁగవలయును.

వ్యా॥ సంధ్యంశతుల్య ఇత్యాద్యుక్తం తత్ర కేతేసంధయః కేతే భావా ఇత్యపేక్షాయాం తత్సంధానం కించిత్స్థూలమేకేన వృత్తేనాహ॥ భాగాస్స్యురితి॥ నతనాడికారసహతా భాగాస్స్యుః। నతసాధనంజాతకపద్ధతౌ వ్యక్తం - రాత్రిశేషమితం యుతం దినదలేనాహ్నాగతం శేషకంసన్నిశేష్యంఖలుపూర్వపశ్చిమనతమితి॥ ఏతదుక్తం భవతి॥ సూర్యోదయకాలాద్యాం ఇష్టకాలం సాధయిత్వా నతంచ సాధయిత్వా తదిష్టకాలభవం నతం షడ్గుణం నతభాగాస్స్యురిత్యర్థః॥ ప్రాక్పశ్చిమేన తేనక్రమేణ తస్మాద్యాన యుక్తస్సార్ధ్యో త్రైరాశికగత్యా వ్యస్తయుక్ పూర్వనతే సతి న్యూనః - పశ్చిమనతే సతియుక్ యుక్తః - తత్కాలికసూర్యస్ఖం స్యాత్ - దశమభావస్స్యాదిత్యర్థః - తథాఖం దశమభావం సససం - షడాశియుక్తం సత్ - సుఖం - చతుర్థభావస్స్యాత్ - కథితం జ్ఞేయం - తల్లగ్నం షష్ఠంషడాశియుక్తం సత్ - సుధః సప్తమభావస్స్యాత్ - ఏవం భావచతుష్టయం సాధయిత్వా అంతరాళే సాధనమాహ॥ వ్యస్తాభ్రాదిలవ ఇతి॥ విగతైరస్తైః అస్తభావో యస్మాత్తత్ వ్యస్తం తస్యచ్యుతత్ అభ్రాంచ వ్యస్తాభ్రాం - సప్తమభావరహిత దశమభావ ఇత్యర్థః - తస్య త్రిలవో గారాశ్యాదికో గాదిస్యాత్ - అథద్వ్యక్స్యత్ర - ద్విపతితః - కార్యః - ఏతౌ ఉభౌ కేవలత్రిలవద్వ్యక్స్యతత్రిలవౌ పృథక్పృథక్ దృష్ట్వా సతౌ పృథక్పృథక్ లగ్నే అంబుని చయోజ్యౌ - అయమర్థః - షష్ఠత్రిలవో లగ్నే యోజ్యః - సద్వితీయభావో భవతి - ద్వ్యగ్నో లగ్నే యోజితః తృతీయభావో భవతి - అథద్వ్యక్స్యతత్రిలవః - కుష్ఠ అంబుని - పూర్వస్మిన్ చతుర్థభావే యోజితః - పశ్చమభావో భవతి - ద్వ్యగ్నోంబుని యోజితః షష్ఠభావో భవతి - తేషుడనగతాః సాధితా భావాః షడ్రాశియుక్తాః - తేషుసప్తమాఖ్యేయాః - లగ్నషష్ఠం పదమితి - పశ్చాల్లగ్నము ఖలగ్నాదయో భావాస్స్యుః అథసంధినాధనమాహ॥ సంధిర్ద్వయోర్గో ష్ఠితమితి ద్వయోః భావయోర్మధ్యగః అర్ధితస్సంధిర్భావస్స్యాత్। అత భావాంతరస్యనావ్యఖ్యా - వ్యస్తేతి॥ సప్తమభావరహితస్య దశమభావస్య



అరిలవః - షడ్భానో రాశ్యాదికః - పృథక్పృథక్ భూచ్యుతః - ఏకస్మాత్పతితః - ఇమావుభౌ భూయః వారంవారం అంగపాతాలయోః - ప్రథమచతుర్థభావయోః - క్షేప్యౌ తనుతః-లగ్నాత్ - ససంధయః - సంధసహితాః - షడ్భావాస్స్యుః - ఇమే భావాః- షడ్భాన్వితాః - పరేససంధయో భావాస్స్యుః - ఏవం భావసంధిసాధనంకృత్వా సంధ్యంశతుల్యోఫల ఇతి ప్రాగుక్తం గ్రహఫలం - విచార్యం అంతరే అనుపాతః - భావసంధ్యంతరేణాప్తం ఖేటసంధ్యంతరాత్ఫలమితి జాతకపద్ధతేః - ఏతత్స్థూలభావానయనం సూక్ష్మంతు జాతకపద్ధతావవగంతవ్యం॥ ఇతి సంధిలక్షణ భావలక్షణే సమాప్తమ్.

(*) అథ కర్తరీదోషలక్షణం సాపవాదమాహ. (*)

మూ॥ ఇందోర్వాహరిజాద్వ్యయస్వగతయోస్స్యాత్క్రూరయోఃకర్తరీ స్వేవక్ర్యంత్యఋజుర్మహత్యథగురౌరిఃఫేశుభేవాతనౌ। స్వేబ్జేసౌమ్యఖగేపివా గురుభృగుజ్ఞైఃకేంద్రకోణేషు వాచేన్నోః కర్తరికారకౌ దివిచరౌనీచస్థితౌ సానహి॥ ౨౮॥

టీక॥ ఇందోర్వా=చంద్రునకైనను, హరిజాద్వా = లగ్నమునకైనను, క్రూరయోః=క్రూరగ్రహములు, వ్యయస్వగతయోస్సతోః = పదిరెండవస్థానమునైనను ద్వితీయస్థానమునైనను పొందినవారగుచునుండఁగా, కర్తరీ=కర్తరియనుదోషము, స్యాత్=అగును. స్వే=ద్వితీయస్థానమునందు, వక్రీ=వక్రగ్రహమును, అంత్యే = ద్వాదశస్థానమునందు, ఋజుః= ఋజుగతిగల గ్రహమును, అస్తిచేత్=ఉన్నయెడల, మహతీ=అధికమైన, కర్తరీ=కర్తరియనుదోషము, స్యాత్=అగును. గురౌ=గురుఁడు, రిఃఫేసతి= పదిరెండవస్థానమునందున్నవాఁడగుచునుండఁగా, కర్తరీ = కర్తరియనుదోషము, న=లేదు. తనౌ=శరీరమునందు, శుభేవా = శుభుఁడుకలుగుచునుండఁగానైనను, కర్తరీ=కర్తరియనుదోషము, న=లేదు. స్వే=ద్వితీయస్థానమునందు, అబ్జేసతి=చంద్రుఁడుకలిగియుండఁగానైనను, సౌమ్యఖగేపివా=సౌమ్యగ్రహము కలిగియుండఁగానైనను, గురుభృగుజ్ఞైః = గురుశుక్రబుధులచేత, కేంద్రకోణేషువా = కేంద్రకోణములయందుండఁగానైనను, న=లేదు. కర్తరికారకౌ = కర్తరిని కలుగఁజేయునట్టి, దివిచరౌ= గ్రహములు, నీచస్థితౌసంతౌ = నీచయందున్నవారగుచునుండఁగా, సా= ఆకర్తరియనుదోషము, న=లేదు.

తా॥ ఇఁకను కర్తరీదోషమును ఆదోషాపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—చంద్రలగ్నమునకైనను లగ్నమునకైనను ద్వితీయ ద్వాదశములయందు క్రూరగ్రహములుండఁగా కర్తరియనుదోషము కలుగును. ఆద్వితీయ ద్వాదశస్థానములలో నున్నవారిలో ద్వితీయస్థానమునందున్న గ్రహము వక్రించినదియును పదిరెండవస్థానమునందున్న గ్రహము ఋజుగతికలదియును అయియున్నయెడల మహాకర్తరియనఁబడును. ఇఁకను ఈదోషభంగమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:...గురుఁడు ద్వాదశమునందున్నను, లగ్నమునందు శుభగ్రహమున్నను, చంద్రుఁడు ద్వితీయమునందున్నను, ద్వితీయస్థానమునందు శుభగ్రహమున్నను, గురుశుక్రబుధులు కేంద్రకోణములయందున్నను, కర్తరిని కలుగఁజేయునట్టిగ్రహములు నీచయందున్నను, కర్తరియను దోషములేదని యెఱుఁగవలయును.

వ్యా॥ ఇందోర్వేతి॥ ఇందోశ్చంద్రాత్సకాశాత్-వాఇతి- అథవా-హోరిజాల్లగ్నాత్ సకాశాద్వ్యయ - ౧౨ - స్వ - ౨ - గతయోః ఉభయత్రగతయోఃక్రూరయోః పాపగ్రహయోస్సతోః - కర్తరీస్యాత్- అథ మహాకర్తరీలక్షణమాహ ॥ స్వేవ్యయేస్థితః - క్రూరః యదివక్రీస్యాత్ అంత్యేద్వాదశేస్థితఃక్రూరః ఋజుః మార్గగామీస్యాత్ - తదామహతీ కర్తరీస్యాత్ - ఏవం కర్తరీలక్షణ ముక్త్వా తద్భంగమాహ॥ గురౌరిఃఫే ప్రాంత్యేసతిసాకర్తరీనస్యాదేవేత్యేకోభంగః - వాఇతి - అథవా-శుభే గ్రహే - బుధశుక్రాణా మన్యతమే - తనౌలగ్నేసతిసానేతి ద్వితీయోభంగః - స్వేద్వితీయే- అబ్జేసతిసానేతి తృతీయోభంగః - వాఇత్యథవా- సౌమ్యఖగే ద్వితీయేసతిసానేతి చతుర్థోభంగః - వాఇత్యథ వాకేన్ద్ర ౧-౪-౭-౧౦-త్రికోణేషు-౫ - ౯-గురుభృగుజ్ఞైః - బృహస్పతిశుక్రబుధైః షడ్భిఃకాలాత్సైతిసప్తమ్యర్థే తృతీయా - సాకర్తరీనస్యాదేవేతి పఞ్చమో భంగః-వాఇత్యథవాకర్తరీకారకౌ - క్రూరాదివిచరౌ నీచస్థితౌ యదా స్యాతాంతదాసానస్యాదితిషష్ఠోభంగః - హీనవధారణే॥ ఇతిసాపవాద కర్తరీదోషలక్షణం సమాప్తమ్.

——(✻) అథ పఞ్చకదోషంసాపవాదమాహ. (✻)——

మూ॥ లగ్నంసేతతిథిగ్రహైర్హృతిభదృగ్వేదర్తుభూశేషకై రోగాగ్నినృపచౌరమృత్యవ ఇమే స్యుః రాత్ర్యర్క మౌంజీషు చ। అగ్నింభౌమగృహద్యుష ద్యూశనిసేవేందుష్వినం చౌర



మిజ్యారేతిష్వారంవివాహసితవిత్సంధ్యాసు హీనేతనౌ॥

టీక ॥ సేతతిథి = గతతిథితోఁగూడుకొనిన, లగ్నమ్ = లగ్నము, గ్రహైః = తొమ్మిదిచేత, హృత్ = హరింపఁబడినదగుచుండఁగా, ఇభదృగ్వేదర్తుభూశేషకైః=ఎనిమిది నాలుగు ఆఱు ఒకటి అనునవిమిగులుటచేత, రోగాగ్నినృపచౌరమృత్యవః = రోగము, అగ్ని, రాజ, చోర, మృత్యువులు, స్యుః = అగును, రాత్ర్యర్క మౌంజీషుచ = రాత్రియందును, ఆదివారమునందును, ఉపనయనమునందును, రుజమ్= రోగపంచకమును, త్యజ= విడువుము, భౌమగృహద్యుషు= అంగారకవారమునందును, గృహనిర్మాణమునందును, పగటియందును, అగ్నిమ్ = అగ్నిపంచకమును, త్యజ=విడిచిపెట్టుము, ద్యూశనిసేవేందుషు = పగటియందును, శనివారమునందును, రాజసేవయందును, సోమవారమునందును, ఇనమ్ = రాజపంచకమును, త్యజ = విడిచిపెట్టుము, ఇజ్యారేతిషు = గురువారమునందును, అంగారకవారమునందును, ప్రయాణమునందును, చౌరమ్-చోరపంచకమును, త్యజ = విడిచిపెట్టుము, వివాహసితవిత్సంధ్యాసు = వివాహమునందును, శుక్రవారమునందును, బుధవారమునందును, సంధ్యాకాలములయందును, అపరమ్ = చెప్పఁబడినపంచకములకంటె వ్యతిరిక్తమైనమృత్యుపంచకమును, త్యజ = విడిచిపెట్టుము, తనౌ = లగ్నము, హీనేసతి = బలహీనమైనదగుచునుండఁగా, (ఏషామ్ = ఈపంచకములకు, బాధః = బాధ, భవతి = అగుచున్నది.)

తా॥ ఇఁకను పంచకదోషమును తదపవాదమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—లగ్నమును శుక్లప్రతిపత్తుమొదలుకొని గతతిథులనుచేర్చి తొమ్మిదిచేత హరింపఁగా ఎనిమిదిమిగిలెనేని రోగపంచకమనియును, రెండుమిగిలెనేని అగ్నిపంచకమనియును. నాలుగు మిగిలెనేని రాజపంచకమనియును, ఆఱు మిగిలెనేని చోరపంచకమనియును, ఒకటి మిగిలెనేని మృత్యుపంచకమనియును, తెలియవలయును. అయితే, ఈపంచకము లెప్పుడెప్పుడు త్యాజ్యములనియెదవేని చెప్పెదను. వినుము. రాత్రులయందును, ఆదివారమునందును, మౌంజీబంధమునందును, రోగపంచకమును విడిచిపెట్టవలయును. అంగారకవారమునందును, గృహనిర్మాణమందును పగటియందును, అగ్నిపంచకమును విడిచిపెట్టవలయును. పగటియందును, శనివారమునందును, రాజసేవయందును, సోమవారమునందును, రాజపంచకమును విడిచిపెట్టవలయును. గురువారమునందును అంగారక

వారమునందును, ప్రయాణమునందును, చోరపంచకమును విడిచిపెట్టవలయును. వివాహమునందును, శుక్రవారమునందును, బుధవారమునందును, సంధ్యాకాలములయందును మృత్యుపంచకమును విడిచిపెట్టవలయును. మఱియును, లగ్నము బలహీనమైనదగుచు నుండఁగా ఈపంచకము వలన దోషముకలుగుననియును, లగ్నముబలముకలదగుచు నుండఁగా ఈ పంచకమువలన దోషము లేదనియును, తెలియవలయును. లగ్నబలమును జాతకమువలనఁ దెలియవలయును. ఎట్లనిన:—"శ్లో॥ అధిపయుతో దృష్టోవా బుధగురునిరీక్షితశ్చయో రాశిః । సభవతిబలవాన్నయదాయుక్తో దృష్టోపివా శేషైః" (=లగ్నాధిపతిచేతఁజూడఁబడినదియును, కూడఁబడినదియును బుధగురువులయొక్క దృగ్యోగాది సంబంధము కలదియును, అగు రాశిబలము కలదనియును, ఇట్లు కానిరాశియును, క్రూరగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధముకలరాశియును బలహీనమైనదనియును, చెప్పఁబడును.) అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడియె.

వ్యా ॥ లగ్నేతి ॥ లగ్నం- సేతతిథి- ఇతాచాసౌతిథిశ్చ- ఇతతిథిః గతతిథిః- తయాసహ వర్తమానం- సేతతిథి- గ్రహైర్యుతమ్- నవభక్తం కార్యం- ఇభదృగ్వేదర్తుభూశేషకైః- ఇభాఅష్టౌ- దృశౌ- ద్వే- వేదాశ్చత్వారః- ఋతవష్షట్- భూరేకః ఏతన్మితైః- శేషకైః- కృత్వాక్రమేణరోగాగ్నినృపచోరమృత్యవస్స్యుః- రోగః ప్రసిద్ధః- అగ్నిః ప్రసిద్ధః- రాజా॥ శ్లో॥ రాజాధిపఃపతిస్స్వామీనాథఃపరిబృఢఃప్రభుః । ఈశ్వరోవిభురీశానో భర్తేంద్రఇనఈశితేతిధనంజయః॥ హరశ్చోరః- అత్యయోమృత్యుః.ఏతే పంచకాస్స్యురిత్యర్థః- ఏతదుక్తంభవతి - లగ్నంశుక్లప్రతిపదాది గతతిథియుక్తం- కృత్వానవభిర్హృత్వా- అష్టశేషేరోగః- ద్విశేషేఅగ్నిః- చతుశ్శేషేరాజా- షట్శేషే చోరః- ఏకశేషేమృత్యుః- అథైతేకుత్రవర్జ్యాఇత్యాహ- రాత్ర్యర్క- మౌంజీ షురుజంత్యజ - రాత్రౌ- అర్కే- ఆదిత్యవారే- మౌంజ్యాంరుజంత్యజ- ధామగృహాద్యేషు- అగ్నింత్యజ - భపుమాదయః ప్రసిద్ధాస్తేషు- వ్యేశనిసేవేందుషు ఇనంత్యజ ద్యుర్లివా- శనిః- శనివారః- సేవాస్వామిసేవనం ఇందుస్సోమవారః- ఏషుఏనంరాజానం- రాజపంచకం- త్యజఇజ్యాగ్రేతిషుహోరంచోరంత్యజ- ఇజ్యోగురువారః. అరో భపుమవారః- ఇతిర్గతిర్యాత్రేతియావత్- ఆసుచోరంత్యజేత్యర్థః-వివాహసితవిత్సంధ్యాసు- అపరం- ఉక్తవ్యతిరిక్తం- మృత్యుమిత్యర్థః. వివాహః- ప్రసిద్ధః- సితః శుక్రవారః- విత్- బుధవారః- సంధ్యా - సంధ్యాకాలః-



ఆసు- మృత్యుంత్యజేతి- అస్యాపవాదమాహ॥ కస్మిన్ సతి॥ తనౌలగ్నే-హీనే- హీనబలేసతి- బలిష్ఠే లగ్నేసతి- ఏషాంకిమపినబాధ ఇత్యర్థః-తథాచ జ్యోతిః ప్రకాశే- రోగంచోరంత్యజేచ్ఛంద్రౌ రాత్రౌఇత్యాది- తత్రాపియత్ర లగ్నంచేద్బలాఢ్యం తచ్చ నిష్ఫలమితి॥ బలంజాతకాద్జ్ఞేయం- లఘుజాతకం॥ శ్లో॥అధిపయుతో దృష్టోవా బుధ గురు నిరీక్షితశ్చయోరాశిః।సభవతిబలవాన్నయదాయుక్తో దృష్టోపివా శేషైరిత్యాది ॥ ఇతిసాపవాదపంచకదోషఃసమాప్తమ్.

——(❋) అథ భనవాంశయోశ్శుద్ధింసాపవాద మాహ. (❋)——

మూ॥ జన్మర్క్షోదయతో మృతీతదధిపౌతద్గాశ్చయేతల్లవ స్తద్భం
చాంగగమంతకృత్తలునచేత్తత్స్వామిమైత్రీకతా। శస్తాం
శోధటయుగ్మభీరుధనుషాంవిజ్ఞాస్తభాంశౌతథా చంద్రా
పుణ్యయుతౌమృతింవితనుతో దైన్యంచహీనౌజసః॥ ౩౦॥

టీక ॥ జన్మర్క్షోదయతః = జన్మరాశి జన్మలగ్నములు మొదలుకొని, మృతీ = అష్టమస్థానములును, తదధిపౌ = ఆయష్టమస్థానాధిపతులును, తద్గాశ్చ = ఆయష్టమస్థానమును పొందినవారును, తల్లవః = వారినవాంశలును, తద్భంచ = వారిరాసులును, అంగగంసత్ = లగ్నమును పొందినదగుచు, అంతకృత్తలు = మరణమును కలుగఁజేయునదిగదా? తత్స్వామిమైత్రీకతా = ఆరాశ్యాదులయధిపతులకు మిత్రతయును ఏకత్వమును, నస్యాచ్చేత్ = లేకపోయెనేని, తదా = అప్పుడు, మరణకృత్తలు = మరణమునుకలుగఁజేయునది యగునుగదా? ఘటయుగ్మభీరుధనుషామ్ = తుల, మిథునము, కన్య, ధనుస్సు, అనురాసులయొక్క, అంశః = నవాంశము, శస్తః = ప్రశస్తమైనది, స్యాత్ = అగును, విజ్ఞాస్తభాంశౌ = బుధరహితులై యస్తంగతులయిన గ్రహములయొక్క రాశినవాంశలును, తథా = అటులనే, చంద్రాపుణ్యయుతౌ = (ఆగ్రహముల రాశినవాంశములు) చంద్రాపుణ్యయుతౌ = చంద్రునితోడను పాపగ్రహములతోడనుకూడినవగుచు, మృతిమ్ = మరణమును, వితనుతః = చేయుచున్నవి. హీనౌజసః = (ఆగ్రహముల నవాంశరాసులు) హీనబలముకలవగుచు, దైన్యంచ = దీనత్వమును, వితనుతః = చేయుచున్నవి.

తా ॥ ఇఁకను రాశినవాంశలశుద్ధిని అపవాదసహితముగఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—జన్మరాశి జన్మలగ్నముల యష్టమస్థానములయధిపతులును ఆస్థానములను పొందినవారును వారినవాంశలును లగ్నము

నుపొందినయెడల వధూవరుల కవశ్యముగ మరణముకలుగును. మఱియు ను, ఆగ్రహములకు ఏకత్వ మిత్రత్వములు లేనియెడల మరణముకలుగు నేకాని యితరసమయములయందుఁ గాదనియెఱుఁగవలయును. మఱియు ను, "శ్లో॥ తస్యాష్టలగ్నే తదధీశ్వరోవా రాశౌతదీశో థవిలగ్నగోవా। సమృత్యుమాప్నోతి తదామనోజ స్త్రినేత్రఫాలాంబకవహ్నినావా॥" (=అష్టలగ్నమునందు అష్టలగ్నాధిపతియున్నను, అష్టమాధిపతి లగ్నము నుపొందినను పరమశివుని నేత్రాగ్నిచేత మన్మథుఁడు మరణమునుపొందిన విధముగ మరణమునుపొందును.) అనివసిష్ఠుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ జన్మర్క్ష జన్మలగ్నాభ్యాం లగ్నేశా వష్టమాచయా। విలగ్నం సంస్థి తానేతాం స్తద్రాశ్యంశా నపిత్యజేత్" (=జన్మలగ్న జన్మరాసులయష్ట మాధిపతులు లగ్నమునందున్నను ఆరాశ్యంశల యధిపతులు లగ్నమునం దున్నను విడిచిపెట్టవలయును.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడెను మఱియును, "శ్లో॥ లగ్నంవ్యాళి వృషంత్యాజ్య మష్టమం సర్వకర్మసు। త త్రాప్యేకే శతాన్త్యేవ తత స్తస్నైవ దోషకృత్॥ సదోషోష్టమ లగ్న స్య యదిజన్మే శరంధ్రిపౌ। సుహృదౌచే త్తదాకార్యం మంగళం మున యోవిదుః॥" (=సర్వకర్మములయందును అష్టమలగ్నమును విడిచిపెట్టవల యును. జన్మేశరంధ్రాధిపతులు మిత్రులైనయెడల అష్టమలగ్నదోషము లేదనఁబడును.) అని చూడామణియను గ్రంథమునందు చెప్పఁబడెను. "శ్లో॥ చతుర్థం ద్వాదశంలగ్నం శస్తంయది గుణాన్వితమ్" (=గుణము లు కలదైనయెడల చతుర్థ ద్వాదశలగ్నములు ప్రశస్తములగునని యె ఱుఁగవలయును.) అను న్యాయముచేత చతుర్థ ద్వాదశస్థానములయందు దోషములేదని యెఱుఁగవలయును. మఱియును, తులా మిథున కన్యాధ నుర్నవాంశలు ప్రశస్తములగునని యెఱుఁగవలయును. బుధరహి తులై అస్తమయమునుపొందిన గ్రహములయొక్క నవాంశలు ప్రశస్తము లయినవి కావనియును, మరణమును కలుగఁజేయుననియును, తెలియవల యును. మఱియును, చంద్రునితోఁ జను పాపులతోఁడను కూడుకొన్నన వ్యా నేసి మరణమును కలిగించుననియును, హీనబలముకలవ న్యానేని దీనత్వ మును కలిగించుననియును తలఁపవలయును.

వ్యా॥ జన్మర్క్షేణేతి॥ జన్మర్క్షోదయతః - జన్మరాశి జన్మలగ్నా భ్యాంసకాశాత్తృతీయే అష్టమభవనేయాతదధిపౌతయోర్మృత్యుభవన యోః స్వామినౌ- యేచతద్గాః- మృత్యుభవనగతాః- స్యుః - తేషాంఅం



శోనవాంశః - అంగగో లగ్నగతశ్చేదం తేషాంభంరాశిః - అంగగం- లగ్నగతంసత్తదాఖిలునిశ్చయేన అంతకృత్ మరణకృత్స్యాత్ - తదాక దాచేద్యదితత్స్వామి మిత్రైకతానస్యాత్ - తయోర్జన్మ మృత్యుభవన యోః - స్వామినోతత్స్వామినోతయోః - అథవాఽయమర్థః-తయోర్జన్మ నింద్యభయోః స్వామినౌతత్స్వామినౌ - తయోర్యదిమిత్రైకతానస్యాత్- మిత్రంచఏకశ్చమిత్రైకౌ - మిత్రైకయోర్భావోమిత్రైకతా - సాచేన్న స్యాత్ అనేనసర్వస్యైకస్య సార్థకతాభవతి - యదితయోర్మిత్రతాస్యా త్ - అథవాఏకతతాస్యాత్తదానాయందోషఇత్యర్థసిద్ధం॥ వసిష్ఠః॥ శ్లో॥ తస్యాష్టలగ్నేతదధీశ్వరోవా రాశౌ తదీశేథవిలగ్నగోవా। సమృత్యుమా ప్నోతతదామనోజస్త్రినేత్ర ఫాలామ్బకవహ్నినేవేతి॥ అన్యచ్చ - జన్మర్క్ష జన్మలగ్నాభ్యాంలగ్నేశావష్టమాచయా। విలగ్నసంస్థితానేతాంస్తద్రా శ్యంశానపిత్యజేదితి॥ చూడామణౌ॥ లగ్నంవ్యాళివృషంత్యాజ్యమష్టమంస ర్వకర్మసు। తత్రాప్యేకేశతాన్త్యేవతత స్తస్నైవదోషకృత్॥ సదోషో ష్టమలగ్నస్యయదిజన్మేశరన్ధ్రిపౌ। సుహృదౌచేత్తదాకార్యం మంగళం మునయోవిదురితి॥ చతుర్థద్వాదశభవనయోర్దోషోనాత్రోక్తః। యతః చతుర్థంద్వాదశంలగ్నంశస్తంయదిగుణాన్వితం॥ ఇతిపూర్వాచార్యమతం హృదిధృత్వాగుణమేవాంగీకృతం - తత్పరసాద్వత్ర్యాతి - నచశానుంపం చేష్టఖేటోనితాం - తనుంలగ్నం - ఇష్టాశ్చ తేఖేటాశ్చ-ఇష్టఖేటాఃపంచతే ఇష్టఖేటాశ్చసంచేష్టఖేటాః - ఇష్టగ్రహైః పఞ్చభిః - శుభదైః-ఇష్టైరూ నితంహీనంలగ్నంచేద్వేదవర్గోనితమితి। సగుణాస్యైవాంగీకారాత్ కింవ్య ర్థపిస్తరేణేతిభావః॥ అంశశుద్ధిమాహ॥ శస్తాంశ ఇతి-ఘటయుగ్మభీరుధ నుషాం-అంశఃశస్తస్స్యాత్ - ఘటస్తులా-యుగ్మంమిథునం - భీరుఃకన్యా- ధనుఃప్రసిద్ధం - ఏషామంశోనవాంశః - ప్రశస్తస్స్యాత్ - తత్రాపివిశేష మాహ॥ పజ్ఞాస్తభాంశావితి॥ విగతఃజ్ఞోబుధః - యేభ్యస్తేవిజ్ఞాః తేచతే అస్తాశ్చ తేషాంభాంశౌరాశినవాంశౌ మృతింవితనుతః - అర్థతస్తస్యాపిబు ధస్యభాంశౌదోషకరౌనభవతః - తథా-చంద్రాత్పూర్వ్యయుతౌ - చంద్రే ణపాపగ్రహేణవాయుతౌ - యుక్తౌ-మృతింవితనుతఃకురుతః - వధూవ రయోరితిశేషః - హీనౌజసః - దుర్బలస్య-భాంశౌ - దైన్యందీనతాంచ వితనుతః॥ ఇతి సాపవాదభనవాంశశుద్ధిః సమాప్తమ్.

—(*) అథవిశేషాంతర విష్టనవాంశా ల్లగ్నసాధనంచాహ. (*)—

మూ॥ నోపగ్గోత్తమతోవినాంత మలవందద్యాచ్చ ర్క్షేచరం చం

చంద్రేతౌళిమృగాస్యగేనచతనుంపంచేష్టఖేటోనితాం। మేషా
దిష్వజనక్రతౌళి కకుళీరాద్యానవాంశాఃక్రమాదిష్టాత్పూ
ర్వనవాంశకాదశ హతాస్త్ర్యా ప్తాలవాద్యాతనుః॥ ౩౦॥

టీక॥ వర్గోత్తమతోవినా=వర్గోత్తమములేక, అంతిమలవమ్=కడప
టినవాంశమును, నోధద్యాత్=ఈయఁగూడదు. చంద్రే = చంద్రుఁడు,
తౌళిమృగాస్యగేసతి = తులామకరములను పొందినవాఁడగుచునుండఁగా,
చరర్క్షే చరరాశియందు, చరమ్=చరనవాంశమును, నోదద్యాత్=ఈయఁ
గూడదు. పంచేష్టఖేటోనితామ్=అయిదగు ఇష్టగ్రహములు తక్కువగాఁ
గల, తనుమ్=లగ్నమును, నచదద్యాత్ = ఈయఁగూడదు. మేషాదిషు=
మేషాదిరాసులయందు, నవాంశాః=నవాంశలు, అజనక్రతౌళికకుళీరా
ద్యాః=మేషము మకరము తుల కర్కటకము మొదలుగాఁగలవి. క్రమా
త్=క్రమముగా, స్యుః=అగును. ఇష్టాత్=ఇష్టనవాంశకంటె, పూర్వనవాం
శకాః=పూర్వనవాంశలు, దశహతాః=పదిచేత గుణింపఁబడినవై, త్ర్యా
ప్తాః=మూఁటిచేతభాగింపఁబడిన, లవాద్యాః=లవాదులు, తనుః = లగ్న
ము, స్యాత్=అగును.

తా॥ ఇఁకను విశేషాంతరమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః...
వర్గోత్తమ సంజ్ఞకల నవాంశముతప్పఁ దక్కిననవాంశను చరలగ్నము
నందు వివాహమునకు గ్రహింపఁగూడదు. మఱియును, చంద్రుఁడు
తులామకరములను పొందియుండఁగా చరరాశియందలి చరనవాంశను
వివాహమునకు గ్రహింపఁగూడదు లగ్నమునందు అయిదు శుభగ్రహ
ములకు తక్కువగా గ్రహములు సంబంధము కలిగియున్నపుడు అట్టిల
గ్నమును వివాహాదులయందు గ్రహింపఁగూడదు. మేషాదిరాసులయందు
క్రమముగా మేష మకర తులాకర్కటకములు మొదలుకొని నవాంశలని
యెఱుఁగవలయును. ఎట్లనినః...మేషమునందు మేషము మొదలుకొనియు
ను, వృషభమునందు మకరము మొదలుకొనియును, మిథునమునందు
తులారాశి మొదలుకొనియును, కర్కటకమునందు కర్కటకము మొదలు
కొనియును, ఇట్లులనే మరల సింహమునందు మేషాదులును, కన్యయందు
మకరాదులును, తులయందు తులాదులును, మరల ధనుస్సునందు మేషా
దులును, మకరమునందు మకరాదులును, కుంభమునందు తులాదులును,
మీనమునందు కర్కటాదులును, నవాంశలని యెఱుఁగవలయును. మఱి
యును, ఇష్టనవాంశకంటె పూర్వనవాంశలు పదిచేత గుణించి మూఁటి
చేత హరింపఁగా మిగిలినది లగ్నమునందలి భాగాదులని యెఱుఁగవల
యును. ఎట్లనినః...ఇష్టలగ్నము మేషము ఆమేషమునందు మేషాదిగ
కన్యానవాంశ ఆకన్యానవాంశమునకు పూర్వము సింహము ఆసింహము
మేషాదిగనైదవది ఆయైదింటిని పదిచేత గుణింపఁగా నేబదియయ్యె.
ఆయేబదింటిని మూఁటిచేత హరింపఁగా లబ్ధముభాగలు ౧౬ పదునాఱు
మిగిలినరెంటిని లిప్తలుచేసి మరలహరింపఁగా వచ్చినలబ్ధలిప్తలు ౪౦నల
బది. కావున మేషమునందు పదునాఱుభాగములు నలుబదిలిప్తలయ్యెనని
యెఱుఁగవలయును.

వ్యా॥ అథవిశేషాంతరమాహ॥ వర్గోత్తమతః - వర్గోత్తమేనవినా
అంతిమలవం - చరమంనవాంశం - నోదద్యాత్ - యల్లగ్నంసఏవనవాం
శో-వర్గోత్తమః - తథాచరర్క్షే చరలగ్నే చరంనవాంశం నోదద్యాత్ -
కస్మిన్సతి - చన్ద్రేతౌళిమృగాస్యగే - తులామకరగేసతి - ఏతచ్చరత్ర
యయోగంనోదద్యాదిత్యర్థః - అత్రచరచతుష్టయమధ్యేచంద్రేతౌళిమృగా
స్యగే ఇత్యేవోక్తంతస్మేషకర్కటయోర్వివాహానక్షత్రాభావాత్ - తథా
తనుంలగ్నం - పంచేష్టఖేటోనితాం - నోదద్యాత్ - యత్రలగ్నేపంచ
ఇష్టగ్రహాఃనభవంతి - తల్లగ్నంనదేయమిత్యర్థః ॥ అథేష్టనవాంశాల్లగ్న
సాధనమాహ॥ తత్రతావన్మేషాదిషు ఆద్యాంశానాహ॥ మేషాదిష్వితి ॥
మేషాదిషు-అజనక్రతౌలికకుళీరాద్యానవాంశాః - క్రమేణోక్తాః - తద్య
థా - మేషే-అజాద్యాః-మేషాద్యాః - వృషేనక్రాద్యాః-మకరాద్యాః-
మిథునేతౌలికాద్యాః - తులాద్యాః - కర్కటకే - కుళీరాద్యాః - కర్క
టాద్యాః - ఏవంపునః సింహేమేషాద్యాః - కన్యాయాంమకరాద్యాః -
తులాయాంతులాద్యాః పునర్ధనుషిమేషాద్యాః - మకరేమకరాద్యాః-కుం
భేతులాద్యాః - మీనేకర్కటాద్యాః - నవాంశాఉక్తాః-ఇత్యర్థః- ఇష్టాంశా
త్పూర్వనవాంశకాః - గతాంశాః - దశహతాః - దశగుణితాః-త్ర్యా
ప్తాః-త్రిభిర్హృతాః లవాద్యాఃభాగాద్యాః - తనుఃలగ్నంస్యాత్-అత్రో
దాహరణం-ఇష్టలగ్నంమేషః - తత్రమేషాదికా అంశాప్రవర్తంతే ఇష్టాం
శః-కన్యానవఆద్యాత్షష్ఠః - పూర్వనవాంశకాః - పంచఏతేదశహతాః ౫౦
త్ర్యాప్తాః-లవాదిషులబ్ధం ౧౬-౪౦ ఇష్టలగ్నసహితంరాశ్యాది ౧౬
౪౦॥ ఇతి విశేషాంతర మిష్టనవాంశాల్లగ్నసాధనంచ సమాప్తమ్.

—(*) అథోదయాస్తశుద్ధిమిష్టకాలే హోరాసాధనంచాహ. (*)—

మూ॥ లగ్నాంశౌ స్వపదృశ్యతౌ న్నసుఖదౌ వాన్యోన్యపాఖ్యే

క్షితౌ తాభ్యాంసప్తమకౌ తథైవ యువతేర్నోచేత్తయో
ర్మృత్యుదౌ । ద్విఘ్నేఽర్కోనవిలగ్నకేర విసితజ్ఞేంద్వా
ర్కిజీవాసృజో హోరేశాద్యుపతేః ఖలేహ్నిఖలజానేష్టా
శుభేమధ్యమాః॥                                        ౩౨॥

టీక॥ లగ్నాంశౌ=లగ్ననవాంశలు, స్వపదృగ్యుతౌ = స్వాధిపతుల యొక్క దృగ్యోగాదిసంబంధములుగలవగుచు, నృసుఖదౌ=వరునకు సుఖమును కలుగఁజేయునట్టివి, స్యాతామ్=అగుచున్నవి. అన్యోన్యపాధ్యేక్షితౌవాసంతౌ=అన్యోన్యాధిపతులయొక్క దృగ్యోగాది సంబంధములు కలవగుచుండఁగా, నృసుఖదౌ=వరునకుసుఖమునిచ్చునట్టివి, స్యాతామ్=అగుచున్నవి. తథైవ=ఆవిధముగానే, తాభ్యామ్ = ఆలగ్ననవాంశలకంటె, సప్తమకౌ=సప్తమరాశినవాంశలు, స్యాతాంచేత్ = అయినయెడలనేని, యువతేః=వధువునకు, సుఖదౌ=సుఖమునిచ్చునవి, స్యాతామ్ = అగుచున్నవి. ఏవమ్=ఈవిధముగా, నోచేత్=లేకపోయెనేని, తయోః=ఆవధూవరులకు, మృత్యుదౌ = మృత్యువునిచ్చునట్టివి, స్యాతామ్ = అగుచున్నవి. అర్కోనవిలగ్నకే=సూర్యునితీసివేయఁగా మిగిలినలగ్నము, ద్విఘ్నేసతి=రెంటచేతఁగొట్టఁబడినదగుచుండఁగా, ద్యుపతేః = సూర్యుఁడుమొదలుకొని, రవిసితజ్ఞేంద్వార్కిజీవాసృజః=రవిశుక్రబుధచంద్రశనిగురుకుజులు, హోరేశాః=హోరాధిపతులు, స్యుః=అగుదురు. ఖలే + అహ్ని=క్రూరగ్రహవారమునందు, ఖలజాః = పాపగ్రహములవలనఁగలిగినహోరలు, ఇష్టాః=శుభకరములయినవి, న=కావు. శుభే + అహ్ని=శుభగ్రహవారమునందు, ఖలజాః = పాపగ్రహములవలనఁ గలిగినహోరలు, మధ్యమాః=మధ్యమములు, (భవంతి=అగుచున్నవి)

తా॥ ఇఁకను ఉదయాస్తశుద్ధిని చెప్పుచున్నాఁడు. ఎట్లనినః — లగ్నము లగ్నముయొక్క నవాంశలగ్నము అను రెండును తమతమ యధిపతులచేతఁ జూడఁబడినను కూడఁబడినను వరునకు సుఖముకలుగును. మఱియును, ఈరెండును పరస్పరాధిపతులచేత చూడఁబడినను కూడఁబడినను (అనఁగా లగ్నమునవాంశాధిపతియొక్క దృగ్యోగాదిసంబంధముకలదైనను నవాంశయు లగ్నాధిపతియొక్క దృగ్యోగాది సంబంధముకలదైనను) కూడ వరునకు సుఖములు కలుగును. ఇటులనే ఆలగ్న నవాంశలయొక్క సప్తమస్థానములు తమతమ యధిపతులయొక్క దృగ్యోగాదిసంబంధములుకలవైనను పరస్పరాధిపతుల దృగ్యోగాదిసంబంధములుకలవై



నను వధువునకు సౌఖ్యముకలుగును. ఇప్పుడు చెప్పఁబడిన విధముగనుండకపోయినయెడల వధూవరుల కిరువురకును మరణము కలుగును. ఇఁకను ఇష్టకాలమునకు హోరాసాధనమును చెప్పుచున్నాఁడు. ఎట్లనినః— తాత్కాలిక సూర్యుని తాత్కాలిక లగ్నములోనుండి తీసివైచి మిగిలినరాశ్యాదికమును రెంటిచేత గుణింపఁగా వచ్చినరాశిసంఖ్య సూర్యుఁడుమొదలుకొని రవిశుక్రబుధ చంద్రశని గురుకుజ హోరలలో గతహోరాసంఖ్య యనఁబడును. పాపగ్రహ వారమునందు పాపగ్రహహోర శుభకరము కాదనియును, శుభవారమునందు పాపహోర మధ్యమమనియును, శుభగ్రహవారమునందు శుభహోర పరమశుభకరమనియును, చెప్పఁబడెను. ఉదాహరణము. ఇష్టగవిరాశ్యాది ౧- ౨౫-౮- ఇష్టలగ్నము రాశ్యాది ౪- ౧౦- ౦ దీనిలో రవినితీయగా ౨- ౧౪- ౩౨- ఆయెను- దీనిని రెంటిచేత హెచ్చింపఁగా ౪-౨౯- ౪౪-రాశిస్థానమునందున్న నాలుగింటికిసమముగ రవిశుక్రబుధచంద్రశనిగురు కుజహోరలో గతించినవి నాలుగుహోరలనియును, అయిదవహోర జరుగుచున్నదనియును తెలియవలయును.

వ్యా॥ అథోదయాస్తశుద్ధిమాహ॥ లగ్నాంశావితి॥ లగ్నాంశౌ-లగ్ననవాంశౌ- స్వపదృగ్యుతౌ- స్వస్వపతినాదృష్టౌ యుక్తౌవాసంతౌ-నృసుఖదౌ- వరస్యసుఖదౌస్యాతాం- వాఇత్యథవా- అన్యోన్యపాధ్యేక్షితౌ- అన్యోన్యపతినా ఆఢ్యౌ ఈక్షితౌవాసంతౌనృసుఖదౌస్యాతాం-ఇత్యుదయశుద్ధిముక్త్వా- అస్తశుద్ధిమాహ॥ తాభ్యాంసప్తమకౌతథైవేతి॥ తాభ్యాంలగ్నాంశాభ్యాం- సకాశాత్- సప్తమకౌ- సప్తమలగ్నతదంశౌ- తథైవేతి పూర్వవత్స్వపదృగ్యుతౌ- యువతేః కన్యాయాః- సుఖదౌస్యాతాం వా ఇత్యథవా- వాసప్తమలగ్నసప్తాంశకౌ- అన్యోన్యపాధ్యేక్షితౌ- యువతేస్సుఖదౌస్యాతాం- నోచేత్ ఏవంచేన్నస్యాత్- తదాతయోర్మృత్యుదౌస్యాతాంక్రమేణ॥ అథేష్టకాలేహోరాసాధనమాహ॥ ద్విఘ్నఇతి ॥ అర్కోనవిలగ్నకే- ద్విఘ్నేకృతేసతి- ద్యుపతేస్సకాశాత్ - హోరేశాభవంతి- తేషాంగణనాక్రమమాహ॥ తేకేహోరేశాః- రవిసితజ్ఞేంద్వార్కిజీవాసృజః- రవిః- ప్రసిద్ధః- సితశ్శుక్రః- జ్ఞోబుధః- ఇందుశ్చంద్రః - ఆర్కిశ్శనిః- జీవోగురుః- అసృజ్మంగలః ఖలేహ్నిపాపవారే- ఖలజాహోరా నేష్టా- శుభేమధ్యమాస్స్యాత్- అర్థాచ్ఛుభహోరాశుభవారేశుభతరా- పాపవారేమధ్యమాస్యాత్- అత్రోదాహరణం- గురువారే ఇష్టార్కః- ౧- ౨౫- ౮- ఇష్టలగ్నం ౪-౧౦- ౦- ఇంద్రంఅర్కోనం- ౨- ౧౪-౩౨-

హోనస్స్యాత్తద్ జ్ఞైః కన్యకాసుతయోస్సదా॥" (= ఏకోదరులగు కన్యలకును ఏకోదరులగు సుతులకును ఏకసంవత్సరమునందు వివాహము చేయ గూడదు.) అనియును జెప్పఁబడియె. చైత్రము మొదలుకొని ఫాల్గునమాసమువఱకును మనుజమానముచేత సంవత్సరమని తెలియఁగవలయును. ఏకోదరులగు పుత్త్రికన్యలకు వివాహోపనయనములను మాత్రము ఏకసంవత్సరమునందు చేయవచ్చునని తెలియఁగవలయును.

వ్యా॥ నో శ్రాద్ధమితి। ఉభయోస్సంబంధ్యేకం - శ్రాద్ధం- అధీత్వా పఠనం-శీతలాప్సు-శీతలోదకేషు- ఆప్లవః - స్నానం - సీమాసింధ్వతిపాతం- సీమా ప్రసిద్ధా - సింధుర్మహానదీ- సింధుర్నదీసముద్రయోరిత్యభిధానాత్- తయోరతిపాతః - ఉల్లంఘనం-సవ్యాతిపాతం - అపసవ్యమిత్యేతత్-ఏకకులజాః-సగోత్రిణః-క్వచిన్నో కుర్యుః - కిమవధి-మండపస్య ఉత్థాపావధి- యావన్మండపోత్థాపనం - స్యాత్-తావన్నకుర్యాదిత్యర్థః॥ ఉక్తంచ శ్లో॥ దర్శశ్రాద్ధం క్షయశ్రాద్ధం శీతాద్భిస్స్నానమేవచ । ప్రాచీనావీతికరణం నదీసీమాతిపాతనం ॥ అన్యచ్చ ॥ నిత్యశ్రాద్ధమధీతించ స్నానంచశీతళైర్జలైః।సపిండానైవకుర్వీరన్ మండపోత్థాపనావధి॥ అథ సమండపోద్వాహః కదాకార్య ఇత్యాహ॥ సుతరాగాహ్నామిరితి ॥ శరాఃపంచ - అగాస్సప్త- తస్మిన్నితాహ్నాగ్నయోః - పంచమే-సప్తమే-విషమే సమే - షష్ఠరహితే- సమేహ్ని-సమదినేఉత్థాప్యః॥ ఉక్తంచ ॥ శ్లో॥ మండపోత్థాపనంకార్యం సమేతు దివసేబుధైః । షష్ఠంచవిషమంత్యేష్టం ముక్త్వాపంచమసప్తమౌ ఇతి॥ అబ్దాంతతః - వర్షమధ్యేగృహాద్వా నకర్తవ్యౌ-సహజయోః-ఏకమాతృజయోః - పురుషయోః - పురుషస్త్రియోః - సమానక్రియా- సమానంకర్మ - నకుర్యాదిత్యర్థః - భిన్నమాతృజయోర్నదోష ఇత్యర్థాత్సిద్ధం - అర్థాద్భిన్నమాతృజయోస్తథా సహోద్వాహాదికరణమాగతం-తద్భిన్నకర్తృజత్వే భిన్నగృహసంనేదితవ్యం - కర్తృత్వమత్ర శ్రాద్ధాధికారిణః - పిత్రోరేవనతువివాహహోమకర్తుర్వరస్య - తథాచోక్తం॥ శ్లో॥ ఏకమాతృజయోరేక వత్సరే పురుషస్త్రియోః - నసమానక్రియాంకుర్యాన్మాతృభేదేవిధీయతే ॥ పురుషాపురుషస్త్రియా - పృథక్ ద్విత్వవివక్షయా - బహుత్వాసంభవాన్నబహుత్వం - యద్వా- పురుషశ్చస్త్రీచతథాతయోర్ద్వయోః పురుషయోస్త్రియోర్వా - కన్యాపురుషయోర్వివాహవిశేషశ్చోక్తః॥ శ్లో॥ సోదర్యయోః కన్యయోః స్నుతయోరేకవత్సరే । వివాహోనస్యాత్తద్ జ్ఞైః - కన్యకాసుతయోస్సదా



త ఇతి॥ అత్రసంవత్సరమానం॥ మనుజమానేన చైత్రాదిఫాల్గునాంతం వేద్యం - సమానక్రియేతి ద్వయోశ్చేత్ - ద్వయోరేకమాతృజయోః వివాహౌవా నను॥ వైవాహికో విధిస్త్రీణామౌపనాయనికోమత ఇతిమనూక్తస్త్రీవివాహస్య వ్రతబంధతుల్యత్వే - ఏకమాతృజయోః - కన్యాపురుషయోః-ఏకసంవత్సరేవివాహవ్రతబంధయోః నిషిద్ధత్వమవగమ్యతే- శిష్టాచారంతు అన్యథాదృశ్యతే - సత్యం మనునాస్త్రీవివాహస్య వ్రతబంధతుల్యత్వం యత్ప్రతిపాదితం తద్బ్రాహ్మణస్త్రీణాంద్విజత్వ ప్రతిపాదనార్థమేవనైతన్నిషేధార్థం అతస్సోదరయోః - పుత్రకన్యకయోర్వ్రతవివాహావేకస్మిన్నపి వర్షే కర్తవ్యావేవ॥ ఉక్తంచ॥ నైకస్మిన్వత్సరే కార్యౌ వ్రతోద్వాహౌ కదాచ నేతి॥

——(*) అథవర్జ్యాంతరాణ్యాహ. (*)——

మూ॥ ఉద్వాహవ్రతచూడకేబ్దదళితత్ఖండంత్రైస్తర్పణం శ్రా
ద్ధంపిండయుతంమహాలయగయాపిత్ర్యంవినానాచరేత్।
పూర్వంసప్తపదీవిధేరధిగతేదోషేవరేవామృతే దేయా
న్యత్రవివాహితాపిచబలాద్వావిద్ధయోనిర్నచేత్॥ ౭౫॥

టీక॥ ఉద్వాహవ్రతచూడకే = వివాహమునందును, ఉపనయనమునందును, చౌలమునందును, అబ్దదళితత్ఖండమ్=సంవత్సరము ఆఱుమాసములకాలము మూఁడు మాసములకాలమును, మహాలయగయాపిత్ర్యం వినా=మహాలయశ్రాద్ధము గయాశ్రాద్ధము తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దికశ్రాద్ధముతప్పఁదక్కిన, పిండయుతమ్ = పిండములతోఁగూడిన, శ్రాద్ధమ్=శ్రాద్ధమును, తిలైః = తిలలచేత, తర్పణమ్=తర్పణమును, నాచరేత్=ఆచరింపఁగూడదు సప్తపదీవిధేః = సప్తపదియను కర్మానుష్ఠానముకంటె, పూర్వమ్=పూర్వము, దోషే=దోషము, అధిగతేసతి = పొందఁబడినదగుచునుండఁగను, వరే=వరుఁడు, మృతేసతివా=మరణమును పొందినవాఁడగుచునుండఁగను, అన్యత్ర=ఇతరునియందు, దేయా = ఈయఁదగినది బలాత్=బలాత్కారముగా, వివాహితాపిచ = వివాహముచేసికొనఁబడినదియును, విద్ధయోనిః=పురుషునిచేత అనుభవింపఁబడినది. నచేత్= కాకపోయెనేని, అన్యత్ర=ఇతరునియందు, దేయా=ఈయఁదగినది.

తా॥ ఇంకను వర్జ్యాంతరములను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— వివాహమైన పిమ్మట సంవత్సరకాలము వఱకును ఉపనయనమునందు ఆఱు మాసములకాలము అతిక్రమించు వఱకును చూడాకర్మమునందు

మూఁడుమాసములకాలము అతిక్రమించువఱకును మహాలయ శ్రాద్ధము గయాశ్రాద్ధము తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దికశ్రాద్ధముతప్పఁ దక్కిన పార్వణశ్రాద్ధములను తిలతర్పణమును చేయఁగూడదు. ఈవిషయమే "శ్లో॥ వివాహవ్రతచూడాసు వర్షమర్థంతదర్థకం । అతిలంతర్పణంకుర్యాచ్ఛ్రాద్ధంకుర్యాదపిండకం । మహాలయే గయాశ్రాద్ధే మాతాపిత్రోఃక్షయేహని । కృతోద్వాహోపికుర్వీత పిండదానంయథావిధి॥ అన్యత్ర॥ వివాహవ్రతచూడాసు వర్షమర్థం తదర్థకం । పిండానంపిండినోదద్యుః ప్రేతపిండాన్వినాత్రిషు॥" (= వివాహమునందు సంవత్సరకాలమువఱకును ఉపనయనమునందు ఆఱుమాసములవఱకును చూడాకర్మములయందు మూఁడుమాసములవఱకును తిలరహితమైన తర్పణమును పిండములనువిడిచి శ్రాద్ధమును చేయవలయును. అనఁగా తిలతర్పణమును పార్వణశ్రాద్ధమును చేయఁగూడదు. వివాహమును చేసికొన్నవాఁడుకూడ మహాలయమందును గయాశ్రాద్ధమందును తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దికశ్రాద్ధమునందును పిండదాన తిలతర్పణములను చేయవచ్చును. ఇతరగ్రంథవచనము॥ వివాహోపనయన చూడాకర్మములయిన పిమ్మట క్రమముగ సంవత్సరము ఆఱుమాసములు మూఁడుమాసములు ప్రేతపిండములనుదప్ప దక్కినపిండములతోఁగూడిన శ్రాద్ధమును పెట్టఁగూడదు.) అని స్మృతులయందుఁగూడఁ జెప్పఁబడియె. సప్తపదియను కర్మము జరుగకముందు వరునియందలి దోషములు బయలుపడినను వరుఁడు మరణమునుపొందినను ఆకన్నియను మఱియొకనికిచ్చి శాస్త్రోక్త ప్రకారముగ వివాహమును చేయవలయును. బలాత్కారముగ కన్నియను ఎత్తికొనిపోయి వివాహమును చేసికొన్నయెడల ఆకన్నియ పురుషునిచేత అనుభవింపఁబడక పోయెనేని అట్టి కన్నియనుకూడ మఱియొకనికిచ్చి వివాహమును చేయవలయును. "శ్లో॥ మహాదోషేసువిజ్ఞాతేపూర్వం సప్తపదీవిధేః । మరణాద్వాసముత్పన్నే దేయాన్యస్మైనదోషభాక్॥ బలాదుద్వాహితాకన్యా దాతవ్యాన్యవరాయచ॥" (= సప్తపదీవిధికాకమునుపు వరునియందలి మహాదోషము తెలియఁబడిన వరుఁడుండఁగను, మరణాదికము కలిగినను ఆకన్యకను ఇతరున కీయవచ్చును. బలాత్కారముగ వివాహితురాలయిన కన్యకనుకూడ వరునకిచ్చి వివాహమును చేయవలయును.) అని యాజ్ఞవల్క్యుఁడుచెప్పె. "శ్లో॥ బలాదుద్వాహితాకన్యా మంత్రైర్యదినసంస్కృతా । అన్యస్మైవిధివద్దేయా యథాకన్యాతథైవసా॥" (= బలాత్కారముగ వివాహము చేసికొనఁబడినకన్యక మంత్రములచేత సంస్కరింపఁబడినది కాకపోయెనేని యాకన్యకను ఇతరునకు శాస్త్రోక్తప్రకారముగనిచ్చి వివాహమును చేయవలయును.) అని మఱియొకస్మృతికర్త చెప్పె. "శ్లో॥ అంధోమూకఃక్రియాహీనశ్చాపస్మారీనపుంసకః । దూరస్థఃపతితఃకుష్ఠీ దీర్ఘరోగీవరోనసత్" (= అంధుఁడు మూకుఁడు క్రియాహీనుఁడు (అనఁగా ఏపనియును చేయఁజాలనివాఁడు) అపస్మారరోగముకలవాఁడు నపుంసకుఁడు దూరస్థుఁడు పతితుఁడు కుష్ఠరోగముగలవాఁడు దీర్ఘరోగముకలవాఁడు అయిన నరుఁడు కన్యాదానమునకుఁదగినవాఁడుకాఁడు.) మహాదోషములు కారికానిబంధమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ మూర్ఖనిర్ధనదూరస్థ శూరమోక్షాభిలాషిణాం । త్రిగుణాధికవర్షాణాం నదేయా జాతుకన్యకా॥" (= మూర్ఖుఁడు, నిర్ధనుఁడు, దూరస్థుఁడు, శూరుఁడు, మోక్షమును గోరుచున్నవాఁడు, త్రిగుణాధిక సంవత్సరములుగలవాఁడు, అగువానికి కన్యాదానమును చేయఁగూడదు.) అని యితరదోషములు చెప్పఁబడియె. "శ్లో॥ యస్యాప్సుప్లవతేబీజం హ్రాదిమూత్రంచ ఫేనిలం। పుమాంస్యాల్లక్షణైరేతైర్విపరీతైస్తుషండకః॥" (= ఎవనిబీజము ఉదకములయందు తేలునో ఎవ్వనిమూత్రము ఫేనిలమైయుండునో ఇట్టిపురుషుఁడు పుంస్త్వము కలవాఁడనియును, ఇతరలక్షణములు కలవాఁడు నపుంసకుఁడనియును, ఎఱుఁగవలయును.) అనియెడు స్మృతిప్రమాణానుసారముగ పురుషనపుంసకలక్షణములను దెలిసికొనవలయును. "శ్లో॥ అపరీక్ష్యవరంకన్యాం నిర్గుణాయప్రయచ్ఛతి । కులంతస్యైవతచ్ఛోక సంతప్తైవనికృంతతి॥" (= పరీక్షింపక గుణరహితుఁడైనవానికి కన్యాదానమును జేసినయెడల ఆదుఃఖముచేత తపింపఁజేయఁబడినదై పితృకులమును నశింపఁజేయుచున్నది.) అను ప్రమాణానుసారముగ పరీక్షింపక కన్యాదానమును జేసినయెడల మహాదోషముకలదని యెఱుఁగవలయును.

వ్యా॥ ఉద్వాహేతి॥ ఉద్వాహవ్రతచూడకేక్రమేణ - అబ్దదళతత్ఖండం-అబ్దదళంచ - ఉద్వాహే వివాహే కృతేసతి - అబ్దంవర్షపర్యంతం - వ్రతే - వ్రతబంధేకృతేసతి - దళం-అబ్దార్థం - షణ్మాసపర్యంతమిత్యర్థః- చూడకే-చౌళకర్మణి - కృతేసతి- తత్ఖండం-తస్యదళస్యాపిఖండం - అర్ధం త్రిమాసపర్యంతమిత్యర్థః- తిలైస్తర్పణంపిండయుతం శ్రాద్ధంచనాచరేత్-కింవినా - మహాలయగయాపిత్ర్యంవినా - మహాలయం- భాద్రపదాపర

పక్షః - గయాప్రసిద్ధా-పిత్ర్యం-మాతాపితృక్షయదినం - తత్రయత్ శ్రాద్ధంక్రియతే - తన్మహాలయగయాపిత్ర్యం-తద్వినా॥ ఉక్తంచ॥ శ్లో॥ వివాహవ్రతచూడాసు వర్షమర్ధంతదర్ధకం । అతిలంతర్పణంకుర్యాచ్ఛ్రాద్ధంకుర్యాదపిండకం ॥ మహాలయేగయాశ్రాద్ధే మాతాపిత్రోః క్షయేహని । కృతోద్వాహోపికుర్వీత పిండదానంయథావిధీతి॥ అన్యచ్చ ॥ వివాహవ్రతచూడాసు వర్షమర్ధంతదర్ధకం । పిండాన పిండినోదద్యుః ప్రేతపిండాన్వినాక్రియాస్వితి॥ పూర్వఖితి॥ సప్తపదీవిధేః పూర్వంప్రథమతఃదోషే అంధమూకాదికేఅధిగతే జాతేసతి-వాఇతి - అథవా-వరేమృతేసతి-కన్యాఅన్యత్రదేయా - అపిచ-యాకన్యా - బలాద్వివాహితాసాపి - అన్యత్రదేయా-తర్హి కథంచేత్ యది - విద్ధయోః నిర్ణయశ్చేన్నస్యాత్ - విద్ధాయోనిర్యస్యాస్స్యాత్తథాపురుషభుక్తేత్యర్థః॥ ఉక్తంచయాజ్ఞవల్క్యేన॥ శ్లో॥ మహాదోషే సువిజ్ఞాతే పూర్వంసప్తపదీవిధేః । మరణాదౌసముత్పన్నే దేయాన్యస్మైనదోషభాక్ ॥ బలాదుద్వాహితాకన్యా దాతవ్యాన్యవరాయచేతి॥ అన్యచ్చ॥ బలాదుద్వాహితాకన్యా మంత్రైర్యదినసంస్కృతా । అన్యస్మైవిధివద్దేయా యథాకన్యాతథైవసేతి॥ మహాదోషాః కారికానిబంధేఉక్తాః॥ అంధోమూకః క్రియాహీనశ్చాపస్మారీనపుంసకః । దూరస్థఃపతితఃకుష్ఠీ దీర్ఘరోగీవరోనసత్ ॥ అన్యేపిదోషాఉక్తాః॥ మూర్ఖనిర్ధనదూరస్థ శూరమోక్షాభిలాషిణాం । త్రిగుణాధికవర్షాణాం నదేయా జాతుకన్యకేతి॥ పురుషనపుంసకలక్షణం॥ యస్యాప్సుప్లవతేబీజం హ్రాదిమూత్రంచఫేనిలం। పుమాంస్స్యాల్లక్షణైరేతై ర్విపరీతైస్తుషండకః ॥ అపరీక్ష్యదానేదోషః ॥ అపరీక్ష్యవరంకన్యాం నిర్గుణాయప్రయచ్ఛతి । కులంతస్యైవతచ్ఛోకసంప్లావినికృంతతీతి॥ ఇతి వర్జ్యాంతరాణి సమాప్తమ్.

అథస్త్రీరహితానాంవిధిం - విషకన్యాలక్షణం- యోగాంతరం-మూలజాదీనాం ఫలంచవ్యాఖ్యామాహ.

మూ॥ అస్త్రీకైఃకుశహేమరౌప్య రచితా తామ్రీచ విప్రాదిభి
ర్భార్యావా నిఖిలైస్సువర్ణ రచితా ధర్మాయధార్యాబు
ధైః । మందారార్క దినేంబుపాగ్ని ఫణిభం భద్రాతిథి
శ్చేదిహోద్భూతాసావిషకన్యకాపి తనుగో సౌమ్యారి
పుక్షేత్రగౌ ౪౮ ॥ ఏకఃక్రూర ఇహోద్భవాప్యథ తనౌ
సౌరీరవిఃపుత్రగో ధర్మస్థో ధరణీసుతోయ మపరోయో
గోపితజ్జావిషం । మూలాద్యత్రిపదోద్భవాశ్వశురమ



హ్యంత్యత్రయేతత్స్త్రియం జ్యేష్ఠాంత్యేపతిపూర్వజంద్వి
పచాంఘ్రౌ దేవరంహంతిచ॥ ౪౯॥

టీక॥ అస్త్రీకైః=భార్యారహితులగు, విప్రాదిభిః=బ్రాహ్మణులు మొదలగువారిచేత, కుశహేమరౌప్యరచితా=దర్భలచేతను బంగారముచేతను వెండిచేతను రచింపఁబడినదియును, తామ్రీచ = తామ్రముచేత రచింపఁబడినదియును, (అయిన) భార్యా=భార్య, ధర్మాయ=ధర్మముకొఱకు, ధార్యా=ధరింపఁదగినది, అథవా=ఇట్లుకాదేని, నిఖిలైః = సకలవర్ణములవారైన, బుధైః=విద్వాంసులచేత, సువర్ణరచితా = బంగారముచేత రచింపఁబడిన, భార్యా=భార్య, ధర్మాయ = ధర్మముకొఱకు, ధార్యా=ధరింపఁదగినది, మందారార్కదినే = శనికుజభానువారములయందు, అంబుపాగ్నిఫణిభమ్ = శతభిషము కృత్తిక ఆశ్లేష అను వానిలోనేదోయొక నక్షత్రము, భద్రాతిథిశ్చ=ద్వితీయాసప్తమీద్వాదశీ అను తిథులలో నొకతిథియును, స్యాచ్చేత్=అయ్యెనేని, ఇహ=ఈయోగమునందు ఉద్భూతా=పుట్టిన, సా=ఆ, కన్యా=కన్య, విషకన్యకా = విషకన్యక, స్యాత్=అగును. ఏకః=ఒకఁడైన, క్రూరః=క్రూరగ్రహము, తనుగః=లగ్నమునుపొందినవాఁడును, సౌమ్యా = సౌమ్యగ్రహములు, రిపుక్షేత్రగౌ = శత్రుక్షేత్రమును పొందినవారును, స్యాచ్చేత్=అయితేని, ఇహ=ఈయోగమునందు, ఉద్భవాపి=పుట్టినదియును, విషకన్యకా = విషకన్యక, స్యాత్=అగును అథవా=ఇట్లుకాదేని, తనౌ=లగ్నమునందు, సౌరీ=శనియును, రవిః సూర్యుఁడు, పుత్రగః = పుత్రస్థానమును పొందినవాఁడును, ధరణీసుతః=కుజుఁడు, ధర్మస్థః=ధర్మస్థానమును పొందినవాఁడును, స్యాచ్చేత్=అయ్యెనేని, అయమపి=ఇదియును, అపరః = ఇతరమైన, యోగః=యోగము, తజ్జాపి=ఆయోగమునందుఁ బుట్టినదియును, విషమ్=విషమును, కుర్యాత్=చేయును. మూలాద్యత్రిపదోద్భవా = మూలానక్షత్రముయొక్క మొదటి మూఁడు పాదములయందుఁ బుట్టినది, శ్వశురమ్ = భర్తయొక్క తండ్రిని, హంతి=చంపుచున్నది. అహ్యంత్యత్రయే = ఆశ్లేషానక్షత్రముయొక్క ద్వితీయపాదాది మూఁడు పాదములయందు, జాతా = పుట్టినకన్యక, తత్స్త్రియమ్ = ఆమామగారియొక్కభార్యను అనఁగా పెనిమిటియొక్కతల్లిని, హంతి=చంపుచున్నది. జ్యేష్ఠాంత్యే = జ్యేష్ఠానక్షత్రముయొక్క కడపటిపాదమునందు, జాతా=పుట్టినయాఁడుది, పతిపూర్వజమ్=భర్తకంటె ముందుగఁబుట్టినవానిని, హంతి=చంపుచున్నది. ద్విప

చతుర్థే=విశాఖానక్షత్రముయొక్క నాల్గవపాదమునందు, జాతా=పుట్టి
నయెడల, దేవరమ్=మరదని, హంతి=చంపుచున్నది.

తా॥ స్త్రీరహితుల యనుష్ఠానము, విషకన్యాలక్షణము, యో
గాంతరము, మూలజాదులఫలము, అనునవి యీశ్లోకము మొదలుకొని
రెండుశ్లోకములచేతఁ జెప్పఁబడుచున్నది. ఎట్లనినః—భార్యారహితుఁ
డగు బ్రాహ్మణుఁడు దర్భలచేత రచింపఁబడిన భార్యను, క్షత్రియుఁడు
బంగారముచేత రచింపఁబడినభార్యను, వైశ్యుఁడు వెండిచేత రచింపఁ
బడినభార్యను శూద్రుఁడు తామ్రముచేత రచింపఁబడినభార్యను సమీప
మునునుంచుకొని ధర్మకార్యముల నాచరింపవలయును. ఇట్లు కాదేని
అన్నివర్ణములవారును బంగారముచేత రచింపఁబడినభార్యను సమీపము
నఁబెట్టుకొని ధర్మకార్యములను చేయవలయును. మఱియును, భార్యలేని
యెడల గృహస్థధర్మమును జేయుటకు వీలులేదుకనుక "శ్లో॥ అపత్నీకై
స్తుధర్మార్థం కాశీహైమీచ రాజతీ। తామ్రీవిప్రాదిభిర్భార్యా భార్యా
హైమీతథాఖిలైః॥" (=అపత్నీకుఁడగు బ్రాహ్మణుఁడు ధర్మార్థము కుశ
నిర్మితమగుభార్యను క్షత్రియుఁడు సువర్ణనిర్మితభార్యను వైశ్యుఁడు రజత
నిర్మితభార్యను శూద్రుఁడు తామ్రనిర్మితమగుభార్యను సమీపమున నుంచు
కొనవలయును. ఇట్లుకాదేని నాలుగు వర్ణములవారును బంగారముచేత
నిర్మింపఁబడినభార్యను సహాయముగఁ జేసికొనవలయును) అని స్మృతి
యందుఁ జెప్పఁబడెను. శనికుజభానువారములయందు శతభిషము కృత్తిక
ఆశ్లేష అను నక్షత్రములలో ఏదోయొక నక్షత్రమును ద్వితీయా సప్తమి
ద్వాదశీతిథులలో నొకతిథియును కలిగియుండఁగా పుట్టినకన్యక విషక
న్యకయనఁబడును. మఱియును, లగ్నమునందు క్రూరగ్రహమును సౌ
మ్యులు షష్ఠస్థానమునందును ఉండఁగాఁ బుట్టిన కన్యకయును విషకన్యక
యనఁబడును. మఱియును, లగ్నమునందు శనియును, పంచమమందుసూ
ర్యుఁడును, అంగారకుఁడు ధర్మస్థానమునందును ఉండఁగాఁ బుట్టినకన్యక
యును విషకన్యకయనఁబడును. ఇట్టికన్యకను పరిగ్రహించినవాఁడు విష
మును పరిగ్రహించినవాఁడు మరణమును పొందినవిధముగ మరణమును
పొందును కనుక అట్టి కన్యకను త్యజింపవలయునని యెఱుఁగవలయును.
మఱియును, మూలానక్షత్రముయొక్క మొదటి మూఁడు పాదములయం
దునుఁ బుట్టినకన్యక భర్తయొక్క తండ్రిని సంహరించును. ఆశ్లేషానక్ష
త్రముయొక్క రెండవ మూఁడవ నాల్గవపాదములయందుఁ బుట్టినకన్యక



భర్తయొక్క తల్లిని సంహరించును. జ్యేష్ఠానక్షత్రముయొక్క నాల్గవపా
దమునందుఁ బుట్టినకన్యక భర్తయొక్క యన్నలను నశింపఁజేయును.
విశాఖానక్షత్రముయొక్క రెండవచరణమునందుఁ బుట్టినకన్యక మఱఁదు
లను నశింపఁజేయునదియగును. ఇట్లు చెప్పుటచేత ఈ దుష్టనక్షత్రముల
యొక్క యీదుష్టచరణములయందుఁగాక యితరపాదములయందుఁ
బుట్టినకన్యకలయందు దోషము లేదని యెఱుఁగవలయును.

వ్యా॥ అస్త్రీకైరితి॥ అస్త్రీకైః- స్త్రీరహితైః - విప్రాదిభిర్విప్రక్ష
త్రియవిట్ఛూద్రైః - క్రమేణకుశహేమరౌప్యరచితా తామ్రీచ భార్యాధ
ర్మాయధార్యా - అయమర్థః- విప్రేణకుశరచితా భార్యా ధర్మాయధా
ర్యా-క్షత్రియేణ హేమరచితా - వైశ్యేనరౌప్యరచితా- శూద్రేణతామ్రీ-
తామ్రేణరచితాభార్యా - ధార్యా - కథంభూతైర్విప్రాదిభిః-బుధైః-స్వ
స్వధర్మనిరతైః-వా ఇతి-అథవా-నిఖిలైః - సర్వైర్విప్రాదిభిః - సువర్ణరచి
తాభార్యాధార్యా - యతస్త్రయావినాగృహస్థ ధర్మసాధనం నస్యాత్-
తథాచోక్తం॥ శ్లో॥ అపత్నీకైస్తుధర్మార్థం కౌశీహైమీచరాజతీ। తా
మ్రీవిప్రాదిభిర్భార్యా భార్యాహైమీతథాఖిలైరితి॥ అథవిషకన్యాలక్ష
ణమాహ॥ మందేతి॥ మందారర్కదినే - శన్యర్కభౌమానామన్యతమ
స్యవాసరే - అంబుపాగ్నిఫణిభం - శతతారకాకృత్తికాశ్లేషాణామన్య
తమం - నక్షత్రం-భాద్రాతిథిర్ద్వితీయా సప్తమీద్వాదశీ - ఆసామన్యత
మాచేత్స్యాత్ - తదామందయోగస్స్యాత్ - ఇహోద్భూతా - అత్ర
యోగేయాకన్యాజాతా - సావిషకన్యకా - అథ యోగాంతరమాహ॥
రిపుక్షేత్రగాషష్ఠస్థానగతా - సౌమ్యా - తనుగా - లగ్నగతా చేత్స్థి
తాం - ఏకఃక్రూరః-తనుగశ్చరిపుక్షేత్రగతశ్చేత్స్యాత్ - ఇమౌద్వౌయో
గౌ- ఇహోద్భూతాపి - విషకన్యకాస్యాత్ - అథ యోగాంతరమాహ
తనౌ-లగ్నే-సౌరిః-శనిస్స్యాత్ - రవిః-సూర్యః-పుత్రగః- పంచమగస్స్యా
త్-ధరణీసుతోభౌమో ధర్మస్థో నవమస్థో యదాస్యాత్ - తదా- అయం
అపరోయోగస్స్యాత్ - తజ్జాపి కన్యా విషంస్యాత్ - యథావిషస్వీకా
రాన్మృత్యుర్భవతి - తథా విషకన్యాస్వీకారాన్మృత్యుర్భవతీతి సూచి
తంతస్మాత్పరిత్యాజ్యేతిభావః - అథమూలజాదీనాంఫలమాహ॥ మూలేతి॥
మూలస్య ఆద్యత్రిపదోద్భవా ప్రథమచరణత్రయే జాతాకన్యాశ్వశురం
హంతిమారయతి - అహ్యంత్యత్రయే అహిరాశ్లేషా - తస్యా అంత్యత్ర
యేద్వితీయాది చరణత్రయే జాతాశ్వశ్రూం - తస్యాశ్శ్వశురస్త్రీ

యం-శ్వశురం హంతీత్యర్థః - జ్యేష్ఠాంత్యే-జ్యేష్ఠాయాః - చతుర్థచరణజా తాపతిపూర్వజం - పత్యుర్జ్యేష్ఠం - భావుకం హంతి - ద్విపచతుర్థే-ద్వౌ పౌ-పదే-యస్యా-ద్విపం - విశాఖా - తస్యాశ్చతుర్థచరణజాతా - దేవరం హంతి అర్థాదన్యచరణజా తాశుభాభవతీతిభావః॥ ఇతి స్త్రీరంహితవిద్యా దయోః సమాపమ్

అథన్యూనామవివాహాదిదోషం - ఋతుత్రయమధ్యే కింకింకర్తవ్యమిత్యాహ.

మూ॥ ఏవం నాయువతేరభావ ఇహనోదోషో నృణేతత్ఫలం మౌంజ్యూర్ధ్వం వదంతి కేచిదపి పైత్ర్యేప్యే ఫలం మూలవత్ । నోద్వాహః సహజాతయోః స్త్రీష్వృతిషు నోద్వాహోన్యౌ తం నో పుము ద్వాహాత్ స్త్రీ ద్వాహనంన మంగళవిధేర్ముండం త్రిషుష్వేషు న॥ ౮౮॥

టీక॥ ఏవమ్ = ఇప్పుడు చెప్పఁబడిన నక్షత్రములయందుఁబుట్టిన, నా=మానవుఁడు, (యువతేః=స్త్రీయొక్క, పిత్రాదీన్=తండ్రి మొదలగు వారిని, హంతి=చంపుచున్నాఁడు.) అభావే= (పిత్రాదులు లేనపుడు) ఇహ=ఈమూలాదిజోద్వాహనమునందు, దోషః = దోషము, నో=లేదు. కేచిత్=కొందఱు, నుః=పురుషునకు, మౌంజ్యూర్ధ్వమ్=ఉపనయనానంతరమందు, ఏతత్ఫలమ్=ఈఫలమును, వదంతి = చెప్పరు. కేచిత్ = కొంతమంది, పైత్ర్యేపి = మఖానక్షత్రముయొక్క మొదటిచరణమునందుఁ గూడ, మూలవత్ = మూలానక్షత్రమునందువలెనే, ఫలమ్ = ఫలమును, వదంతి=చెప్పుచున్నారు. సహజాతయోః=ఏకోదరులగువారికి, స్త్రీష్వృతుషు=మూఁడుఋతువులయందు, ఉద్వాహః=వివాహములు, (నకార్యో=చేయఁదగినవి) కావు. ఉద్వాహాత్ = వివాహముకంటె, స్త్రీఋతుషు=మూఁడుఋతువులయందు, వ్రతమ్ = ఉపనయనము, నో=కూడదు. పుముద్వాహాత్=పురుషవివాహముకంటె పరమందు, స్త్రీఋతుషు = మూఁడు ఋతువులయందు, స్త్రీద్వాహమ్=స్త్రీవివాహము, నో = కూడదు, మంగళవిధేః=వివాహముకంటె, పరమందు, స్త్రీఋతుషు=మూఁడుఋతువులయందు, ముండమ్=చౌలమైనను ఉపనయనమైనను, న = చేయఁదగినది కాదు. ఏషు=ఈమూఁడుఋతువులయందును, త్రిషుభి=మూఁడుశుభముల సముదాయము, నకార్యా=చేయఁదగినది కాదు.

తా॥ ఇంకను పురుషులకు వివాహాదిదోషము ఋతుత్రయములో



పల జేనిజేనిజేయఁగూడదో యావిషయమును దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—స్త్రీవలెనే పురుషుఁడుకూడ పై శ్లోకమునందుఁ జెప్పఁబడినట్లు మూలానక్షత్రము మొదలుగాఁగల నక్షత్రములయందుఁ బుట్టియుండెనేని స్త్రీయొక్క మామా పిత్రాదులను సంహరించునని తెలియవలయును. "శ్లో॥ మూలాజాశ్వశురంహంతి సార్పజాచతదంగనాం । జ్యేష్ఠజాతుప తిజ్యేష్ఠం దేవరంతుద్విదైవతా॥" (= మూలానక్షత్రమునందుఁ బుట్టిన యాఁడుది మామగారిని నశింపఁజేయును. ఆశ్లేషానక్షత్రమునందుఁ బుట్టినయాఁడుది యత్తగారిని నశింపఁజేయును. జ్యేష్ఠానక్షత్రమునందుఁ బుట్టిన యాఁడుది భర్తయొక్కయన్నలను సంహరించును. విశాఖా నక్షత్రమునందుఁ బుట్టినయాఁడుది మరదులను హరించును.) అని గర్గమునివరుఁడు చెప్పె. "శ్లో॥ మూలాంత్యే పాదజౌశ్రేష్ఠౌ తథాశ్లేషాద్యపాదజౌ । ద్వీశాంత్యపాదజౌదుష్టౌ తథాశ్లేషాంత్యపాదజౌ ॥" (=మూలానక్షత్రముయొక్క కడపటిపాదమునందుఁ బుట్టిన స్త్రీపురుషులు శ్రేష్ఠులు. అటులనే ఆశ్లేషానక్షత్రముయొక్క కడపటిపాదమునందుఁ బుట్టినవారు కూడశ్రేష్ఠులే. విశాఖానక్షత్రముయొక్క కడపటిపాదమునందుఁ బుట్టినవారు దోషయుతులగుదురు. ఆశ్లేషానక్షత్రముయొక్క కడపటిపాదమునందుఁ బుట్టినవారుకూడ దుష్టులేయగుదురు.) అని కశ్యపపటలమను గ్రంథమునందుఁ జెప్పఁబడినది. మామగారు మొదలగువారు లేనపుడు మూలానక్షత్రము మొదలుగాఁగల నక్షత్రములయందలి దుష్టపాదముల యందుఁ బుట్టినప్పటికిని దోషమేమియును లేదని తెలియఁగవలయును. ఉపనయనానంతరమందు ఈఫలము లేదని తెలియఁగవలయును. "శ్లో॥ మూలవ్యాళభనోదోషో వివాహేయ ఉదాహృతః। నసమౌంజీబంధనాదూర్ధ్వం పుంసాంనైవేతికేచన ॥" (=వివాహమునందు మూలాశ్లేషా నక్షత్రములయందు కలదని చెప్పఁబడిన దోషము ఉపనయనానంతరమందు పురుషులకులేదు.) అని నారదమునివరుఁడు చెప్పె. కొందఱు మఖానక్షత్రముయొక్క ప్రథమచరణమునందుఁగూడ మూలయందువలెనే ఫలముకలుగునని చెప్పుచున్నారు. "శ్లో॥ పైత్ర్యాద్యంఘ్రోద్భవాకన్యా శ్వశురఘ్నీతి కేచన" (=మఖానక్షత్రమునందుఁ బుట్టినకన్య మామగారిని జంపునని కొందఱు చెప్పుదురు.) అను ప్రమాణానుసారముగ మఖానక్షత్రముయొక్క ప్రథమచరణమునందుఁ బుట్టినకన్యకు దోషముకలదని నారదుఁడు చెప్పె. అటుమూఁడుమూఁడులలోపల ఏకోదరులగు భ్రాతృపుత్రులకుఁగాని పుత్రిక

లకుఁగాని వివాహములు చేయఁగూడదు. "శ్లో॥ వివాహస్త్వేకజన్యానాం షణ్మాసాభ్యంతరే యది। అసంశయం త్రిభిర్వర్షైః తత్రైకా విధవా భవేత్॥" (= ఏకగర్భజాతులగు పురుషులకుఁగాని స్త్రీలకుఁగాని ఆఱుమాసములలోపల వివాహము చేసినయెడల స్త్రీలలో నొకతె విధవయగుననియును, పురుషులయినయెడల మరణమును పొందుటకాని మరణమును పొందిన భార్యకలవాఁడగుటకాని నిస్సంశయముగఁ గలుగును.) అని నారదుఁడు చెప్పె. మఱియును, వివాహమైనపిమ్మట ఆరుమాసములలోపల ఉపనయనమును చేయఁగూడదు. "శ్లో॥ వ్రతోద్వాహాత్పరం పుత్రీవివాహోనహ్యృతుత్రయే। నతయోర్వ్రతముద్వాహాన్మంగళే నాన్యమంగళమ్॥" (= వ్రతోద్వాహముల యనంతరమందు ఆఱుమాసములలోపల మరల వ్రతోద్వాహములను చేయఁగూడదు. ఉద్వాహానంతరమందు ఆఱుమాసములలోపల ఉపనయనమును జేయఁగూడదు. ఒక శుభకార్యము జరిగియుండఁగా వేఱొక శుభమును చేయఁగూడదు.) అని నారదుఁడు చెప్పె. పురుషవివాహానంతరమందు ఆఱుమాసములలోపల కన్యావివాహమును చేయఁగూడదు. "శ్లో॥ పుత్రోద్వాహాత్పరంపుత్రీవివాహోనహ్యృతుత్రయే॥" (= పుత్రునియొక్క వివాహానంతరమందు ఆఱుమాసములలోపల పుత్రీవివాహమును చేయఁగూడదు.) అని కాత్యాయనుఁడు చెప్పె. వివాహానంతరమందు ఆఱుమాసములలోపల ముండనమునుగాని చౌలమునుగాని ఉపనయనమునుగాని చేయఁగూడదు. "శ్లో॥ కులేహ్యృతుత్రయాదర్వాఙ్ముండనమ్" (కులమునందు ఆఱుమాసములలోపల ముండనముకూడదు.) అని కాత్యాయనుఁడు చెప్పె. "శ్లో॥ వ్రతంసమావర్తనకం సచౌలం కేశాంతమేతాని వదంతితద్జ్ఞాః। క్షౌరం పురస్సృత్యభవంతియస్మాచ్చత్వారితస్మాదిహముండనాని॥" (= వ్రతము సమావర్తనము చౌలము అను కర్మములు క్షౌరపూర్వకములయినవని పెద్దలు చెప్పుచున్నారు. కావున ఈనాలుగు కర్మములును ముండనములనఁబడును.) అని జ్యోతిశ్శాస్త్రమునందుఁ జెప్పఁబడియె. పునరుపనయనాదికము ప్రాయశ్చిత్తములలోపల చేరినదికనుక ముండనముచేయఁబడినప్పటికిని పునరుపనయనాదికమునకు ఈనిషేధము లేదని యెఱుఁగవలయును. "శ్లో॥ నకుర్యాన్మంగలత్రయమ్" (= మూఁడుమంగళములను చేయఁగూడదు.) అనునట్టి కాత్యాయన వచన ప్రమాణమును సారముగ ఆఱుమాసములలోపల మూఁడుశుభములను జేయఁగూడదు.



వ్యా॥ ఏవమితి॥ ఏవం ఉక్తనక్షత్రచరణజాతో - నా-నరః- యువతేః స్త్రియః పిత్రాదీన్-శ్వశురాదీన్హంతి॥ తథాచగర్గః॥ శ్లో॥ మూలజా శ్వశురంహంతిసార్పజాచతదంగనాం। జ్యేష్ఠజాతుపతిజ్యేష్ఠం దేవరంతు ద్విదైవతే॥ తథాచకశ్యపపటలే॥ మూలాంత్యపాదజాశ్రేష్ఠా తథాశ్లేషాద్యపాదజా। ద్విశాంత్యపాదజాదుష్టా తథాశ్లేషాంత్యపాదజా ఇతి॥ అస్యాపవాదః॥ అభావ ఇహనోదోషఇతి - అభావేతేషాం శ్వశురాదీనాం అభావేసతి - ఇహ-మూలాదిజోద్వాహనే-నోదోషః - కేచిదార్యాః-నుః-నరస్య మౌంజ్యూర్ధ్వం - మౌంజీబంధనానంతరం - ఏతత్ఫలం నవదంతి॥ ఉక్తంచనారదేన॥ శ్లో॥ మూలవ్యాళభవోదోషో వివాహోద్యా ఉదాహృతః। సమౌంజీ బంధనాదూర్ధ్వం పుంసాం నైవేతి కేచనేతి॥ మైత్ర్యేపి - మఘాయా ఆద్యచరణేపి - మూలవత్ఫలంస్యాదితి కేచిద్వదంతి-తథాచోక్తంనారదేన॥ శ్లో॥ మైత్ర్యగండోద్భవాకన్యా శ్వశురఘ్నీతి కేచనేతి॥ అథర్తుత్రయమధ్యేకంకింనకర్తవ్యమిత్యాహ॥ నోద్వాహావితి॥ సహజాతయోః - ఏకోదరసముత్పన్నయోః - పుత్రయోర్వా-ఉద్వాహౌ- వివాహౌ-త్ర్యృతుషు - త్రయశ్చతే ఋతవశ్చత్ర్యృతవః - తేషు నకార్యౌ షణ్మాసాభ్యంతరేన కార్యావిత్యర్థః॥ ఉక్తంచనారదేన॥ వివాహస్త్వేకజన్యానాం షణ్మాసాభ్యంతరేయది। అసంశయం త్రిభిర్వర్షైస్తత్రైకా విధవాభవేదితి॥ నోద్వాహాద్వ్రతమితి ఉద్వాహాత్త్ర్యృతుషువ్రతం మౌంజీనకార్యా సత్యంయతః - పారస్కరాచార్యేణ వ్రతబంధోపి మంగళత్వేన ప్రతిపాదితోనముండనమితి॥ అన్యైర్గృహ్యకారైః ముండనత్వేనసమర్థితత్వాత్ - పారస్కరమతే తన్మతానుసారిణామేవ ప్రాశస్త్యం అతోనోద్వాహాద్వ్రతమిత్యుక్తేనదోషః - తథాచోక్తంనారదేన॥ వ్రతోద్వాహాత్పరంపుత్రీ వివాహోనహ్యృతుత్రయే। నతయోర్వ్రతముద్వాహాన్మంగళేనాన్యమంగళమితి॥ నోపుముద్వాహాత్స్త్ర్యుద్వాహనమితి॥ పుముద్వాహాత్ పురుషవివాహాత్ - త్ర్యృతుషు- స్త్ర్యుద్వాహంకన్యావివాహః - నోకార్యః-తథాచకాత్యాయనః - పుత్రోద్వాహాత్పరంపుత్రీవివాహోనహ్యృతుత్రయే ఇతి॥ నమంగళవిధేర్ముండనమితి॥ మంగళవిధేః వివాహాత్త్ర్యృతుషు - ముండనంచౌలంవ్రతంవానకార్యం - అత్రకాత్యాయనః॥ శ్లో॥ కులేహ్యృతుత్రయాదర్వాఙ్ముండనమితి॥ ముండనలక్షణంతుజ్యోతిశ్శాస్త్రే॥ శ్లో॥ వ్రతంసమావర్తనకం సచౌలం కేశాంతమేతాని వదంతితద్జ్ఞాః। క్షౌరంపురస్సృత్యభవంతి యస్మాచ్చత్వారితస్మాదిహ

ముండనాని ॥ ముండనేన్కృతేపి పునరుపనయనాదేశ్చనాయాం నిషేధః। తత్ర కేశముండనస్య కృతాకృతత్వాత్ - పునరుపనయనాదేః - ప్రాయశ్చిత్తాత్మకత్వేన విహితస్య కాలాతిక్రమే ప్రాయశ్చిత్తభయాదనుక్తకాలత్వాచ్చ - త్రిషుజ్యేష్ఠేషునేతి॥ ఏషుజ్యేష్ఠేషుత్రిశుభీనకార్యా - త్రయాణాంశుభానాం సమాహారస్త్రిశుభీ మంగళత్రయ మితి యావత్ - నకుర్యాన్మంగలత్రయ మితికాత్యాయనవచనాత్॥

మూ॥ నోజ్యేష్ఠాల్లఘుకాలరుద్ధత ఋతేకాత్యాయనోముండనం
చౌలంప్రాహన మేఖలేత్యుభయతః కార్యా వివాహాది
యం । భేదేబ్దస్యచ సంకటే వితనుయాత్పూర్వోదితం
మంగళం వేదాహాంతరితేదినవ్యవహితే నద్యానగేనా
పినా॥ ౪౯॥

టీక॥ జ్యేష్ఠాత్ = పెద్దశుభముగు వివాహముకంటె పరమందు, కాలబుద్ధతఋతే = కాలనిర్బంధము కలవానిని తప్పదకిన, లఘు = స్వల్పమంగళము, నో = చేయఁగూడదు. కాత్యాయనః = కాత్యాయనుఁడు, చౌలమ్ = చౌలమును, ముండనమ్ = ముండనమును, ప్రాహ = చెప్పుచున్నాఁడు. మేఖలా = మౌంజి, ముండనమ్ = ముండనము, న = కాదు. ఇతి = ఇట్లని, ప్రాహ = చెప్పుచున్నాఁడు. ఇయమ్ = ఈమౌంజి, ఉభయతః = వివాహమునకు పూర్వాపరకాలములయందు, కార్యా = చేయఁదగినది, సంకటే = సంకటమునందు, అబ్దస్య = సంవత్సరముయొక్క, భేదేసతి = భేదముకలుగుచుండఁగా, పూర్వోదితమ్ = పూర్వమునందుఁ జెప్పఁబడిన, మంగళమ్ = శుభమును, వితనుయాత్ = చేయవలసినది. వేదాహాంతరితేపి = నాలుగు దినములవ్యవధానమునందుఁగూడ, మంగళమ్ = శుభమును, వితనుయాత్ = చేయవలయును. దినవ్యవహితేపి = ఒకదిన వ్యవధానమునందుఁగూడ, వితనుయాత్ = చేయవలయును. నద్యా = నదిచేత, వ్యవహితేపి = వ్యవధానమునందుఁగూడ, వితనుయాత్ = చేయవలసినది, నగేన = పర్వతముచేత, వ్యవహితేపి = వ్యవధానమునందుఁగూడ, మంగళమ్ = శుభమును, వితనుయాత్ = చేయవలయును.

తా॥ జ్యేష్ఠమంగళమైన పిమ్మట ఆఱుమాసములలోపల లఘుమంగళమును జేయఁగూడదు. "శ్లో॥ చూడాకేశాంతసీమంత వివాహోపనయనాన్బుధాః । గురుమంగళమిత్యాహు స్తదన్యల్లఘుమంగలమ్ ॥" (= చూడాకేశాంతము, సీమంతము, వివాహము, ఉపనయనము అనువానిని



గురుమంగళములనుగాను ఇతరమును లఘుమంగళములనుగాను చెప్పుచున్నారు.) అని సారసముచ్చయమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. అవశ్యముగా కాలానుసారముగా చేయఁదగిన కర్మములను చేయుటవలన దోషమేమియును లేదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ మాతృయాగక్రియాపూర్వం జ్యేష్ఠంకృత్వాతుమంగలం । ఋతుత్రయంపునర్యావ న్నకుర్యాల్లఘుమంగలమ్ ॥" (= మాతృయజ్ఞక్రియకంటె పూర్వమందు జ్యేష్ఠమంగలమును చేసినపిమ్మట ఆఱుమాసములవఱకును లఘుమంగళమును జేయఁగూడదు.) అని కాత్యాయనుఁడు చెప్పె. "శ్లో॥ లఘువాగురువాకార్యం కార్యంనైమిత్తికంయది॥" (= లఘుమంగళమైనను గురుమంగలమునైనను నైమిత్తికమైనయేని యవశ్యముగఁ జేసియే తీరవలయును.) అనియును కాత్యాయనుఁడే చెప్పె. మఱియును, ఉపనయనము ముండనముకాదనియును, చౌలమే ముండనమనియును, వివాహమునకు ఉభయపార్శ్వములయందును మౌంజి చేయఁదగినదనియును, ఎఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ ముండనంచౌలమిత్యుక్తం వ్రతోద్వాహౌతుమంగళం । చౌలంముండనమేవోక్తం వర్జయేద్వత్సరాత్పరం। మౌంజీంచోభయతఃకార్యా యతోమౌంజీనముండనమ్ ॥" (= ముండనము చౌలమని చెప్పఁబడినది. వ్రతోద్వాహములు మంగళము లనఁబడును. చౌలము ముండనమనియే చెప్పఁబడినది. మౌంజియనునది ముండనము కాదు కనుక రెంటిని చేయవచ్చును.) అనియును, కాత్యాయనుఁడే చెప్పె. దేశకాలభయాదులు కలుగుచునుండఁగా పదిరెండుమాసములు గాకపోయినను సంవత్సరభేదముండెనేని పూర్వోదితమగు మంగళమును చేయవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ ఫాల్గునేచైత్రమాసేతుపుత్రోద్వాహోపనాయనే । భేదాదబ్దస్యకుర్వీత నర్తుత్రయలంఘనమ్ ॥" (= సంవత్సరభేదము కలదుకనుక ఫాల్గునచైత్రమాసములయందు పుత్రోద్వాహోపనయనములను చేయవచ్చును. ఆఱుమాసములకాలమును నిరీక్షింపవలసినపనిలేదు.) అని సంహితాసారావళియందుఁ జెప్పఁబడెను. మఱియును, దేశకాలభయాదులు కలుగుచునుండఁగా నాలుగుదినములు వ్యవధానమున్నప్పుడుకూడ రెండవశుభమును కూడఁజేయవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ పుత్రీపరిణయాదూర్ధ్వంయావద్దినచతుష్టయం । పుత్రాంతరస్యకుర్వీత నోద్వాహ మితిసూరయః॥" (= పుత్రికవివాహానంతరమందు నాలుగుదినములు వ్యవధినిక

లిగించుకొని కాలదేశభయాదులు కలుగుచుండఁగా రెండవపుత్త్రికకు వివాహమును చేయవచ్చును.) అని స్మృతిసారావళియందుఁ జెప్పఁబడెను. ఇట్లుగాకున్నను యొకదిన వ్యవధానమునందుఁగూడఁ జేయవచ్చును. "శ్లో॥ ఏకోదరప్రసూతానామేకస్మిన్వాసరే నరః । వివాహంనైవ కుర్వీత మండనోపరిముండనమ్॥" (=ఏకోదర ప్రసూతులగువారికి ఒక్క దినమందే వివాహములను చేయఁగూడదు.) అని స్మృతియందుఁ జెప్పఁబడెను. ఏకదినమందుఁగూడ నదీపర్వతములు అంతరితములై యుండఁగాఁ జేయవచ్చును. "శ్లో॥ ఏకోదరయోర్వరయోరేకదినోద్వాహతో భవేన్నాశః । నద్యంతర ఏకదినే వ్యాహుస్సంకటే చ శుభమ్॥" (=ఏకోదరులగువరులకు ఏకదినమునందే వివాహమును చేసినయెడల నాశము కలుగును. నదీపర్వతాదివ్యవధి కలిగియున్నయెడల సంకట కాలమునందు చేయవచ్చును) అని జ్యోతిర్వివరణమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ నద్యంతరేపి శుభదం పృథక్శైలస్యరోధతః॥" (నదీపర్వతముల వ్యవధానము కలుగుచునుండఁగా శుభము కలుగును.) అని సారంగధరుఁడు కూడఁజెప్పె.

వ్యా॥ నోజ్యేష్ఠాల్లఘ్వితి॥ జ్యేష్ఠాత్ లగ్నాత్ - వివాహాత్ త్రిఋతుషు లఘుమంగలం నోకుర్యాత్ - యద్బృహస్పతినాయుక్తం తజ్జ్యేష్ఠమంగళం - అన్యల్లఘుమంగలం - జ్యేష్ఠ లఘులక్షణం సారసముచ్చయే॥ శ్లో॥ చూడాకేశాంతసీమంత వివాహోపనయాస్త్వథ । గురుమంగళమిత్యాహుస్తదన్యల్లఘుమంగళమితి॥ తన్నకార్యమిత్యర్థః - కస్మాద్వృతే. కాలబుద్ధతః-ఋతేకాలేనబుద్ధం - గర్భాధానపుంసవనాది - తస్మాద్వృతే తేనవినేత్యర్థః॥ తథాచ కాత్యాయనః॥ శ్లో॥ మాతృయజ్ఞక్రియాపూర్వం జ్యేష్ఠంకృత్వాశుమంగలం । ఋతుత్రయంపునర్యావన్నకుర్యాల్లఘుమంగళం॥ లఘువాగురువాకార్యం కార్యంనైమిత్తికంయదితి ॥ లఘుగురుమంగలయోర్భిన్నకర్తృత్వేనదోషః - కాత్యాయనోమునిః ఇతిపారిజాత॥ ఇతీతికిం॥ వ్రతంముండనంన - చౌలమేవముండనం - మౌంజీవివాహాదుభయత్రకార్యేతి॥ తథాచతద్వాక్యం ॥ శ్లో ॥ ముండనంచౌలమిత్యుక్తంవ్రతోద్వాహౌతుమంగళం । చౌలంముండనమేవోక్తం వర్జయేద్వరణాత్పరం॥ మౌంజీచోభయతఃకార్యా యతోమౌంజీనముండనమితి ॥ అథసంకటేప్రవృత్తిమాహ॥ భేదేబ్దస్యేతి॥ సంకటేదేశకాలభయాదౌ- అబ్దస్యసంవత్సరస్యభేదే - పూర్వోదితంమంగళం - వితనుయాత్ - విస్తారయేత్-



కుర్యాదిత్యర్థః - తథాచోక్తంసంహితాసారావళ్యాం॥ శ్లో ॥ ఫాల్గునేచైత్రమాసేతుపుత్రోద్వాహోపనాయనే । భేదాదబ్దస్యకుర్వీతనర్తుత్రయలంఘనమితి ॥ అథవా- వేదాహాంతరితే-చతుర్దినాంతరితే - కాలే మంగళంవితనుయాత్ - తథాచస్మృతిసారావళ్యాం ॥ శ్లో ॥ పుత్రీపరిణయాదూర్ధ్వం యావద్దినచతుష్టయం । పుత్ర్యంతరస్యకుర్వీత నోద్వాహమితిసూరయఇతి॥ అథవా దినవ్యవహితేకాలేమంగళంకుర్వీత॥ తథాచోక్తం॥ శ్లో ॥ ఏకోదరప్రసూతానామేకస్మిన్వాసరేనరః । వివాహంనైవ కుర్వీత మండనోపరిముండనమితి॥ అథవాఏకాహేపి - నద్యానగేనపర్వతేన - అంతరితేదేశేమంగళంవితనుయాత్ - జ్యోతిర్వివరణే॥శ్లో॥ ఏకోదరయోర్వరయోరేకదినోద్వాహతో భవేన్నాశః । నద్యంతరఏకదినేకేప్యాహుస్సంకటేచశుభమితి॥ శార్ఙ్గధరోపి॥ నద్యంతరేపి శుభదంపృథక్శైలస్యరోధత ఇతి॥

మూ॥ ఏకాహేపిజనాశ్రయాంతర ఇహేదంతారతమ్యాద్బుధై
గ్యోజ్యంనోయమయోర్నిషిద్ధ మనయోరేకత్రకార్యంజగుః। నైకస్మైదుహితృద్వయం సహజయోర్నైకోద్భవే
కన్యకే దద్యాదుద్వహనం మిథోన తనుయాత్తుర్యాద
సంపద్యదః॥ ౫౦॥

టీక॥ ఏకాహేపి=ఒక్కదినమునందుఁగూడ, జనాంతరాశ్రయే= మండపాంతరమందు, మంగళమ్=శుభమును, వితనుయాత్ = చేయవలయును. ఇహ=ఈవివాహాదివిషయమునందు, ఇదమ్ = సంవత్సరభేదము కలుగుచునుండఁగా చెప్పఁబడిన విషయము, తారతమ్యాత్ = తారతమ్యమువలన, బుధైః=విద్వాంసులచేత, యోజ్యమ్ = యోజనచేయఁదగినది, యమయోః=కవలవారికి, నిషిద్ధమ్=నిషేధింపఁబడినది, నో = కాదు. అనయోః=ఈకవలవారికి, మంగళమ్=శుభమును, ఏకత్ర = ఒక్కదినమందే యొక్కమండపమందే, కార్యమ్ = చేయఁదగినది, ఇతి = ఇట్లని, జగుః= చెప్పుదురు.ఏకస్మై=ఒక్కనికొఱకు,దుహితృద్వయమ్=ఇరువురుకుమార్తెలను, నోదద్యాత్=ఈయఁగూడదు. సహజయోః = ఏకోదరులగుపురుషులకు, ఏకోద్భవే=ఏకగర్భజనితలయిన, కన్యకే=కన్యకలను, నోదద్యాత్= ఈయఁగూడదు. మిథః=పరస్పరమును, ఉద్వహనమ్=వివాహమును, నతనుయాత్=చేయఁగూడదు. అసంపది = తగినయుపపత్తిలేని సమయమునందు, అదః=ఈవివాహములను, తనుయాత్=చేయవలయును.

తా॥ ఇట్లు కాదేని యొక్క దినమందుఁగూడ వేఱొక మండపమందు సోదరులగువారికి వివాహమును చేయవచ్చును. "శ్లో॥ నప్రతిషిద్ధంలగ్నం సంప్రాప్తే సంకటేమహతి। ఏకోదర సంభవయోరేకాహే భిన్నమండపేకాలే॥" (=అధికమైన సంకటము సంప్రాప్తమగుచుండఁగా లగ్న మునిషిద్ధమైనది కానేరదు. కావున ఏకోదర సంభవులగువారికి భిన్నమండపములయందు భిన్నకాలములయందుఁ జేయవచ్చును.) అని జ్యోతిర్వివరణమందుఁ జెప్పఁబడియె. ఈవివాహాది విషయమునందు సంవత్సరము యొక్క భేదముకలుగుచునుండఁగా అని పూర్వశ్లోకమునందుఁ జెప్పఁబడినవిషయమును విద్వాంసులగువారు తారతమ్యమునుబట్టి యోచనను చేయవలయును. అనఁగా సంకటమునకుఁదగినట్లు చేయవలయుననుట. కవలవారికిమాత్రము ఏకసంవత్సరమునందే యేకకాలమునందే యేకమంటపమునందే వివాహమును చేయవచ్చునని మునివరులు చెప్పుచున్నారు. "శ్లో॥ ఏకస్మిన్వత్సరేచైక వాసరేమండపేతథా। కర్తవ్యంమంగళంస్వస్రోర్భ్రాత్రోర్యమళజాతయోః॥" (=జంటగాఁబుట్టినస్త్రీలకును పురుషులకును ఒక్కసంవత్సరమునందే యొక్క దినమునందే యొక్కమండపమునందే మంగళముచేయఁదగినది.) అని గ్రంథాంతరమందుఁగూడఁ జెప్పఁబడియె. మఱియును, ఒక్కవరునకే యేకోదరులగు కన్యకలనిచ్చి వివాహమును జేయఁగూడదు. మఱియును, ఏకోదరసంభవులగు భ్రాతలకు ఏకోదరజనితలగు కన్యకల నీయఁగూడదు. ఇటులనే పరస్పరమును వివాహమును అనఁగా బదులుకు బదులిచ్చి వివాహమును చేసికొనఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, వధూవరులు సంభవింపని సంకటకాలమునందుఁ జెప్పఁబడినవిధముగఁ జేయుటవలన దోషములేదని యెఱుఁగవలయును. "శ్లో॥ ప్రత్యుద్వాహోనైవకార్యో నైకస్మిన్దుహితృద్వయం। నచైకజన్యయోఃపుంసోరేకజన్యేతుకన్యకే॥" (=బదులునకు బదులిచ్చి వివాహమును చేసికొనఁగూడదు. ఒక్కనియందు ఇద్దఱగు పుత్రికలనీయఁగూడదు. ఏకోదరులగు పురుషులకు ఏకగర్భజనితలగు కన్యకల నీయఁగూడదు.) అని నారదుఁడు చెప్పె.

వ్యా॥ ఏకాహేపీతి॥ అథవాఏకాహేఽపి - జనాంతరాశ్రయే- మండపాంతరేమంగళంవితనుయాత్ ॥ ని ॥ మండపోస్త్రీజనాశ్రయ ఇత్యమరః॥ ఉక్తంజ్యోతిర్వివరణే॥ శ్లో॥ నప్రతిషిద్ధంలగ్నం సంప్రాప్తేసంకటేమహతి॥ ఏకోదరసంభవయోరేకాహే భిన్నమంటపేకాలఇతి॥ అత్రైషాంసంవత్సరభేదాంశనిర్ణయమాహ॥ ఇహైదమితి॥ ఇహాస్మిన్ వివాహాదివిషయే ఇదం భేదేబ్దస్యేత్యాద్యుక్తం బుద్ధైస్తారతమ్యాద్యోజ్యం - సంకటానురూపం యోజ్యమిత్యర్థః - అథ యమళయోర్విశేషమాహ - నోయమయోరితి॥ యమయోర్యమళయోః - ఇదంనోషిద్ధం - అనయోర్యమళయోర్మంగలం ఏకత్ర ఏకవత్సర ఏకవాసరే - ఏకమండపేకార్యమితి మునయోజగుః॥ ఉక్తంచ॥ శ్లో॥ ఏకస్మిన్వత్సరేచైవ వాసరేమండపేతథా। కర్తవ్యంమంగళంస్వస్రోర్భ్రాత్రోర్యమళజాతయోరితి॥ అథ ప్రత్యుద్వాహనిషేధమాహ॥ నైకస్మైఇతి॥ ఏకస్మైవరాయ దుహితృద్వయం ఏకోద్భవకన్యాద్వయంనదద్యాత్ - సహజయోరేకోదర సంభవయోర్భ్రాత్రోః ఏకోద్భవేకన్యేకేనదద్యాత్ - తథామిథఃపరస్పరం ఉద్వహనంనతనుయాత్ - అత్రాపిసంకటేప్రవృత్తిమాహ॥ కుర్యాదితి॥ అదఃనైకస్మా ఇత్యాద్యుక్తమకర్తవ్యం అసంపది అన్యవధూవరాలాభేసతికుర్యాత్ - తథాచనారదః॥ శ్లో॥ ప్రత్యుద్వాహోనైవకార్యో నైకస్మిన్దుహితృద్వయం। నచైకజన్యయోఃపుంసోరేకజన్యేతుకన్యకే ఇత్యాది॥



## (*) అథ ప్రతికూలనిర్ణయాదిన్యాహ. (*)

మూ॥ నోద్వాహంసతినిశ్చయేపి జగదుఃపిత్రోస్సపిత్రోస్త్రియా
స్సూనోర్భ్రాతురనూఢిత స్వసురసూః త్యాక్రాంతౌపితృ
వ్యస్యచ।అన్యస్యాన్వయజాత్యయేపిజనకాంబాస్త్రీసుతా
న్యాత్యయేఽబ్దార్ధార్ధార్ధదళాంతరేవిదధతేహేరంబశాం
త్యాక్వచిత్॥ ౫౧॥

టీక॥ నిశ్చయేపిసతి = వివాహనిశ్చయమైనదగుచునుండఁగా, సపిత్రోః=తల్లిదండ్రులతోఁగూడియున్న, పిత్రోః= (వధూవరుల) తల్లిదండ్రులకు, అసూత్క్రాంతౌసత్యామ్ = ప్రాణోత్క్రమణము కలుగుచునుండఁగను, స్త్రియాః = (వరునిప్రథమ) స్త్రీకి, అసూత్క్రాంతౌసత్యామ్= ప్రాణోత్క్రమణము కలుగుచునుండఁగను, సూనోః = వరునిపుత్రునకు, అసూత్క్రాంతౌ సత్యామపి = ప్రాణోత్క్రమణము కలుగుచుండఁగను, భ్రాతుః=సోదరునకు, అసూత్క్రాంతౌ సత్యామ్=ప్రాణోత్క్రమణము కలుగుచునుండఁగను, అనూఢితస్వసుః = వివాహముగాని చెలియలికి, అసూత్క్రాంతౌ సత్యామ్=ప్రాణోత్క్రమణము కలుగుచునుండఁగను, పితృవ్యస్య = తండ్రియొక్క సోదరునకు, అసూత్క్రాంతౌ సత్యాంచ= ప్రాణోత్క్రమణము కలుగుచునుండఁగను, ఉద్వాహమ్ = వివాహము,

న=కూడదు. ( ఇతి=ఇట్లని, బుధాః-విద్వాంసులు, ) జగదుః = చెప్పిరి. అన్యే-మఱికొందఱు, స్వాన్వయజాత్యయేపి = స్వకులమునందుఁ బుట్టిన వారియొక్క నాశమందును, ఉద్వాహమ్-వివాహము, నో = కూడదు. (ఇతి-ఇట్లని,) జగదుః=చెప్పుదురు. జనకాంబాస్త్రీసుతాన్యాత్యయే=తండ్రియొక్కయును తల్లియొక్కయును భార్యయొక్కయును పుత్త్రినియొక్కయును (వీరికంటె) ఇతరులగు దాయాదులయొక్కయును నాశమందు, అబ్దార్ధార్ధార్ధదళాంతరే=సంవత్సరకాలము, ఆఱుమాసములకాలము, మూడుమాసములకాలము, నలుబదైదుదినములకాలము, ఇరువదిమూడుదినములకాలము వ్యవధికలుగుచుండఁగా, హేరంబశాంత్యా = గణేశశాంతిచేత, క్వచిత్-ఒకానొకప్పుడు, బుధాః-విద్వాంసులు, విదధతే-చేయుచున్నారు.

తా॥ వివాహముచేయునటుల నిశ్చయింపఁబడిన దగుచుండఁగా వధూవరుల తల్లిదండ్రులకుఁగాని ఆవధూవరుల పితామహ పితామహీలకుఁగాని వరునియొక్క భార్యకుఁగాని (ఇది ద్వితీయవివాహప్రమాటయని యెఱుఁగవలయును.) వరునిపుత్త్రికకుఁగాని వధూవరుల సోదరులకుఁగాని, వివాహముగాని చెల్లెండ్రకుఁగాని పినతండ్రులకుఁగాని నాశము కలిగెనేని యావధూవరులకు వివాహమును చేయఁగూడదని యెఱుఁగవలయును. "శ్లో॥ వరవధ్వోః పితామాతా పితృవ్యశ్చసహోదరః । ఏతేషాంప్రతికూలంచే న్మహావిఘ్నప్రదంభవేత్ ॥" (=వధూవరులయొక్క తండ్రి తల్లి పినతండ్రి సహోదరుఁడు అను వారలకు మరణముకలిగెనేని యధికమైన విఘ్నముకలుగును.) అని వృద్ధశౌనకుఁడు చెప్పె. "శ్లో॥ పితాపితామహశ్చైవ మాతాచైవపితామహీ । పితృవ్యస్త్రీసుతోభ్రాతా భగినీచవివాహితా । ఏభిరేవవిపన్నైశ్చ ప్రతికూలంబుధైస్స్మృతం। అన్యైరపివిపన్నైస్తు కేచిదూచుర్నతద్భవేత్॥" (=తండ్రియును, పితామహుఁడును, తల్లియును, పితామహియును, పితృవ్యుఁడును, భార్యయును, పుత్త్రుఁడును, భ్రాతయును, వివాహితురాలగు సోదరియును, అనువారు మరణమును పొందినయెడల వివాహము చేయఁగూడదని విద్వాంసులచేతఁ జెప్పఁబడియె. ఇతరులగు జ్ఞాతులు మరణమును పొందినపుడుకూడ మహావిఘ్నమే యని కొందఱుచెప్పుచున్నారు.) యిూగులమాట మునుచెప్పెదను. మఱియును, ఇతరులగు విద్వాంసులు స్వగోత్రమునందుఁ బుట్టినవారికి మరణము కలిగినపుడుకూడ అదివఱకు నిశ్చయింపఁబడిన



వధూవరులకు వివాహమును చేయఁగూడదని చెప్పుచున్నారని యెఱుఁగవలయును. "శ్లో॥ వాగ్దానానంతరంయత్ర కులయోఃకస్యచిన్మృతిః। తదోద్వాహోనైవకార్యః స్వపక్షక్షయదోషతః॥" (=వాగ్దానానంతరమందు వధూవరులగోత్రములయందుఁ బుట్టినవారిలో నెవ్వరైన మరణమునుపొందిరేని యావధూవరులకు వివాహమును చేయఁగూడదు.) అని భృగువుచెప్పె. మఱియును, వాగ్దానానంతరమందు వధూవరుల తల్లిదండ్రులకును వరునిభార్యకును, పుత్త్రికకును, వధూవరులకులస్థులకును మరణము కలిగినయెడల ఆవధూవరులకు వివాహమును చేయఁగూడదనియును, ఒకవేళఁ జేసినయెడల క్రమముగా సంవత్సరము ఆఱుమాసములు మూడుమాసములు నలుబదైదు దినములు ఇరువదిమూడు దినములును గతించిన పిమ్మట చేయవలయును.

వ్యా॥ నోద్వాహమితి॥ నిశ్చయేపిసతిబుధాః - ఉద్వాహంనజగదుః-కస్యాంసత్యాం - పిత్రోః అసూతాక్రాంతౌసత్యాం - మాతాచపితాచ పితరౌతయోః - అసూనాంప్రాణానాం ఉత్క్రాంతిః-ఉత్క్రమణంతస్యాంసత్యామిత్యర్థః - కథంభూతయోః పిత్రోఃస్వపిత్రోః - పితరౌచపితరౌచపితరః - మాతుఃపితరౌ - పితుఃపితరావిత్యర్థః - తైస్సహావర్తమానౌసపితరౌ - తయోఃసపిత్రోః - పుంసఃకస్యాంసత్యాం - స్త్రియాః అసూత్క్రాంతౌసత్యాం ఇదంద్వితీయవివాహేజ్ఞేయం - ఏవంసూనోః పుత్రస్యభ్రాతుఃసహజస్య అనూఢితస్వసుః - అపరిణీతభగిన్యాః-పితృవ్యస్యపితృభ్రాతుః - అసూత్క్రాంతౌసత్యాం - ఏతదుక్తంభవతి ॥ పిత్రాదీనాముక్తానాంమధ్యే అన్యతమేమృతేసతి వివాహంనకుర్యాదిత్యర్థః - తథాచవృద్ధశౌనకః ॥ శ్లో ॥ వరవధ్వోఃపితామాతా పితృవ్యశ్చసహోదరః । ఏతేషాంప్రతికూలంచే న్మహావిఘ్నప్రదంభవేత్॥ అన్యచ్చ॥ పితాపితామహశ్చైవ మాతాచైవపితామహీ । పితృవ్యస్త్రీసుతోభ్రాతాభగినీచవివాహితా॥ ఏభిరేవవిపన్నైశ్చ ప్రతికూలంబుధైస్స్మృతం। అన్యైరపివిపన్నైస్తు కేచిదూచుర్నతద్భవేదితి ॥ అథాన్యేషాంమతమాహ ॥ అన్యేఇతి॥ అన్యేబుధాః - స్వాన్వయజాత్యయేపి స్వకులజాతమర్త్యనాశేపి-ఉద్వాహంనవిదధుః - తథాచభృగుః ॥ శ్లో ॥ వాగ్దానానంతరంయత్ర కులయోఃకస్యచిన్మృతిః । తదోద్వాహోనైవకార్యః స్వపక్షక్షయదోషతఇతి॥ అథసంకటేప్రవృత్తిమాహ॥ జనకాంబాస్త్రీతి॥ జనకశ్చ అంబాచస్త్రీచసుతశ్చ అన్యశ్చ-అన్యఃకులజః-ప్రతికూలాధికారీ - ఏషాంసమాహారో

నాశః మరణమిత్యావత్ - తస్మిన్ సతి-అబ్దార్ధార్ధార్ధదశాంతరే హేరంబశాంత్యా - గణేశశాంత్యా-క్వచిత్సంకటే పదధతే బుధా ఇత్యధ్యాహారః-ఏతదుక్తం భవతి - పరస్యవధ్వావా పితృనాశే - అబ్దాంతరే-వర్షాన్తరే-మాతృనాశే-అర్ధాంతరే-షణ్మాసాంతరే-స్త్రీనాశే- అర్ధార్ధాన్తరే త్రిమాసాంతరే-ఏతద్ద్వితీయాదివివాహేజ్ఞేయం - తథాపుత్రనాశే అర్ధాంతరే-సార్ధమాసాంతరే - అన్యనాశే - పితృమాతృస్త్రీత్యాదిభ్యోన్యస్యకులస్యనాశేదశాంతరేన ర్ధమాసస్యార్ధాంతరే - త్రయోవింశతిదినాంతరే విదధత ఇత్యర్థః॥ ఇతి ప్రతికూలనిర్ణయాదీని సమాప్తమ్.

——(*) తత్రభ్రాతృవిశేషమాహ. (*)——

మూ॥ భ్రాతుశ్చాత్మజవద్భయే ఽతిసమయే పిత్రోర్మృతేస్సంశయేనాన్యేషాం ప్రతికూలమామయివిరక్తారాద్గతానామపి । ఆతుర్యాన్మృతసృక్రియానభిభవేనాందీముఖంనాచరేన్నోకుర్యాజ్జ్వరితస్యమంగళమతివ్యాధ్యుద్భవేనిశ్చయమ్॥ ౫౭॥

టీక॥ భ్రాతుః=సోదరునకు, (నాశేసతి = నాశముకలుగుచునుండఁగా) పుత్రవత్-పుత్రనాశమందువలెనే, (సార్ధమాసాంతరేసతి= నలుబదైదుదినములు వ్యవధికలుగుచుండఁగా, కుర్యాత = చేయవలయును.) భయే=దుర్భిక్షరాజభయమందును, అతిసమయే = కాలాతిక్రమణమునందును, పిత్రోః=తల్లిదండ్రులకు, మృతేః = మరణముయొక్క, సంశయే=సందేహమునందును, అన్యేషామ్-ఇతరులు, (మృతానాంసతామ్=మరణమునుపొందినవారగుచునుండఁగా, ప్రతికూలమ్=విఘ్నము, నాస్తి=లేదు. ఆమయివిరక్తారాద్గతానామ్=రోగి విరక్తుఁడు దూరముననున్నవాఁడు అనువారలు, మృతానాంసతామపి = మరణమును పొందుచుండఁగను, ప్రతికూలమ్=విఘ్నము, నాస్తి=లేదు. ఆతుర్యాత్-నాల్గవపురుషనిలోపల, మృతసృక్రియానభిభవే = మరణమునుపొందినమానవులకు పరలోకక్రియలు చేయఁబడనివగుచునుండఁగా, నాందీముఖమ్-నాందీముఖము, నాచరేత్-ఆచరింపఁగూడదు. జ్వరితస్య-జ్వరమును పొందినవానికి, మంగళమ్=శుభమును, నోకుర్యాత్ = చేయఁగూడదు. అతివ్యాధ్యుద్భవే-అధికమైనవ్యాధి కలుగుచునుండఁగా, నిశ్చయమ్=సత్యముగా, మంగళమ్=శుభమును, నైవకుర్యాత్=చేయఁగూడదు.

తా॥ ఆప్రతికూలమునందు భ్రాతృవిశేషమును చెప్పుచున్నాఁ



డు. ఎట్లనినః—భ్రాతయగువాఁడు నశించినయెడల పుత్త్రనాశమందువలెనే నలుబదైదు దినములు గతించిన పిమ్మట వివాహాది శుభములను చేయవలయును. "శ్లో॥ పితురబ్దమిహాశౌచం తదర్ధంమాతురేవచ । మాసత్రయంతుభార్యాయా స్తదర్ధంభ్రాతృపుత్త్రయోః॥ అన్యేషాంతుసపిండానా మాశౌచం మాససమ్మితం । యదాతు శాంతికంకృత్వా తతోలగ్నంవిధీయతే॥" (=తండ్రి మరణమును పొందినయెడల సంవత్సరకాలమాశౌచమనియును, తల్లికి ఆరుమాసములకాల మాశౌచమనియును, భార్యకు మూడుమాసములాశౌచమనియును, భ్రాతృపుత్త్రులకు నలుబదైదుదినములాశౌచమనియును, ఇతరులకు జ్ఞాతులకు నెలదినములాశౌచమనియును, కావున ఇట్టియాశౌచకాలములు అతిక్రమించిన పిమ్మట శాంతిని జేసి పిమ్మట లగ్నమును జేయవలయును.) అని స్మృతిసారావళియను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ సంకటేసమనుప్రాప్తే యాజ్ఞవల్క్యేనయోగినా । శాంతిరుక్తాగణేశస్య కృత్వాతాంశుభమాచరేత్॥ అకృత్వాశాంతికంయస్తు నిషేధేసతిదారుణే । నకరోతిశుభంగర్వాద్విఘ్నస్తస్యపదేపదే॥" (=సంకటము సంభవించినపుడు యాజ్ఞవల్క్యమునివరుఁడు గణేశశాంతిని జేయుమనియె. కావున గణేశశాంతినిచేసి శుభమునాచరింపవలయును. మిగుల భయంకరమైన నిషేధము కలుగుచునుండఁగా శాంతినిజేయక గర్వముచేత శుభమును చేయువానికి మాటిమాటికిని విఘ్నము కలుగును.) అని స్మృత్యంతరమందుఁగూడఁ జెప్పఁబడెను "శ్లో॥ ప్రతికూలేపికర్తవ్యో వివాహోమాసమంతరాత్। శాంతింవిధాయగాందత్వా వాగ్దానాదిచరేత్పునః॥" (=ప్రతికూలము కలిగినప్పటికిని మాసముదినము లతిక్రమించిన పిమ్మట శాంతినిచేసి గోదానమును దేసి యనంతరమందు వాగ్దానాదికమును చేయవలయును.) అని జ్యోతిఃప్రకాశమునందుఁ జెప్పఁబడియె. మఱియును, ఈశాంత్యాదికమును కన్యక ప్రౌఢురాలు కాఁదగియుండఁగా తల్లిదండ్రుల మరణమునందుఁగూడ మాసముదినము లతిక్రమించిన పిమ్మట వాగ్దానాదికమును చేయవలయును. మఱియును, దుర్భిక్షరాజభయాదులు కలుగుచుండఁగను, కాలాతిక్రమణము కలుగుచునుండఁగను, తల్లిదండ్రులకు మరణసంశయము కలుగుచునుండఁగను, తల్లిదండ్రులకంటె నితరులకు మరణము కలిగినను దశరాత్రాశౌచము గడచిపోఁగానే వాగ్దానాదికమును చేయవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ దుర్భిక్షేరాష్ట్రభంగేచ పిత్రోర్వా

ప్రాణసంశయే । ప్రౌఢాయామపికన్యాయాం నానుకూలంప్రతీక్ష్యతే॥" (=దుర్భిక్షమునందును రాజ్యభంగము కలుగునపుడును, తల్లిదండ్రులకు ప్రాణసంశయము కలిగియున్నపుడును, కన్యక ప్రౌఢురాలయ్యె తరుణము గనున్నను ఇతరుల మరణాదికమువలన విఘ్నభయములేదు.) అని జ్యోతిస్సాగరమందుఁ జెప్పఁబడియె. మఱియును, దీర్ఘరోగియును, విరక్తుఁడును, దూరదేశము నందున్నవాఁడును మరణమును పొందినప్పటికిని ప్రతికూలభయములేదని యెఱుఁగవలయును. "శ్లో॥ దీర్ఘరోగాభిభూతస్య దూరదేశస్థితస్యచ । ఉదాసవృత్తిసన్యస్య ప్రతికూలంనవిద్యతే॥" (=దీర్ఘరోగముకలవానికిని దూరదేశమునందున్నవానికిని వైరాగ్యమును పొందినవానికిని మరణము కలిగినప్పటికిని ప్రతికూలభయములేదు.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడె. తనను గోత్రమునందు నాల్గవపురుషునివఱకునుగల పురుషులకు ప్రేతకర్మములు గాకయుండెనేని నాందీముఖము నాచరింపఁగూడదు. "శ్లో॥ ప్రేతకర్మాణ్యనిర్వర్త్య చరేన్నాభ్యుదయక్రియాం । ఆచతుర్థంతతఃపుంసి పంచమేతుశుభంభవేత్॥" (=నాల్గవపురుషునివఱకునుగల పురుషులలో నెవ్వనికైనను ప్రేతకర్మములు కాకపోయెనేని వివాహాది శుభములను జేయఁగూడదు. అయిదవపురుషునకు ప్రేతకర్మములు గాకపోయినను విఘ్నముకలుగదు.) అని మేధాతిథియను మునివరుఁడు చెప్పె. మఱియును, జ్వరితుఁడగువానికి మంగళమును జేయఁగూడదు. "శ్లో॥ జ్వరినస్యోత్పాదనంయస్య శుభంతస్యనకారయేత్ । దోషనిర్గమనాత్పశ్చాత్ స్వస్థోధర్మంసమాచరేత్॥" (=జ్వరముకలవానికి శుభమును జేయఁగూడదు. జ్వరదోషము పోయిన పిమ్మట శుభాదిధర్మములను జేయవలయును.) అని గర్గమునివరుఁడు చెప్పె. మఱియును, అతిభయంకరమైన జ్వరము కలిగియుండెనేని నిశ్చయముగా వివాహాదిశుభములను జేయఁగూడదు. "శ్లో॥ కేచిదూచుర్గృహస్థస్య కస్యచిద్దారుణోజ్వరః । తావన్మంగళకార్యంచ నకార్యంనిశ్చితంబుధైః॥" (=దారుణమగు జ్వరము కలిగియుండఁగా ఆజ్వరము నివర్తించువఱకును శుభమును జేయఁగూడదు.) అని గర్గమునివరుఁడు చెప్పె.

వ్యా॥ భ్రాతుశ్చాత్మవదితి॥ భ్రాతుర్నాశే పుత్రవత్ - పుత్రనాశోక్తవద్జ్ఞేయం - సార్ధమాసాంతరే కర్తవ్యమిత్యర్థః - తథాచస్మృతిరత్నావళ్యాం॥ శ్లో॥ పితురబ్దమిహాశౌచం తదర్ధంమాతురేవచ । మాసత్రయంతుభార్యాయాః తదర్ధంభ్రాతృపుత్రయోః॥ అన్యేషాంతుసపిండా



నామాశౌచంమాససమ్మితం । యదాతు శాంతికంకృత్వా తతోలగ్నం విధీయత ఇతి॥ స్మృత్యంతరేప్యుక్తం॥ సంకటేసమనుప్రాప్తే యాజ్ఞవల్క్యేన యోగినా । శాంతిరుక్తాగణేశస్య కృత్వాతాంశుభమాచరేత్॥ అకృత్వాశాంతికంయస్తు నిషేధేసతిలగ్నకే । సకరోతిశుభంగర్వాద్విఘ్నాస్తస్యపదేపదే ఇతి॥ జ్యోతిఃప్రకాశే॥ ప్రతికూలేపి కర్తవ్యో వివాహోమాసమంతరాత్ । శాంతింవిధాయగాందత్వా వాగ్దానాదచరేత్పునరితి॥ ప్రౌఢత్వే ప్రౌఢాయాం కన్యాయాం పిత్రోర్మరణేపజ్ఞేయం । ప్రతికూలేప్రతికూలాభావమాహ॥ దుర్భిక్షేత్యాది - భయేదుర్భిక్ష రాజభయే అతిసమీపస్థే అతికాలేపిత్రోర్మాతాపిత్రోః మృతేసంశయేసతి - అన్యేషాంమాతృపితృభ్యామన్యేషాంమృతానాం ప్రతికూలంనాస్తి - తథాచోక్తం జ్యోతిస్సాగరే॥ శ్లో॥ దుర్భిక్షేరాష్ట్రభంగేచ పిత్రోర్వాప్రాణసంశయే । ప్రౌఢాయామపికన్యాయాం నానుకూలం ప్రతీక్షతే ॥ విశేషాంతరమాహ॥ ఆమయివిరక్తారాద్గతానామపి ప్రతికూలంనాస్తి - ఆమయీ-రోగీ దీర్ఘరోగితయ్యావత్ - విరక్తోగృహాదిషూదాసీనః - ఆరాద్గతో దూరంగతః - దేశాంతరంగత ఇత్యేయావత్॥ ని॥ ఆరాద్దూరసమీపయోరిత్యమరః - ఏషామపిమృతానాం ప్రతికూలంనాస్తి॥ తథాచోక్తం స్మృత్యంతరే॥ శ్లో॥ దీర్ఘరోగాభిభూతస్య దూరదేశస్థితస్యచ । ఉదాసవృత్తిసన్యస్య ప్రతికూలంనవిద్యత ఇతి॥ అథాన్యాపి శాస్త్రార్థానాహ॥ ఆతుర్యాదితి॥ తుర్యశ్చతుర్థః పురుషః - మూలపురుషాచ్చతుర్థ ఇత్యర్థః - తంమర్యాదీకృత్య-మృతస్యనరస్య-క్రియాయాః అనభిభవే - అభావేసతి - క్వచిత్కారణాంతరక్రియాయామకృతాయాం నాందీముఖంనాచరేత్ - తత్స్వగోత్రవిషయం తథాచమేధాతిథిః॥ శ్లో॥ ప్రేతకర్మాణ్యనిర్వర్త్య చరేన్నాభ్యుదయక్రియాం । ఆచతుర్థంతతఃపుంసి పంచమేతుశుభంభవేదితి॥ నోకుర్యాదితి॥ జ్వరితస్యమంగళంనోకుర్యాత్ - తథాచగర్గః॥ శ్లో॥ జ్వరస్యోత్పాదనం యస్య శుభంతస్యనకారయేత్ । దోషనిర్గమనాత్పశ్చాత్ స్వస్థోధర్మంసమాచరేత్॥ ఇతి॥ అతీతి॥ అతివ్యాధ్యుద్భవే - కస్యచిత్కులజస్యశరీరే అతిదారుణజ్వరోత్పత్తౌ - నిశ్చయం నోకుర్యాత్ - ప్రతికూలభీత్యా- రోగః పాప్మాజ్వరోవ్యాధిర్వికారోదురితమామయ ఇత్యమరః జ్వరపర్యాయనామాని॥ తథాచగర్గః॥ శ్లో॥ కేచిదూచుర్గృహస్థస్య కస్యచిద్దారుణోజ్వరః । తావన్మంగళకార్యంచ నకార్యంనిశ్చితంబుధైరితి॥ ఇతి భ్రాతృవిషయకశేషం సమాప్తమ్.

—* అథ మహత్సంకటేసతివృద్ధిసూతకే కర్తవ్యతాదీనాహ. *—

మూ॥ చేత్స్యాత్సూతకముక్తపూర్వ సమయేనారబ్ధ కార్యేబుధః కూశ్మాండీ ఘృతహోమతోపిజన నాశౌచే క్వచి
త్కారయేత్ । సింహేజ్యేనశుభంహితంహరిలవోర్ధ్వం
గౌతమీదక్షిణేజాహ్నవ్యుత్తరతః క్వచిద్ధితమజేర్కే తోఽస్ర
భీత్యాదిషు॥ ౫౩॥

టీక॥ ఉక్తపూర్వసమయే = వివాహాదులకు పూర్వమునందుఁ జెప్పఁబడినకాలమునందు, అనారబ్ధకార్యేసతి=కర్మము ఆరంభింపఁబడనిదగుచునుండఁగా, సూతకమ్ = సూతకము, స్యాచ్చేత్ = అయ్యెనేని, బుధః=విద్వాంసుఁడు, జననాశౌచే=జననాశౌచమునందు, క్వచిత్=ఒకానొకప్పుడు, కూశ్మాండీఘృతహోమతః= "కూశ్మాండీభిర్ఘృతేన" అను ఋక్కులతో ఘృతహోమమువల్లన, కారయేత్ = చేయవలయును. సింహేజ్యే = సింహమునందు గురుఁడుండఁగా, శుభమ్=శుభము, హితమ్=హితమైనది, న=కాదు క్వచిత్=ఒకానొకప్పుడు, హరిలవోర్ధ్వమ్=సింహనవాంశమును అతిక్రమించినపిమ్మట, గౌతమీదక్షిణే=గోదావరికి దక్షిణమందును, జాహ్నవ్యుత్తరతః = గంగానదికి ఉత్తరమందును, హితమ్=ఇష్టమైనది, స్యాత్=అగును. అజే=మేషమునందు, అర్కే-సతి = సూర్యుఁడుకలిగియుండఁగా, అస్రభీత్యాదిషు = రజోదోషాది భయములుకలుగుచుండఁగా, శుభమ్=శుభమును, కుర్యాత్=చేయవలయును.

తా॥ గొప్పదగు సంకటము కలుగుచునుండఁగా వృద్ధిసూతకము నందు కర్తవ్యతాదులను గుఱించి చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—యజ్ఞము వివాహము చౌలము మౌంజిబంధము మొదలగు కర్మములకు చెప్పఁబడినకాలమునందు అభ్యుజ్ఞాదికర్మము ఆరంభింపఁబడకయుండఁగా సూతకము మొదలుగాఁగల సంకటములు సంప్రాప్తములయ్యెనేని "కూశ్మాండీభిర్ఘృతేవా దేవహేడనమ్" అను మంత్రము మొదలుగాఁగల మూఁడుమంత్రములచేత ఘృతహోమమునుచేసి సూతకాద్యాశౌచములయొక్క పరిమితదినములగు పదిదినములలోపలనే యజ్ఞవివాహాదులను జేయవచ్చునని తెలియవలయును. "శ్లో॥ సంకటేమనుప్రాప్తే సూతకేసముపాగతే । కూశ్మాండీభిర్ఘృతంహుత్వా గాందత్వాచపయస్వినీం । చూడోపనయనోద్వాహ ప్రతిష్ఠాదికమాచరేత్॥" (=సంకటము కలిగినపుడును, సూతకమువచ్చినపుడును, కూశ్మాండీ ఋక్కులచేత ఘృతహోమమును చేసి క్షీరములను పిదుకుచున్నగోవును దానముచేసి చూడోపనయనోద్వాహ దేవప్రతిష్ఠాదికమును ఆచరింపవలయును.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ అనారబ్ధవిశుద్ధ్యర్థం కూశ్మాండైర్జుహుయాద్ఘృతం । గాందద్యాత్పంచగవ్యాశీతతశ్శుద్ధ్యతిసూతకీ॥" (=అనారబ్ధకార్యముయొక్క పరిశుద్ధతకొఱకు కూశ్మాండ ఋక్కుల చేత ఘృతహోమమునుచేసి పంచగవ్యమును పుచ్చుకొని గోదానమును చేసినయెడల సూతకియగువాఁడు మిగుల పరిశుద్ధుఁడగును.) అని మఱియొకస్మృతియందుఁ జెప్పఁబడియె. ఇకను గురుఁడు సింహమునందుండఁగా మంగళములను జేయ గూడదను విషయమును దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—సింహరాశియందు గురుఁడుండఁగా శుభకర్మములను జేయఁగూడదు. ఈవిషయ మిదివఱకే చెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ శాంతికంపౌష్టికంయాత్రాప్రతిష్ఠోద్వాహపూర్వకం । నకుర్యాత్సర్వమాంగళ్యం సింహస్థేచబృహస్పతౌ॥" (=గురువు సింహమునందుండఁగా శాంతికము పౌష్టికము దేవతాప్రతిష్ఠ, వివాహము మొదలుగాఁగల సకల శుభములను జేయఁగూడదు.) అని కాలనిర్ణయమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ ఇష్టాపూర్తేవచౌలాది సంస్కారాన్వాస్తుకర్మచ । అన్యానిశుభకర్మాణి నకుర్యాత్సింహగేగురౌ ॥" (గురుఁడు సింహమునందుండఁగా ఇష్టాపూర్తము, చౌలాది సంస్కారములు, వాస్తుకర్మము, మఱియునితరములగు శుభకర్మములును చేయఁగూడదు.) అని మాండవ్యుఁడు చెప్పె. ఇఁకను సంకటమునందలి ప్రవృత్తిని చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఒకానొకప్పుడు దేశకాలభయాదికము కలుగుచునుండఁగా సింహమునందు గురుఁడున్నపుడు ఆగురుఁడు సింహనవాంశమును అతిక్రమించినపిమ్మట గోదావరికి దక్షిణమునందును గంగానదికి యుత్తరమందును శుభకర్మములను చేయవలయును. "శ్లో॥ సింహేగురౌ సింహనవాంశకోర్ధ్వం గోదావరీ దక్షిణకూలజాతైః । ఉద్వాహకాలాత్యయదోషభీతైః కార్యోవివాహశ్చ్యవనోబ్రవీతి॥" (=సింహస్థితగురుఁడు సింహనవాంశమును అతిక్రమించినపిమ్మట వివాహకాలాతిక్రమణాది భయముకలుగుచునుండఁగా గోదావరీనదికి దక్షిణతీరమునందలి వారు వివాహాదికమును చేయవచ్చునని చ్యవనుఁడు చెప్పె.) అని జ్యోతిర్నిబంధమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ భాగీరథ్యుత్తరేతీరే గోదావర్యాశ్చ దక్షిణే। వ్రతోద్వాహాదికర్మాణి సింహసంస్థేనదుష్యతి॥" (=భాగీరథికి యు

త్తరమునందును గోదావరికి దక్షిణమందును, సింహమునందు గురుఁడు న్నప్పటికిని ఉపనయనవివాహాది శుభములను చేయవచ్చును.) అని గర్గ మునివరుఁడు చెప్పె. మఱియును, గోదావరికి దక్షిణమందును గంగాన దికి ఉత్తరమందును అని చెప్పుటచేత గోదావరికి ఉత్తరమందును భాగీ రధికి దక్షిణమందును అనఁగా గంగాగోదావరులకు మధ్యయందు సంక టకాలమునందుఁగూడ వివాహాదికమును ఆచరింపఁగూడదని యెఱుఁగవ లయును. "శ్లో॥ గోదావర్యుత్తరేతీరే భాగీరథ్యాశ్చదక్షిణే। వివాహాదిన కుర్వీత సింహసంస్థేచవాక్పతౌ॥" (= గురుఁడు సింహరాశియందుం డఁగా గోదావరికి ఉత్తరమునందును భాగీరథికి (గంగకు) దక్షిణము నందును నివసించినవారు వివాహాది శుభములను జేయఁగూడదు) అని వసిష్ఠమునివరుఁడుకూడఁ జెప్పె. మఱియును రజోదర్శనాది భయములు కలుగుచునుండఁగా గంగాగోదావరుల మధ్యయందున్నవారుకూడ సిం హమందున్న గురుఁడు సింహనవాంశమును అతిక్రమించిన పిమ్మట వివా హాది శుభములను చేయవచ్చునని యెఱుఁగవలయును. మఱియును, గురుఁడు సింహమునందున్నప్పటికిని సూర్యుఁడు మేషమునందుండఁగా రజోదర్శనాది సంకటములు వచ్చునట్లుండెనేని వివాహాది శుభములను జేయవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ మేషస్థే దివసకరేసింహస్థే వజ్రపాణిసచివేచ। యస్యాః పరిణయనమసౌ సాధ్వీ సుఖసంపదోపే తాస్యాత్॥" (=సూర్యుఁడు మేషమునందుండఁగా గురుఁడు సింహమునందు న్నప్పటికిని వివాహములను చేయుటవలన దోషము లేదనియును, శుభ ములే కలుగుననియును, ఎఱుఁగవలయును.) అని శౌనకుఁడు చెప్పె. మఱి యును, "వ్రతబంధస్తుమీనగే" (మీన చైత్రమునందుఁగూడ ఉపనయన మును చేయవచ్చును) అని యీగ్రంథకర్త యిదివఱకే చెప్పె. కావున మీనచైత్రమందుఁగూడ మౌంజీబంధనాదికమును చేయవచ్చునని యెఱుఁ గవలయును. మఱియును, "శ్లో॥ జన్మభాదష్టగేసింహే నీచేవాశత్రు గేగురౌ। మౌంజీబంధశ్శుభఃప్రోక్తశ్చైత్రేమీనగతేరవౌ॥" (=గురుఁడు జన్మరాశికి యెనిమిదవస్థానమునందున్నను నీచయందున్నను శత్రుస్థానము నందున్నను మీనచైత్రమందు మౌంజీబంధము శుభకరమైనదగును.) అని మౌంజీపటలమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ సింహస్థేదేవగురౌ మేష స్థేయదిభవేత్సహస్రాంశుః। మంగళకార్యంకుర్యాదితి నారదపరాశరౌ వదతః॥" (=బృహస్పతి సింహమునందుండఁగా సూర్యుఁడు మేషమునం



దుండెనేని మంగళకార్యములను జేయవచ్చునని నారదపరాశరులు చెప్పి రి.) అని శౌనకుఁడు చెప్పె. "అస్రభీత్యాదిషు" అనుచోటఁ జెప్పఁబడిన యాదిశబ్దముచేత వృద్ధపత్యృమరణమునందు కర్త్రంతరము లేకపోవుట మొద లుగాఁగల యధికసంకటము మొదలగునవియని యెఱుఁగవలయును.

వ్యా॥ చేత్స్యాదితి॥ ఉక్తపూర్వసమయే - యజ్ఞోద్వాహనచౌల మౌంజికమిత్యతోక్తే పూర్వకాలే అనారబ్ధకార్యేసతి - కర్మణి అనార బ్ధేసతి-సంకటేచప్రాప్తేసతి - కూశ్మాండీఘృతహోమతః - కూశ్మాండీ భిర్యద్దేవాదేవహేడనమిత్యాది తిసృభిఋగ్భిర్ఘృతహోమః - కూశ్మాం డీఘృతహోమః - తేనజననాశౌచేదశాహాంతః - జన్మదశాహమధ్యే - కర్మఆచరేత్ - కూశ్మాండీఘృతహోమంశాస్త్రోక్తం - సదక్షిణంకృత్వ కర్మకర్తవ్యమిత్యర్థః - తదుక్తంస్మృత్యంతరే॥ శ్లో॥ సంకటేసమనుప్రా ప్తేసూతకేసముపాగతే। కూశ్మాండీభిర్ఘృతంహుత్వా గాందత్వాచ పయస్వినీం॥ చూడోపనయనోద్వాహ ప్రతిష్ఠాదికమాచరేదితి॥ స్మృత్యం తరే॥ అనారబ్ధవిశుద్ధ్యర్థం కూశ్మాండైర్జుహుయాద్ఘృతం। గాందద్యా త్పంచగవ్యాశీతతశ్శుద్ధ్యతిసూతకీతి॥ అథసింహేగురౌ సతిమంగళ నిషేధ మాహ॥ సింహేజ్యేతి॥ సింహే సింహరాశౌఇజ్యః - సింహేజ్యః-తస్మిన్ సతి-శుభం-నిత్యవ్యతిరిక్తం - నహితంస్యాత్ - ఇదంతు పూర్వమేవప్రపం చితం - తథాచకాలనిర్ణయే॥ శ్లో॥ శాంతికంపౌష్టికంయాత్రా ప్రతిష్ఠో ద్వాహపూర్వకం। నకుర్యాత్సర్వమాంగళ్యం సింహస్థేచబృహస్పతౌ॥ తథాచమాండవ్యః॥ ఇష్టాపూర్తేచచౌలాది సంస్కారాన్వ్రతకర్మచ। అన్యానిశుభకర్మాణి నకుర్యాత్సింహగేగురావితి॥ అథసంకటే ప్రవృత్తి మాహ॥ హరిలవోర్ధ్వమితి॥ క్వచిత్సంకటే దేశకాలభయాదౌ సింహే జ్యేపి హరిలవాదూర్ధ్వంసింహాంశాదూర్ధ్వం - గౌతమ్యాః దక్షిణతఃజా హ్నవ్యా ఉత్తరతః - శుభంకర్మహితంస్యాత్॥ తథాచజ్యోతిర్నిబంధే॥ శ్లో॥ సింహేగురౌ సింహనవాంశకోర్ధ్వం గోదావరీదక్షిణకూలజాతైః। ఉద్వాహకాలాత్యయదోషభీతైః కార్యోవివాహశ్చ్యవనోబ్రవీతీతి॥ తథాచగర్గః॥ భాగీరథ్యుత్తరేతీరే గోదావర్యాశ్చదక్షిణే। వ్రతోద్వా హాదికర్మాణి సింహసంస్థేనదుష్యతీతి॥ అర్థాద్గోదావర్యాః- ఉత్తరే-భాగీ రథ్యాఃదక్షిణే ఏవంద్వయోర్గోదాజాహ్నవ్యోః - మధ్యేసంకటేపి శుభం నాచరేదితిసిద్ధం-తథాచవసిష్ఠః॥ శ్లో॥ గోదావర్యుత్తరేతీరే భాగీరథ్యా శ్చదక్షిణే। వివాహాదినకుర్వీత సింహసంస్థేచవాక్పతౌ-ఇతి॥ అత్రాప్యత్ర

సంకటేప్రవృత్తిమాహ॥ అజేతి॥ అస్రభీత్యాదిషు- రజోభయాదిషుసత్సు అంతః గోదాజాహ్న్వ్యోర్మధ్యే - హరిలవాదూర్ధ్వం సింహేజ్యేసతి - అజే-మేషే-ఇనే-సూర్యేసతి-శుభమాచరేత్ - అజఇనే ఇత్యేతత్ వివాహవిషయం - అస్రభీత్యాదిష్విత్యనేనపదేనలక్ష్యతే॥ తథాచశౌనకః॥శ్లో॥ మేషస్థేదివసకరేసింహస్థేవజ్రపాణిసచివేచ । యస్యాఃపరిణయనమసౌసాధ్వీసుఖసంపదోపేతేతి॥ వ్రతబంధస్తు మీనగేసూర్యేసతి - చైత్రేకర్తవ్యఇతిగ్రంథకృతాప్రాగేనోక్తం - అనిమిషరవిమధౌకార్యమితి॥ తథాచమౌంజీపటలే॥ శ్లో॥ జన్మభాదష్టగేసింహేనీచేవాశత్రుగేగురౌ । మౌంజీబంధశ్శుభఃప్రోక్తశ్చైత్రేమీనగతేరవౌ॥ అథవా ఇనే ఇత్యేతత్పదం సర్వశుభసాధారణవిషయం ॥ తథాచశౌనకః ॥ శ్లో ॥ సింహస్థేదేవగురౌమేషస్థేయదిభవేత్సహస్రాంశుః । మంగలకార్యంకుర్యాదితి నారదపరాశరౌవదతఇతి॥ అస్రభీత్యాదిష్విత్యత్రాదిశబ్దేన వృద్ధపితృమరణశంకాయాంకర్తర్యంతరాభావాద్యతి సంకటేజ్ఞేయం॥

## (*) అథనామరాశిజన్మరాశ్యోర్నిర్ణయమాహ. (*)

మూ॥ దేశగ్రామ గృహజ్వర వ్యవహృతి ద్యూతేషు దానేమనౌ
సేవాకాకిణివర్గసంగర పునర్భూమేళకేనామభం । జన్మర్క్షంపరతో వధూపురుషయోర్జన్మర్క్ష మేకస్యచేద్ జ్ఞాతం
శుద్ధిమితోవిలోక్య చతయోర్నామర్క్షయోర్మేలకః॥ ౫౪॥

టీక॥ దేశగ్రామ గృహజ్వర వ్యవహృతి ద్యూతేషు = దేశము, గ్రామము, గృహము, జ్వరము, వ్యవహారము, ద్యూతము, అను వానియందును, దానే=తులాపురుషాది దానములయందును, మనౌ = మూలమంత్రమునందును, సేవాకాకిణివర్గ సంగర పునర్భూమేళకే=రాజసేవ, కాకిణి, వర్గశుద్ధి, యుద్ధము, పునర్భూమేలనము, మొదలగు వానియందును, నామభమ్=నామనక్షత్రము, ప్రధానమ్=ముఖ్యము, స్యాత్=అగును. పరతః = ఇప్పుడు చెప్పఁబడినవానికంటె ఇతరములగు కార్యముల యందు, జన్మర్క్షమ్=జన్మనక్షత్రము, ప్రధానమ్=ముఖ్యము, స్యాత్=అగును. వధూపురుషయోః=వధూవరులలోపల, ఏకస్య=ఒకనికి, జన్మర్క్షమ్=జన్మనక్షత్రము, జ్ఞాతంచేత్=తెలియఁబడెనేని, ఇతః = ఈజన్మనక్షత్రమువలన, శుద్ధిమ్=గుర్వాదిశుద్ధిని, విలోక్య=చూచి, తయోః = ఆవధూవరులకు, నామర్క్షయోః = నామనక్షత్రములయందు, మేలకః = మేలనము, స్యాత్=అగును.



తా॥ నామరాశి జన్మరాశులయొక్క నిర్ణయమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—దేశము, గ్రామము, గృహము, జ్వరము, వ్యవహారము, ద్యూతము, తులాపురుషాదిదానము, మంత్రము, రాజసేవ, వర్గశుద్ధి, యుద్ధము, పునర్భూమేలనము మొదలగువానియందు నామనక్షత్రము ప్రధానమైనదని యెఱుఁగవలయును. ఇప్పుడు చెప్పఁబడినవానికంటె ఇతరములగువానియందు జన్మనక్షత్రము ప్రధానమైనదని యెఱుఁగవలయును. "శ్లో॥ దేశేగ్రామేగృహేయుద్ధే సేవాయాం వ్యవహారకే। నామరాశేఃప్రధానత్వం జన్మరాశింనచింతయేత్॥ కాకిణ్యాంవర్గశుద్ధౌచదానేద్యూతేజ్వరోదయే । మంత్రేపునర్భూవరణే నామరాశేః ప్రధానతా॥ " (=దేశము, గ్రామము, గృహము, యుద్ధము, సేవ, వ్యవహారము, మొదలగు కార్యములయందు నామనక్షత్రము ముఖ్యమైనది. జన్మనక్షత్రమును వినావలయును. కాకిణియందును, వర్గశుద్ధి, దానము, ద్యూతము, జ్వరోదయము, మంత్రము, పునర్భూవరణము, అను వానియందు నామనక్షత్రము ప్రధానమైనది.) అని జ్యోతిర్నిబంధమునందుఁ జెప్పఁబడియె. "శ్లో ॥ వివాహేసర్వమాంగళ్యే యాత్రాదౌ గ్రహగోచరే। జన్మరాశేఃప్రధానత్వం నామరాశిం నచింతయేత్॥ " (=వివాహమునందును సర్వమంగళకార్యములందును, యాత్రాదులయందును గ్రహగోచరమందును, జన్మరాశి ముఖ్యమనియును, నామరాశిని విచారింపఁగూడదనియును, తెలియవలయును.) అనియును జ్యోతిర్నిబంధమందుఁ జెప్పఁబడియె. మఱియును, వధూవరులలోపల నొక్కరి జన్మనక్షత్రముమాత్రము తెలియఁబడెనేని గుర్వాదిశుద్ధినిమాత్రము జన్మనక్షత్రమునుబట్టి ఆయిరువురిలో జన్మనక్షత్రముకలవానికి చూచుకొని యిరువురికి మేలనమునుమాత్రము నామనక్షత్రములనుబట్టి చూచుకొనవలయును. "శ్లో॥ వివాహఘటనంచైవ లగ్నజంగృహజంబలం। నామభాచ్చింతయేత్సర్వం జన్మనజ్ఞాయతేయదా॥ ,, (=వివాహఘటనము గృహజమగు బలము మొదలగువానిని జన్మనక్షత్రము తెలియనపుడు నామనక్షత్రమువలనఁ దెలిసికొనవలయును.) అనిశార్ఙ్గధరుడు చెప్పె.

వ్యా॥ దేశఇతి॥ దేశఃప్రసిద్ధః- గ్రామఃప్రసిద్ధః - గృహంప్రసిద్ధం- జ్వరః-ప్రసిద్ధః- ఇత్యాదిషునామరాశిః - ప్రధానంస్యాత్ - ఏతదుక్తంభవతి॥ దేశగ్రామగృహేషుప్రవేశార్థం- జ్వరేచంద్రాద్యవలోకనార్థం- వ్యవహృతిర్వ్యవహారః - ద్యూతంప్రసిద్ధం - దానం - తులాపురుషాది-

ప్యేషుచంద్రబలాద్యర్థం - వసామంత్రే మేలనార్థం - చంద్రబలాద్యర్థంచ-సేవా రాజాదిసేవా - తత్ర మేలాద్యర్థం - కాకిణ్యాం-కాకిణ్యవలోకనార్థంవర్గశుద్ధ్యర్థం - సంగరేసంగ్రామే - చంద్రబలాద్యర్థం - పునర్భ్యామేలకే-పునర్భ్వామేలనాయ- నామరాశిరవలోకనీయేత్యర్థః - పరతః-ఏభ్యోన్యత్రవివాహయాత్రాదౌ - జన్మర్క్షం-జన్మరాశిః-ప్రధానంస్యాత్॥ తథాచజ్యోతిర్నిబంధే॥ శ్లో॥ దేశేగ్రామే గృహేయుద్ధే సేవాయాం వ్యవహారకే। నామరాశేఃప్రధానత్వం జన్మరాశింనచింతయేదితి ॥ కాకిణ్యాంవర్గశుద్ధౌచ దానేద్యూతేజ్వరోదయే । మంత్రేపునర్భ్వావరణే నామరాశేః ప్రధానతేతి॥ వివాహేసర్వమాంగళ్యే యాత్రాదౌగ్రహగోచరే। జన్మరాశేఃప్రధానత్వం నామరాశింనచింతయేదితి ॥ అథవధూవరయోర్మధ్యే ఏకస్యజన్మర్క్షంజ్ఞాతం - ఏకస్యనజ్ఞాతం - తదాశుద్ధిమేలాదికం కథమవలోకనీయమిత్యాహ॥ వధూపురుషయోరితి॥ వధూపురుషయోర్మధ్యే-చేద్యది ఏకస్యజన్మర్క్షంజ్ఞాతం - ఏకస్యనజ్ఞాతంతదాఇతః - జ్ఞానాత్‌జన్మర్క్షాదేకస్యశుద్ధిం గుర్వాదిశుద్ధిం విలోక్యతయో ర్వధూవరయోర్నామర్క్షగుణాన్మేలకోవర్ణవశ్యాదికః - పూర్వోక్తోవిలోక్యః- అర్థాద్ద్వయోర్నామ్నాజ్ఞానేనామర్క్షాదేవసర్వంవిలోక్యం - తథాచశార్ఙ్గధరః॥ శ్లో॥ వివాహఘటనంచైవ లగ్నజంగృహజంబలం । నామభాచ్చింతయేత్సర్వం జన్మనజ్ఞాయతేయదీతి॥

——(*) అథమేళకార్థం నామ్నోనక్షత్రజ్ఞానాదీనాహ. (*)——

మూ॥ భంనామాదిమవర్ణతోఽవకహడా ద్యుజ్యాదివర్ణాద్బవౌ
తుల్యావత్రశసౌఖషౌ యదభిధాబహ్వ్యోస్య నామాంతిమం । ఆర్యాస్సూద్వహనేజనుర్భమమలంపట్టస్యబంధే
జగుః గేహగ్రామనృపాభిషేకకృషిమౌంజ్యన్నాశనే
భూషణే॥ ౫౫॥

టీక॥ నామాదిమవర్ణతః = పేరుయొక్క మొదటివర్ణమునుబట్టి, అవకహడాత్ = "అవకహడ" అనునట్టి శాతపదచక్రమువలన, భమ్= నక్షత్రము, జ్ఞాతవ్యమ్= తెలియఁదగినది, యుజి=సంయుక్తాక్షరనామమందు, ఆదివర్ణాత్= మొదటివర్ణమువలన, భమ్ = నక్షత్రము, జ్ఞాతవ్యమ్= తెలియఁదగినది, అత్ర=ఈ "అవకహడ" అనునట్టి శాతపదచక్రమునందు, బవౌ=బవఅనువర్ణములు, తుల్యౌ = సమానములయినవి, శసౌ= శవర్ణసవర్ణములు, తుల్యౌ=సమానములయినవి, ఖషౌ=ఖవరషవర్ణములు, తుల్యౌ=సమానములు, యదభిధా=ఎవనినామము, బహ్వ్యః=అనేకనామములుకలదో, అస్య=వీనికి, అంతిమమ్=కడపటి, నామ = నామము, (ప్రధానమ్=ముఖ్యము, స్యాత్ = అగును.) సూద్వహనే పురుషవివాహమునందును, పట్టస్య=పట్టముయొక్క, బంధే=బంధమందును, గేహగ్రామన్నృపాభిషేకకృషిమౌంజ్యన్నాశనే = గృహకరణప్రవేశము, గ్రామప్రవేశము, రాజాభిషేకము, కృషి, మౌంజీబంధము, అన్నప్రాశనము, అనువానియందును; భూషణే = అలంకారధారణమందును, జనుర్భమ్= జన్మనక్షత్రమును, అమలమ్=నిర్మలమైనదానినిగా; ఆర్యాః = పూజ్యులగువారు, జగుః=చెప్పుచున్నారు

తా॥ ఇఁకను మేలకముకొఱకు నామముయొక్క నక్షత్రజ్ఞానాదులను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— "అవకహడ" అనునట్టి శాతపదచక్రమువలన అనఁగా, "చూచేచోలా అశ్విని" అను శ్లోకములచేత కూర్పఁబడిన చక్రమువలన నామముయొక్క మొదటియక్షరమునుబట్టి నక్షత్రమును దెలిసికొనవలయును. ఎట్లనిన:— చూడామణియను నామముయొక్క మొదటి యక్షరము చకారమగుటవలన "చూచేచోలా అశ్విని" అను శ్లోకోక్తప్రకారముగ చకారమునకు అశ్వినీనక్షత్రమును దెలిసికొనవలయును. "శ్లో ॥ జన్మనజ్ఞాయతేయేషాం తేషాంనామగవేష్యతే । చక్రేఽవకహడేభాంశాత్తన్నాడీకైశ్చిదగ్నిభాత్॥" ( = జన్మకాలము తెలియనివారికి నామమునుబట్టియే నక్షత్రమును దెలిసికొనవలయును. మఱియును నామనక్షత్రములను బట్టియే నక్షత్రపాదమును కూడఁ దెలియవలయును.) అని దీపికయందుఁ జెప్పఁబడెను. నామనక్షత్రమును వెదకునప్పుడు కృత్తికానక్షత్రమువలన నాడిని చూడవలసినదని కొందఱు చెప్పుచున్నారు. అయినను ఆమతము అంగీకరింపఁదగినదికాదు. "వ్యస్తమగు నశ్విన్యాదిత్రికము" అను న్యాయముచేత నాడినిచూచుట బహుసమ్మతమైయున్నదని యెఱుఁగవలయును. నామముయొక్క మొదటియక్షరము సంయుక్తాక్షరమైయుండెనేని ఆసంయుక్తాక్షరములలో మొదటియక్షరమువలన నామనక్షత్రమును దెలిసికొనవలయును. ఎట్లనిన:—ప్రద్యుమ్నయనునామమునందలి మొదటియక్షరము "ప్ర" అయియున్నదికనుక ఆ "ప్ర" అనుదానిలోని ప్రకారమును అచ్చును అనఁగా "పి" అను నక్షరమును గ్రహించి యానక్షత్రమువలన నక్షత్రమును దెలిసికొనవలయును. మఱియు నిటులనే ద్రుపదయనునామము

నందు "దు" అను నక్షరమునుబట్టి నక్షత్రమును గ్రహింపవలయును. "శ్లో॥ సంయోగాక్షరజే నామ్ని జ్ఞేయం తత్రాదిమాక్షరమ్," (= సంయోగాక్షరములుగల నామమునందు మొదటియక్షరమును గ్రహింపవలయును.) అని స్వరశాస్త్రమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "అవకహడ" అను చక్రమునందు నామాదిమాక్షరము లేనపుడు బవలును శసలును ఖషలును సమానములయినవని యెఱుఁగవలయును. "శ్లో॥ ఖషౌ శసౌ బవౌ చైవ జ్ఞేయావితి పరస్పరమ్," (= ఖషవర్ణములును శసవర్ణములును బవవర్ణములును పరస్పరమును సమానములయినవి.) అని స్వరశాస్త్రమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ నహి ప్రోక్తా ఙఞణా వర్ణా నామాదౌ సంతి తేన హి। చేద్భవంతి తదా జ్ఞేయా గజడాస్తే యథాక్రమం॥ చక్రం శతపదం వక్ష్యే బుధైః శాక్షరసంభవమ్ ॥" (నామాదియందు ఙఞణ అనువర్ణములు లేవు. కావున "అవకహడ" చక్రమునందు ఙఞణవర్ణములు చెప్పఁబడలేదు. ఒకవేళ ఙఞణ వర్ణములు నామాదియందుండె నేని వానికి మూఁటికిని క్రమముగా గజడవర్ణములను గ్రహింపవలయును.) అని మఱియొక గ్రంథమునందుఁ జెప్పఁబడె. మఱియును, ఒకవేళ ఒకనికే అనేకనామములు గలిగియున్నయెడల కడపటినామమునుబట్టి నక్షత్రమును దెలియవలయును. "శ్లో॥ బహూనియస్య నామాని నరస్యస్యుః కథంచన। తస్య పశ్చాద్భవం నామ గ్రాహ్యం స్వరవిశారదైః॥" (= అనేకనామములు గలిగినపుడు కడపటి నామమును ముఖ్యముగా గ్రహింపవలయును.) మఱియును, పురుషవివాహమునందును, పట్టబంధమందును, గృహనిర్మాణ గృహప్రవేశములయందును, గ్రామనిర్మాణ గ్రామప్రవేశములయందును, రాజాభిషేకమందును, కృషియందును, మౌంజీబంధమందును, అన్నప్రాశనమందును, భూషణధారణమందును, జన్మనక్షత్రమును శుభమైనదానినిగా పెద్దలు చెప్పుచున్నారు. "శ్లో॥ జన్మభం కృషినృపాభిషేచనే భూషణే నగరగేహకర్మణి। ఆధిపత్యభువి మౌంజిబంధనే పుంవివాహ ఉదితం శుభం బుధైః॥" (= కృషి నృపాభిషేచనములయందును, భూషణమందును, నగరగృహకర్మములయందును, ఆధిపత్యమందును, మౌంజీబంధమందును, పురుషవివాహమందును జన్మనక్షత్రము శుభకరమైనదని జ్యోతిఃప్రకాశమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ వసంతసమయే దద్యా దష్టే గర్భాష్టమేఽష్టమే। మేఖలంజన్మమాసేపి జన్మభే చ తథాపి చ॥" (= గర్భాష్టాది నెనిమిదవ సంవత్సర



మునందైనను జననాదిగ నెనిమిదవ సంవత్సరమునందైనను వసంతకాలమునందును జన్మమాస జన్మనక్షత్రములయందు మేఖలమును గట్టవలయును.) "శ్లో॥ పట్టబంధనచౌలాన్న ప్రాశనే చోపనాయనే। శుభదం జన్మనక్షత్ర మశుభం త్వన్యకర్మణి॥" (= పట్టబంధమందును చౌలమందును అన్నప్రాశనమందును ఉపనయనమందును, జన్మనక్షత్రము శుభకరమైనదనియును, ఇతరకర్మములయందు అశుభకరమైనదియును అగును.) అని నారదుఁడు చెప్పె.

వ్యా॥ భమితి॥ నామాదిమఃస్యో నామాద్యక్షరం తస్మాత్ అవకహడం - శాతపదం చక్రం యస్మాచ్చక్రాత్ - చూచేచోలాపదేష్వాద్యే ఇత్యాదయశ్శ్లోకాని బద్ధాస్తస్మాచ్చక్రాత్ భం నక్షత్రం జ్ఞేయం-తద్యథా॥ చూడామణీతి నామ్నః ఆద్యక్షరాత్ చకారాత్ - చూచేచోలా ఇత్యాదినా అశ్వినీనక్షత్రం తత్ర ప్రథమచరణ ఇతివత్ జ్ఞేయ మిత్యర్థః ॥ తథాచ దీపికాయాం ॥ శ్లో ॥ జన్మ నజ్ఞాయతే యేషాం తేషాం నామ గవేష్యతే। చక్రేఽవకహడే భాంశా తన్నాడీ కైశ్చిదగ్నిభాదితి ॥ తన్నాడీత్యస్యార్థః- యదా నామ్నా నక్షత్రం గవేష్యతే తదా అగ్నిభాత్ కృత్తికానక్షత్రాత్ నాడీవిలోక్యేతి కైశ్చిదుక్తం - కైశ్చిదితి తన్మతమగ్రాహ్యం - తస్మాదశ్విన్యాదిత్రికం వ్యస్తమితిన్యాయేన నాడ్యవలోకనం బహుసమ్మత మితిభావః॥ అథ నామాదౌ సంయోగాక్షరే సతి కింకర్తవ్య మిత్యపేక్షాయామాహ॥ యుజ్యాదివర్ణాదితి॥ యుజియుక్తేఽక్షరే సంయుక్తాక్షరే ప్రద్యుమ్నేత్యాదికే నామాదౌ యుక్తాక్షరే సతి ఆదివర్ణాత్ ప్రథమవర్ణాత్-భం జ్ఞేయం-యథా ప్రద్యుమ్ననామ్ని ప్రథమవర్ణః- ప్రస్తరాద్యః - పకారః తస్మాత్ భం జ్ఞేయమిత్యర్థః - ప్రియవచేత్యాదౌ పికార ఏవ- గ్రుపదేత్యాదౌ ద్రుకార ఏవ గ్రాహ్య ఇత్యాది - స్వరశాస్త్రే ॥ శ్లో ॥ సంయోగాక్షరజే నామ్ని జ్ఞేయం తత్రాదిమాక్షరమితి ॥ అథ అవకహడచక్రే నామాద్యక్షరాభావే సతి కింకర్తవ్య మిత్యపేక్షాయామాహ॥ బవౌ తుల్యావత్ర శసౌ ఖషావితి - అత్రావకహడచక్రే బవౌ ఇతి ఇమౌ వర్ణౌ తుల్యౌ - తథా చ ఖషౌ॥ శివ ఇతి నామ్ని సతి అవకహడే చక్రే శవర్ణస్యాభావాత్ శవర్ణస్థానే సకారాంగీకారాత్ - భం జ్ఞేయమితిభావః - ఏవమేవ శసౌ తథా ఖషౌ పరస్పరవర్ణా జ్ఞాత్వా భం జ్ఞేయం - తథాచ స్వరశాస్త్రే ॥ ఖషౌ శసౌ వబౌ చైవ జ్ఞేయావితి పరస్పరమితి॥ అన్యచ్చ॥ నహి ప్రోక్తా ఙఞణా వర్ణా నామాదౌ సంతి తేన హి। చేద్భవంతి తదా జ్ఞేయా గజడాస్తే యథాక్రమమితి॥ చక్రం

శతపదంవక్ష్యే ఋక్షాంశాక్షరసంభవమితి॥ స్వరశాస్త్రోక్తమవకహడ చక్రంప్రసిద్ధం - అథయస్యబహూనినామాని సంతితస్య కస్మాన్నామ్నో భంజ్ఞేయమిత్యాకాంక్షాయామాహ ॥ యదభిధాబహ్వ్యోస్య నామాంతిమమితి॥ యస్య అభిధానామాని బహ్వ్యోభవంతి తస్యాంతిమం పశ్చాద్భవంనామగ్రాహ్యం॥ తథాచస్వరశాస్త్రే॥ శ్లో॥ బహూనియస్యనామానిసరస్యస్యుఃకథంచన। తస్యపశ్చాద్భవంనామగ్రాహ్యం స్వరవిశారదైరితి॥ అథ జన్మనక్షత్రం మేషమేష శస్తంతాన్యాహ॥ ఆర్యాఇతి॥ న్రుద్వహనే - పురుషవివాహే - జనుర్భం - జన్మనక్షత్రం-అపులంనిర్దూషణంజగుః - తథాపట్టస్యబంధేపట్టబంధనే - గేహం గృహాకరణప్రవేశనం-తథాగ్రామే - గ్రామవరప్రవేశనం - నృపాభిషేకో రాజాభిషేకః-కృషిఃప్రసిద్ధా - మౌంజీప్రసిద్ధా అన్నాశనం-నవాన్నప్రాశనం-భూషణం-భూషణధారణం - ఏషాంసమాహార స్తస్మిన్ జన్మభంశుభదంజగుః॥ తథాచజ్యోతిఃప్రకాశే॥ శ్లో॥ జన్మభంకృషినృపాభిషేచనే భూషణే నగరగేహకర్మణి। ఆధిపత్యభువిమౌంజిబంధనే పుంవివాహ ఉదితం శుభం బుధైరితి॥ రాజమార్తండే॥ శ్లో॥ వసంతసమయేదద్యా దబ్దే గర్భాష్టమే ష్టమే। మేఖలంజన్మమాసేపి జన్మభేచతిథావపీతి॥ నారదః॥ పట్టబంధనచౌలాన్న ప్రాశనేచోపనాయనే। శుభదంజన్మనక్షత్ర మశుభం త్వన్యకర్మణీతి॥ ఇతి స్వకృత వివాహప్రకరణం సమాప్తమ్.

—(*) అథాగ్న్యాధానంతన్నక్షత్రంచ వృత్తేనైకేనాహ. (*)—

మూ॥ అగ్న్యాధానమవాది దార సమయే దాయాద్యకాలేపరై
ర్ద్వీశాగ్నిధ్రువశాక్రపూషభమృగే జ్యైర్వ్యబ్జలగ్నాంశ
యోః। జీవేంద్వర్కకుజైస్సుతే - ౫-౯-౩-౬ - ౧౧-౧౦-
గురు-౧-కేంద్ర-౧-౪-౭ - ౧౦-స్థైరనస్తంగతైస్స్వోచ్చే
ష్టర్క్షగతైఃపరైరుపచయైర్విత్తాద్యశుద్ధౌబుధైః॥ ౧॥

టీక॥ అగ్న్యాధానమ్ = అగ్నియొక్కయాధానము, దారసమయే=దారసమయమందు, అవాది = చెప్పఁబడెను. పరైః = ఇతరులచేత, దాయాద్యకాలే=ధనవిభాగకాలమందు, అవాది=చెప్పఁబడెను. ద్వీశాగ్నిధ్రువశాక్రపూషభమృగేజ్యైః=విశాఖ, కృత్తిక, ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రోహిణులు, జ్యేష్ఠ, పుష్యమి, మృగశీర్ష, పుష్యమి, రేవతి, అనునట్టి నక్షత్రములచేత, వ్యబ్జలగ్నాంశయోః = జలచరరాసులయందును వానినవాంశలయందును ( అనఁగా, మకరముయొక్క పశ్చిమార్ధము కుంభము



మీనము కర్కాటకము అను రాసులయందును ఈరాసుల నవాంశలయందును, జీవేంద్వర్కకుజైః=గురుడు చంద్రుఁడు సూర్యుఁడు అంగారకుఁడు అనునట్టిగ్రహములు, అనస్తంగతైః=అస్తమయమును పొందనివారై, సుతగురుకేంద్రస్థైః = అయిదు మూఁడు ఆఱు పదనొకండు పది తొమ్మిది ఒకటి నాలుగు ఏడు పది స్థానములయందుండఁగను, స్వోచ్చేష్టర్క్షగతైః=స్వక్షేత్ర ఉచ్చ మిత్ర క్షేత్రములను పొందియుండఁగను, పరైః=ఇతరులు, ఉపచయైః = ఉపచయస్థానములను పొందియుండఁగను, విత్తాద్యశుద్ధౌ=రెండవగృహమును లగ్నమును పరిశుద్ధతను పొందియుండఁగను, అగ్న్యాధానమ్ = అగ్నియొక్కయాధానము, బుధైః=విద్వాంసులచేత, అవాది=చెప్పఁబడెను.

తా॥ అగ్న్యాధానమును దానికిఁదగిన నక్షత్రాదులను ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—అనేకులయిన విద్వాంసులచేత వివాహకాలమునందు అగ్న్యాధానము చెప్పఁబడెను. ఇతరులు ధనవిభాగకాలమునందుఁ జెప్పిరి. "సూ॥ అవసథ్యాధానందారకాలేదాయాద్యకాలే ఏకేషామ్" (=అగ్న్యాధానమును దారకాలమందైనను ధనవిభాగకాలమందైనను జేయవలసినది.) అని కాత్యాయన గృహ్యసూత్రమునందు రెండువిధముగాఁజెప్పె. మఱియును, ఈసూత్రమునకు భాష్యమునుచేయునపుడు భాష్యకారులు భ్రాతృవులు లేనివాఁడు దారకాలమునందే చేయవలసినదనియును, భ్రాతృవులు కలవాఁడు ధనవిభాగకాలమునందుఁ జేయవలసినదనియును, చెప్పిరి. "శ్లో॥ కృతదారో నైవతిష్ఠేత్ క్షణమప్యగ్నినావినా। యోనాగ్నిముపసేవేత దారాన్కామాదృతావపి॥ పారదారీసవిజ్ఞేయ స్స్వస్త్రీస్వీకరణాదపి। యథాస్నానంయథాసంధ్యా వేదస్యాధ్యయనంయథా। తథైవౌపాసనందృష్టం నస్థితిస్తద్వియోగతః॥" (=వివాహమును జేసికొన్నవాఁడు క్షణమునైనను అగ్నిని సేవింపకయుండఁగూడదు. అగ్నిసేవనువదలి ఋతుకాలమందైనను కామమువలన స్వభార్యను స్వీకరించినను పరదారాభిగమనమును జేసినవాఁడగును. స్నానసంధ్యాధ్యయనములవలెనే యగ్నిసేవకూడ చేయఁదగినది. కావున అగ్నిసేవను జేయనియెడల ద్విజత్వము నిలువదని యెఱుఁగవలయును.) అని స్మృతులయందు వివాహమైనపిమ్మట అగ్న్యాధానమును జేయకపోవుట మహాదోషమని చెప్పఁబడినది. మఱియును, విశాఖ, కృత్తిక, ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్రలు, రోహిణి,

జ్యేష్ఠ, పుష్యమి, మృగశీర్ష, రేవతి, అను నక్షత్రములును జలచర రాసులును నవాంశలునుదప్ప దక్షిణరాశి నవాంశాదులును అగ్న్యాధానమునకు శ్రేష్ఠములయినవని తెలియవలయును. "శ్లో ॥ కర్కినక్రఘటమీనవిలగ్నేవాంశకేతనుగతేథతదీయే । లగ్నకేకుముదినీదయితే వానాశమేతి జనితోపిహుతాశః॥" (=కర్కటకము మకరము కుంభము మీనము అనునవి లగ్నములయినను లగ్ననవాంశములయినను అయ్యేనేని భార్యనైనను భర్తనైనను నశించును. అగ్నిహోత్రముకూడ నశించును.) అని వృత్తశతమునందుఁ జెప్పఁబడియె. మఱియును, గురువు, చంద్రుఁడు, రవి, కుజుఁడు, అను గ్రహములు ౫-౩-౬ - ౧౧-౧౦-౯ - ౧-౪-౭-౧౦-స్థానములయందుండఁగా ఈస్థానములు పైనఁ జెప్పఁబడిన గ్రహములకు స్వోచ్చమిత్ర స్వక్షేత్రములలోనైయుండఁగను, ఈ గ్రహములు అస్తంగతులు గాకయుండఁగను, అగ్న్యాధానమును జేయవలసినదని యెఱుంగవలయును. మఱియును, ఇప్పుడు చెప్పఁబడిన గ్రహములకంటె ఇతర గ్రహములు ఉపచయస్థానములను పొందియుండఁగను, లగ్నద్వితీయములు పాపగ్రహరహితములయినవై యుండఁగను, అగ్న్యాధానమును చేయవలయును. "శ్లో ॥ కేంద్రత్ర్యుపచయత్రికోణభగతాస్సూర్యారజీవేందవశ్శేషాశ్చోపచయస్థితాయది తదాగ్న్యాధానముక్తంశుభం । చంద్రేనైధనగేప్రమీయేత యువతీ భౌమేపుమానష్టమే శేషైర్మృత్యుగతైరుజాచ సహితోగ్న్యాధానకర్తాభవేత్ ॥ నోకుర్యాద్ధుతభుక్పరిగ్రహమహత్స్నౌపుత్రజీవేందుభిర్నీచస్థైర్విజితై రిపోర్భవనగైరస్తంగతైర్వాద్విజః॥" (=సూర్య కుజగురు చంద్రులు కేంద్రములయందైనను ఉపచయస్థానములయందైనను త్రికోణములయందైనను ఉండఁగను, ఇతర గ్రహములును ఉపచయస్థానములయందుండఁగను, అగ్న్యాధానము మిగుల శుభమును కలుగఁజేయును. మఱియును, చంద్రుఁడు అష్టమమందుండెనేని భార్యనశించును. అంగారకుఁడు అష్టమస్థానమునందుండెనేని పురుషుఁడు (యజమానుఁడు) నాశమునుపొందును. చంద్రాంగారకులకంటె నితరులు అష్టమస్థానమునందుండిరేని అగ్న్యాధానకర్తరోగముతోఁ గూడుకొన్నవాఁడగును. కుజగురుచంద్రులు నీచయందుండఁగను అపజయమును పొందియున్నను, శత్రుస్థానమునందున్నను, అస్తంగతులయినను అగ్న్యాధానమును జేయఁగూడదు.) అని వృత్తశతమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. "శ్లో ॥ అగ్న్యాధానంనకుర్వీత కర్కినక్షత్రమేవిధౌ । లగ్నేగేధనగేపాపే తథారంధ్రేగ్రహాన్వితే ॥" (=చంద్రుఁడు కటక మకర కుంభ మీనముల యందుండఁగను, లగ్నమునందు పాపులుండఁగను, అష్టమస్థానము గ్రహసహితమైనదై యుండఁగను, అగ్న్యాధానమును జేయఁగూడదు.) అని సంహితాసారమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె.



వ్యా॥ అగ్న్యాధానమితి॥ అగ్నేరాధానం బహుభిర్బుధైః దారకాలే అవాది - కథితం-చతుర్థీకర్మానంతరందారకాలః - పరైరాచార్యైర్దాయాద్యకాలే ధనవిభాగకాలే అవాది-తథాచవృత్తశతే॥శ్లో॥అగ్న్యాధానందాయకాలే విధేయం కైశ్చిత్ప్రోక్తంతచ్చ దాయాద్యకాలే ఇతి॥ తథాచకాత్యాయనగృహ్యే॥ ఆవసథ్యాధానం దారకాలే దాయాద్యకాలే ఏకేషామితి॥ ఏతద్భాష్యకారైరేవం వ్యవస్థాపితం - అభార్యత్వేదారకాలే భార్యత్వేదాయాద్యకాలే ప్రోక్తమితి ॥ స్మృతిషుకృతదారస్యాగ్నినావినాబహుదోషోదృశ్యతే - తథాహి॥ కృతదారోనైవతిష్ఠేత్క్షణమప్యగ్నినావినా । యోనాగ్నిముపసేవేత దారానాక్రమ్యాదృతావపి॥ పారదారీసవిజ్ఞేయస్స్వస్త్రీస్వీకరణాదపి । యథాస్నానంయథాసంధ్యావేదస్యాధ్యయనంయథా॥ తథైవోపాసనంద్రష్టం నస్థితిస్తద్వియోగత ఇత్యాది - తస్మాత్సూత్రకారైః కాత్యాయనాదిభిః దారకాల ఏవ బాహుళ్యేనోక్తం- అగ్న్యాధానతు తాన్యాహ॥ తైః - ద్వీశాగ్నిధ్రువశాక్రపుష్యమృగపౌష్ణైః - ద్వీశం-విశాఖా- అగ్నిఃకృత్తికా - ధ్రువాణి-త్ర్యుత్తరారోహిణ్యః - శాక్రంజ్యేష్ఠా-పుష్యమృగౌప్రసిద్ధౌ - పౌష్ణంరేవతీ-తైః-కయోః-వ్యబ్జలగ్నాంశయోః - విగతాః - అబ్జాః యాభ్యాంతేవ్యబ్జౌతౌచతౌలగ్నాంశౌచతయోః - అబ్జాఃజలచరరాశయః - మకరస్యపశ్చిమార్ధం - కుంభోమీనః- కర్కటశ్చైతే జలచరరాశయః - చంద్రోపిజలజః - ఏతైరహితయోర్లగ్న నవాంశయోరిత్యర్థః - తథాచవృత్తశతే॥ శ్లో॥ కర్కినక్రఘటమీనవిలగ్నేవాంశకేతనుగతేథతదీయే । లగ్నకేకుముదినీదయితే వానాశమేతి జనితోపిహుతాశః॥ ఇతి ॥ కైః-జీవేంద్వర్కకుజైః - సుతర్క్షకేంద్రగురుస్థైః - జీవోగురుః- ఇందుశ్చంద్రః అర్కఃసూర్యఃకుజోభౌమః - తైః-సుతపంచమం - బుద్ధయఉపచయభవనాని-గురుర్నవమం-కేంద్రాణి - ప్రథమచతుర్థసప్తమదశమాని- ౫ - ౩-౬-౧౧-౧౦-౯-౧-౪- ౭-౧౦ - ఏతత్స్థానగతైః - కథంభూతైరనస్తంగతైః-సూర్యకిరణైరలుప్తైః - పునః కథంభూతైః - స్వోచ్చేష్టర్క్షగతైః - స్వోచ్చ

ఉచ్చానిచ - ఇష్టాశ్చఏషాం - ఋక్షాణిరాశయస్తద్గతైః స్వరాశ్యుచ్చ రాశిమిత్రరాశిగతైరిత్యర్థః - పరైరుక్తేభ్యోన్యైర్గ్రహైః ఉపచయైః త్రిష డేకాదశదశమగైః - కస్యాంసత్యాం - విత్తాద్యశుద్ధౌసత్యాం - విత్తంద్వి తీయంఆద్యం - లగ్నం-తయోశ్శుద్ధిః - క్రూరరాహిత్యం-తస్యాంసత్యాం- శేషంపూర్వవత్ - ప్రాయశ్చంద్ర మిత్యుక్తమవలోక్యం - తథాచవృత్త శతే॥ శ్లో॥ కేంద్రత్రికోణోపచయత్రికోణ భగతాస్సౌమ్యార జీవేందవశ్చే త్పాపాశ్చోపచయస్థితా యది తదాగ్న్యాధాన ముక్తంశుభం। చంద్రేనైధన గేత్రిమేతయువతీభావేప్రమానష్టమే శేషైర్మృత్యుగతైరుజాచ సహితో గ్న్యాధానకర్తాభవేత్ ॥ నోకుర్యాద్ధుతభుక్పరిగ్రహం ముహుః త్సౌమ్యప్రజా వేంశుభి ర్క్షేచస్థై ర్విజితైరపోర్భవనగ్రైరస్తంగతైర్వాద్విజ ఇతి॥ తథాచ సంహితాసారే॥ అగ్న్యాధానంనకుర్వీత కరకానక్షత్రమేవిధౌ। లగ్నగే ధనగేపాపే తథారంధ్రగ్రహాన్వితే ఇతి॥ ఇతి అగ్న్యాధాన ప్రకరణం సమాప్తమ్.

—(✻) అథగృహప్రకరణం వివక్షుస్సాదౌగ్రామవిచారమాహ. (✻)—

మూ॥ నామర్క్షాద్ద్వివసుతాంకదిగ్భవ-౨-౫-౯ - ౧౦ - గతోగ్రా
మోఃశుభోన్యోన్యథా తత్కోణేంత్య భువాం శుభంనివ
సతాందోషాఃపరేషామలం। కన్యాకర్కిధనుస్తులాక్రియ
ఘటాఃకౌర్వ్యాండజౌయామ్యతో మధ్యేన్యే న్యవసంత్య
థేంద్రకకుభోవర్గాస్స్యురోజస్వినః॥ ౧॥

టీక॥ నామర్క్షాత్ = నామరాశికంటె, ద్వివసుతాంక దిగ్భవగతః= రెండవది అయిదవది తొమ్మిదవది అగు దిక్కులయందుఁ బుట్టిన, గ్రామః=గ్రామము, శుభః=మేలయినది, స్యాత్=అగును. అన్యః=ఇట్టిది కాని గ్రామము, అన్యథా=మేలునుకలుగఁజేయనిది, స్యాత్=అగును. తత్కోణే.ఆగ్రామముయొక్క కోణమునందు, నివసతామ్ = నివసించుచున్న, అంత్యభువామ్=రజకచర్మకారాదులకు, శుభమ్=శుభము, భవేత్=అగును. తత్కోణే=ఆగ్రామముయొక్క కోణమునందు, నివసతామ్=నివసించుచున్న, పరేషామ్=ఇతరులకు, అలమ్=అధికముగా, దోషాః = దోషములు, స్యుః=అగును. యామ్యతః = దక్షిణదిక్కు మొదలుకొని యెనిమిది దిక్కులయందును; కన్యాకర్కిధనుస్తులాక్రియఘటాః = కన్య, కర్కటకము, ధనుస్సు, తుల, మేషము, కుంభము, అనురాసులును, కౌర్వ్యాండజౌ=వృశ్చికమీనములును, న్యవసంతి=నివసించుచున్నవి. అన్యే=ఇతరము

లగు వృషభ మిథున సింహ మకరములు, మధ్యే = మధ్యభాగమునందు, న్యవసంతి=నివసించుచున్నవి. అథ=పిమ్మట, ఇంద్రకకుభః = ఇంద్రదిక్కు మొదలుకొని యెనిమిదిదిక్కులయందును, వర్గాః= "అకచటతపయశ" అనువర్గములు, ఓజస్వినః=బలముకలవి, స్యుః=అగును.

తా॥ ఇఁకను గృహప్రకరణమును జెప్పఁబోవుచు ముందుఁగా గ్రామవిచారమును జెప్పుచున్నాఁడు. ఎట్లనినః—నామరాశికి రెండవది యును, అయిదవదియును, తొమ్మిదవదియును, అయిన దిక్కులందుఁ బుట్టినగ్రామము శుభకరమైనదగును. ఇతరదిక్కులయందుఁ బుట్టినది శుభకరమైనదికానేరదు. "శ్లో॥ ఏకభేసప్తమేగ్రామే వైరంహానిస్త్రిష ష్ఠగే। తుర్యాష్టద్వాదశేరోగ శ్శేషస్థానేసుఖంభవేత్॥" ( = ఏకరాశి యును సప్తమరాశియును అయిన గ్రామమునందును, మూఁడవదియును ఆఱవదియును అయిన గ్రామమునందును హానికలుగును. నాలుగు ఎని మిది పదిరెండు రాసులయందున్న గ్రామము రోగమును గలుగఁజేయు ను. ఇతరరాసులయందున్న గ్రామము శుభములను కలుగఁజేయును.) అని జ్యోతిస్సాగరమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. ఇఁకను గ్రామ దిక్కోర్ణయమును జెప్పుచున్నాఁడు ఎట్లనినః—ఆగ్రామముయొక్క కోణ మందు నివసించుచున్న రజకచర్మకారాదులగు నంత్యజాతులవారికి శుభ ములు కలుగును. "శ్లో॥ రజకశ్చర్మకశ్చైవ నటోబురుడఏవచ। కైవర్త మేదభిల్లాశ్చ సప్తైతే అంత్యజాస్స్మృతాః॥" (=రజకుఁడు, చర్మకారుఁ డు, నటుఁడు, బురుడుఁడు, కైవర్తుఁడు, మేదుఁడు, భిల్లుఁడు, అను నేడ్గు రును అంత్యజులనఁబడుదురు.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడెను. గ్రామకోణమునందు అంత్యజాతులుదప్పఁ దక్కినవారు నివసించినయెడల కీడునుపొందుదురు "శ్లో॥ భవనపురగ్రామాణాం యేషాంకోణా స్తేషు నివసతాందోషః। శ్వపచాదయోంత్యజాద్యాస్తే ష్వేవవృద్ధిమా యాంతి॥" (=గృహముయొక్కయును, పట్టణముయొక్కయును, గ్రామ ముయొక్కయును, కోణములయందు నివసించువారలకు దోషముకలు గును. శ్వపచాదులును అంత్యజాదులును కోణములయందు నివసించిరేని శుభములను పొందుదురు.) అని జ్యోతిర్నిబంధమను గ్రంథమునందు జెప్పఁబడె. మఱియును, దక్షిణ దిక్కుమొదలుకొని క్రమముగ నెనిమిది దిక్కులయందును కన్యాకర్కిధనుస్తులామేషకుంభ వృశ్చికమీనములు నివ సించియున్నవని యెఱుఁగవలెయును. మఱియును, ఈచెప్పఁబడిన రాసు

లకంబై వేరయిన వృషభ మిథున సింహ మకరములు మధ్యభాగము నందు నివసించియున్నవని యెఱుఁగవలయును. మఱియును, తూర్పుదిక్కు మొదలుకొని క్రమముగ నెనిమిది దిక్కులయందును "అకచటతపయశ" వర్గములు మిగులఁ దేజస్సుకలవైయున్నవని తెలియవలయును. మఱియును, ఈశ్లోకమునందలి "అథేంద్రికకుభో వర్గా స్స్యురోజస్వినః" అను వాక్యమునకు మీఁది శ్లోకములో నన్వయమని తెలియవలయును.

వ్యా॥ నామర్క్షాదితి॥ నామర్క్షాన్నామరాశేః సకాశాత్ - ద్వి-త్రి-సుతా-౫-౯-౧౨- దిగ్భవగతో గ్రామశ్శుభస్స్యాత్ - అన్య ఉక్తవిపరీతో గ్రామశ్శుభస్స్యాత్ - అన్యథా స్యాదశుభస్స్యాదిత్యర్థః - తదుక్తం జ్యోతిస్సాగరే॥ శ్లో॥ ఏకభే సప్తమే గ్రామే వైరం హానిస్త్రిషష్ఠగే। తుర్యాష్టద్వాదశే రోగ శ్శేషస్థానే సుఖం భవేదితి॥ ఏవం గ్రామం శుభాశుభమభిధాయేదానీం గ్రామదిక్షు యమమాహ॥ తతోఽర్ణ ఇతి॥ తతోఽర్ణేతస్య గ్రామస్యాకరణే అంత్యజానాం రజకచర్మకారాదీనాం నివసతాం వసతిం కుర్వతాం శుభం స్యాత్॥ శ్లో॥ రజకశ్చర్మకశ్చైవ నటో బురుడ ఏవచ। కైవర్తమేదభిల్లాశ్చ సప్తైతే అంత్యజాస్స్మృతాః॥ ఇత్యాదీనాం గ్రామకోణే శుభం స్యాదిత్యర్థః - తతోఽర్ణే నివసనం పరేషాం వర్ణానాం అలమత్యర్థం దోషాస్స్యుః - అశుభాని స్యురిత్యర్థః॥ తథాచ జ్యోతిర్నిబంధే। శ్లో॥ భవనపురగ్రామాణాం యేషాం కోణాస్తేషు నివసతాం దోషః। శ్వపచానామంత్యజాద్యాస్తేష్వేవ వృద్ధిమాయాంతి॥ ఏవం జాతీనాం శుభాశుభాదివిభాగముక్త్వా - రాశిపరత్వేన దిక్షు వసతిమాహ॥ కన్యేతి॥ యమాశాదితః-దక్షిణస్యాస్సకాశాత్ - క్రమేణాష్టాసు దిక్షు కన్యాకర్కి-ధనుస్తులావమేషౌ రాశయో న్యవసంతి - అన్యేప్యుక్తవ్యతిరిక్తా మధ్యేవసంతి॥ ఏతదుక్తం భవతి అభీష్టం గ్రామం నవభాగం పరికల్ప్య మధ్యభాగాద్దక్షిణభాగేకన్యా న్యవసత॥ కన్యారాశినా దక్షిణభాగే గృహం కార్య మిత్యర్థః తథైవ నైరృతేకర్కటః - పశ్చిమే ధనుః-వాయవ్యే తులా - ఉత్తరే అజో మేషః-ఈశాన్యాంఘటః కుంభః - పూర్వే కార్పీవృశ్చికః - ఆగ్నేయే అంత్యో మీనః-న్యవసత- అన్యే వృషమిథునసింహ మకరా మధ్యభాగే న్యవసంతి ఏవం రాశిపరత్వేన దిఙ్నియమముక్త్వా ఇదానీం - వర్ణపరత్వేన దిఙ్నియమమాహ॥ అథేతి॥ ఇంద్రకకుంభః - సకాశాత్-అష్టసు దిక్షు అప్రముఖాః-అష్టవర్గాః - అకచటతపయశా ఇత్యేతే-ప్రసిద్ధాః - ఓజస్వినో బలవంతస్స్యురిత్యుత్తరశ్లోకేనాన్వయః॥



(*) అథ పృథ్వ్యవర్ణాదికమాహ. (*)

మూ॥ అష్టావప్రముఖాస్స్వపంచమపరాద్విఘ్నస్వ వర్గోన్యయుక్తష్టః కాకిణికాగజైర్మిథ ఇమా యస్యాధికాస్సోర్థదః।
శ్వేతారక్తకపీతకృష్ణ వసుధాస్స్వాదుఃకటుస్తిక్తకా కా
షాయా ఘృతశోణితాన్నమదిరాగంధాశ్శుభాః ప్రతః॥౧॥

టీక॥ అప్రముఖాః = అకారము మొదలుగాఁగల, అష్టవ్=ఎనిమిది వర్గములును, (అష్టసు=ఎనిమిదయిన, దిక్షు=దిక్కులయందు, ఓజస్వినః= తేజస్సుకలవి, స్యుః=అగును.) స్వపంచమపరాః=స్వవర్గమునకు అయిదవవర్గములు వైరముకలవి, స్యుః=అగును. ద్విఘ్నస్వవర్గః = రెంటిచేత గుణింపఁబడిన గ్రామవర్గ కర్తృవర్గములజంట, మిథః = పరస్పరమును, అన్యయుక్-అన్యవర్గముతోఁగూడఁబడినదై, గజైః=ఎనిమిదిచేత, తష్టః= భాగింపఁబడినదై. (మిగిలినది.) కాకిణికాః=కాకిణికములు, స్యుః=అగును. ఇమాః=ఈకాకిణికములు, యస్య=దేనికి, అధికాః = అధికములయినవో, సః=అది, అర్థదః=అర్థమునిచ్చునట్టిది, స్యాత్ = అగును. విప్రతః= బ్రాహ్మణుఁడు మొదలుకొని, శ్వేతారక్తకపీతకృష్ణవసుధాః = తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు, అనువర్ణములుగల భూములు, శుభాః = శుభములయినవి, స్యుః=అగును. స్వాదుఃకటుస్తిక్తకాకాషాయాః=తీపు, కారము, చేదు, కాషాయము అను రుచులు, విప్రతః=బ్రాహ్మణుఁడు మొదలుకొని నాలుగువర్ణములవారికిని, శుభాః=శుభములయినవి, స్యుః=అగును. విప్రతః = బ్రాహ్మణుఁడు మొదలుకొని నాలుగువర్ణములవారికిని, ఘృతశోణితాన్నమదిరాగంధాః = నేతియొక్కయును, రక్తముయొక్కయును, అన్నముయొక్కయును, మద్యముయొక్కయును, గంధమువంటి గంధముకలభూములు, శుభాః=శుభకరములయినవి, స్యుః=అగును.

తా॥ ఇఁకను పృథ్వీవర్ణాదికమును గుఱించి చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— అ ఆ ఇ ఈ ఉ ఊ లు మొదలుగాఁగల పదునాఱగునచ్చులతోఁ గూడియున్నవర్గము తూర్పుదిక్కునందు బలముకలదనియును, కాదిపంచాక్షరములుగల వర్గము ఆగ్నేయదిక్కునందు బలముకలదియనియును, చాదిపంచాక్షరవర్గము దక్షిణదిక్కునందు బలముకలదనియును, టాదిక పంచాక్షరవర్గము నిఋతిదిక్కునందు బలముకలదనియును, తాదిక పంచాక్షరవర్గము పశ్చిమదిక్కునందు బలముకలదనియును, పాదికపంచాక్షరవర్గము వాయవ్యదిక్కునందు బలముకలదనియును, యాదిపంచా

క్షరవర్గము ఉత్తరదిక్కునందు బలముకలదనియును, శాదిక్షపంచాక్షరవర్గము ఈశాన్య దిక్కునందు బలముకలదనియును, తెలియవలయును. మఱియును, కర్తయగువాఁడు తనదు నామాదిమాక్షరము ఏవర్గమునందున్నదో తెలిసికొని తనదువర్గము ఏదిక్కునందలి వర్గములోనున్నదో యాదిక్కునందు గృహమును కట్టుకొనుటచేత "తమతమ స్థానములయందు ప్రాణులు బలముకలవియగును" అనునట్టి న్యాయానుసారముగ శుభములుకలుగునని యెఱుఁగవలయును. మఱియును, అన్యోన్యవర్గమునకు అయిదవవర్గము విరోధియని యెఱుఁగవలయును. ఎట్లనినః— అవర్గమునకు అయిదవవర్గమగు తవర్గము సౌమ్యవైరియనియును, కవర్గమునకు అయిదవవర్గమయిన పవర్గము సౌమ్యవైరియనియును, తెలిసికొని యిటులనే సకలవర్గములకును వైరులగు వర్గములను దెలిసికొనవలయును. ఈవిరోధము అన్యోన్యవర్గముల యధిపతులనుబట్టి యెఱుఁగవలయును. కావుననే, ॥ "శ్లో॥ వర్గేశాస్తార్క్ష్యమార్జార సింహశ్వా సర్పమూషకాః । ఇభేణౌ పూర్వతస్తేషాం స్వవర్గాత్పంచమోరిపుః ॥" (=గరుడుఁడు, మార్జారము, సింహము, శ్వానము, సర్పము, మూషకము, గజము, జింక, అను నెనిమిదియును క్రమముగ "అకచటతపయశ" అను నెనిమిది వర్గములకు అధిపతులని యెఱుఁగవలయును. మఱియును, ఈవర్గములలో ప్రతివర్గమునకును అయిదవ వర్గము విరోధియని యెఱుఁగవలయును.) అని భూపాలవల్లభమను వర్గమునందుఁ జెప్పఁబడియె. కావున తనదువర్గమునకు అయిదవ వర్గముకల దిక్కునందు గృహమును కట్టుకొనఁగూడదు. మఱియును, అయిదవ వర్గముగల దిక్కుతప్పఁ దక్కినవర్గములుగల దిక్కులు మధ్యమఫలదాయకములయినవగును. మఱియును, తనదువర్గమునకు ఆసన్నమైనవర్గము శుభకరమైనదనియును, వైరిదిక్కునందున్నవర్గము అశుభకరమైనదనియును, తెలియవలయును. ఇట్లు స్వవర్గగ్రామవర్గములకు మిత్రారిత్వములను చూచి నివాసము చేయవలయును. మఱియును, రాశిఘటితవర్గఘటితములలోపల రాశిఘటితమైనది బలముకలదియగును. మఱియును, గ్రామవర్గము వసతినిజేయునట్టి వానియొక్క వర్గము అను రెండు వర్గములను ద్విగుణితముగాఁజేసి అన్యోన్యమును అన్యవర్గముతోఁజేరునట్లుచేసి యెనిమిదిచేత భాగింపఁగా మిగిలినవి కాకిణికము లనఁబడును. ఈరెంటిలో దేనికి కాకిణికములు అధికములయినవగునో అది ధనము నిచ్చునట్టిది



యగును. మఱియును, ఈవిధముగా గ్రామదిఙ్నియమమును చెప్పి యిప్పుడు "శ్లో॥ నిర్మాణే పత్తనగ్రామ క్షేత్రాదీనాం సమంతతః । క్షేత్రమాదౌ పరీక్షేత గంధవర్ణరసప్లవైః ॥" (=పట్టణగ్రామక్షేత్రాదులను నిర్మించుటయందంతటను ముందుగా క్షేత్రమును పరీక్షింపవలయును. పిమ్మట గంధవర్ణ రసప్లవములను పరీక్షింపవలయును.) అను న్యాయానుసారముగ భూమియొక్క వర్ణరసగంధములను ఈ శ్లోకమునందలి సగముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనినః— శ్వేతవర్ణముగల భూమి బ్రాహ్మణునకును ఈషద్రక్తవర్ణముకలభూమి క్షత్రియునకును, పచ్చనివర్ణముగల భూమి వైశ్యునకును, నల్లనివర్ణముకలభూమి శూద్రునకును శుభములను కలుగఁజేయును. ఇట్లు చెప్పుటచేత మిశ్రజాతులగువారికి మిశ్రవర్ణముగలభూమి శ్రేష్ఠమైనదని యెఱుఁగవలయును. మఱియును, మధురరసముగలభూమి బ్రాహ్మణులకును, కారమయిన మన్నుగలభూమి క్షత్రియులకును, తిక్తరసముకలభూమి వైశ్యులకును, కషాయరసముగల భూమి శూద్రులకును శుభమును కలుగఁజేయునని యెఱుఁగవలయును. ఇట్లు చెప్పుటచేత మిశ్రరసముగలభూమి మిశ్రజాతులవారికి శుభకరమైనదని యెఱుఁగవలయును. "శ్లో॥ మధురంకటుకంతిక్తం కషాయశ్చ రసాఃక్రమాత్॥" (=మధురకటుకతిక్త కషాయరసములుగల భూములు క్రమముగ బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని శుభమును కలుగఁజేయును.) అని నారదుఁడు చెప్పె. నేయియొక్క గంధమువంటి గంధముగలభూమి బ్రాహ్మణునకును, శోణితగంధముగల భూమి క్షత్రియునకును, అన్నగంధముగల భూమి వైశ్యునకును, మద్యగంధముకలభూమి శూద్రునకును, మిశ్రగంధముగలభూమి మిశ్రజాతికిని, శుభమునుకలుగఁజేయునని యెఱుఁగవలయును. "శ్లో॥ ఘృతాసృగన్నమదిరా గంధాచ్చక్రమశోభవేత్" (=ఘృతరక్తాన్న మద్యములయొక్క గంధమువంటి గంధముగలభూమి బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని క్రమముగ శుభమును కలుగఁజేయునవియగును.) అని కారికయందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ మధుపేరాన్నపిశిత గంధవర్ణానుపూర్వకం । మధురంకటుకంతిక్తం కషాయశ్చరసాఃక్రమాత్ ॥" (=మధుకషాయాన్న మాంసముల గంధమువంటి గంధముగల భూములు బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని శుభములను కలుగఁజేయును. మఱియును, మధురకటుకతిక్తకషాయరసములవంటి రసములుగల భూములు క్రమముగ బ్రాహ్మ

ణాది నాలుగువర్ణములవారికిని శుభకరములు.) అని నారదుఁడు చెప్పెను.
" శ్లో॥ ఘృతాసృగన్నమద్యానాం గంధాచ్చక్రమశోభవేత్ । మధురా స్యాత్కషాయామ్లా కటుకాచానుపూర్వశః ॥ " (= ఘృతరక్తాన్నమద్యములయొక్క గంధముయొక్క గంధములవంటి గంధములుగలభూమి క్రమముగ బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని మేలును కలుగఁజేయును. మధురకషాయామ్ల కటుక రసములుగలభూములు క్రమముగ బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని శుభములను కలిగించును.) అని కారికయందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ అష్టావితి ॥ ఏతదుక్తంభవతి - అఆఇఈఉఊ ఇత్యాదికః షోడశాక్షరోవర్గః - పూర్వస్యాంబలీ-కాదికః-పంచాక్షరః-ఆగ్నేయ్యాం-చాదికోదక్షిణస్యాం - టాదిర్నైరుత్యాం-తాదికః పశ్చిమస్యాం - పాదికోవాయవ్యాం - యాదికఉత్తరస్యాం - శాదికఈశాన్యాంబలీ - అయమర్థః-స్వనామాదిమాక్షరాత్ - వర్గం జ్ఞాత్వాస్వస్థానే గృహం కార్యమితిభావః - యతఃస్వస్వస్థానే ప్రాణినోబలవంత ఇతిలోకేప్రసిద్ధం కింతుతేవర్గాః - స్వపంచమపరాః - స్వేభ్యఃపంచపరాః- వైరిణో ఏషాంతేతథాయథా అవర్గస్యపంచమస్తవర్గః - సౌమ్యవైరీ- కవర్గస్యపంచమః పవర్గః-సౌమ్యవైరీ - ఏవంసర్వేషాంవర్గాణాం వైరిణోజ్ఞాతవ్యాః - వైరత్వంచాస్వామివశేన - తదుక్తంభూపాలవల్లభే॥ శ్లో ॥ పరేశాస్తార్క్ష్య మార్జార సింహశ్వాసర్పమూషకాః । ఇభేణౌపూర్వతస్తేషాం స్వవర్గాత్పంచ మోరిపురితి॥ తస్మాత్స్వవైరివర్గస్య దిశిగృహం నకార్యమితిభావః॥ అర్థాదన్యత్రమధ్యమం - తత్రాపిస్వదిగ్వర్గాసన్నంశుభం - వైరిదిగాసన్నమశుభమితి బుద్ధ్యాజ్ఞేయం - ఏవంస్వవర్గగ్రామవర్గయో ర్మిత్రారిత్వమవలోక్యవాసఃకర్తవ్య ఇతిసిద్ధం - తత్రరాశిఘటితవర్గ ఘటితయోర్మధ్యేరాశిఘటితంబలవత్ - తదుక్తంజ్యోతిస్సాగరే ॥ కేచిత్త్వాహు రథవర్గాణాం స్వస్థానేగృహమితి అథవర్గఘటితేకాకిణికాఆహ ॥ ద్విఘ్న ఇతి - స్వవర్గో గ్రామవర్గః - వసతిం కర్తుర్వర్గశ్చ ద్విఘ్నః ద్విగుణితఃకార్యః - మిథఅన్యయుక్ అన్యవర్గయుక్తార్యః గజైరష్టభిః తష్టః శేషితస్సః - కాకిణికాస్స్యుః - ఇమాఃకాకిణికాఃయస్య అధికాఃసోర్థదో ధనదాతాస్యాత్ ॥ ఏవంగ్రామదిజ్ఞాయమముక్త్వా ఇదానీం ॥ నిర్మాణేపత్తనగ్రామ క్షేత్రాదీనాంసమంతతః । క్షేత్రమాదౌ పరీక్షేత గంధవర్ణ రసప్లవై రిత్యుక్తత్వాత్ తావద్వర్ణపరత్వేన భూమేర్వర్ణరసగంధాన్ వృత్తార్ధేనాహ॥



శ్వేతేతి॥ శ్వేతారక్తకపీతకృష్ణ వసుధాఃవిప్రతః బ్రాహ్మణాత్సకాశాత్ వర్ణానాంశుభాఃశోభనాఃస్యుః॥ శ్వేతవసుధాపృథ్వీ బ్రాహ్మణస్య ఆరక్తవసుధాక్షత్రియస్య పీతవసుధా వైశ్యస్యకృష్ణవసుధాశూద్రస్య శోభనేతి అర్థాత్ మిశ్రజాతినాంమిశ్రాశోభనా॥ తథాచవసిష్ఠః॥ శ్వేతాశస్తా ద్విజేంద్రాణాం రక్తాభూమిర్మహీభుజాం । విశాంపీతాచశూద్రాణాం కృష్ణాన్యేషాంచమిశ్రితేతి॥ ఏవంవర్ణముక్త్వా ఇదానీంరసమాహ॥ స్వాదురతి॥ స్వాదుర్మధురావసుధాబ్రాహ్మణస్య శోభనా - కటుర్మరిచరసాక్షత్రియస్య - తిక్తకానింబరసావైశ్యస్య - కషాయాహరీతకీరసా శూద్రస్యశోభనేతి అర్థాన్మిశ్రాణాం మిశ్రాశోభనా॥ తథాచనారదః ॥ శ్లో ॥ మధురంకటుకంతిక్తం కషాయశ్చరసాఃక్రమాత్ ॥ ఏవంరసానుక్త్వాగంధానాహ ॥ ఘృతేతి ॥ ఘృతగంధాబ్రాహ్మణస్య శోణితగంధారక్తగంధాక్షత్రియస్య - అన్నగంధావైశ్యస్య - మదిరాగంధా మద్యగంధాశూద్రస్య - మిశ్రాణాంమిశ్రగంధాశుభేత్యర్థః ॥ తథాచోక్తంకారికాయాం॥ శ్లో॥ ఘృతాసృగన్నమదిరా గంధాచక్రమశోభవదితి॥ నానాగ్రంథేషురసగంధానాంనానాత్వంతద్వికల్పతోగ్రాహ్యం ॥ తథాచనారదః॥ శ్లో ॥ మధుక్షీరాన్నపిశిత గంధవర్ణానుపూర్వకం। మధురంకటుకంతిక్తంకషాయశ్చరసాఃక్రమాత్॥ పెరగంధాకషాయగంధా-అన్యత్సుగమం॥ తథాచకారికాయాం ॥ శ్లో ॥ ఘృతాసృగన్నమద్యానాం గంధాచక్రమశోభవేత్ । మధురాస్యాత్కషాయామ్లా కటుకాచానుపూర్వశ ఇతి॥

— { ఏవం పృథ్వీవర్ణాదిక మభిధాయేదానీంవర్ణ పరత్వేన భూప్లవత్వం శల్యజ్ఞానంచాహ. } —

శూ॥ సౌమ్యాదిప్లవభూతలే విరచయే ద్విప్రాది కోగ్ర్యాఖిలే
సాన్యేషాంనియమోథయత్ర నిఖిలాఃకుర్యుర్గృహంప్రాక్
స్థిరం।సద్మప్రశ్నకృతోముఖాత్ప్రథమతో వర్ణాదివర్ణోద్గమశ్చేత్తద్దిగ్గ తమాదిశేత్తు హపయై శ్శల్యం సుధీర్మధ్యతః॥ ౩॥

టీక॥ విప్రాదికః = బ్రాహ్మణుఁడు మొదలుగాఁ గలవారు, సౌమ్యాదిప్లవభూతలే = ఉత్తరదిక్కు-మొదలుగాఁగల దిక్కు-లయందు పల్లముగలప్రదేశమునందు, గృహమ్=గృహమును, విరచయేత్=రచింపవలయును. అగ్ర్యః=బ్రాహ్మణుఁడు, అఖిలే=సకలదిక్కు-లయందునులోతుగల భూమియందు, గృహమ్=గృహమును, విరచయేత్=రచింపవలయును. అన్యే

షామ్=ఇతరులకు, నియమః=నియమము, న=లేదు. యత్ర=ఏప్రదేశమునందు, హృత్=అంతఃకరణము, స్థిరమ్=స్థిరమైనది, స్యాత్=అగునో, తత్ర=ఆప్రదేశమునందు, నిఖిలాః=అన్నివర్ణములవారును, గృహమ్ = గృహమును, కుర్యుః=చేయవలసినది, సద్మప్రశ్నకృతః=గృహమునుగుఱించి ప్రశ్నమును చేయుచున్నవానియొక్క, ముఖాత్=ముఖమువలన, ప్రథమతః=ముందుగా, వర్గాదివర్ణోద్గతశ్చేత్ = వర్గములయొక్క మొదటివర్ణము బయలువెడలెనేని, సుధీః విద్వాంసుఁడు, శల్యమ్=శల్యమును, తద్దిగ్గతమ్=ఆదిక్కును పొందినదానినిగా, ఆదిశేత్ = చెప్పవలయును. హపయైః=హపయవర్ణములచేత, మధ్యః=మధ్యకోష్ఠమందు, శల్యమ్ = శల్యమును, ఆదిశేత్=చెప్పవలయును.

తా॥ ఇదివఱకు పృథ్వీవర్ణాదికము చెప్పఁబడెను కనుక ఇప్పుడు బ్రాహ్మణాదివర్ణములవారికి భూప్లవత్వమును శల్యజ్ఞానమును జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఉత్తరదిక్కు మొదలుకొని నాలుగుదిక్కులలో ప్లవముగల భూములు బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని క్రమముగ శుభకరములయినవగును. బ్రాహ్మణుఁడుమాత్రము నాలుగుదిక్కులలో ఏదిక్కునందు ప్లవముకలిగియున్నను గృహమును నిర్మించుకొనవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ ఉదకాదిప్లవమిష్టం విప్రాదీనాం ప్రదక్షిణేనైవ। విప్రస్సర్వత్రవసేద్వర్ణ మథేష్టమన్యేషామ్॥" (=విప్రాదులకు ప్రదక్షిణక్రమముచేత ఉదకాదిప్లవము శుభకరమైనదగును. బ్రాహ్మణుఁడు సకలస్థలములయందును నివసింపవచ్చుననియును, ఇతరులు ప్రియముగలచోట నివసింపవలసినదనియును, తెలియవలయును.) అని భృగువు వచించెను. మఱియును, సకలవర్ణములవారును తమయంతఃకరణములకు ప్రియమైనచోట గృహనిర్మాణమును జేసికొనుటచేత శుభములు గలుగును. "శ్లో॥ మనసశ్చక్షుషోర్యత్ర సంతోషో జాయతే భువి। తస్యాం కార్యం గృహం సర్వై రితి గర్గాదిసమ్మతమ్॥" (=మనస్సునకును నేత్రమునకును ఏస్థలమందు సంతోషముకలుగునో ఆస్థలమునందు గృహనిర్మాణమును జేసికొనవలసినదని గర్గాదులమతము) అని వాస్తుశాస్త్రమునందుఁ జెప్పఁబడెను. మఱియును, ఈస్థలమునందు గృహనిర్మాణమును జేసికొనవచ్చునా? అని అడుగుచున్న గృహకర్తయొక్క ముఖమునుండి ముందుగా బయలువెడలునట్టి వర్ణము ఏవర్గములోనుండునో ఆవర్గము ఏదిక్కునందుండునో యాదిక్కున శల్యములున్నవని చెప్పవలయును. మఱి



యును, గృహసమ్మితమగు భూమిని దక్షిణోత్తరరేఖలచేత సమముగా తొమ్మిదిభాగములుచేసి తూర్పుదిక్కు మొదలుకొని యెనిమిది దిక్కులయందును క్రమముగా అకచటతపయశ వర్ణములను ఎనిమిదింటిని వ్రాయవలయును. ఇట్లు వ్రాసి పిమ్మట ప్రశ్నాదిమాక్షరము అకారమయ్యెనేని తూర్పుదిక్కునందు శల్యమున్నదనియును, కకారమయ్యెనేని ఆగ్నేయదిక్కునందు శల్యమున్నదనియును, ఇటులనే తక్కినవర్ణములనుబట్టి తక్కినదిక్కులయందు శల్యములున్నవనియును, చెప్పవలయును. మఱియును, ప్రశ్నాదిమాక్షరము "హపయ" అను మూటిలో నొకటియయ్యెనేని మధ్యభాగమునందు శల్యములున్నవని చెప్పవలయును. "శ్లో॥ స్మృత్వేష్టదేవతాం ప్రష్టుర్వచనస్యాద్యమక్షరం। గృహీత్వా తు తతశ్శల్యాశల్యం సమ్యగ్విచార్యతే॥ అకచటతపయశాః హయావర్గాః పూర్వాదిమధ్యాంతాః। శల్యకరా ఇహ నాన్యే శల్యగృహే నివసతాం నాశః॥" (జ్యోతిష్కుఁడగువాఁడు ఇష్టదేవతను స్మరించి ప్రశ్నమును చేయువానియొక్క ప్రశ్నాదిమాక్షరమును గ్రహించి శల్యములున్నవనియును శల్యములులేవనియును, చెప్పవలయును. మఱియును, "అకచటతపయశహపయవర్ణములను తూర్పుదిక్కు మొదలుకొని మధ్యకోష్ఠముతోఁగూడ తొమ్మిదికోష్ఠములయందును వ్రాసి ప్రశ్నాదిమాక్షరము ఏవర్గమునందుండునో ఆవర్గముయొక్క దిక్కునందు శల్యములున్నవని చెప్పవలయును. మఱియును, శల్యములుగల గృహమునందు నివసించుచున్నవారికి నాశముకలుగును.) అని జ్యోతిర్నిబంధమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ పృచ్ఛాయాం యది అః ప్రాచ్యాం నరశల్యం తదా భవేత్। సార్ధహస్తప్రమాణేన తచ్చ మానుషమృత్యుకృత్॥ ఆగ్నేయ్యాం దిశి కః ప్రశ్నే ఖరశల్యం కరద్వయే। రాజదండో భవేత్తత్ర భయం నైవ నివర్తతే॥ యామ్యాయాం దిశి చః ప్రశ్నే కుర్యాదాకటిసంస్థితం। నరశల్యం గృహేశస్య మరణం చిరరోగతః॥ నైరృత్యాం దిశి టః ప్రశ్నే సార్ధహస్తాదధస్స్థితే। శునోస్థి జాయతే తత్ర బాలానాం జననే స్మృతం। తః ప్రశ్నే పశ్చిమాయాం తు శిశోశ్శల్యం ప్రజాయతే। సార్ధహస్తే గృహస్వామి నశ్యతి సదా గృహే॥ వాయవ్యాం దిశి పః ప్రశ్నే తుషాంగారాశ్చతుఃకరే। కుర్వంతి మిత్రనాశం చ తదా దుస్స్వప్నదర్శనం॥ ఉదీచ్యాం దిశి యః ప్రశ్నే విప్రశల్యం కటేరధః। తచ్ఛీఘ్రం నిర్ధనత్వాయ కుబేరసదృశస్య హి॥ ఈశాన్యాం దిశి శః ప్రశ్నే గోశల్యం సార్ధహస్తతః। తద్గోధనస్య నాశాయ జాయతే గృహమేధినః॥

హపయామధ్యమేకోష్ఠే వక్షో మాత్రేథ వేదధః । నృకపాలి మధోభస్మ లోహంతత్కులనాశకృత్ ॥ ” (= ప్రశ్నాదిమాక్షరము అకారమయ్యేనేని తూర్పున ఒకటిన్నర చేతిలోతున మానవశల్యము లుండును. ఆశల్యములు మానవులను జంపును. ప్రశ్నాదిమాక్షరము కకారమయ్యేనేని గాడిదెలయొక్క శల్యములు ఆగ్నేయ దిక్కునందు రెండు చేతులలోపల నుండును. ఆశల్యములవలన రాజదండన కలుగుచుండును. అట్టి భయమె న్నటికిని నివర్తింపదు. ప్రశ్నాదిమాక్షరము చకారమయ్యేనేని దక్షిణ దిక్కున మొలలోతున మనుష్యశల్యములుండును. ఆశల్యములవలన చిరరోగముచేత మృత్యువుకలుగును. ప్రశ్నాదిమాక్షరము టకారమయ్యేనేని నిఋతిదిశయందు ఒకటిన్నర చేతిలోపల కుక్కలయెముకలుండును. వానివలన బాలురకు మరణము కలుగుచుండును. ప్రశ్నాదిమాక్షరము తకారమయ్యేనేని పశ్చిమదిక్కునందు ఒకటిన్నర చేతిలోతున శిశుశల్యములుండుననియును, ఆశల్యములవలన గృహయజమానుడు గృహమునందుండక సర్వకాలములయందును దేశాటనమును జేయుచుండునని యును, తెలియవలయును. ప్రశ్నాదిమాక్షరము పకారమయ్యేనేని వాయవ్యదిక్కున చేతెడులోతున ఉముకభాగ్గులు ఉండును. వానవలన సర్వకాలములయందును దుస్స్వప్నములును మిత్రనాశమును అగుచుండును. ప్రశ్నాదిమాక్షరము యకారమయ్యేనేని ఉత్తరపుదిక్కున మొలలోతున బ్రాహ్మణశల్యము లుండుననియును, వానివలన కుబేరతుల్యుడుకూడ శీఘ్రముగ నిర్ధనుడగుననియును, తెలియవలయును. ప్రశ్నాదిమాక్షరము శవర్ణమయ్యేనేని యీశాన్యదిక్కున ఒకటిన్నర చేతిలోతున గోశల్యములుండును. వానివలన గోధనమంతయును నశించుచుండును. ప్రశ్నాదిమాక్షరము “హపయ” వర్ణములలో నొకటియయ్యేనేని మధ్యభాగమునందు ఱొమ్ములోతున మనుష్యకపాలముండును. మఱియును భస్మ లోహాదులుండును. వానివలన కులనాశమగును.) అని జ్యోతిర్నిబంధమందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ సౌమ్యేతి॥ సౌమ్యాదిషు ఉత్తరాదిషు ప్లవో నిమ్నత్వం యస్య తస్యాశ్చ తద్భూతలంచ తస్మిన్ విప్రాదికో బ్రాహ్మణాదికః గృహంవిరచయేత్ ॥ ఏవంవర్ణపరత్వేన భూప్లవత్వముక్త్వా బ్రాహ్మణస్య విశేషమాహ॥ అగ్ర్యోఖిల ఇతి అగ్ర్యో బ్రాహ్మణః అఖిలే సర్వప్లవే గృహం విరచయేత్ ॥ తథాచ భృగుః ॥ శ్లో ॥ ఉదక్ప్రాదిప్లవమిష్టం విప్రాదీనాం



ప్రదక్షిణేనైవ। విప్రస్సర్వత్ర వసేద్వర్ణ మథేష్టమన్యేషామితి॥ అథపద్యాంతరమాహ॥ యత్రేతి॥ యత్రనిఖిలాః సర్వవర్ణాస్తత్రగృహం కుర్యాః ॥ తత్ర కుత్ర యత్ర భువి హృత్ అంతఃకరణం స్థిరంస్యాత్ - అయమర్థః-యస్యాం భూమౌ అంతఃకరణప్రశస్త్యంస్యాత్ - తత్రైవ గృహంకర్తవ్యమిత్యర్థః॥ తథాచ వాస్తుశాస్త్రే ॥ శ్లో ॥ మనసశ్చక్షుషోయత్ర సంతోషోజాయతేభువి । తస్యాంకార్యంగృహం సర్వై రితిగర్గాదిసమ్మతమితి ॥ అథశల్యజ్ఞానం వృత్తార్థేనాహ॥ సద్మప్రశ్నేతి॥ సద్మప్రశ్నేకృతః అత్రగృహంకర్తవ్యమిత్యాది గృహప్రశ్నకర్తుః ముఖాచ్చేద్యది ప్రథమతః వర్ణాదిః వర్ణోద్గమఃస్యాత్ - వర్గాణాం ప్రథమాక్షరోదయఃస్యాత్ అకచటతపయశానామన్యతమాక్షరోదయః స్యాత్తదాశల్యం తద్దిగ్గతం - తస్యవర్గస్య దిగ్గతంసుధీః ఆదిశేత్ శల్యమస్తీతి కథయేదిత్యర్థః - ఏతదుక్తంభవతి ॥ గృహసన్నిహితాం భూమిం దక్షిణోత్తరరేఖాభిః సమతయానవధాకృత్వా వర్గాద్యక్షరైః అకచటతపయశైరష్టభిః క్రమేణాష్టాసు పూర్వాదిదిక్షు శల్యమాదిశేత్ అకారేప్రశ్నాద్యక్షరేసతి పూర్వస్యాందిశి శల్యమాదిశేత్ కకారే ఆగ్నేయ్యాంచకారే దక్షిణస్యాం ఇత్యాద్యష్టసుదిక్షు అష్టభిరక్షరైరాదిశేదిత్యర్థః ॥ తు-పునః - హపయైస్త్రిభిరక్షరైః మధ్యకోష్ఠే శల్యమాదిశేత్ హపయానాంత్రయాణాం అక్షరాణాం అన్యతమే ప్రశ్నాద్యక్షరేసతి మధ్యే శల్యమాదిశేదిత్యర్థః ॥ తథాచోక్తం జ్యోతిర్నిబంధే ॥ శ్లో॥ స్మృత్వేష్టదేవతాం ప్రష్టుర్వచనస్యాద్యమక్షరం । గృహీత్వాతుతతశ్శల్యాశల్యంసమ్యగ్విచార్యతే ॥ అకచటతపయశాహపయావర్ణాఃపూర్వాదిమధ్యాంతాః - శల్యకరాఇహనాస్యే శల్యగృహే నివసతాంనాశ ఇతి ఏతదేవస్పష్టం తత్రైవోక్తం ॥ శ్లో ॥ పృచ్ఛాయాంయది అఃప్రాచ్యాం నరశల్యంతదాభవేత్ । సార్ధహస్తప్రమాణేన తచ్చమానుష మృత్యుకృత్॥ అగ్నేయ్యాందిశి కఃప్రశ్నే ఖరశల్యంకరద్వయే । రాజదండో భవేత్తత్ర భయంనైవనివర్తతే॥ యామ్యాయాందిశిచఃప్రశ్నే కుర్యాదాకటిసంస్థితం। నరశల్యంగృహేశస్య మరణం చిరరోగతః ॥ నైరృత్యాం దిశిటఃప్రశ్నే సార్ధహస్తాదధఃస్థలే । శునోస్థిజాయతే తత్ర బాలానాం జనమృత్యుకృత్॥ తఃప్రశ్నే పశ్చిమాయాంతు శిశోశ్శల్యంప్రజాయతే । సార్ధహస్తే గృహస్వామీ నతిష్ఠతిసదాగృహే ॥ వాయవ్యాందిశిపఃప్రశ్నే తుషాంగారాశ్చతుఃకరే । కుర్వంతి మిత్రనాశంచ తదాదుస్స్వప్నదర్శనం ॥ ఉదీచ్యాందిశియఃప్రశ్నే విప్రశల్యంకటేరధః । తచ్ఛీఘ్రం నిర్ధనత్వాయ కుబేర

సదృశస్యహి । ఈశాన్యాందిశిశంప్రశ్నే గోశల్యంసార్థహస్తతః। తద్ద్వారా ధనస్యనాశాయ జాయతేగృహమేధినః ॥ హయయా మధ్యమేకోష్ఠే కుట్టిమాత్రభవేదధః । నృకపాలాదిశల్యంతుకులనాశకృదితి॥

——— { ఏవంశల్యమభిధాయేదానీం స్థలస్యశుభాశుభజ్ఞానస్యోపాయం భూమిశోధనంచాహ. } ———

మూ॥ శ్వభ్రంహస్తమితంఖనేదిహజలంపూర్ణం నిశాస్యేన్యసే
త్ప్రాతర్దృష్టజలంస్థలంసదజలంమధ్యంత్వసత్స్ఫుటితం।
జ్ఞాత్వైవంనిఖనేద్గృహాధికభువం నత్వాజలాంతంసరో
ర్వావద్వాపురుషస్తతఃకపిశిరస్తుల్యాశ్మభిః పూరయేత్॥౪॥

టీక॥ హస్తమితమ్=చేతెడులోతుగల, శ్వభ్రమ్ = గోతిని, ఖనేత్=త్రవ్వవలయును. ఇహ=ఈగోతియందు, నిశాస్యే = సూర్యాస్తజలమును, పూర్ణమ్ = నిండునట్లుగా, న్యసేత్ = ఉంచవలయును తత్=ఆగర్తము, ప్రాతః = ప్రాతఃకాలమునందు, దృష్టజలమ్ = చూడఁబడినజలముకలది, స్యాచ్చేత్ అయ్యెనేని, తదా అప్పుడు, తత్=ఆప్రదేశము, సత్=యోగ్యమైనది, స్యాత్=అగును. అజలమ్=జలములేనిది, స్యాద్యది=అయ్యెనేని, మధ్యమ్=మధ్యమఫలమునిచ్చునది, స్యాత్=అగును. స్ఫుటితమ్=బద్దలయినది, స్యాచ్చేత్=అయ్యెనేని, అసత్=అశుభములను కలుగఁజేయునది, స్యాత్=అగును. ఏవమ్=ఈవిధముగా, జ్ఞాత్వా = తెలిసికొని, గృహాధికభువమ్=గృహమునుకట్టుటకు ఏర్పాటుచేయఁబడిన భూమికంటె అధికమైనభూమిని, నత్వా=నమస్కరించి, జలాంతమ్=ఉదకమువచ్చువఱకైనను, స్తరోగంతంవా=శిలలువచ్చువఱకైనను, యావద్వాపురుషః=పురుషపరిమితిలోతువఱకైనను, నిఖనేత్=త్రవ్వవలయును. తతః = పిమ్మట, కపిశిరస్తుల్యాశ్మభిః = కోతియొక్క శిరస్సునకు తుల్యములగు ఱాళ్ళచేత, పూరయేత్=నిండింపవలయును.

తా॥ ఈవిధముగా శల్యములనుజెప్పి యిప్పుడు స్థలముయొక్క శుభాశుభజ్ఞానముయొక్క ఉపాయమును భూమిశోధనమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:——ముందుగా నివేశనస్థలమునందు చేతెడులోతున గోతి త్రవ్వి సూర్యునియొక్క యస్తమయకాలమునందు ఆగోతినిండునట్టుల నుదకమునుపోసి ప్రాతఃకాలమున పరీక్షింపఁగా ఆజలముకొంచెమైనను మిగిలియుండెనేని యాస్థలము మిగుల శుభకరమైనదనియును, ఆగోతియందు బురదగానుండెనేని మధ్యము



ఫలము నిచ్చుననియును, ఆగోతియందలినేల బ్రద్దలై యుండెనేని యశుభములను గలిగించుననియును, తెలియవలయును, "శ్లో॥ తథానిశాదౌతత్కృత్వా సుపానీయేనపూరయేత్ । ప్రాతర్దృష్టేజలేవృద్ధిం సమంపంకేవ్రణేక్షయః ॥" ( = నివాసముచేయుటకు నిశ్చయింపఁబడిన స్థలమునందు చేతెడులోతుగలగోతినిత్రవ్వి సూర్యాస్తమానకాలమునందాగోతిని మంచినీళ్ళచేతనిండించి ప్రాతఃకాలమునందుఁ జూడఁగా జలముండెనేని వృద్ధికలుగుననియును, బురదగనుండెనేని సమఫలములు కలుగుచుండుననియును, ఆగోతియొక్క యడుగుభాగము పగుళ్ళుపారియుండెనేని నాశము కలుగుననియును చెప్పవలయును.) అని నారదమునివరుఁడు చెప్పె. ఇప్పుడు చెప్పినవిధములచేత తగినస్థానమును దెలిసికొని గృహనిర్మాణమునకుఁ దగినభూభాగముకంటె నధికభాగమును ఉదకమువచ్చువఱకును త్రవ్వవలయును. ఇట్లుకాదేని ఱాళ్ళుండువఱకయినను త్రవ్వవలయును. ఇట్లును జేయలేనియెడల పురుషాకృతి పరిమితమగు లోతువఱకును త్రవ్వవలయును. ఇట్లుచేయునపుడు ఇష్టదేవతకును భూదేవికిని నమస్కారమును జేయవలయును. పిమ్మట నాగోతిని కోతితలయొక్క పరిమితిగల శిలలచేత ఆగోతిని పూడ్చవలయును, "శ్లో॥ జలాంతంప్రస్తరాంతంవా పురుషాంతమథాపివా । క్షేత్రంసంశోధ్యచోద్ధృత్య శల్యంసదనమారభేత్ ॥" ( = జలమువఱకైనను ఱాళ్ళువచ్చువఱకైనను పురుషుని లోతువఱకైనను గృహనిర్మాణమున కేర్పాటుచేయఁబడినభూమినిత్రవ్వి శోధించి శల్యములున్నయెడలఁ దీసివైచి పిమ్మట గృహనిర్మాణమును చేయవలయును.) అని మాండవ్య మునివరుఁడు చెప్పె. "శ్లో॥ కపిశీర్షప్రమాణైశ్చ గ్రావభిఃపూరయేద్గృహం । భావంతత్రసమంకృత్వా తతఃప్రాచీంప్రసాధయేత్ ॥" ( = తొలుతఁద్రవ్వినగోతిని కపిశిరస్తుల్యములగు ఱాళ్ళచేత ఆగోతిని నిండింపవలయును. అనంతరమందు ప్రదేశమును సమముగఁజేసి ప్రాగ్దిక్కును సాధింపవలయును.) అని మత్స్యపురాణమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ ఖన్యమానేయదాక్షేత్రే పాషాణఃప్రాప్యతేయదా । ధనాయుశ్చిరతాతస్య చేష్టకాసుధనాగమః ॥ కపాలాంగారకేశాదౌ వ్యాధినాపీడితోభవేత్ ॥" ( = క్షేత్రము త్రవ్వఁబడినదగుచునుండఁగా పాషాణము పొందఁబడెనేని ధనము చిరాయుష్యము మొదలగునవి కలుగును. ఇటికలుదొరికెనేని ధనప్రాప్తియగును. కపాలాంగారకేశాదులు సంప్రాప్తములయ్యెనేని వ్యాధిచేత

పీడింపఁబడిన వాఁడగును. ) అని కారికయందు చెప్పఁబడెను.

వ్యా॥ శ్వభ్రమితి॥ శ్వభ్రంగర్తం - హస్తమితం భవేత్ - ఇహాస్మిన్ శ్వభ్రే నిశాస్యే - రాత్రిముఖే అర్ధసూర్యాస్తే - జలంపూర్ణం - న్యసేత్ - తచ్చేద్యది ప్రాతః సజలంస్యాత్ - తదాతత్స్థలంసత్ - శుభంస్యాత్ - వృద్ధికరంస్యాత్ - యదిఅజలంగత జలంస్యాత్ తదామధ్యమంయదాస్ఫుటితంస్యాత్తదా అసత్ - నానావిధహానికరం స్యాదిత్యర్థః - తథాచ నారదః ॥ శ్లో ॥ తథానిశాజాతతృత్వా సుపానీయేనప్రపూరయేత్। ప్రాతర్ద్రష్టే జలేవృద్ధిం సమంపంకేవ్రణక్షయఇతి ॥ ఏవంశుభాశుభస్థల లక్షణమభిధాయేదానీంభూమిశోధనమాహ ॥ జ్ఞాత్వేతి ॥ ఏవముక్త ప్రకారైః - స్థానంజ్ఞాత్వాగృహాధికభువం జలాంతంయథాభవతితథా ఖనేత్ గృహాదధికాగృహాధికాసాచాసౌ భూశ్చతదాతాంకల్పితంగృహాత్ కించిదధికాంభూమింజలపర్యంతం ఖనేదిత్యర్థఃఅధికఖననంశుద్ధ భూభాగేభిత్తిరచనార్థంవా ఇత్యథవా స్తరోయావత్తావత్ ఖనేత్ పృథ్వీగర్భమృద్భేదానాం స్తరాఃసంతి - తత్రత్రాంత్యస్తరపర్యంతం ఖనేదిత్యర్థః అథ వాయావత్పురుషస్తన్మితంవా పురుషమాత్రంఖనేత్ - ఇదంశక్త్యపేక్ష యాజ్ఞాతవ్యం పురుషప్రమాణం పంచారత్నయః ॥ తథాచశుల్బం ॥ పంచారత్నిర్దశవితస్తిర్వింశతి శతాంగుళఃపురుషఇతి॥ పంచారత్న్యాదయః- పురుషపర్యాయాః - కిరకృత్వా - నత్వా - నమస్కృత్య - ఖనేదిత్యర్థః - తతఃతదనంతరం తత్ఖాతంకపిశిరస్తుల్యాశ్మభిః - వానరశిరఃప్రమాణైః గ్రావభిః పూరయేత్పూర్ణంకుర్యాత్ ॥ తథాచమాండవ్యః॥ శ్లో ॥ జలాంతం ప్రస్తరాంతంవా పురుషాంతమథాపివా । క్షేత్రంసంశోధ్యచోద్ధృత్య శల్యంసదనమారభేదితి ॥ తథాచమత్స్యపురాణే ॥ కపిశీర్షప్రమాణైశ్చ గ్రావభిఃపూరయేద్దృఢం । భావంతత్రసమంకృత్వాతతః ప్రాచీంప్రసాధయేదితి ॥ ఖన్యమానే క్షేత్రేయదాప్యతే తత్ఫలంకారికాయాముక్తం ॥ శ్లో ॥ ఖన్యమానేయదాక్షేత్రే పాషాణఃప్రాప్యతేయదా । ధనాయుశ్చిరతాతస్య చేష్టకాసుధనాగమః ॥ కపాలాంగారకేశాద్యా వ్యాధినాపీడితోభవేదితి॥

—(*) ఏవంస్థలశుద్ధిమభిధాయాథునాదిక్సాధనమాహ (*)—

మూ॥ ప్రాక్సాధ్యోజ్జయినీస్థలాద్యమదిశిత్వాష్ట్రానిలాభ్యంతరా
త్సౌమ్యే తోయోగ్న్యుదయాదు దగ్ధ్రువముఖా ద్దిజ్మోహకే
స్యాన్మృతిః । గేహంమాధవపౌషఫాల్గున నభోమార్గే
మృద్వానిలైః పాశ్యార్కేజ్యవసుధ్రువైః స్థిరతనౌ కు
ర్యాత్సుకేంద్రాష్టమే॥



టీక॥ ఉజ్జయినీస్థలాత్=ఉజ్జయినీస్థలమునుండి. యమదిశి=దక్షిణపు దిక్కునందు. త్వాష్ట్రానిలాభ్యంతరాత్ = చిత్తాస్వాతులయొక్క మధ్యనుండి. ప్రాక్=పాగ్దిక్కు. సాధ్యా=సాధింపఁదగినది. అతః=ఈయుజ్జయినీపట్టణముకంటె. సౌమ్యే=ఉత్తరభాగమునందు. అగ్న్యుదయాత్=కృత్తికోదయమునుండి. ప్రాక్=తూర్పుదిక్కు. సాధ్యా=సాధింపఁదగినది. స్యాత్=అగును. ధ్రువముఖాత్=ధ్రువముఖమునుండి. ఉదక్=ఉత్తరదిక్కు. సాధ్యా=సాధింపఁదగినది. దిఙ్మోహకే=దిక్కుయొక్క జ్ఞానములేకపోవుచుండఁగా. మృతిః=మరణము. స్యాత్=అగును. మాధవపౌషఫాల్గుననభోమార్గేషు=వైశాఖ, పుష్య ఫాల్గున శ్రావణ మార్గశీర్ష మాసములయందు. మృద్వానిలైః=చిత్రానూరాధా రేవతీ మృగశీర్షా స్వాతీనక్షత్రములచేతను. పాశ్యార్కేజ్యవసుధ్రువైః=శతభిషము, హస్త, పుష్యమి, ధనిష్ఠ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనునక్షత్రములచేతను. సుకేంద్రాష్టమే=శుభగ్రహములు కేంద్రములయందును అష్టమమందునుగల. స్థిరతనౌ=స్థిరలగ్నమునందు. గేహమ్=గృహము. కుర్యాత్=చేయవలయును.

తా॥ ఇదివఱకు స్థలశుద్ధి చెప్పఁబడెనుకనుక ఇప్పుడు ఈశ్లోకము చేత దిక్సాధనను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఉజ్జయినీపట్టణమునకు దక్షిణపుదిక్కునందు చిత్రాస్వాతులమధ్యయందు తూర్పుదిక్కును సాధింపవలయును. ఎట్లనిన:—రాత్రులయందు ప్రాఙ్ముఖుఁడైకూర్చుండి నలికాయంత్రముచేత కాడిపొడుగుననుదయించిన చిత్రానక్షత్రమునుచూచుచు నలికాగ్రాలంబమగు భూమినివిడిచిపెట్టి భూమియందు చిహ్నమును చేయవలయును. పిమ్మటఅటులనే ఆనేత్రముచేతనే స్వాతీనక్షత్రమునుచూచుచు నలికాగ్రము మొదలుకొని లంబమగుభూమినిపెట్టి లంబపాతమందు గుర్తునుపెట్టవలయును. నేత్రమునుండి లంబమునువిడిచి యప్పుడే చిహ్నమునుచేయవలయును. ఈవిధముగాచిహ్నద్వయము చిత్రాస్వాతీచిహ్నములయందు తన్మితమగురజ్జువునుపట్టుకొని రజ్జుప్రాంతములను ఒకటిగాఁజేసి మధ్యయందు చిహ్నమునుచేయవలయును. మఱియును, మరలఅక్కడనే అటులనే రజ్జువునుప్రసరింపఁజేసి మధ్యచిహ్నమునందు శంకువును పాతి ఆశంకువునుండి పశ్చిమచిహ్నమువఱకును రజ్జువును ప్రసరింపఁజే

యవలయును. అదియే ప్రాచీసూత్రమగును. ఇటులనే యుజ్జయినికి దక్షిణమందు ప్రాచీసాధనమును చెప్పి పిమ్మట ప్రాచీసాధనము ఉత్తరదిక్కునందు ప్రాచీసాధనమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఉజ్జయినికి ఉత్తర దిక్కునందు కృత్తికోదయమునుండి ప్రాచీసాధనమును చేయవలయును. ఎట్లనిన:—మునుపటివలెనే నలికచేత యుగమాత్రోదితమగు కృత్తికా నక్షత్రమును చూచి నలికామూలాగ్రములనుండి లంబములను విడిచి భూమియందు చిహ్నద్వయమును చేసి ఆ రెంటిమీదను మునుపటివలెనే ప్రాచీన సూత్రమును పట్టి ప్రాచీదిక్కును సాధింపవలయును. ధ్రువుని బట్టియుత్తరపుదిక్కును సాధింపవలయుననియును, ఉత్తరదిక్కును సాధించుట సర్వదేశములవారికిని సాధారణమనియును, తెలియవలయును. దిక్కులయొక్క విజ్ఞానము లేకపోయిన యెడల మరణము కలుగును. "శ్లో ॥ చిత్రాస్వాత్యంతరేశ్రోణాద్దక్షిణాపథవాసినాం। ప్రాచీతు కృత్తికాజ్ఞేయా హ్యుత్తరాపథవాసినామ్॥" (= ఉజ్జయినికి దక్షిణమందు నివసించినవారు చిత్రాస్వాతులయొక్క మధ్యభాగమును బట్టి ప్రాగ్దిక్కును సాధించుకొనవలయును. ఉజ్జయినికి ఉత్తరపుదిక్కునందు నివసించినవారు కృత్తికానక్షత్రమును బట్టి ప్రాగ్దిక్కును సాధింపవలయును.) అని దేవయజనదీపికయను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో ॥ కృత్తికాశ్రవణంపుష్యం చిత్రాస్వాత్యోర్యదంతరం। ఏతత్ప్రాచ్యాదిశోరూపం యుగమాత్రోదితేపురః ॥" (= ఎనుబదియాఱంగుళముల పొడవునకు వచ్చియున్న కృత్తిక, శ్రవణము, పుష్యమి, చిత్ర, స్వాతి, అనునట్టి నక్షత్రములయొక్క మధ్యభాగమునుండి తూర్పు దిక్కును సాధింపవలయును.) అని శుల్బసూత్రమునందుఁ జెప్పఁబడియె. "శ్లో ॥ ప్రాసాదేసదనేళిందే ద్వారేకుండేవిశేషతః। దిఙ్మూఢేకులనాశస్స్యాత్తస్మాత్సంసాధయేద్దిశః ॥" (= ప్రాసాదమందును, సదనమందును, అళిందమందును, ద్వారమందును, కుండమందును, దిక్కులు తెలియకపోయిన యెడల కులనాశమగుననియును, కావున దిక్కులను సాధింపవలసినదనియును, తెలియవలయును. అని వృద్ధనారదుఁడు చెప్పెం. ఇంకను ఏమాసములయందు గృహనిర్మాణమును జేయవలసినదియును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—వైశాఖము, పుష్యమి, ఫాల్గునము, శ్రావణము, మార్గశీర్షము, అనునట్టి మాసములయందును, చిత్ర, అనూరాధ, రేవతి, మృగశీర్ష, స్వాతి, శతభిషము, హస్త, పుష్యమి, ధనిష్ఠ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనునట్టి నక్షత్రములయందు



ను, అష్టమస్థానమునందు శుభగ్రహములకల స్థిరలగ్నమందును గృహనిర్మాణమును జేయవలయును. ఇతరవిషయములను పూర్వమునందుఁ జెప్పఁబడినట్లు చూచుకొనవలయును.

వ్యా॥ ప్రాగితి॥ ఉజ్జయినీస్థలాత్ - యమదిశి - దక్షిణస్యాందిశి - త్వాష్ట్రానిలాభ్యంతరాత్ - ప్రాక్సాధ్యానరై రిత్యధ్యాహారః - త్వాష్ట్రం చిత్రా అనిలంస్వాతీ అనయోరంతరం మధ్యం - తస్మాత్ప్రాచీసాధ్యేత్యర్థః - ఏతదుక్తంభవతి - సంభవేసతి- రాత్రౌ ప్రాఙ్ముఖ ఉపవిశ్య- యుగమాత్రోదితాం - చిత్రాం-నలికయా-విలోకయన్ - నలికాగ్రాల్లంబం-భూమిపర్యంతం ముక్త్వా భూమౌ చిహ్నంకృత్వా - తత్రైవాచలస్తేనైవనేత్రేణ స్వాతీమవలోకయన్ - తత్రైవ నలికాగ్రాత్సకాశాల్లంబం భూమిపర్యంతంముక్త్వా లంబపాతే చిహ్నంకృత్వా - నేత్రాల్లంబం ముక్త్వా తత్రైవ చిహ్నంకుర్యాత్ - ఏవంచిహ్నద్వయం చిత్రాస్వాతీ చిహ్నయో రజ్జుంతన్మితాంధృత్వా రజ్జుప్రాంతౌ ఏకీకృత్యమధ్యే చిహ్నంకుర్యాత్ - పునస్తత్ర తత్రైవప్రసార్యమధ్య చిహ్నే శంకుంనిఖాయ - తస్మాత్పశ్చిమచిహ్నపర్యంతం రజ్జుప్రసారయేత్ - తత్ప్రాచీసూత్రం - ఏవముజ్జయిన్యాః దక్షిణతః ప్రాచీసాధనముక్త్వా అనంతరం ఉత్తరతః ప్రాచీసాధనమాహ॥ సౌమ్యేఇతి॥ అతః ఉజ్జయిన్యాః సౌమ్యే ఉత్తరభాగే అగ్న్యుదయాత్ - కృత్తికోదయాత్-ప్రాచీసాధ్యా - ఏతదుక్తంభవతి పూర్వవన్నలికయా యుగమాత్రోదితాం కృత్తికామాలోక్య నలికామూలాగ్రాభ్యాం లంబౌ ముక్త్వా భూమౌ చిహ్నద్వయంకృత్వా తయోరుపరి ప్రాచీసూత్రం ॥ అథోత్తరసాధనమాహ॥ ఉదగితి॥ ధ్రువముఖాత్ ఉదక్ ఉత్తరదిక్ సాధ్యా ఇదంసర్వేషాంసాధారణం ॥ అథదిఙ్మూఢత్వదోషమాహ॥ దిఙ్మూఢకేస్యాన్మృతిరితిస్పష్టం ॥ తథాచోక్తం దేవయజనదీపికాయాం॥ శ్లో॥ చిత్రాస్వాత్యంతరేశ్రోణాద్దక్షిణాపథవాసినాం। ప్రాచీతుకృత్తికాజ్ఞేయా హ్యుత్తరాపథవాసినామితి॥ శ్రోణాత్ ఉజ్జయిన్యాః తథాచ శుల్బే॥ కృత్తికాశ్రవణంపుష్యం చిత్రాస్వాత్యోర్యదంతరం। ఏతత్ప్రాచ్యాదిశోరూపం యుగమాత్రోదితేపుర ఇతి॥ యుగప్రమాణం షడశీత్యంగుళాని ॥ తథాచశుల్బసూత్రం ॥ అంగుళైః రథసమ్మితాయాః ప్రమాణంత త్రాష్టాశీతిశతమీషాచతుశ్శతమక్షః పక్షష్షడశీతిర్యుగం చత్వారోష్టకాఃశమ్యేతి॥ తథాచస్ఫుటకరణే ॥ శ్లో ॥ ధ్రువలంబకరేఖాయా రేఖాంతస్సన్ధ్యయా వ్యవహారితౌస్తః। తన్మత్స్యపుచ్ఛముఖతః పశ్చిమపూర్వాభిధో

విద్యాదితి॥ వృద్ధనారదః ॥ శ్లో ॥ ప్రాసాదేసదనేళిందే ద్వారేకుండేపి శేషతః । దిఙ్మాఖ్యేమలనాశస్స్యాత్తస్మాత్సంసాధయేద్దిశ ఇతి॥ అథకేషు మాసేషు గృహంకర్తవ్యమిత్యాహ ॥ గేహమితి మాధవాదిషుమాసేషు మృద్వాదిర్భిర్నక్షత్రైః గేహంగృహంకుర్యాత్ మాధవోవైశాఖః పౌష ఫాల్గునౌనభః శ్రావణఃమార్గోమార్గశీర్షః తేష్విత్యర్థః మృదూనిచిత్రానూరాధా రేవతీమృగాః - అనిలంస్వాతిపాశివరుణః తద్భంశతతారకా అర్కోహస్తః ఇజ్యఃపుష్యఃవసుర్ధనిష్ఠాధ్రువాని రోహిణీ ఉత్తరాత్రయం చతైఃస్థిరతనౌస్థిరలగ్నేకేంలత్ర ణే సుకేంద్రాష్టమే శోభనానిగ్రహరహితానికేంద్రాష్టమానియస్య తత్తథాతస్మిన్ స్థిరతనావితివాపాఠః శేషం పూర్వవత్॥

—✻ అథోక్తేష్వపినక్షత్రేషు విశేషంవృషభవాస్తుచాహ. ✻—

మూ॥ నోపృష్ఠాగ్రవిధౌనరిక్తకతిథౌనార్కారవారాంశయో
రుక్తర్క్షేష్వపికుంభమీనగవిధౌ స్తంభోచ్ఛ్రితంనాచరే
త్ । తుర్యాత్పంచదశాత్త్రిదిక్ప్రమితాత్వేదాబ్ధి పంచ
క్రమాన్నింద్యాన్యర్కయుతాదిగేహ కరణే భానిప్రవే
శేపిచ॥ ౬॥

టీక॥ పృష్ఠాగ్రవిధౌ=చంద్రుఁడు పృష్ఠభాగమునందును అగ్రభాగమునందును ఉన్నవాఁడగుచుండఁగా, స్తంభోచ్ఛ్రితమ్ = స్తంభప్రతిష్ఠను, నోకుర్యాత్=చేయఁగూడదు. రిక్తకతిథౌ=రిక్తతిథియందును, నోకుర్యాత్=చేయుగూడదు. అర్కారవారాంశయోః=సూర్యకుజవారములయందును సూర్యకుజులయొక్క యంశలయందును, నోకుర్యాత్ = చేయఁగూడదు. ఉక్తర్క్షేష్వపి = చెప్పఁబడిన నక్షత్రములయందుఁగూడ, కుంభమీనగవిధౌ=చంద్రుఁడు కుంభమీనములయందుండఁగా, స్తంభోచ్ఛ్రితమ్= స్తంభప్రతిష్ఠను, నాచరేత్=చేయఁగూడదు. అర్కయుతాది=సూర్యుఁడున్ననక్షత్రముమొదలుకొని, తుర్యాత్ = నాల్గవ నక్షత్రమునుండియును, పంచదశాత్ = పదునైదవ నక్షత్రమునుండియును, త్రిదృక్ప్రమితాత్=ఇరువదిమూఁడవ నక్షత్రమునుండియును, క్రమేణ = క్రమముగా, వేదాబ్ధిపంచ=నాలుగు, నాలుగు, అయిదు, సంఖ్యలుగల, భాని=నక్షత్రములు, గేహకరణే=గృహనిర్మాణమందును, ప్రవేశేపిచ = గృహప్రవేశమందును, నింద్యాని=నిందింపఁదగనవి. స్యుః=అగును.

తా॥ శాస్త్రోక్త నక్షత్రములయందలి విశేషమును వృషభవా



స్తును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—చంద్రుఁడు పృష్ఠభాగమునందును అగ్రభాగమునందును ఉండఁగా గృహనిర్మాణాదిక మును జేయఁగూడదు. అనఁగా కృత్తికాదిగ నేడునక్షత్రములు పూర్వదిక్కునందును మఘాదిగ నేడునక్షత్రములు దక్షిణదిక్కునందును ఉన్నవని యెఱిగి సప్తశలాకాచక్రమునందున్న నక్షత్రములలోపల మృద్వానిలాదీష్ట చంద్రనక్షత్రము ఏదిగ్భాగము నందున్నదో ఆదిఙ్ముఖముగల గృహమునందు సమ్ముఖుఁడైనచంద్రుఁడు తెలియఁదగినవాఁడు. దానికి పృష్ఠభాగమునందున్నవాఁడు పృష్ఠభాగమునందున్న చంద్రుఁడని యెఱుఁగవలయును. ఇట్లు విచారించి చంద్రుఁడు పృష్ఠభాగమునందుఁగాని అగ్రభాగమునందుఁగాని యుండఁగా గృహనిర్మాణము చేయఁదగినది కాదని యెఱుఁగవలయును. "శ్లో ॥ చక్రేసప్తశలాకాఖ్యే కృత్తికాదీని విన్యసేత్ । ఋక్షంచంద్రస్యవాస్తోశ్చ పురఃపృష్ఠేచనోశుభమ్॥" (=సప్తశలాకమను పేరుగల చక్రమునందు కృత్తికాదిగ నక్షత్రములను వ్రాయవలయును. పిమ్మట చంద్రనక్షత్రమును దెలిసికొని చంద్రునకును వాస్తుపునకు ముందు వెనుకలనున్న నక్షత్రములయందు గృహనిర్మాణమును జేయఁగూడదు. "శ్లో ॥ ధనలాభః ప్రవాసస్స్యాద్దాయుశ్చోరభయం క్రమాత్ । దక్షాగ్రవామపృష్ఠస్థే గృహకర్తుర్నిశాకరే ॥" (=చంద్రుఁడు గృహకర్తకు దక్షిణమునందును అగ్రభాగమునందును వామభాగమునందును పృష్ఠభాగమునందును ఉన్నవాఁడగుచునుండఁగా క్రమముగా ధనలాభము ప్రవాసముఆయుష్యము చోరభయము అనునవి కలుగును.) అని బ్రహ్మశంభువనువాఁడు చెప్పె. మఱియును, రిక్తతిథులయందు గృహనిర్మాణమును జేయుట యుచితముకాదని యెఱుఁగవలయును. కుజసూర్యవారములయందును సూర్యాంగారక నవాంశములయందును గృహము నిర్మాణమునకుఁగా స్తంభప్రతిష్ఠాదికమును జేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, గృహనిర్మాణమునకుఁ జెప్పఁబడిన నక్షత్రములయందుఁగూడ చంద్రుఁడు కుంభమీనములను పొందియుండఁగా స్తంభప్రతిష్ఠను జేయఁగూడదు. "శ్లో ॥ పంచకేమృచధిష్ణ్యేషు నకుర్యాత్స్తంభముచ్ఛ్రియం । క్షేత్రసూత్రశిలాన్యాస ప్రాకారాదిసమాచరేత్ ॥" (=పంచకనక్షత్రములయందు క్షేత్రసూత్ర శిలాన్యాస ప్రాకారాదికమును స్తంభప్రతిష్ఠను చేయఁగూడదు.) అని మాండవ్యమునివరుఁడు చెప్పె. ఇఁకను వృషభవాస్తువును జెప్పుచున్నాఁడు. ఎట్లని

న:—సూర్యస్థిత నక్షత్రముమొదలుకొని నాల్గవనక్షత్రముకంటెను పదునైదవనక్షత్రముకంటెను ఇరువది మూడవ నక్షత్రముకంటెను క్రమముగా నాలుగు నాలుగు అయిదుసంఖ్యలుగల నక్షత్రములు గృహనిర్మాణమునందు నింద్యములయినవగును. “ శ్లో॥ త్రివేదాబ్ధిత్రివేదాబ్ధిద్విత్రిభేష్వర్కతశ్శశీ । కుర్యాల్లక్ష్మీంసముద్వాసం స్థైర్యలక్ష్మీందరిద్రతాః । ధనం వ్యాధింక్రమాన్మృత్యుం ప్రవేశారంభయోర్నృప॥ ” (=సూర్యుఁడున్న నక్షత్రముమొదలుకొని మూఁడునాలుగు మూఁడునాలుగు మూఁడునక్షత్రములయందు చంద్రుఁడున్నయెడల లక్ష్మియును ప్రవాసమును స్థైర్యము లక్ష్మి దారిద్ర్యము ధనము వ్యాధి మృత్యువు అనునవి కలుగును.) అని వ్యవహారసారమునందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ నో ఇతి॥ పృష్ఠాగ్రవిధౌ సతినోవిరచయేత్ - ఏతదుక్తంభవతి కృత్తికాదీని సప్తనక్షత్రాణి పూర్వస్యాం - మఘాది సప్తదక్షిణే ఇత్యాదిసప్తశలాకాచక్రస్థిత నక్షత్రాణాం మధ్యే పృష్ఠానిలాదీష్వ చంద్రనక్షత్రంయస్మిన్ దిగ్భాగే భవతితద్దిఙ్ముఖే గృహేసమ్ముఖశ్చంద్రోజ్ఞేయః- తత్పృష్ఠస్థేపృష్ఠతోజ్ఞేయ ఏవమగ్రగేపృష్ఠగేవా చంద్రేసతి గృహంనకర్తవ్యమిత్యర్థం॥ తథాచభృగుః॥ శ్లో॥ చక్రేసప్తశలాకాఖ్యే కృత్తికాదీనివిన్యసేత్ । ముఖంచంద్రస్యవాస్తోశ్చ పృష్ఠే చ నో శుభమితి॥ తథాచబ్రహ్మశంభుః॥ శ్లో॥ ధనలాభః ప్రవాసస్స్యాద్దాయుశ్చోర భయం క్రమాత్ దక్షాగ్రవామపృష్ఠస్థే గృహకర్తుర్నిశాకరే॥ ఇతినరక్తకతిథౌ స్పష్టం - నారాకారవా రాంశయోః అర్కభౌమయోర్వార నవాంశయోఃనకుర్యాత్ ఉక్తత్వేఽప్యపి కుంభమీనగవిధౌ సతిస్తంభోచ్ఛ్రితం నాచరేదితి అర్థాదన్యత్సర్వం ఆచరేత్॥ తథాచమాండవ్యః॥ శ్లో॥ పంచకేషుచధిష్ణ్యేషు నకుర్యాత్తంభముచ్ఛ్రియం । క్షేత్రసూత్రశిలాన్యాసప్రాకారాదిసమాచరేదితి॥ అథవృషభవాస్త్వాహ॥ తుర్యాదితి॥ అర్కయుతాది సూర్యనక్షత్రాది తుర్యాచ్చతుర్థాత్ పంచదశాత్ త్రిదృక్పరిమితాత్ త్రయోవింశాత్సకాశాత్ క్రమేణవేదాబ్ధిపంచభాని నక్షత్రాణి గృహస్యకరణేరచనాయాం ప్రవేశేపినింద్యానిస్యుః॥ తథాచ వ్యవహారసారే॥ శ్లో॥ త్రివేదాబ్ధిత్రివేదాబ్ధి ద్విత్రిభేష్వర్కతశ్శశీ । కుర్యాల్లక్ష్మీంసముద్వాసం స్థైర్యల్లక్ష్మీందరిద్రతాః॥ ధనంవ్యాధింక్రమాన్మృత్యుం ప్రవేశారంభయోర్నృపఇతి॥



——(*) అథ చతుర్థాద్వారనిర్ణయమాహ. (*)——

మా॥ శేతేభాద్రపదాత్త్రిషుత్రిషు సురఃప్రాగాదిశీర్షోఽత్రహి
ప్రోక్తంసద్మముఖంతుగోళ్యజఘటేష్వర్కేఽయమోదఙ్ము
ఖం । హృద్రోగైణకులీరలేయగరవౌపూర్వాపరాస్యం
గృహం నాన్యస్థే భుజకోటిఘాత ఇభహృచ్ఛేషంస్యురా
యాఃక్రమాత్॥ ౭॥

టీక॥ భాద్రపదాత్ = భాద్రపదమాసముమొదలుకొని, త్రిషుత్రిషు=మూఁడుమూఁడగుమాసములయందు, సురః=వాస్తుపురుషుఁడు, ప్రాగాదిశీర్షః = తూర్పుమొదలుగాఁగల దిక్కులయందు శిరస్సుకలవాఁడై, శేతే=శయనించుచున్నాఁడు. అత్రహి = ఈశిరస్సుకలదిక్కునందు, ముఖమ్=ముఖముకల, సద్మ=గృహము, ప్రోక్తమ్=చెప్పఁబడెను. అర్కే=సూర్యుఁడు, గోళ్యజఘటేషు = వృషభవృశ్చికమేష తులారాసులయందు, స్థితేసతి=ఉన్నవాఁడగుచునుండఁగా, అయమ్ ఉదఙ్ముఖమ్ = దక్షిణాభిముఖమైనను, ఉత్తరాభిముఖమైనగృహమైనను, కార్యమ్=చేయఁదగినది, హృద్రోగైణకులీరలేయగరవౌ=కుంభము మకరము కర్కటకము సింహము అనురాసులయందు సూర్యుఁడుండఁగా, పూర్వాపరాస్యమ్ = తూర్పుపడమరలయందు ముఖములుగల, గృహమ్=గృహము, కార్యమ్=చేయఁదగినది; రవౌ=సూర్యుఁడు, అన్యస్థేసతి = ఇతరరాసులయందుండఁగా, గృహమ్=గృహము, కార్యమ్=చేయఁదగినది, న = కాదు. భుజకోటిఘాతః=ఆయామవిశాలము లనుపించుటచేతనైన కోటిఘాతము, ఇభహృత్=ఎనిమిదిచేత హరింపఁబడఁగా, శేషమ్=మిగిలినది, క్రమాత్ = క్రమముగా, ఆయాః=ఆయములు, స్యుః=అగును.

తా॥ ఇఁకను నాలుగు ద్వారములయొక్కయును నిర్మాణవిధిని దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—భాద్రపదమాసము మొదలుకొని మూఁడేసిమాసములయందు వాస్తుపురుషుఁడు తూర్పు మొదలుగాఁగల దిక్కులయందు శిరస్సుకలవాఁడై శయనించుచున్నాఁడని యెఱుఁగవలయును. అనఁగా, భాద్రపదాదిగ మూఁడుమాసములయందు తూర్పుశిరస్సుకలవాఁడయ్యును, మార్గశీర్షాదిగ మూఁడుమాసములయందు దక్షిణశిరస్సుకలవాఁడయ్యును ఫాల్గునాదిగ మూఁడుమాసములయందు పశ్చిమశిరస్సుకలవాఁడయ్యును, జ్యేష్ఠాదిగమూఁడుమాసములయందు ఉత్తరశిరస్సుకలవాఁడయ్యును వాస్తుపురుషుఁడు శయనించుచున్నాఁడని యెఱుఁగవల

యను. ఈశిరస్సుకల దిక్కునందు ముఖముగల గృహమును నిర్మింపఁగూడదు. మఱియును, సూర్యుఁడు వృషభము వృశ్చికము మేషము తుల అనునట్టి రాసులయందు సంచరించుచుండఁగా దక్షిణాభిముఖమును ఉత్తరాభిముఖమును అయినగృహమును నిర్మింపవలసినదని యెఱుఁగవలయును. మఱియును, సూర్యుఁడు కుంభము, మకరము, కర్కటకము సింహము అను రాసులనుపొందియుండఁగా పూర్వముఖముకలదియును పశ్చిమాభిముఖముకలదియును అయిన గృహమును నిర్మింపవలయును. మఱియును, సూర్యుఁడు ఇప్పుడు చెప్పఁబడినరాసులకంటె ఇతరములయిన రాసులయందు సంచరించుచుండఁగా గృహనిర్మాణమును జేయఁగూడదు. మఱియును, గృహనిర్మాణమునకు నిశ్చయింపఁబడిన భూమియొక్క యాయామవిశాలములను హెచ్చించి యామొత్తమును ఎనిమిదిచేత భాగింపఁగా మిగిలినది అనఁగా శేషము క్రమముగా క్రిందిశ్లోకమునందుఁ జెప్పఁబోయెడునాయములు అగుచున్నవి.

వ్యా॥ శేత ఇతి॥ భాద్రపదాత్త్రిషు మాసేషు సురో వాస్తుపురుషః ప్రాగాదిశీర్షః శేతేఇతి ఏతదుక్తంభవతి - భాద్రపదాదిమాసత్రయే పూర్వశీర్షః మార్గశీర్షాది మాసత్రయే దక్షిణశీర్షః ఫాల్గునాది మాసత్రయే పశ్చిమశీర్షః జ్యేష్ఠాదిమాసత్రయే ఉత్తరశీర్షో వాస్తుః శేత ఇతి అత్ర అస్యాంశీర్షదిశాయాం సద్మముఖంగృహముక్తం ప్రోక్తం అథసంక్రాంతిపరత్వేన ముఖనిర్ణయమాహ॥ గోళ్యజేతి॥ గోళ్యజఘటేష్వర్కే సతి యమోదఙ్ముఖంకార్యం గోవృషః అళిర్వృశ్చికః అజో మేషః ఘటస్తులా ఏషు రాశిషు అర్కే సూర్యే సతి యమోదఙ్ముఖం దక్షిణాభిముఖం ఉత్తరాభిముఖంవా గృహంకార్యమిత్యర్థః - హృద్రోగిణకుళీరలేయగరవౌ సతి పూర్వాపరాస్యం పూర్వాభిముఖం పశ్చిమాభిముఖం గృహంకార్యమిత్యర్థః - హృద్రోగః కుంభః ఏణో మకరః కుళీరః కర్కటః లేయః సింహః - ఏతాన్ గచ్ఛతి సతథా సచాసౌ రవిశ్చ తస్మిన్ సతి - పూర్వాపరాస్యం - పూర్వపశ్చిమముఖం వా గృహంకార్యం - అన్యస్థే-అన్యరాశిస్థే రవౌ సతి గృహం న కార్యం - అథాయపరత్వేన గృహముఖనిర్ణయం వివక్షుస్తావదాయసాధనమాహ॥ భుజేతి॥ భుజకోటిఘాత ఇభహృత్ - శేషంఆయాస్స్యుః - భుజో గృహదైర్ఘ్యవిస్తారయోరన్యనామ - తదన్యా కోటిః తథా చోక్తం లీలావత్యాం॥ శ్లో॥ ఇష్టో బాహుర్యస్స్యాత్తత్స్పర్ధిన్యాం దిశీతరో బాహుః త్ర్యస్రే చతురస్రే వా సా కోటిః కీర్తితా తజ్జ్ఞైః ఇతి॥ తయోర్ఘాతో గుణనం



ఇభహృచ్ఛేషం పూర్వాది యథాస్యాత్తథా ధ్వజాదయః ఆయాః క్రమాత్స్యుః॥

మూ॥ పూర్వాదిధ్వజధూమసింహశునకోక్షాణఃఖరేభోష్ట్రకాః
ధార్యాస్స్వస్వపదేధ్వజోఽఖిల ముఖః ప్రాగ్యామ్యవక్త్రో
గజః। ప్రాగాస్యోవృషభోవివారుణ ముఖస్సింహః ప్రశ
స్తాఇమే ధూమోఽగ్నేశ్శునకోంత్యజస్య ఖగపస్యోష్ట్రోఽట్ట
పల్యాఃఖరః॥ ౮॥

టీక॥ పూర్వాదిధ్వజధూమసింహశునకోక్షాణః = తూర్పుదిక్కు మొదలుగాఁగల యెనిమిది దిక్కులయందును క్రమముగా ధ్వజము ధూమము సింహము శునకము వృషభము అనునట్టి యాయములును, ఖరేభోష్ట్రకాః = ఖరము గజము ఉష్ట్రము అనునట్టి యాయములును, బలిష్ఠాః=బలముకలవి, స్యుః=అగుచున్నవి. (ఏతే=ఇవి,) స్వస్వపదే = తమతమస్థానములయందు, ధార్యాః=ధరింపఁదగినవి, స్యుః = అగును. ధ్వజః= ధ్వజాయము, అఖిలముఖః = అన్నిదిక్కులయందును ద్వారములుగలది, గజః=గజాయము, ప్రాగ్యామ్యవక్త్రః = తూర్పుదిక్కునందును దక్షిణపుదిక్కునందును ముఖముకలది, వృషభః=వృషభాయము, ప్రాగాస్యః= తూర్పుదిక్కునందు ముఖముకలది, సింహః=సింహాయము, పశ్చిమదిక్కు తప్పఁ దక్కినదిక్కులయందు ముఖముకలది, ఇమే = ఈధ్వజగజవృషభసింహాయములు, ప్రశస్తాః=ప్రసిద్ధములయినవి, అగ్నేః=అగ్నిగృహమునకు, ధూమః=ధూమాయము, యోగ్యః=తగినది, అంత్యజస్య=అంత్యజాతివానికి, శునకః=శునకాయము, యోగః=తగినది, ఖగపస్య=పక్షివాలకునకు, ఉష్ట్రః=ఉష్ట్రాయము, యోగ్యః=తగినది, అట్టపల్యాః = వేశ్యాస్త్రీకి, ఖరః=ఖరాయము, యోగ్యః=తగినది.

తా॥ తూర్పుదిక్కు మొదలుగాఁగల యెనిమిది దిక్కులయందును క్రమముగా ధ్వజ ధూమ సింహ శునక వృషభ ఖర గజోష్ట్రకములని యెడు నెనిమిది యాయములును బలిష్ఠములయినవని యెఱుఁగవలయును. మఱియును, ఈయెనిమిది విధములగు ఆయములును వానివానికిఁ దగినగృహములయందు ధరింపఁదగినవి. “శ్లో॥ ఖేటఖర్వటకోటేషు వృషస్సింహో గజశ్శుభః। వాపీకూపతటాకాదౌ గజో దేయో విచక్షణైః॥ ఆసనే యోజయేత్సింహం శయనే చైవ కుంజరం। వృషంభోజనపాత్రే చ దద్యాచ్ఛాలాదిషు ధ్వజం॥ మహానసేఽగ్నిశాలాయాం గృహే చాగ్న్యుప

జీవినాం । ధూమం దద్యాత్తథాశ్వానం యవనాంత్యజయోర్గృహే ॥ ఖరశ్శయ్యాగృహేయోజ్యో ధ్వాంక్షః పక్షిపతేర్గృహే । వృషసింహగజం దద్యాత్ప్రాసాదే పురమందిరే॥ ” ( = ఖేటఖర్వట కోటములయందు క్రమముగ వృషసింహగజాయములు శుభకరములయినవి. వాపీకూపతటాకాదులయందు గజాయము ప్రశస్తమైనదగును. సింహాసనమునందు సింహాయమును బెట్టవలయును. శయ్యాగృహమునందు గజాయమును బెట్టవలయును. భోజనపాత్రలయందును భోజనశాలయందును ధ్వజాయము శ్రేష్ఠమైనదగును. మహానసమందును, అగ్నిశాలయందును, అగ్నిని ఆధారముగాఁజేసికొని జీవించువారి గృహమునందును ధూమాయమును బెట్టవలయును. యవనులయొక్కయును, అంత్యజాతివారియొక్కయును గృహమునందు శునకాయమును బెట్టవలయును. శయ్యాగృహమునందు ఖరాయము శుభకరమైనదగును. పక్షిపతియొక్క గృహమునందు వృషభాయము శుభములను గలిగించును. ప్రాసాదమునందును పట్టణపుగృహమునందును వృషసింహగజాయముల నీయవలయును.) అని వాస్తుప్రదీపమను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. “ శ్లో ॥ బస్త్రజే ధర్మశాలాయాం కుంభే స్తంభే ధ్వజే ధ్వజః । గోగజౌ భూగృహే చైవ సాధారణగృహే శుభౌ । యంత్రే శస్త్రే రథే సింహో భాండాగారే శుభో గజః । ధాన్యాంబుస్థానగోశ్వేభ శాలాయాం వృషభశ్శుభః । నాడ్యభాగో ద్వాహవేద్యాం గజసింహవృషాశ్శుభాః ॥ ” (=ధర్మశాలయందును కుంభస్తంభధ్వజములయందును ధ్వజాయము శుభకరమైనది. భూగృహమందును సాధారణగృహమునందును వృషభగజాయములు శుభకరములయినవి. యంత్రశస్త్రరథాలయములయందును భాండాగారమందును గజాయము శుభకరమైనదగును. ధాన్యాలయమందును, జలాలయమందును, గోగజములశాలలయందును వృషభాయము శుభకరమైనదగును. ఉద్వాహవేదికయందు గజసింహవృషభాయములు శుభకరములయినవగును.) అని శిల్పశాస్త్రమునందుఁ జెప్పఁబడెను. మఱియును, ధ్వజాయము సకలదిక్కులయందును ద్వారములుగలదనియును, వృషభాయము ప్రాఙ్ముఖమైనదనియును, సింహాయము పశ్చిమదిక్కుతప్పఁ దక్షిణ దిక్కులయందు ద్వారములుకలదనియును, తెలిసికొనియీయాయములలో నేయాయముకల గృహము నిర్మింపఁబడునో ఆగృహమునకు ఆయాయమునకుఁ జెప్పఁబడినదిక్కునందు ద్వారమును నిర్మింపవలయును. మఱియును, ధ్వజసింహ



వృషభగజాయములు నాలుగును ప్రశస్తములయినవనియును, ఇతరాయముల శుభకరములయినవనియును, తెలియవలయును. “శ్లో॥ కీర్తిశ్శోకో జయో వైరం ధనం నిర్ధనతా సుఖం । రోగశ్చేతి గృహారంభే ధ్వజాదీనాం ఫలం క్రమాత్॥ ” (=ధ్వజాదిగ నెనిమిదివిధములగు నాయములకును క్రమముగ కీర్తి శోకము జయము వైరము ధనము దారిద్ర్యము సుఖము రోగము అను నెనిమిదియును ఫలములని యెఱుఁగవలయును.) అని గర్గముని వరుఁడు చెప్పె. మఱియును, అగ్నిగృహమునందు ధూమాయము అంత్యజునిగృహమునందు శునకాయము పక్షిపాలకుని గృహమునందు ఉష్ట్రాయము వేశ్యాగృహమందు ఖరాయము ప్రశస్తములయినవని యెఱుఁగవలయును.

వ్యా॥ పూర్వాదిష్వితి॥ పూర్వాదిషు ధ్వజాదయో బలిష్ఠా ఇతిభావః ఏతే ధ్వజాదయః - స్వస్వపదే - స్వస్వస్థానే ధ్వజః - పూర్వధూమ ఆగ్నేయ్యామిత్యాది - దార్యాః - అయమర్థః - ముఖ్యగృహక్షేత్రయాదిత్వు - వక్ష్యమాణగృహేషు - ధార్యా ఇత్యర్థః - అథవా స్వసదృశవస్తుషు ధార్యాః - అథవా స్వసదృశస్వ గృహేషు ధార్యాః - అథవా క్రూరకర్మసాధనవస్తుషు పరాక్రమిణో ధార్యాః - అథవా స్వసదృశవస్తుసత్త్వోపజీవినాం గృహేషు ధార్యాః - అథవా స్వానురూపవస్తు సాధ్యహితవస్తుగృహేషు యథాయోగ్యం ధార్యా ఇత్యర్థః - ఏతత్స్పష్టముక్తం వాస్తుప్రదీపే ॥ శ్లో ॥ ఖేటఖర్వటకోటేషు వృషస్సింహో గజశ్శుభః । వాపీకూపతటాకాదౌ గజాదేయో విచక్షణైః ॥ ఆసనే యోజయేత్సింహం శయనే చైవ కుంజరం । వృషం భోజనపాత్రే చ దద్యాచ్ఛాలాదిషు ధ్వజం॥ మహానసేఽగ్నిశాలాయాం గృహే చాగ్న్యుపజీవినాం । ధూమం దద్యాత్తథా శ్వానం యవనాంత్యజయోర్గృహే ॥ ఖరశ్శయ్యాగృహే యోజ్యో ధ్వాంక్షః పక్షిపతేర్గృహే । వృషసింహగజం దద్యాత్ప్రాసాదే పురమందిరే ॥ తథా చ శిల్పశాస్త్రే ॥ బస్త్రజే ధర్మశాలాయాం కుంభే స్తంభే ధ్వజే ధ్వజః । గోగజౌ భూగృహే చైవ సాధారణగృహే శుభౌ ॥ యంత్రే శస్త్రే రథే సింహో భాండాగారే శుభో గజః । ధాన్యాంబుస్థానగోశ్వేభ శాలాయాం వృషభశ్శుభః ॥ నాడ్యభాగో ద్వాహవేద్యాం గజసింహవృషాశ్శుభా ఇత్యాది - ఏవం ఆయసాధనముక్త్వేదానీం తేషాం ముఖ్యాన్యాహ ॥ ధ్వజోఖిలముఖః - సర్వదిగ్ద్వారః - ప్రాగ్యామ్యవక్త్రోగజః - సుగమం - ప్రాగాస్యో వృషభః - ఆస్యం ముఖం - ప్రాఙ్ముఖో వృషభః - స్పష్టం ॥ వివాదుఁనా

ఖస్సింహః - వరుణస్యాయంవారుణోదిగ్విభాగః - పశ్చిమదిగ్విభాగతః - వారుణోయేభ్యస్తత్ర ముఖంయస్యసతథా - పశ్చిమదిశంవినాసర్వ దిగ్ద్వారఇత్యర్థః - యోయోయద్దిఙ్ముఖఆయస్తత్సంఘాతగృహస్యతత్తద్దిశి - ముఖంకర్తవ్యమిత్యర్థః - ఏవంఆయపరత్వేన గృహముక్త్వాప్రసంగేన ఆయానాంశుభత్వమాహ ॥ ప్రశస్తాఇమేఇతి ॥ ఇమేచత్వారఆయాఃప్రశస్తాః సర్వేషాంశుభాః - అర్థాదన్యేచత్వారః సమాఆయా అప్రశస్తాః ॥ తథాచగర్గః ॥ కీర్తిశ్శోకోజయోవైరం ధనంనిర్ధనతాసుఖం । రోగశ్చేతి గృహారంభే ధ్వజాదీనాంఫలంక్రమాదితి ॥ అథదుష్టేపిసమయేవిశేషమాహ ॥ ధూమోగ్నేరితి ॥ అగ్నేర్గృహేధూమో ధూమాయఃప్రశస్తః- అంత్యజస్యశునకఃప్రశస్తః ఖగపస్యపక్షిపాలకస్యఉష్ట్రః ప్రశస్తఃఅట్టపల్యావేశ్యాయాఃగృహే ఖరఃఖరాయఃప్రశస్తః॥

—ఏవమాయపరత్వేన గృహముఖముక్త్వాధునా రాశిపర్వతేనాహ.—

మూ॥ ప్రాహుఃప్రాఙ్ముఖ మంత్యవృశ్చికకుళీ రాణాంప్రచేతో
ముఖం జూకోపాంత్యగవాంయ మాస్యమబలా యుగ్మ
ణకానాంహితం । సౌమ్యాస్యంగృహమాద్య సింహధను
షా మత్రేష్టకాష్ఠాననం కృత్వాప్రాన్యక కుబ్జవాక్షవద
నం తత్కార్యమాస్యంనసత్ ॥ ౯॥

టీక॥ అంత్యవృశ్చిక కుళీరాణామ్ = మీనవృశ్చిక కర్కటములకు. ప్రాఙ్ముఖమ్=ప్రాఙ్ముఖముకల. గృహమ్=గృహమును. ప్రాహుః=చెప్పుచున్నారు. జూకోపాంత్యగవామ్ = తులాకుంభవృషభములకు. ప్రచేతోముఖమ్=పశ్చిమద్వారముగల. గృహమ్=గృహమును. ప్రాహుః=చెప్పుచున్నారు. అబలాయుగ్మణకానామ్ = కన్యామిధునమకరములకు. యమాస్యమ్=దక్షిణద్వారముగల. గృహమ్=గృహమును. ప్రాహుః=చెప్పుచున్నారు. ఆద్యసింహధనుషామ్=మేషసింహధనుస్సులకు. సౌమ్యాస్యమ్=ఉత్తరముఖముకల. గృహమ్=గృహమును. ప్రాహుః = చెప్పుచున్నారు. అత్ర=ఈగృహద్వారపక్షములయందు. తత్=ఆగృహమును. ఇష్టకాష్ఠాననమ్=ఇష్టమయినదిక్కునందు ముఖముకలగృహములను. కృత్వా=చేసి. అప్రాన్యకకుబ్జవాక్షువదనమ్ = ఇష్టమైనయితరదిక్కునందు ద్వారముగలుగునట్లుగా. తత్=ఆగృహ... కార్యమ్=చేయదగినది. “ఆస్యంనసత్” అనువాక్యమునకు పైశ్లోకముతో నన్వయము.

తా॥ ఆయములకుదగినద్వారములు ఇదివఱకుఁజెప్పఁబడెనుకను



క ఇప్పుడు రాసులకుఁ దగినద్వారములను చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— మీనము వృశ్చికము కర్కటకము అనునట్టిరాసులకు తూర్పుద్వారముగలగృహము శ్రేష్ఠమైనది. తులాకుంభవృషభములకు పశ్చిమద్వారము శ్రేష్ఠమైనది. కన్యా మిథున మకరములకు దక్షిణద్వారము శ్రేష్ఠమైనది. మేష సింహ ధనుస్సులకు ఉత్తరద్వారము శ్రేష్ఠమైనది. మఱియును, ఈనాలుగువిధములలో ఏరాశికలగృహమునకు ఏద్వారము శ్రేష్ఠమైనదో తెలిసికొని తనకుఇష్టమైనదిక్కునందు ద్వారమునుబెట్టి గృహాన్యాక్త దిక్కునందు కిటకీలనునిర్మింపవలయును. సకలదిక్కులయందును ద్వారములను బెట్టుట యుచితముకాదు. “శ్లో॥ ద్వారంచతుర్విధంప్రోక్తం వాస్తుసంక్రాంతిభావజం । కృత్వాచాన్యతమంముఖ్యం గవాక్షాద్యైఃపరాణిచ ॥” ( = ద్వారములు వాస్తుసంక్రాంతిభావజన్యములని నాలుగువిధములుగాఁజెప్పఁబడినవి. ఈనాలుగువిధములగుద్వారములలో నేదోయొకద్వారమునుగల్పించి మిగిలినస్థలములయందు గవాక్షులనుంచవలయును.) అని వాస్తుశాస్త్రమునందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ ప్రాహురితి॥ అంత్యవృశ్చికకుళీరాణాం ప్రాఙ్ముఖంగృహంహితం ప్రాహుఃఅంత్యోమీనః - వృశ్చికఃప్రసిద్ధః - కుళీరఃకర్కటః- ఏషామిత్యర్థః - జూకోపాంత్యగవాం ప్రచేతోముఖంపశ్చిమాభిముఖం - జూకఃతులా - ఉపాంత్యఃకుంభః - గౌర్వృషః - ఏషామిత్యర్థః - అబలాయుగ్మణకానాం యమాస్యందక్షిణాముఖం - అబలాకన్యా - యుగ్మంమిథునంఏణోమకరః - ఏషామిత్యర్థః - ఆద్యసింహధనుషాం సౌమ్యాస్యం- ఆద్యోమేషః - సింహధనుషీప్రసిద్ధే ఏషాంసౌమ్యాస్యం ఉత్తరాముఖం గృహంహితంప్రాహురాచార్యాః - చతుర్ధాగృహముఖమభిధాయేదానీంతన్నిర్ణయమాహ ॥ అత్రేష్టకాష్ఠాననమితి ॥ గృహముఖపక్షేషు శోభావకాశానురూపం ఇష్టకాష్ఠాననం ఇష్టదిఙ్ముఖం కృత్వాతద్గృహంఅప్రాన్యకకుబ్జవాక్షువదనంకార్యం - అప్రాశ్చతాః అన్యకకుభశ్చతాసుగవాక్షాఏవ వదనానియస్యతత్తథా ఉర్వరితపక్షత్రయప్రాప్తదిక్షు గవాక్షాః కార్యాఇత్యర్థః ॥ తథాచవాస్తుశాస్త్రే ॥ శ్లో ॥ ద్వారంచతుర్విధంప్రోక్తం వాస్తుసంక్రాంతిభావజం । కృత్వాచాన్యతమంముఖ్యం గవాక్షాద్యైఃపరాణిచేతి॥

ఏవంగృహముఖనిర్ణయముక్త్వాధునా కోణాదివిద్ధముఖస్య దోషంతదపవాదంగ్రహనక్షత్రానయనంవ్యయానయనంచాహ.

మూ॥ కోణాధ్వభ్రమకూపకర్దమతరుర్ద్వాస్తంభదేవేక్షితంస
సద్మోచ్చ్యాద్ద్విగుణాధికాంతరభవే వేధేనదోషఃకిల। అష్ట
ఘ్నేగృహభూఫలేభవిహృతే శేషంగృహర్క్షంభవేదృ
క్షేసర్పహృతేవ్యయోగృహమసత్స్వల్పాయభూరి
వ్యయమ్॥ ౧౦॥

టీక॥ కోణాధ్వభ్రమకూపకర్దమతరుర్ద్వాస్తంభదేవేక్షితమ్ = భిత్తికోణము, మార్గము, తిరుగలిమొదలుగాగల తిరిగెడుయంత్రములు, కూపము, స్నానాదులవలన శాశ్వతముగనుండెడు బురద, వృక్షము, ద్వారము, స్తంభము, దేవత, అనువానిచేత వేధింపఁబడిన. ఆస్యమ్=గృహద్వారము. నసత్=యోగ్యమైనదికాదు. సద్మోచ్చ్యాద్ద్విగుణాధికాంతరభవే=గృహమునకుఁదగిన యౌన్నత్యముకంటె ద్విగుణాధికమయినయంతరమువలనఁగలిగిన. వేధే=వేధయందు. దోషః=దోషము. నకిల=లేదు. గృహభూఫలే=ఆయామవిశాలములను పెంచుటచేతనైనమొత్తము. అష్టఘ్నే=ఎనిమిదిచేతగుణింపఁబడినదై. భవిహృతేసతి=ఇరువదేడుచేత అపహరింపఁబడినదగుచుండఁగా. శేషమ్=మిగిలినది. గృహర్క్షమ్=గృహనక్షత్రము. భవేత్=అగును. ఋక్షే=గృహనక్షత్రము. సర్పహృతేసతి=ఎనిమిదిచేత అపహరింపఁబడినదగుచుండఁగా. శేషమ్=మిగిలినది. వ్యయః=వ్యయము. భవేత్=అగును. స్వల్పాయభూరివ్యయమ్=స్వల్పమైనయాయమును అధికమైనవ్యయమునుకల. గృహమ్=గృహము. అసత్=శ్రేష్ఠమైనది. భవేత్=అగును.

తా॥ ఇదివఱకుఁ జెప్పఁబడినశ్లోకముచేత గృహముఖనిర్ణయము చెప్పఁబడెనుగనుక ఇప్పుడుకోణాదులచేత వేధింపఁబడిన ద్వారమునకు దోషమును దోషాపవాదమును గృహనక్షత్రానయనమును, వ్యయానయనమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—గోడయొక్క-కోణము, మార్గము, తిరుగలిమొదలుగాఁగల తిరిగెడుయంత్రము, కూపము, స్నానాదులను జేయుటచేత స్థిరముగాఁగలిగియున్న బురద వృక్షము, ద్వారము, స్తంభము, దేవస్థానము, అనువానిచేత వేధింపఁబడిన గృహద్వారము అశుభములనుగలిగించును. గృహమునకు ఉచితమైనదానికంటె ద్విగుణాధికమైన యంతరమునందుఁగలిగిన వేధయందు దోషమేదియును లేదని



యెఱుఁగవలయును. "శ్లో॥ మార్గతరుకోణకూప భ్రమవిద్ధమశుభదం ద్వారం। సదోచ్ఛ్రియాద్ద్విగుణాంత్యక్త్వాభూమింనదోషాయ" (=మార్గము, వృక్షము, కోణము, కూపము, భ్రమచక్రాదులు, వీనిచేత విద్ధమైనద్వారము అమంగళములను గలిగించును. గృహముయొక్క యున్నతమైనదానికంటె ద్విగుణమును విడిచిపెట్టినయెడల దోషములేదు.) అని కాత్యాయన గృహ్యకారికయందుఁగూడఁ జెప్పఁబడియె. మఱియును, గృహభూమియొక్క ఆయామ విశాలములను పెంచిన మొత్తమును ఎనిమిదిచేతగుణించి యిరువదేడుచేత భాగింపఁగా మిగిలినది గృహనక్షత్రమగుననియును, ఆనక్షత్రమును ఎనిమిదిచేత భాగింపఁగా మిగిలిన సంఖ్య వ్యయమనియును, ఆయముకంటె వ్యయము అధికముగానున్న యెడల శుభములు కలుగుననియును, తెలియవలయును.

వ్యా॥ కోణేతి॥ ఆస్యమితి॥ ఆస్యంగృహస్యముఖం కోణస్తంభాదిభిర్విద్ధంనస్యాత్ కోణోభిత్తికోణః - అధ్వామార్గః - భ్రమోభ్రమయంత్రం-ఘరట్టకులాలచక్రాది - కూపఃప్రసిద్ధః- కర్దమఃస్నానాదిజనితో నిరంతరస్థాయీ-తరుర్వృక్షః - ద్వాఃద్వారాంతరం - స్తంభఃప్రసిద్ధః దేవస్థాపరపభిర్విద్ధంముఖం నసత్స్యాదిత్యర్థః అథాస్యాపవాదమాహ॥ సద్మోచ్చ్యేతి॥ సద్మోచ్చ్య ద్విగుణాధికాంతరభవే వేధేనదోషః సద్మనోగృహస్య ఔచ్చ్యంతస్యాపేక్షయా ద్విగుణాధి కాంతరభవే ద్విగుణాధికాంతరేజాతేవేధేకోణాదివేధేనదోషః అర్థాన్న్యూనేదోషః కిలేత్యాగమే నిశ్చయేవాతథాచాగమాంతరే ఉక్తంమార్గతరుకోణకూప భ్రమవిద్ధమశుభదంద్వారం సదోచ్ఛ్రియా ద్ద్విగుణాంత్యక్త్వా భూమిం నదోషాయేతి కాత్యాయన గృహ్యకారికాయామప్యుక్తం॥ విద్ధంకూపతరుస్తంభపథపంకైస్సదైవతైః। తద్ద్వారమశుభంప్రోక్తమత్యుచ్ఛ్రంనీచమేవచేతి॥ అథగ్రహనక్షత్రానయనం వ్యయానయనంచాహ॥ అష్టఘ్నఇతి॥ గృహభూఫలేగృహక్షేత్రఫలే అష్టఘ్నేఅష్టగుణితే భవిహృతే సప్తవింశతిహృతేసతి శేషంగృహర్క్షం గృహనక్షత్రంభవేత్ ఋక్షేసర్పహృతే అష్టహృతేసతిశేషం వ్యయోభవేత్. ఏవమాయవ్యయావభిధాయాధునా తత్ఫలం విశేషణద్వారాహ॥ గృహమసదితి॥ స్వల్పాయభూరివ్యయం గృహమసత్-అశుభంస్యాత్ - స్వల్పాయశ్చ భూరివ్యయశ్చతౌ యస్మింస్తత్తథా అర్థాద్బహ్వాయాల్పవ్యయం శుభం॥



(*) అథ నక్షత్రేజ్ఞాతే రాశినిర్ణయమాహ. (*)

మూ॥ మేషేశ్విత్రితయంహరౌత్రిపిత్రృభం మూలత్రయంధన్విని
ద్వేద్వేభే పరతోగృహేశ ఘటితం ప్రాగ్వత్తు నాడ్యన్య
థా। ఏకాది ద్విగుణోత్తరాగృహ ముఖా ద్దిక్ష్వంకకా
స్స్యుఃక్రమాచ్ఛాలాశాంక యుతిఃకయుగ్ ధ్రువముఖా
న్యోకాంసిసంతిస్ఫుటమ్॥ ౧౧॥

టీ॥ అశ్విత్రితయమ్=అశ్వినీనక్షత్రము మొదలుకొని మూడునక్షత్రములు, మేషే=మేషమునందు, జ్ఞేయమ్ = తెలియఁదగినది, త్రిపిత్రృభమ్ = మఖానక్షత్రముమొదలుకొని మూడునక్షత్రములు మూడును, హరౌ= సింహమునందు, జ్ఞేయమ్=తెలియఁదగినది, మూలత్రితయం=మూలానక్షత్రముమొదలుకొని మూడునక్షత్రములను, ధన్విని=ధనుస్సునందు, జ్ఞేయం= తెలియఁదగినది, పరతః=ఇతరరాసులయందు, ద్వేద్వే = రెండురెండు, భే=నక్షత్రములు, జ్ఞేయే=తెలియఁదగినవి, గృహేశఘటితం = గృహమునకును గృహస్వామికిని సంయోగము, ప్రాగ్వత్ = వివాహమునందువలెనే, యోజ్యం=యోజనచేయఁదగినది, నాడీతు=నాడియన్ననో, అన్యథా= వివాహమునందుకంటె వ్యతిరిక్తముగా, జ్ఞేయా=తెలియఁదగినది, గృహముఖాత్=గృహముఖముమొదలుకొని, ఏకాదిద్విగుణోత్తరా = ఒకటిమొదలుకొని ద్విగుణాధికములయిన, అంకకాః=అంకములు, క్రమాత్ = క్రమముగా, దిక్షు=ఎనిమిదిదిక్కులయందును, స్యుః = అగుచున్నవి. శాలాంకయుతిః = శాలయొక్కయును దిగంకములయొక్కయును సంయోగము, కయుక్=ఏకయుక్తమైనదగుచు, ధ్రువముఖాని=ధ్రువకముమొదలుగాఁగల, ఓకాంసి=గృహములు, స్ఫుటం = స్ఫుటముగా, సంతి = అగుచున్నవి.

తా॥ నక్షత్రమును తెలియఁబఱచుచు రాశినిర్ణయమును జెప్పుచున్నాఁడు. ఎట్లనఁగా:—అశ్విని మొదలుగాఁగల మూడునక్షత్రములను మేషమునందుఁదెలియవలయును. మఖానక్షత్రము మొదలుకొని మూడునక్షత్రములను సింహమునందుఁ దెలిసికొనవలయును. మూలానక్షత్రము మొదలుకొని మూఁడునక్షత్రములను ధనుస్సునందుఁ దెలిసికొనవలయును. ఇతరరాసులయందు రెండేసినక్షత్రములను దెలిసికొనవలయును. మఱియును, గృహమునకును గృహస్వామికిని సంయోగమును వివాహమునందువలెనే దెలిసికొనవలయును. మఱియును, నాడిని మాత్రము వేఱు



విధముగాఁజూడవలయును. "శ్లో॥ అశ్విన్యాదిత్రయంమేషే సింహే ప్రోక్తంమఖాత్రయం। మూలాదిత్రితయంచాపే శేషభేషు ద్వయంద్వయం" (=అశ్వినీ నక్షత్రము మొదలుకొని మూడునక్షత్రములను మేషమునందును, మఖానక్షత్రము మొదలుకొని మూడునక్షత్రములను సింహమునందును, మూలానక్షత్రము మొదలుకొని మూడునక్షత్రములను ధనుస్సునందును, ఇతరములగు రాసులయందు రెండేసినక్షత్రములను దెలిసికొనవలయును.) అని గర్గమునివరుఁడు చెప్పె. శ్లో॥ "ప్రభుంపణ్యాంగనాం మిత్రం దేశంగ్రామంపురంగృహం। ఏకనాడీస్థితంభవ్యం విరుద్ధంవేధవర్జితం॥" (=ప్రభువు, వేశ్యాంగన, మిత్రుఁడు, దేశము, గ్రామము, పట్టణము, గృహము, అనునవి యేకనాడియందుండెనేని శుభము కలుగును.) అని వృద్ధగర్గుఁడు చెప్పె. "శ్లో॥ సేవ్యసేవకయోశ్చైవ గృహతత్స్వామినోరపి। పరస్పరంమిత్రయోశ్చ ఏకనాడీప్రశస్యతే" (=సేవ్యసేవకులకును, గృహమునకును గృహయజమానునకును, మిత్రులకును, పరస్పరమును ఏకనాడి ప్రశస్తమైనది.) అని జ్యోతిస్సాగరమందుఁ జెప్పఁబడెను. ఇఁకను అంశసాధనము కొఱకు గృహములను తన్నామాక్షరసంఖ్యను జెప్పుచున్నాఁడు. ఎట్లనఁగా:—క్రమముగా గృహద్వారము మొదలుకొని ప్రదక్షిణక్రమముచేత నాలుగు దిక్కులయందును ఒకటిమొదలుకొని ద్విగుణాధికముగ అంకములగును. అనఁగా ద్వారముగలదిక్కునం దొకటియనియును, రెండవదిక్కునందు రెండనియును, మూడవదిక్కునందు నాలుగనియును, నాల్గవదిక్కునందు ఎనిమిదనియును, తెలియవలయును. మఱియును, శాలాదిగంకయోగము ఒక్కదానితోఁగూడుకొన్నదగుచు ధ్రువాదికములును శాస్త్రోక్తములయిన గృహములు స్ఫుటముగా అగుచున్నవి. "శ్లో॥ ధ్రువంధన్యంజయంనందం ఖరంకాంతంమనోరమం। సుముఖందుర్ముఖంక్రూరం సుపక్షంధనదంక్షయం। ఆక్రందంవిపులంచైవ విజయంచేతిషోడశం॥" (=ధ్రువము, ధన్యము, జయము, నందము, ఖరము, కాంతము, మనోరమము, సుముఖము, దుర్ముఖము, క్రూరము, సుపక్షము, ధనదము, క్షయము, ఆక్రందము, విపులము, విజయము, అని ధ్రువకములు పదునాఱు స్మృతియందుఁ జెప్పఁబడెను.)

వ్యా॥ మేషేతి॥ అశ్విత్రితయం మేషే జ్ఞేయం త్రిపిత్రృభంమఘాత్రయంహరౌసింహేజ్ఞేయం మూలత్రయం ధనుషిజ్ఞేయం అన్యేషు రాశిషు ద్వేద్వేభేజ్ఞేయే॥ తథాచగర్గః॥ శ్లో॥ అశ్విన్యాదిత్రయంమేషే సింహేప్రో

క్త్రంమఘాత్రయం । మూలాదిత్రితయంచాపి శేషభేషుద్వయద్వయమితి॥ అథగృహతత్స్వామినోర్ఘటితమాహ। గృహేశేతి॥ గృహంప్రసిద్ధంఈశః స్వామీతయోర్ఘటితం పాణిగ్రహవివాహవత్ యోజ్యంతత్ర విశేషమాహ॥ నాడ్యన్యథేతి నాడీ అన్యథాయోజ్యావివాహవత్ నయోజ్యేత్యర్థః- అత్రఏకనాడ్యేవప్రశస్తేతిభావః - తథాచవృద్ధగర్గః॥ శ్లో॥ ప్రభుఃపణ్యాంగనాంమిత్రందేశగ్రామంపురంగృహం। ఏకనాడీస్థితంభవ్యం విరుద్ధంవేధవర్జితమితి ॥ తథాచజ్యోతిస్సాగరే॥ సేవ్యసేవకయోశ్చైవ గృహతత్స్వామినోరపి । పరస్పరంమిత్రయోశ్చ ఏకనాడీప్రశస్యతఇతి॥ అథాంశసాధనార్థం గృహాణితన్నామాక్షర సంఖ్యాంచాహ॥ ఏకాదితి॥ గృహముఖాత్సకాశాత్ - క్రమాత్ప్రదక్షిణక్రమాత్ - దిక్షుచతసృషుదిక్షు - ఏకాదిద్విగుణోత్తరా అంకాస్స్యుః - ఏతదుక్తంభవతి॥ ద్వారదిశిఏకః- తస్మాద్ద్వితీయదిశిద్వౌ - తృతీయదిశిచత్వారః చతుర్థదిశి-అష్టౌ ఏవంభవంతీత్యర్థః - శాలాశాంకయుతిః - శాలాదిగంకయోగః - ఏకయుక్తాస్సన్తః ధ్రువముఖాని - ధ్రువాదీకాని - శాస్త్రోదితాని - గృహాణిస్ఫుటంసంభవంతి - తానియథా ॥ శ్లో ॥ ధ్రువంధన్యంజయం నందంఖరం కాంతం మనోరమం । సుముఖందుర్ముఖంక్రూరం సుపక్షంధనదంక్షయం । ఆక్రందంవిపులంచైవ విజయంచేతిషోడశమితి॥

—(*) అథనామాక్షర సంఖ్యాఆహ. (*)—

మూ॥ అషష్ఠాద్దశమంత్రయోదశమిమే ద్వ్యర్ణాఃపరేత్ర్యక్షరా
షష్ఠాంత్యం చతురక్షరం ఖలుగృహం స్యుష్షోడశైవంగృహాః । గేహక్షేత్రఫలయుగ్వ్యయోగృహభవైర్నామాక్షరైస్సంయుతస్స్యాత్ఛిష్టోవహ్నిభిరంశకానశుభదం గేహంద్వితీయాంశకమ్॥ ౧౨॥

టీక॥ అషష్ఠాత్=ఆఱవఱకును. దశమమ్=పదియవదియును. త్రయోదశమ్=పదుమూడవదియును. (అనునట్టి) ఇమే=ఈయెనిమిదియును. ద్వ్యర్ణాః=రెండక్షరములుగలవి. షష్ఠ్యాంత్యమ్=ఏడవది. చతురక్షరమ్=నాలుగక్షరములుగల. గృహంఖలు=గృహముకదా! పరే=ఇతరమైనవి. త్ర్యక్షరాః=మూడక్షరములుగలవి. ఏవమ్=ఈవిధముగా. గృహాః=గృహములు. షోడశ=పదునారు. గేహక్షేత్రఫలయుక్=గృహక్షేత్రఫలముతోఁగూడిన. వ్యయః=వ్యయము. గృహభవైః=గృహమువలనఁబుట్టిన. నామాక్షరైః=నామాక్షరములతో. సంయుతః=కూడినదై. వహ్నిభిః=మూటిచేత. తష్టస్సన్=హరింపఁబడినదగుచు. శేషః=మిగిలినది. అంశకాః=అంశలు. స్యుః=అగును. ద్వితీయాంశకమ్=రెండవయంశముకల. గేహమ్=గృహము. శుభదమ్=శుభమునుగలుగఁజేయునట్టిది. న=కాదు.



తా॥ ఇఁకను నామాక్షరసంఖ్యను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— ఒకటి రెండు మూడు నాలుగు అయిదు ఆఱు పది పదిమూఁడు అనుసంఖ్యలుగలగృహములు రెండక్షరములుగలవి. ఏడవసంఖ్యకల్గది నాలుగక్షరములుగలది. ఇతరసంఖ్యలుగలగృహములు మూడక్షరములుగలవి. ఇవ్విధముగగృహములు పదునాఱువిధములైనవని యెఱుఁగవలయును: మఱియును, పూర్వమునందుఁజెప్పఁబడిన వ్యయసంఖ్యను గృహక్షేత్రఫలముతోఁజేర్చి గృహభవములగు నామాక్షరములతోఁజేర్చి మూటిచేతఅపహరింపఁబడఁగా మిగిలినసంఖ్యలు అంశలుఅగును. ఆమిగిలినమూఁడును ఇంద్రుఁడు యముఁడు రాజు అనునామములు గలవికావున ఆమూటిలో రెండవది శుభకరమైనదికాదని యెఱుఁగవలయును.

వ్యా॥ అషష్ఠాదితి॥ షష్ఠంమర్యాదీకృత్యేత్యాషష్ఠం - తస్మాత్ప్రథమద్వితీయతృతీయే - చతుర్థపంచమషష్ఠాని - దశమంత్రయోదశం- ఇమే అష్టగృహాత్ ద్వ్యర్ణాః - ద్వ్యక్షరాః - షష్ఠాంత్యంసప్తమం - గృహంచతురక్షరంచ - చత్వారిఅక్షరాణియస్మిం స్తత్తథాఅన్యేగృహాః - త్ర్యక్షరాః - ఏవంషోడశగృహాస్స్యుః ॥ ని ॥ గృహాఃపుంసిచభూమ్న్యేవనికాయ్యనిలయాలయాఇత్యమరః - అథాంశకసాధనమాహ ॥ గేహక్షేత్రేతి॥ గేహక్షేత్రఫలయుగ్వ్యయః - గృహక్షేత్రఫలయుక్తః - పూర్వానీతోవ్యయః - గృహభవైర్నామాక్షరైః సంయుతః - వహ్నిభిస్త్రిభిస్తష్టః - శేషితస్సన్ - అంశకాస్స్యుః - ఇంద్రోయమోరాజేతి తన్నామానిగ్రంథాన్తరేఉక్తాని - తత్రద్వితీయాంశకంవస్త్యం గృహంనశుభదం - అర్థాత్ప్రథమతృతీయాంశకం శుభదమిత్యర్థః ॥ ని ॥ నిశాంతవస్త్యసదన భవనాగారమందిరమిత్యమరః॥

—(*) అథగుణవిచార్యావధిముపాయాంతరసూచనాంచాహ. (*)—

మూ॥ యావన్మూరిగుణంహృది స్ఫురతితత్తావద్విచార్యంకశైశ్చైత్రైరోన్నతను యాదిహాంగుళముఖ్యం త్యక్త్వావిహాయాథవా । శ్రీగోపీపతిమంగళాలుగిముఖై రాయాసవిచ్ఛిత్తయే స్వేష్టాయర్క్ష ఫలంనిబద్ధమిహాతజ్జ్ఞాత్వాస్థలంసాధయేత్॥ ౧౩॥

టీక॥ యావత్-ఎంతపర్యంతము. కరైః=హస్తములచేత. (గృహమ్=గృహము) భూరిగుణమ్=అనేకగుణములుగలదై. హృది=హృదయమునందు. స్ఫురతి=స్ఫురించుచున్నదో. తావత్=అంతపర్యంతమును. విచార్యం=విచారింపదగినది. తైః=ఆహస్తములచేత భూరిగుణం=అనేకగుణములుగలదై. హృది=హృదయమునందు నస్ఫురతిచేత్=స్ఫురింపకపోయినయెడల. తదా=అప్పుడు. ఇహ=ఈహస్తములయందు. అంగుళముఖం=అంగుళాదికమును. క్షిప్త్వా=ఉంచి. అథవా=ఇట్లుకాదేని. విహాయ=త్రోసివేసి. తనుయాత్=చేయవలయును. శ్రీగోపీపతి మేంగహాలుగిముఖ్యైః=సంపత్కరులయిన గోపీపత్యాచార్యుడు, మేంగనాథదైవజ్ఞుడు, హాలుగిదైవజ్ఞుడు అనువారిచేత. ఆయాసవిచ్ఛిత్తయే=ఆయాసముపోవుటకొఱకు. స్వేష్టార్థ ఫలం=తనకుఇష్టమైన యాయముయొక్కయును, నక్షత్రముయొక్కయును ఫలముకలుగునట్లుగా. నిబద్ధం=కూర్పబడినదో. తత్=దానిని. ఇహ=ఈవిషయమునందు జ్ఞాత్వా=తెలిసికొని స్థలం=స్థలమును. సాధయేత్=సాధింపవలయును.

తా॥ ఇంకను గుణవిచారణకలుగుటకును ఉపాయాంతరమును చెప్పుచున్నాడు. ఎట్లనిన:—హస్తములచేత ఎంతపర్యంతము గృహము అనేకగుణములుగలదియగునో యంతవఱకును విచారించి మనోహరమగుటకు అంగుళములు మొదలగువానిని చేర్చినైనను త్రోసివేసినైనను స్థలమును సాధించుకొనవలయును. మఱియును, ఇష్టమగుఫలముకలుగుటకొఱకు శ్రీగోపీపత్యాచార్యుడు, మేంగనాథదైవజ్ఞుడు, హాలుగిదైవజ్ఞుడు, మొదలగువారు చెప్పినవిషయమును తెలిసికొని స్థలమును సాధింపవలయును.

వ్యా॥ యావదితి॥ యావత్పర్యంతం- కరైః-హస్తైః- కృత్వాభూరిగుణం- బహుగుణగృహం- హృది - అంతఃకరణేస్ఫురతి- తత్తావద్విచార్యంచేద్యది- తైః- కేవలైః- హస్తైః- కృత్వాబహుగుణంనస్ఫురతి- తదా- అంగులముఖం- అంగులాదికం- కరేషుక్షిప్త్వా - అథవావిహాయతమయాత్- కుర్యాత్ ॥ అథోపాయాంతర సూచనామాహ ॥ శ్రీగోపీపతీతి ॥ గోపీపతిః- గోపీరాజః- మేంగః- మేంగనాథదైవజ్ఞః- హాలుగిర్హాలుగిదైవజ్ఞః- ఏతన్ముఖ్యైర్జ్యోతిర్విద్భిః- ఆయాసవిచ్ఛిత్తయే- యత్స్వేష్టాయర్క్షం- ఫలం- నిబద్ధం- తదిహాస్మిన్గృహకరణవిషయే - జ్ఞాత్వాస్థలంస్వాభీష్టస్థలంసాధయేత్ ॥ తథాచగోపీరాజః ॥ శ్లో ॥ విష్ణుంవ్యేకాయగోభూ-



౧౯- హతిభయుజిఫలంగోపిరాజోభ- ౨౭ - శేషాత్సాయంచేష్టాప్తిదృఘ్నా౽౨౧౬- యుతసహి-౮- హతాదృక్-౨- ప్రకృత్యాఖ్య-౨౧-విశ్వే-౧౩ ॥ బాణా-౫-స్సిద్ధా-౨౪- ష్టి- నాగో-౮- ద్వా-౨౭- ధృతి-౧౯- గిరీశ౧౧- త్ర్యా-౩- కృతిం-౨౨- ద్ర-౧౪- ర్తు-౬- తత్త్వా-౨౫- త్యష్ట్య-౧౭-౦క-౯- త్న్యా-౧- సఖే-౨౦- నా-౧౨- ర్ణవ-౪- వికృతి-౨౩ - దినా-౧౫-ద్ర్య-౭- తత్కృతి-౨౬- ర్ధృత్య-౧౮- ధారా-౧౦ ॥ ఇతి ॥ అస్యార్థః- గోపిరాజః- విష్ణుం- విష్ణునామానం- శిష్యంప్రత్యాహేత్యన్వయః- కిమహ॥ హేవిష్ణో- వ్యేకాయగోభూ-౧౯- హతి- భయుజిభ-౨౭- శేషాత్- అహి-౮- హతాదృక్ప్రకృత్యాదయః - ఫలంస్యాత్- విగతఃఏకోయస్మాత్సవ్యేకఃసచాసౌ ఆయశ్చవ్యేకాయః వ్యేకాయశ్చగోభూశ్చ అనయోర్హతిః- గుణనం- వ్యేకాయగోభూహతిశ్చభంచ వ్యేకాయగోభూహతిభే- తయోర్యుక్ యోగః- తస్యాంభశేషాత్సప్తవింశతిహృచ్ఛేషాత్ ఏకాది మసప్తవింశతిపర్యంతేషు- అహిహతాః- అష్టహతాః - దృక్ప్రకృత్యాదయః- ఫలంక్షేత్రఫలంస్యాదిత్యర్థః- కథంభూతంఫలం- సాయం- ఇష్టాయసహితమిత్యర్థః- ఏతత్స్వేష్టాయానక్షత్రజంఫలంభవతి ॥ న్యాసః- వా ఇత్యథవా- తత్సాయంఫలం- ఇష్టాప్తిదృ౧౨౧౬- ఘ్నాన్యయుతేసత్ఫలంస్యాత్- ఇష్టశ్చ- అప్తిదృక్చ ఇష్టాప్తిదృక్ తయోర్ఘ్నిఘ్నహతిస్తయాయుతమిత్యర్థః ఇదమపిస్వేష్టాయ నక్షత్రజంఫలంభవతీతి ॥ అత్రాంకన్యాసఏవవ్యాఖ్యానం- తథాచమేంగనాథదైవజ్ఞస్యసూత్రం ॥ ఇష్టభాత్యష్టిఘాతేయఆయస్తేనోనితేష్టకః । త్రిహృల్లబ్ధహతాగాశ్వి-౨౭- యుతేచేష్టాయభంభవేదితి ॥ అస్యార్థఃఇష్టభాత్యష్టిఘాతే - ఇష్టభంచ- అత్యష్టిశ్చతయోర్ఘాతో గుణనంతస్మిన్పృథక్సాపితే యఆయస్తేనఊనితేష్టకః- ౧౧ ఊనోనభవతి- తదాష్టాప్రక్షేప్యస్స్ఫోటనీయః- ఊనితేష్టాయః- త్రిహృల్లబ్ధహృతాగాశ్వియుతే- లబ్ధేనఆహతాశ్చతే - అగాశ్వినశ్చ - తైఃపృథక్- స్థాపితే- ఇష్టభాత్యష్టిఘాతేయుతేసతి- ఇష్టాయభంక్షేత్రఫలంభవేత్- ఆయశ్చభంచఆయభేక్షష్టే ఆయభేయస్మింస్తత్తథా- అత్రయద్విభిర్నిశ్శేషోభాగోనగచ్ఛతి- తదాతత్రతావత్- అష్టాక్షేప్యః - యావత్త్రిభిర్భాగోగచ్ఛతి- తథాచహాలుగిదైవజ్ఞస్యసూత్రం - వ్యేకేష్టగ్నహతాద్విబాణశశినో-౧౫౨- త్యష్ట్యాయుతా-౧౭- స్తేపిచవ్యేకేష్టాయహతైకనాగ-౮౧-సహితాష్టఘ్నాగ్నినాభి-౨౧౬- ర్హృతాః । శేషంక్షేత్రఫలంభవేదభిమతస్వేష్టాయనక్షత్రజం స్యాచ్ఛేదఘ్నయంతదభీష్టవిస్తృతిహృతం దైర్ఘ్య

ధృతంవిస్తృతిరితి ॥ స్పష్టార్థోయంశ్లోకః ఇత్యావిచారణయాఇష్టంక్షేత్రఫలంఅవకాశానురూపం ప్రాదిధృత్వాస్థలంసాధయే దిత్యర్థః॥

—{ అథ స్థలసాధనాయ సూత్రమోటనలక్షణం స్థలసాధనం అన్యకోణ ద్వయసాధనంచాహ. }—

మూ॥ ద్విఘ్నాయామమితంద్విపాశి మజరత్సూత్రం విధాయాం
కయే త్త్ర్యాయామాంఘ్రిమితేచవిస్తృతిదళేతౌకర్ణకో
ణాభిధౌ । పాశౌక్షేత్రవిరామశంకు నిహితౌకృత్వాద్య
మాకర్షయే త్కోణేశంకు రితీతరో౽వినిమయాద్రజ్వంత
యోశ్చాపరౌ॥ ౧౪॥

టీక॥ అజరత్సూత్రం = నూతనసూత్రమును, ద్విఘ్నాయామమితం= రెంటిచేతc బెంచcబడిన గృహాయామముయొక్క పరిమితికలదానినిగాను, ద్విపాశి= రెండుముడ్లుకలదానినిగాను, విధాయ= చేసి, త్ర్యాయామాంఘ్రిమితే = గృహాయామముయొక్క మూడవ భాగమునందు, విస్తృతిదళే = గృహవిస్తారముయొక్క సగమునందును, అంకయేత్ = చిహ్నము చేయవలయును. తౌ = ఆరెండుగుర్తులును, కర్ణకోణాభిధౌ = కర్ణకోణములను నామధేయములుగలవి. స్యాతాం = అగును. పాశౌ= పాశములను, క్షేత్రవిరామ శంకునిహితౌ = క్షేత్రవిరామమునందలి శంకువునందుంచcబడినవానినిగా. కృత్వా= చేసి. ఆద్యం= మొదటిదానిని, ఆకర్షయేత్= ఆకర్షింపవలయును. కోణే= కోణమునందు. ఇతరః= ఇతరమైన. శంకుః= శంకువు. ఇతి= ఇట్లని. జ్ఞేయం= తెలియcదగినది. వినిమయాత్= వ్యత్యయమువలన. రజ్వంతయోః = రజ్జువుయొక్క అంతములయందు. అపరౌ= ఇతరమైనవని. జ్ఞేయౌ= తెలియcదగినవి.

తా॥ ఇతరకోణద్వయసాధనమును చెప్పుచున్నాcడు. ఎట్లనిన:— నూతనసూత్రమును గృహాయామమునకు రెట్టింతలుగాను రెండుముడ్లుగలదానినిగానుజేసి గృహాయామముయొక్క మూడవభాగమునందును గృహాయామముయొక్క అర్థభాగమునందును గుర్తులుపెట్టవలయును. ఆగుర్తుల రెంటిలో మొదటిదికర్ణమనియును, రెండవదికోణమనియును, చెప్పcబడును. మఱియును, పాశములను క్షేత్రవిరామమునందలి శంకువునందుంచcబడినవానినిగాcజేసి మొదటిదానిని ఈడ్వవలయును. రెండవదికోణమునందలి శంకువునందుంచవలయును. మరలవానినే తల్లక్రిందుగాcజేసినయెడల ఇతరకోణములగును.



వ్యా॥ ద్విఘ్నేతి॥ అజరత్సూత్రం నూతనసూత్రం ద్విఘ్నాయామమితంద్విపాశం చవిధాయఅంతాత్- ఏకస్మాత్సూత్రాన్తాత్ - అంకయేదిత్యన్వయః - ద్విఘ్నశ్చాసౌఆయామశ్చద్విఘ్నాయామః - ఆయామోదైర్ఘ్యంతేనమితం - ద్విగుణితదైర్ఘ్యం - సమానమిత్యర్థః - ద్విపాశంద్వౌపాశౌయస్మిన్ తత్- ద్విపాశం - ఏవంవిధంసూత్రం - విధాయకృత్వా- అంతాత్- సకాశాత్- అంకయేత్- చిహ్నయేత్- ఎతదుక్తంభవతి పూర్వకల్పితక్షేత్రస్య దైర్ఘ్యమితం సూత్రంద్విగుణం విధాయతదంతయోః- పాశౌకృత్వా- అంకయేత్- కుత్రకుత్రాంకయేదిత్యాహ ఆయామాంఘ్రిమితేచపరం విస్తృతిదళేఅంకయేత్- త్రయశ్చతేఆయామాంఘ్రయశ్చతేతథాత్రైస్మితంతస్మిన్- ఎతదుక్తంభవతి ॥ క్షేత్రదైర్ఘ్యంచతుర్భిర్భక్త్వా- లబ్ధంఅంఘ్రిప్రమాణం- ఎకస్మాదంతాత్ - అంఘ్రిత్రయంహిత్వాచిహ్నయేత్- తస్మాదేవాంతాత్ - విస్తృతిదళే- క్షేత్రస్యవిస్తారార్థమితే- అంకయేత్- తౌఅంకౌ- కర్ణకోణాభిధౌస్తః- అంఘ్రిత్రయేకృతః- కర్ణాఖ్యః- విస్తృతిదళేకృతోంకః - కోణాఖ్యః - ఎవంసూత్రమోటనముక్త్వా- స్థలసాధనమాహ ॥ పాశావితి ॥ పాశౌ - క్షేత్రవిరామశంకు నిహితౌ కృత్వా- ఆద్యంఅంకంఆకర్షయేదిత్యన్వయః- క్షేత్రస్యవిరామౌ- అంతౌ- తయోః- శంకుంనిఖాతయోశ్శంక్వోః- మోటితసూత్రాన్తపాశౌనిధాయ- కర్ణాఖ్యంచిహ్నంధృత్వా- ఎకస్యాందిశిఆకర్షయేత్ యథోభయశంకుగతారజ్జుసమానాఆకృష్టాస్యాత్ - తథాఆకర్షయేదిత్యర్థః- కోణేశంకురితి- కోణే- కోణచిహ్నేయత్రకోణచిహ్నమాగతం- తత్రభువిశంకుంనిఖాయ- ఇత్యధ్యాహారః- ఇత్యమునాప్రకారేణఇతరః- శంకుర్నిఖేయః- ఎతదుక్తంభవతి ॥ తదేవకర్షచిహ్నం- అన్యస్యాందిశి - ఆకృష్యకోణేశంకుర్నిఖేయః- ఎవంకోణద్వయసాధనమభిధాయ అన్యకోణద్వయసాధనమాహ ॥ వినియమాదితి ॥ రజ్వంతయోర్వినియమా ద్విపరీతధారణాత్ -అపరౌకోణశంకూనిఖేయౌ ॥ ఏతదుక్తంభవతి ॥ రజ్వంతౌవిపరీతౌ ధృత్వా పూర్వవత్ కర్షాకర్షణంకృత్వాకోణయోః- శంకూనిఖేయౌ॥

———(*) ఏవంక్షేత్రసాధనముక్త్వాసూత్రన్యాసమాహ. (*)———

మూ॥ ఆగ్నేయాదిదృఢంప్రదక్షిణగతం సూత్రంసమాసాదయే
న్మస్త్యేవామక పార్శ్వసుప్తపురుషం ధ్యాత్వాత ముత్తా
నకం । అష్టాశ్వం ౨౮ శమగేందు ౧౭ సమ్మితలవా న్యూ
చ్ఛాస్త్వహాయాగ్రగో భాగోనాభిరథంఖనేల్లపమితం వా

మశ్మభిఃపూరయేత్॥ ౧౫॥

టీక॥ దృఢమ్=దృఢముగా. ఆగ్నేయాది = ఆగ్నేయదిక్కు మొదలుకొని. ప్రదక్షిణగతమ్ ప్రదక్షిణముగాపొందునట్లుగా. సూత్రమ్=సూత్రమును. సమాసాదయేత్=పట్టవలయును. మధ్యే=క్షేత్రమధ్యమందు. వామకపార్శ్వసుప్తపురుషమ్ = వామపార్శ్వముగనిద్రించియున్నపురుషుండగు. తమ్=ఆవాస్తుపురుషుని. ఉత్తానకమ్ = నిద్రనుండి లేచినవానినిగా. ధ్యాత్వా=ధ్యానముచేసి. తమ్=కృకలాసరూపుఁడైన యావాస్తుపురుషుని. అష్టాశ్వ్యంశమ్=ఇరువదెనిమిది భాగములుగలవానినిగా. (ప్రకల్ప్య=కల్పించి.) పుచ్ఛాత్=పుచ్ఛభాగము మొదలుకొని. అగేందుసమ్మితలవాన్=పదునేడుభాగములను. విహాయ=విడిచి. అగ్రగః=ముందరపొందిన. భాగః=భాగము. నాభిః=నాభి. స్యాత్=అగును. ఇతః=ఈనాభికి. వామే=వామభాగమునందు. లవమితమ్=భాగపరిమాణమును. ఖనేత్=త్రవ్వవలయును. (తతః=పిమ్మట) అశ్మభిః=పాషాణములచేత. పూరయేత్=నిండింపవలయును.

తా॥ ఇదివఱకు క్షేత్రసాధనము చెప్పఁబడెనుకనుక ఇప్పుడుసూత్రన్యాసక్రమము చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఆగ్నేయదిక్కు మొదలుకొనిప్రదక్షిణక్రమముగ సూత్రమునుబట్టికొలవవలయును. క్షేత్రమధ్యమందు వామభాగమునశయనించి యిదివఱకుఁ జెప్పఁబడినదిక్కునందు శిరస్సునుబెట్టుకొనినిద్రించుచున్న వాస్తుపురుషునిలేచినవానినిగా ధ్యానముచేయవలయును. అట్లునిద్రించుచున్నవాఁడునుకృకలాసరూపుఁడును అయినవాస్తుపురుషుని ఇరువదెనిమిదిభాగములుగాభావించి పుచ్ఛముమొదలుకొని పదునేడుభాగములనువిడిచిపెట్టి యగ్రభాగమునందలిభాగము నాభిదేశమని యెఱుఁగవలయును. అంతటఈనాభికి వామభాగమునందొకభాగమంతనేలనుత్రవ్వి రాళ్ళచేతపూడ్చవలయును. "శ్లో॥ సూత్రభిత్తిశిలాన్యాసం స్తంభస్యారోపణంతథా। పూర్వదక్షిణయోర్మధ్యే కుర్యాదిత్యాహకాశ్యపః॥" (=సూత్రభిత్తిశిలాన్యాసములను స్తంభప్రతిష్ఠను పూర్వదక్షిణదిక్కులమధ్యయందుఁ జేయవలయునుఅని కాశ్యపుఁడుచెప్పె.) అనిబ్రహ్మశంభువుపచించె. "శ్లో॥ నభస్యాదిషుమాసేషు త్రిషుత్రిషుయథాక్రమం। పూర్వాదిదిక్షిరావామ పార్శ్వశాయీప్రదక్షిణమ్॥" (=భాద్రపదముమొదలుకొని మూఁడేసిమాసములు వాస్తుపురుషుఁడు తూర్పుదిక్కు మొదలుకొని ప్రదక్షిణక్రమముగనాలుగుదిక్కులయందును శిరస్సును



బెట్టుకొనినిద్రించును.) అనినారదుఁడుచెప్పె. "శ్లో॥ వాస్తోశ్శిరసిపృచ్ఛే చ యామ్యకుక్షౌచపృష్ఠతః। ఆయుఃకామఃఖనేన్నైవ వామకుక్షౌఖనిశ్శుభా। వాస్తుక్షేత్రప్రమాణంచ కల్పయిత్వాస్యవామకే। కుక్షౌఖాతం విధాయాదౌ గ్రావభిఃపూరయేత్తతః॥" (=దీర్ఘాయుష్యమునుగోరువాఁడు వాస్తుపురుషునియొక్క శిరస్సునందును పుచ్ఛమునందును పొట్టయొక్క దక్షిణపుభాగమునందును పృష్ఠభాగమునందును ఖననముచేయఁగూడదు. వామకుక్షియందుఁద్రవ్వవలయును. వామకుక్షియందుఁద్రవ్వుటచేత శుభములుగలుగును. వాస్తుక్షేత్రప్రమాణములనుకల్పించుకొని వాస్తుపురుషునియొక్క వామకుక్షియందు గోతినిత్రవ్వి పిమ్మటఱాళ్ళచేత పూడ్చవలయును.) అనిశిల్పశాస్త్రమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ త్యజేద్దశశిరోభాగే పుచ్ఛాగ్రేసప్తదశాంశకాన్। మధ్యేనాభింవిజానీయాత్తత్రశంకుంప్రతిష్ఠయేత్। అస్థిరమ్యశిరోయత్ర వాస్తోస్తద్గణయేత్కరైః। దైర్ఘ్యంవావిస్తృతంతత్ర కృత్వాష్టాశ్విమితాంశకాన్॥" (=శిరస్సునందుపదిభాగములను అగ్రభాగమునందు పదునైదుభాగములనువిడిచి మధ్యయందునాభియున్నదని తెలిసికొని ఆనాభియందు శంకువునుస్థాపింపవలయును. వాస్తుపురుషునియొక్క శిరస్సును హస్తములచేత తెలిసికొని దైర్ఘ్యవిస్తారములను గ్రహించివాస్తుపురుషుని ఇరువదెనిమిదిభాగములనుగాఁ జేయవలయును.

వ్యా॥ ఆగ్నేయాదీతి॥ ఆగ్నేయాదిదృఢం - ప్రదక్షిణగతంసూత్రం ఆసాదయేత్- మధ్యే క్షేత్రమధ్యే- వామకపార్శ్వసుప్తం పురుషంప్రాగుక్తశిరసంధ్యాత్వా - తంపురుషఁఉత్తానకంధ్యాయేత్ - కథంభూతం పార్శ్వస్థంలఘుమధ్యాగునోః- పరంస్యాద్యధోపరితద్వైవపూరయేత్ - పశ్చిమంచగురుభిః- పునఃపునఃసర్వమేవ - లఘురిత్యయంవిధిరితి॥ కథంభూతం అష్టాశ్వ్యంశకం- అష్టాశ్విమాంశాభాగాయస్మిన్ సతథాతంఅయమర్థః- క్షేత్రప్రమాణంకృకలాసరూపం వాస్తుపురుషంప్రకల్ప్య - తతోష్టావింశతిధాకుర్యాత్ - ఏవమష్టాశ్వ్యంశం ప్రకల్ప్యపుచ్ఛాత్సకాశాత్ అగేన్దుసమ్మితలవాన్ సప్తదశభాగాన్విహాయత్యక్త్వా అగ్రగః తదగ్రగో భాగోనాభిః- ఇతో నాభేఃసకాశాత్ వామే వామభాగేలవసమ్మితంఖనేత్ అనంతరమశ్మభిఃపూరయేత్ - తథాచబ్రహ్మశంభుః॥ శ్లో॥ సూత్రభిత్తిశిలాన్యాసం స్తంభస్యారోపణంతథా। పూర్వదక్షిణయోర్మధ్యే- కుర్యాదిత్యాహకాశ్యపఇతి॥ నారదః॥ నభస్యాదిషుమాసేషు త్రిషు త్రిషుయథాక్రమం। పూర్వాదిదిక్షిరావామపార్శ్వశాయీ ప్రదక్షిణమితి॥ తథాచ

శిల్పశాస్త్రే॥ వాస్తోశ్శిరసి పుచ్ఛే చ యామ్యే కుక్షౌ చ పృష్ఠతః॥ ఆయుఃకామః ఖనేన్నైవ వామకుక్షౌ ఖనిశ్శుభా వాస్తుక్షేత్రప్రమాణంచ కల్పయిత్వా స్వవామకే। కుక్షౌ ఖాతం విధాయాదౌ గ్రావభిః పూరయేత్తత ఇతి॥ తథా శల్యజ్ఞః॥ త్యజేద్దశశిరోభాగే హ్యగ్రే సప్తదశాంశకాన్ । మధ్యే నాభిం విజానీయాత్తత్ర శంకుం ప్రతిష్ఠయేత్। అస్థిరవ్యశిరో యత్ర వాస్తోస్తద్గణయేత్క్రమైః ॥ దైర్ఘ్యం వా విస్తృతిం తత్ర కృత్వాష్టాశ్వి మితాంశకానితి॥

—* అథ శంకున్యాససన్నృమానం రేఖాకరణం శిలాన్యాసంచాహ. *—

ము॥ నాకాలేత్రనిధేయ ఉక్తతరుజో గ్ర్యాత్సిద్ధవింశా ౨౦ ష్టస్
హాః కృత్ ౧౨ సంఖ్యాంగుళకస్త్రిభాగచతుర శ్రాష్టా
శ్రకానశ్రకః । కంవక్షస్థ్సలమూరుపాదయుగళం సం
స్పృశ్యవిప్రాదికో రేఖాంసూత్రవదగ్నిజేనరచయేత్త
ద్వచ్ఛభిత్తేశ్శిలాః॥ ౧౬॥

టీక॥ అత్ర=ఈవాస్తుపురుషునియొక్క కుక్షిభాగమునందు. నా=పురుషుఁడు. కాలే=ముహూర్తసమయమునందు. అగ్ర్యాత్=బ్రాహ్మణుఁడు మొదలుకొని. సిద్ధ ౨౪ వింశా ౨౦ ష్టస్య ౧౬ హాఃకృత్ ౧౨ సంఖ్యాంగుళకః=ఇరువదినాలుగు ఇరువదిపదునాఱు పదిరెండుఅంగుళములుగలదియును. త్రిభాగచతురశ్రాష్టాశ్రకానశ్రకః = మూఁడుభాగములలో మొదటిభాగమునందు నాలుగంచులుగలదియును రెండవభాగమునందు ఎనిమిదంచులుగలదియును మూఁడవభాగమునందు అంచులులేక గుండ్రముగానున్నదియును అయినదియును. ఉక్తతరుజః=శాస్త్రమునందుఁ జెప్పఁబడిన వృక్షములవలనఁబుట్టినదియును. (అయిన) శంకువు. నిధేయః = స్థాపనచేయఁదగినది. విప్రాదికః=బ్రాహ్మణుఁడు మొదలగువాఁడు. కమ్=శిరస్సును. వక్షస్థలమ్=వక్షస్థలమును. ఊరుపాదయుగళమ్ = తొడలయొక్కయును పాదములయొక్కయును జంటను. సంస్పృశ్య=స్పృశించి. రేఖామ్=రేఖను. అగ్నిజేన = ఆగ్నేయాదిదిక్కులయొక్క క్రమముచేత. సూత్రవత్=సూత్రమునువలెనే. రచయేత్=రచింపవలయును. తద్వత్=ఆవిధముగానే. భిత్తేః=గోడయొక్క. శిలాః=శిలలను. రచయేత్=రచింపవలయును.

తా॥ శంకున్యాసమును నృమానమును రేఖాకరణమును శిలాన్యాసమును ఈశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనినః—ఈవాస్తుపురుషునియొక్క కుక్షిభాగమునందు మానవులలో బ్రాహ్మణాదినాలుగువర్ణముల వారును క్రమముగా శాస్త్రమునందుఁ జెప్పఁబడినదియును ఇరువదినాలు



గంగుళములు ఇరువదంగుళములు పదునాఱంగుళములు పదిరెండంగుళములును పరిమితికలదియును మూఁడుభాగములలో మొదటిభాగమునందు నాలుగంచులుకలదియును రెండవభాగమునందు ఎనిమిదంచులుకలదియును మూఁడవభాగమునందు గుండ్రముగనున్నదియును, అయినశంకువును ఆగ్నేయాదిక్రమముగా స్థాపింపవలయును. "శ్లో॥ స్యాచ్చతుర్వింశతింశాష్టి ద్వాదశాంగుళకైః క్రమాత్ । విప్రాదీనాం శంకుమానం స్వర్ణవస్త్రాద్యలంకృతం॥" (=బ్రాహ్మణాదినాలుగువర్ణములవారికిని క్రమముగ ఇరువదినాలుగు ఇరువదిపదునాఱు పదిరెండుఅంగుళముల పరిమితికల శంకువును వస్త్రాదులచేత అలంకరించి స్థాపించుచున్నారు.) అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ ఖదిరార్జునశాలోత్థం యుగపత్రతరూద్భవం । రక్తచందనపాలాశ రక్తశాలకిలాలజం । నింబకారండకుటజవైణకం బిల్వవృక్షజం । శంకుం త్రిధా విభజ్యాద్యం చతురశ్రం తతఃపరం ॥ అష్టాశ్రంచ తృతీయాంశ మనశ్రమృజుమవ్రణం । ఏవంలక్షణసంయుక్తం పరికల్ప్య శుభేదినే॥" (=చండ్రమద్దిసాల వృక్షములయొక్క కొయ్యనైనను, యుగపత్రవృక్షముయొక్క కొయ్యనైనను, రక్తచందనపుకొయ్యనైనను, పాలాశపుకొయ్యనైనను, రక్తశాలపుకొయ్యనైనను, కిలాలవృక్షపుకొయ్యనైనను, నింబవృక్షపుకొయ్యనైనను, కారంజపుకొయ్యనైనను, గిరిమల్లికావృక్షపుకొయ్యనైనను, వెదురుకొయ్యనైనను, బిల్వవృక్షపుకొయ్యనైనను శంకువునుగాఁజేయవలయును. మఱియును, ఆకొయ్యను మూఁడుభాగములుగాఁజేసి మొదటిభాగమును నాలుగంచులుగలదానినిగాను, రెండవభాగమును ఎనిమిదియంచులుగలదానినిగాను, మూఁడవభాగమును గుండ్రముగనుజేసి శుభదినమునందు అలంకరింపవలయును.) అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె. ఆశంకువును స్థాపించునపుడు బ్రాహ్మణుఁడు శిరస్సును స్పృశించి యాగ్నేయాదిక్రమముగ సూత్రమును అనుసరించి రేఖను నిర్మింపవలయును. ఇటులనే క్షత్రియుఁడు వక్షస్థలమును, వైశ్యుఁడు ఊరుయుగమును, శూద్రుఁడు పాదయుగమును స్పృశించి రేఖను నిర్మింపవలయును. "కృత్వా సూత్రనిపాతం మధ్యాంగుళ్యాఽథవా ప్రాదేశిన్యా అంగుష్ఠేన వామపాణినా కక్షాంతరముక్తాభిః రేఖాంకుర్యాత్" (=ముందుగా సూత్రమును బట్టి మధ్యాంగుళిచేతనైనను, చూపుడువ్రేలిచేతనైనను, అంగుష్ఠముచేతనైనను, వామహస్తముచేతనైనను, రేఖను నిర్మింపవలయును. అనిలల్లాచార్యుఁడు చెప్పె. "శ్లో॥ విప్రశ్శీర్షం నృపోవక్షో

వైశ్యశ్చోరూపరః పదౌ । స్పృష్ట్వా రేఖాం గృహారంభే కుర్యాదగ్నేః ప్రదక్షిణమ్" (=బ్రాహ్మణుఁడు శిరస్సును, క్షత్రియుఁడు వక్షస్థలమును, వైశ్యుఁడు తొడలను, శూద్రుఁడు పాదములను, గృహారంభకాలమందు స్పృశించి యాగ్నేయాదిక్రమముగ రేఖానిర్మాణమును చేయవలయును.) అని భృగువు చెప్పె. "శ్లో ॥ అంగుష్ఠకేన దేశిన్యా రేఖాం కుర్వీత సూత్రతః । స్వర్ణేన మణినా రూప్య ముక్తాదధిఫలాక్షతైః । కుసుమై ర్వా న శస్త్రేణ న లోహేన న భస్మనా । కాష్ఠాదిభిర్న చాపసవ్యాం న వక్రాం దోషదర్శనాత్ । శస్త్రేణ శస్త్రమృత్యుస్స్యా దిత్యాదిస్పష్టమీరితమ్॥" (=అంగుష్ఠము చేతనైనను, తర్జని చేతనైనను, సూత్రము చేతనైనను, రేఖను చేయవలయును. మఱియును, బంగారము చేతనైనను, మణి చేతనైనను, రూప్యము చేతనైనను, దధిఫలాక్షతల చేతనైనను, పుష్పముల చేతనైనను రేఖను గీయవలయును. మఱియును, శస్త్రము చేతనైనను, లోహము చేతనైనను, భస్మము చేతనైనను, కాష్ఠాదుల చేతనైనను, రేఖను గీయఁగూడదు. మఱియును, ఆ రేఖను అపసవ్యముగానైనను, వక్రముగనైనను, గీయఁగూడదు. శస్త్రము చేత రేఖను గీసిన యెడల శస్త్రము మూలకముగా మృత్యువు కలుగును.) అని కారికయను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ శస్త్రేణ శస్త్రమృత్యుర్బంధో లోహేన భస్మనాగ్నిభయం । తస్కరభయం తృణేన చలితా కాష్ఠేన రాజభయం । వక్రా చ పాదలిఖితా శత్రుభయదా క్లేశదా విరూపా చ । చర్మాంగారాస్థికృతాం దంతేన చ కర్తురశుభాయ । వైరమపసవ్యలిఖితా ప్రదక్షిణా సంపదో వినిర్దిశ్యా॥" (=శస్త్రము చేత రేఖను గీసిన యెడల శస్త్రముల మూలకముగ మరణము కలుగును. లోహము చేత బంధము కలుగును. భస్మము చేత అగ్నిభయము కలుగును. తృణము చేత తస్కరభయము కలుగును. కాష్ఠము చేత రాజభయము కలుగును. పాదము చేత రేఖను గీసిన యెడల శత్రుభయము కలుగును. విరూపముగ నా గీత యుండెనేని దుఃఖమును గలిగించును. చర్మము అంగారము ఎముక మొదలగువాని చేతనైనను గీసిన యెడల కర్తకు అశుభములు కలుగును. అపసవ్యముగా గీయఁబడిన రేఖవలన వైరము కలుగును. ప్రదక్షిణాకారముగ గీయఁబడిన రేఖవలన సకలసంపదలును కలుగును.) అని బృహద్వాస్తుపద్ధతియందుఁ జెప్పఁబడియె. "శ్లో ॥ దక్షిణపూర్వకోణే కృత్వా పూజాం శిలాం న్యసేత్ప్రథమం । శేషాః ప్రదక్షిణేన స్తంభాశ్చైవ ప్రతిష్ఠాప్యా" (=ఆగ్నేయదిక్కునందు పూజను చేసి శిలాన్యాసమును చేయవలయును. మఱియును, స్తంభాదు



లనుగూడ ప్రదక్షిణాక్రమము చేతనే స్థాపింపవలయును.) అని వరాహుఁడు చెప్పెను.

వ్యా॥ అథ శంకున్యాసమాహ ॥ నేతి ॥ అగ్రే కుక్షిస్థలే- నా- నరః శంకుః- కార్యే- ముహూర్తసమయే- నిధేయః - సకీయాత్ప్రమాణ ఇత్యపేక్షాయాం స్వమానమాహ ॥ అగ్ర్యాత్- విప్రాత్సకాశాత్- వర్ణపరత్వేనసిద్ధ- ౨౪- వింశా- ౨౦- ష్ట్య- ౧౬ - వాఃకృత్- ౧౨ - సంఖ్యాంగులకః నిధేయః ప్రతిష్ఠాపనీయః- ఏతదుక్తం భవతి ॥ విప్రేణ సిద్ధసంఖ్యాంగుళకశ్శంకుర్వింశాంగుళో నిధేయః - క్షత్రియేణ వింశాంగుళః - వైశ్యేన అష్ట్యంగుళః- షోడశాంగుళః- శూద్రేణ అహఃకృత్సంఖ్యాంగుళః - ద్వాదశాంగుళో నిధేయ ఇత్యర్థః- కింలక్షణః- నాడక్షతరుజః- శాస్త్రోక్తవృక్షోద్భవః- పునః కింలక్షణః- త్రిభాగచతురశ్రాష్టాశ్రకానశ్రకః - త్రిభాగేషు చతురశ్రాష్టాశ్రకానశ్రకానియస్మిన్ సతథా - ఏతదుక్తం భవతి - యథాప్రమాణం శంకుం త్రివిధా విభజ్యాద్యాంశం చతురశ్రం ద్వితీయాంశం అష్టాశ్రం తృతీయాంశం అనశ్రం వర్తులం కుర్యాదితి భావః ॥ తథా చోక్తం గ్రంథాంతరే॥ శ్లో॥ స్యాచ్చతుర్వింశవింశాష్టిద్వాదశాంగుళకైః క్రమాత్ । విప్రాదీనాం శంకుమానం స్వర్ణవస్త్రాద్యలంకృతం ॥ ఖదిరార్జునశాలోత్థం యుగపత్రతరూద్భవం । రక్తచందనపాలాశ రక్తశాలకిలాలజం ॥ నింబకారంజకుటజవైణకంబిల్వవృక్షజం । శంకుం త్రిధా విభజ్యాద్యం చతురశ్రం తతః పరం ॥ అష్టాశ్రం చతృతీయాంశ మనశ్రమృజు మవ్రణం । ఏవం లక్షణసంయుక్తం పరికల్ప్య శుభేదినే ॥ ఇతి ॥ అథ రేఖాకరణమాహ ॥ కమితి ॥ అగ్నిజేన- సువర్ణేన- బ్రాహ్మణాదికః - కాదిసంస్పృష్ట్వా - సూత్రవద్రేఖాం రచయేత్- సూత్రవదితి ॥ ఆగ్నేయ్యాదిగ్రహప్రదక్షిణం కుర్యాదిత్యర్థః- ఏతదుక్తం భవతి ॥ బ్రాహ్మణః - కంశిరః స్పృష్ట్వా - తర్జన్యావాకృత్వా- ఆగ్నేయాదిప్రదక్షిణం సూత్రానుగతాం రేఖాం కుర్యాత్- తథైవ క్షత్రియో వక్షస్థలం స్పృష్ట్వా- రేఖాం కుర్యాత్- వైశ్యః- ఊరుయుగం స్పృష్ట్వా రేఖాం కుర్యాత్- శూద్రః పాదయుగళం స్పృష్ట్వా- రేఖాం కుర్యాత్॥ తథా చ లల్లః ॥ కృత్వా సూత్రనిపాతం మధ్యాంగుళ్యా అథవా ప్రాదేశిన్యాం అంగుష్ఠేన వామణినాకనకాంతరముక్తాభిః రేఖాం కుర్యాదిత్యాది॥ తథా చ భృగుః ॥ శ్లో ॥ విప్రశ్శిర స్స్వనృపో వక్షో వైశ్యశ్చోరూపరః పదౌ । స్పృష్ట్వా రేఖాం గృహారంభే కుర్యాదగ్నేః ప్రదక్షిణమితి ॥ అగ్నేరిత్యాగ్నేయ్యాః ॥ తథా చ కారికాయాం ॥ అంగుష్ఠకేన దేశిన్యా రేఖాం కుర్వీత సూ

త్రతః । స్వర్ణేనమణినారూప్య ముక్తాదధిఫలాక్షతైః ॥ కుసుమైర్వానశస్త్రేణ నలోహేననభస్మనా ॥ కాష్ఠాదిభిర్వాపసవ్యాం నవక్రాందోషదర్శనాత్ । శస్త్రేణశత్రుమృత్యుస్స్యాదిత్యాదిస్పష్టమీరితమితి ॥ తథాచ బృహద్వాస్తుపద్ధతౌ ॥ శస్త్రేణశత్రుమృత్యుశ్చధో లోహేనభస్మనా గ్నిభయం । తస్కరభయంతృణేనచలిఖితాకాష్ఠేనరాజభయం ॥ వక్రాచపాదలిఖితా శత్రుభయదాక్లేశదావిరూపాచ । చర్మాంగారాస్థికృతాందంతేనచకర్తురశుభాయ- వైరమపసవ్యలిఖితా ప్రదక్షిణాసంపదోవినిర్దిశ్యా ఇతి ॥ అథశిలాన్యాసమాహ ॥ భిత్తేఃశిలాఅపిసూత్రవదాచరేయుః ॥ ఆగ్నేయాదిప్రదక్షిణంస్థాపయేయురిత్యర్థః ॥ తథాచవరాహః ॥ దక్షిణపూర్వకోణే కృత్వాపూజాంశిలాంన్యసేత్ప్రథమం । శేషాఃప్రదక్షిణేన స్తంభాశ్చైవప్రతిష్ఠాప్యా ఇతి॥

— { అథభిత్తిప్రసంగేనద్వారం స్తంభప్రతిష్ఠాంగృహోచ్ఛ్రితాంచాహ. } —

మూ॥ పూర్వాదౌత్రిషడర్ధపంచమలవే ద్వాస్స్యాత్కోణోద్ధృతే
దైర్ఘ్యే వ్యంశసముచ్ఛ్రితాబ్ధిలవకే సర్వాసుదిక్షూదితా । స్తంభోగ్నేర్దిశిపూజితస్సుసమయే స్థాప్యశ్శిరశ్ఛత్రభాగ్విస్తారాష్టి ౧౬ లవాన్వితైఃకృతకరైస్తుల్యం
గృహోచ్చ్యంవిదుః॥ ౧౭॥

టీక॥ దైర్ఘ్యే=గృహముయొక్కవిస్తారము, అంకోద్ధృతేసతి=తొమ్మిదిచేతభాగింపఁబడినదగుచునుండఁగా, పూర్వాదౌ=తూర్పుదిక్కు మొదలుగాఁగలదిక్కునందు, క్రమేణ=క్రమముగా, సవ్యతః=వామభాగము మొదలుకొని, త్రిషడర్ధపంచమలవే=మూఁడవదియును, ఆఱవదియును, అయిదవదియును, అయినభాగమునందు, ద్వాః=ద్వారము, (మునిభిః=మునులచేత, ఉక్తమ్=చెప్పఁబడెను,) సర్వాసు=సమస్తములయిన, దిక్షు=దిక్కులయందు, వ్యంశసముచ్ఛ్రితా= ద్విభాగోచ్ఛమైనద్వారము, అబ్ధిలవకే=నాల్గవభాగమునందు, ఉదితా=చెప్పఁబడినది, సుసమయే=మంచిదగుకాలమునందు, పూజితః=పూజింపఁబడినదియును, శిరశ్ఛత్రభాక్=శిరస్సునందుఛత్రముఁబొందినదియును, (అయిన) స్తంభః=స్తంభము, అగ్నేః=అగ్నియొక్క, దిశి=దిక్కునందు, స్థాప్యః=స్థాపింపఁదగినది, గృహోచ్ఛ్రమ్=గృహముయొక్కయున్నతమును, విస్తారాష్టిలవైః=విస్తారముయొక్క పదునాఱవభాగముతోఁగూడిన, కృతకరైః=నాలుగుహస్తము



లతో, తుల్యమ్=సమానమైనదానినిగా, విదుః=చెప్పుచున్నారు.

తా॥ ఈశ్లోకముచేత ద్వారమును స్తంభప్రతిష్ఠను గృహోచ్ఛ్రతను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—గృహముయొక్క దైర్ఘ్యమును తొమ్మిదిచేత భాగింపఁబడినదగుచునుండఁగా తూర్పుదిక్కు మొదలుకొని వామభాగమును ఒట్టుకొని మూఁడవ ఆఱవ అయిదవ భాగములయందు ద్వారమును బెట్టవలయును. అనఁగా, గృహదైర్ఘ్యమును తొమ్మిదిభాగములుచేసి పూర్వాభిముఖమైన గృహమునందు వామభాగమునుండి రెండుభాగములనువిడిచిపెట్టి మూఁడవభాగమునందు ద్వారమునుపెట్టవలసినదనియును, దక్షిణాభిముఖమైనగృహమునందు అంశపంచకమునువిడిచిపెట్టి యాఱవభాగమునందు ద్వారమును నిర్మింపవలసినదనియును, పశ్చిమాభిముఖమైనగృహమునందు నాల్గుభాగములనువిడిచిపెట్టి యైదవభాగమునందు ద్వారమును బెట్టవలసినదనియును, ఉత్తరాభిముఖమైనగృహమునందుఁగూడ నాల్గుభాగములనువిడిచిపెట్టి యైదవభాగమునందు ద్వారమును నిర్మింపవలసినదనియును, తెలియవలయును. మఱియును, సర్వదిక్కులయందును ద్వారములనుబెట్టునెడల నాల్గవభాగమునందు ద్విభాగోచ్ఛమగు ద్వారము నిర్మింపవలసినదని చెప్పఁబడెను. "శ్లో ॥ దైర్ఘ్యేనవాంశాఃపదమత్రసవ్యా ద్వారంశుభంప్రాక్త్రిచతుర్థభాగే । చతుర్థషష్ఠేదిశిదక్షిణస్యాం పశ్చాచ్చతుఃపంచమకేతథోదక్ ॥" (=గృహముయొక్కదైర్ఘ్యమును తొమ్మిదిభాగములుచేసి సవ్యభాగమునుబట్టుకొని తూర్పుదిక్కునందు మూఁడవ నాల్గవభాగమునందును, దక్షిణదిక్కునందు నాలుగవ యాఱవభాగములయందును, పశ్చిమదిక్కునందు నాల్గవభాగమునందును, ఉత్తరపుదిక్కునందు అయిదవభాగమునందును, ద్వారమునునిర్మింపవలయును.) అనివరాహుఁడుచెప్పె. "శ్లో॥ మానాధికోనదిగ్భాగే ద్వారేనిచసుఖక్షయః॥" (=తక్కువదగుదిగ్భాగమునందు ద్వారమునునిర్మించినను ఆద్వారముమానాధికమైనదైనను మానహీనమైనదయినను సుఖనాశమగును.) అనిచ్యవనుఁడుచెప్పె. ఆగ్నేయదిక్కునందు పూర్వమునందుఁజెప్పఁబడిన సుముహూర్తకాలమునందు శాస్త్రోక్తమైనచెప్పఁబడిన బుట్టినదియును, చందనాదులచేతపూజింపఁబడినదియును, శిరస్సునందుఛత్రమునుకలిగియును, అయినస్తంభమును స్థాపింపవలయును. "శ్లో॥ ఛత్త్రస్రగంబరయుతః కృతధూపవిలేపనస్సముత్థాప్యః । స్తంభస్తథైవకార్యోద్వారోచ్ఛ్రాయఃప్రయత్నేన॥" (=ద్వారగమంశపుడగు కలిగియును, చందనము

సరలవృక్షము, పతంగవృక్షము, లొద్దుగచెట్టు, ఏపిచెట్టు, లొద్దుగచెట్టు, కొమ్మలుగలచెట్టు, శింశుపావృక్షము, తెల్లమద్దిచెట్టు, చందనవృక్షము, అశోకవృక్షము, రేగుచెట్టు, ఇప్పచెట్టు, కడిమిచెట్టు, జమ్మిచెట్టు, నింబవృక్షము, బిల్వవృక్షము, అనునవి గృహమునందు శుభకరములయినవి. ఈవృక్షములు గృహమునందు సమముగనుండవలయును. వాకిలియందు ఈవృక్షములు విషమముగనుండెనేని శుభకరములుగావు.) అని వాస్తుశాస్త్రమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ ప్లక్షోదుంబరచూతాఖ్యా నింబస్నుహివిభీతకాః। దగ్ధాఃకంటకినోవృక్షా వటాశ్వత్థకపిత్థకాః। అగస్తిశిగ్రుతాలాఖ్యా స్తింత్రిడీకాశ్చనిందితాః। అస్యేచగృహనిర్మాణే యోజనీయాస్సదాద్రుమాః॥" (=జువ్వి, మేడి, మామిడి, నిమ్మ, జెముడు, తాండ్ర, దగ్ధవృక్షములు, కంటకవృక్షములు, వటాశ్వత్థకపిత్థవృక్షములు, నల్లయగిసిచెట్టు, తాలవృక్షము, తింత్రిడీవృక్షములు, మొదలుగాఁగలవృక్షములు గృహనిర్మాణమునందు యోజనచేయఁదగినవి.) అనినారదుఁడు చెప్పె. "శ్లో॥ పితృవనమార్గసురాలయ వల్మీకోద్యానతాపసాశ్రమజాః। చైత్యసరిత్సంగమభవాశ్చ ఘటతోయసిక్తాశ్చ। కంజానుజాతవల్లీనిపీడితా వజ్రమారుతోపహతా। స్వపతితహస్తినిపీడితశుష్కాగ్ని ప్లుష్టదుష్టమధునిలయాః। తరవోవర్జయితవ్యాశ్శుభదాస్స్యుస్సి స్నిగ్ధపత్రకుసుమఫలాః। సురదారుచందనసమామధుకరతరవశ్శుభాద్విజాతీనాం। క్షాత్రస్యారిష్టాశ్వత్థ ఖదిరబిల్వావృద్ధికరాః। వైశ్యానాంజీవఖదిరసిందూరకస్యంధనాశ్చశుభఫలదాః। తిందుకకేసరసరలార్జునోత్థశాలాశ్చశూద్రాణాం। సర్వేషాంవాశస్తాస్సర్వే వృక్షాశ్చహోదితానోచేత్" (=శ్మశానము, మార్గము, దేవాలయము, పుట్ట, ఉద్యానవనము, తాపసాశ్రమము, రథ్య, నదీతీరము, అనువానియందు పుట్టినవృక్షములును, ఘటతోయసిక్తములు, పిడుగుచేతను వాయువుచేతను, కొట్టఁబడినవృక్షములు, తమంతటతామపడిన వృక్షములు, చేతిచేతపడవేయఁబడిన వృక్షములు, ఎండిపోయినవృక్షములు, కాలినవృక్షములు, అనువానిని విడిచిపెట్టవలయును. మఱియును, మనోహరములయిన పత్రపుష్పఫలముకల వృక్షములుకూడవిడువఁదగినవి. దేవదారు, చందనము, మధుకరవృక్షములును బ్రాహ్మణులకు శ్రేష్ఠములయినవి. కుంకుడుఅశ్వత్థము, ఖదిరము, బిల్వవృక్షము, అనునవిక్షత్రియులకు శ్రేష్ఠములయినవి. జీవఖదిర సిందూర స్యందనములు వైశ్యులకు శుభఫలములనుకలుగఁజేయును. తిందుక కేసర



సరలార్జునవృక్షములు శూద్రులకుశుభకరములయినవి. నిందితములుగాని వృక్షములు అందఱకునుశుభకరములయినవనఁబడును.) అనివరాహుఁడు చెప్పె. "శ్లో॥ అన్యవేశ్మస్థితందారు నైవాన్యస్మిన్ప్రయోజయేత్। నతత్రవసతేకర్తా వసేత్తత్రనజీవతి॥" (=ఒకగృహమునకు ఉపయోగించినవృక్షమును వేఱొకగృహమునకుపయోగింపఁగూడదు. అట్టిగృహమునందు గృహస్థుజమాని నివసింపఁగూడదనియును, ఒకవేళనివసించెనేని మరణమునుపొందుననియును, తెలియవలయును) అనివ్యాసుఁడుకూడఁజెప్పె. "శ్లో॥ ఇష్టకాలోష్టపాషాణ మృత్తికాజీర్ణమాయసం। తృణంపర్ణంబుధైఃప్రోక్తం దారుణంనగృహాయవై॥" (=ఇతరగృహములకుపయోగింపఁబడినయిటుకలు, పెంకులు, పాషాణములు, మృత్తిక, యినుము, తృణము, పర్ణము, అనువానిని ఉపయోగింపఁగూడదని సమరంగణమనుగ్రంథమందుఁజెప్పఁబడియె. "శ్లో॥ నూతనేనూతనంకాష్ఠం నోజీర్ణే నూతనంశుభమ్॥" (=నూతనగృహమునందు నూతనస్తంభములును, జీర్ణగృహమునందు జీర్ణకాష్ఠములును, ఉపయోగింపవలయును. జీర్ణగృహమునందు నూతనకాష్ఠమును, నూతనగృహమునందు జీర్ణకాష్ఠమును ఉపయోగింపఁగూడదు.) అనిశార్ఙ్గధరుఁడుకూడఁజెప్పె. "శ్లో॥ యానీహభూతానివసన్తి తాని బలింగృహీత్వావిధివత్ప్రయుక్తం। అన్యత్రవాసం పరికల్పయంతు క్షమంతుతాన్యద్యనమోస్తుతేభ్యః॥" (=ఈవనమునందు నివసించియున్నభూతములు శాస్త్రోక్తప్రకారమగు బలినిగ్రహించి యితరస్థలమందుపోయినివసించుటకు ఆభూతములకునమస్కరించుచున్నాను.) అనివృక్షచ్ఛేదనమునుచేయునపుడు ఈశ్లోకముచేత ప్రార్థింపవలయును. మఱియును, గృహవిస్తారముయొక్క పదునాఱవభాగముతోఁగూడిన నాలుగుహస్తములతోసమానమయిన యౌన్నత్యమునుంచవలయును. "శ్లో॥ విస్తారష్షోడశాంశశ్చ చతుర్హస్తోభవేద్గృహోచ్ఛ్రాయః॥" (=గృహవిస్తారముయొక్క పదునాఱవభాగముతోఁగూడిన నాలుగుహస్తములపరిమితిగలయెత్తు గృహమునకుఁగలిగియుండవలయును) అని రత్నకోశమనుగ్రంథమునందుఁజెప్పఁబడియె. "శ్లో॥ నాత్యుచ్ఛ్రితంనాతినీచం కుడ్యోత్సేధంయథారుచి॥" (=గోడయొక్కపొడవుమిగులనున్నతముగను మిగులఁదక్కువగను ఉండఁగూడదనియును, మనోహరముగనుండవలయుననియును, తెలియవలయును.) అనిలల్లుఁడుచెప్పె

వ్యా॥ పూర్వాదావితి॥ దైర్ఘ్యే గృహదైర్ఘ్యే - అంకాప్తే- నవ

జయేత్ । నతత్రవసతేకర్తా వసేత్తత్రనజీవతీతి ॥ సమరంగణే ॥ ఇష్ట కాలోష్టపాషాణ మృత్తికాజీర్ణమాయసం । తృణంపర్ణంబుధైఃప్రోక్తం దారుణంనగృహాయవై ఇతి ॥ శార్ఙ్గధరోపి ॥ నూతనేనూతనంకాష్ఠం జీర్ణేజీర్ణంప్రశస్యతే । జీర్ణేచనూతనంకాష్ఠం నోజీర్ణేనూతనంశుభమితి ॥ వృషశ్చేదప్రార్థనాఉక్తా॥యానీహాభూతానివసన్తితాని బలింగృహీత్వా విధివత్ప్రయుక్తం।అన్యత్రవాసంపరికల్పయంతుక్షమంతుతాన్యద్యనమోస్తుతేభ్యఇతి ॥ అథస్తంభప్రసంగేనగృహోచ్ఛ్రతామాహ ॥ విస్తారేతి ॥ విస్తారస్యగృహవిస్తారస్య- అష్టిలవః - షోడశాంశస్తేనఅన్వితైర్యుక్తైః- కృతకరైశ్చతుర్హస్తైః - తుల్యంసమానం - గృహోచ్ఛ్రంవిదుర్మునయ ఇత్యధ్యాహారః ॥ తథాచరత్నకోశే ॥ విస్తారషోడశాంశశ్చతుర్హస్తోభవేద్గృహోచ్ఛ్రాయఇతి ॥ తథాచలల్లః ॥ నాత్యుచ్ఛ్రితంనాతినీచం కుడ్యోత్సేధంయథారుచితి॥

— { అథముఖ్యగృహాత్కస్య గృహంకస్యాందిశికర్తవ్యం జలస్థానం- శక్తిభువోస్సంకోచేసతికర్తవ్యంచాహ. } —

మూ॥ స్నానాగ్నిస్వపి వస్త్రభోజనపశుద్రవ్యామరౌకస్థితిం
పూర్వాదౌజలమీశితుర్దిశిపరం వాయోరవాఙ్మూత్రకం।
అల్పేశక్తిభువోర్యథారుచిపరైర్గేహస్యదక్షేఘరట్టాం
బూలూఖలచుల్లికాపితృపదప్రక్షాళనాన్యూచిరే॥౧౮॥

టీక॥ స్నానాగ్నిస్వపివస్త్రభోజన పశుద్రవ్యామరౌకస్థితిమ్ = స్నానము, అగ్ని, నిద్ర, వస్త్రము, భోజనము, పశువులు, ద్రవ్యములు, దేవాలయము, అనువానిమొక్క స్థితి, పూర్వాదౌ=పూర్వదిక్కు మొదలుగాఁగలదిక్కునందు, కార్యమ్=చేయఁదగినది. జలమ్=ఉదకము. ఈశితుః=ఈశ్వరునియొక్క, దిశి=దిక్కునందు, (ఈశాన్యదిక్కునందు.) కార్యమ్=చేయఁదగినది, పరమ్=ఇక్కడఁజెప్పఁబడని వస్తుసముదాయము. వాయోః=వాయువుయొక్క, దిశి=దిక్కునందు, కార్యమ్-చేయఁదగినది, అవాక్=దక్షిణదిక్కునందు, మూత్రకమ్=మూత్రస్థానము, కార్యమ్=చేయఁదగినది, శక్తిభువోః=సామర్థ్యముయొక్కయును భూమియొక్కయును. అల్పే=అల్పమునందు, యథారుచి=ఇష్టానుసారముగ, సర్వమ్=సమస్తమును, పరైః=ఇతరులచేత, ఉక్తమ్=చెప్పఁబడెను, గేహస్య=గృహముయొక్క, దక్షే=దక్షిణభాగమునందు, ఘరట్టాంబూలూఖలచుల్లికాపితృపదప్రక్షాళనాని = తిరుగలి, ఉదకము, రోలు, పొయ్యి, పితృపాదప్రక్షాళనము, అనువానిని, ఊచిరే=చెప్పిరి.



తా॥ ముఖ్యగృహమునకు ఏయేగృహము ఏయేదిక్కున నుండవలసినదియును, జలస్థానమేదిక్కున నుండవలసినదియును, శక్తియును భూమియును జాలనప్పుడేమిచేయవలసినదియును, ఈ శ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును. ఎట్లనిన:—స్నానము, అగ్ని, నిద్ర, శయ్య, వస్త్రములు, భోజనము, పశువులు, సువర్ణాదిద్రవ్యములు దేవతలయిల్లు, అనునవి క్రమముగ తూర్పుదిక్కు మొదలుకొని యెనిమిది దిక్కులయందును ఉండవలయును. " శ్లో ॥ స్నానాగారందిశిప్రాచ్యామాగ్నేయ్యామగ్నిమందిరం। యామ్యాయాంశయనాగారం నైఋత్యాం వస్త్రమందిరం ॥ ప్రతీచ్యాం భోజనాగారం వాయవ్యాం పశుమందిరం। భాండకోశంతూత్తరస్యామీశాన్యాందేవమందిరమ్ ॥ " (=స్నానగృహమును తూర్పుదిక్కునందును అగ్నిగృహమును ఆగ్నేయ దిక్కునందును, శయ్యాగృహమును దక్షిణపుదిక్కునందును, వస్త్రమందిరమును నిఋతిదిక్కునందును, భోజనాలయమును పశ్చిమదిక్కునందును, పశుమందిరమును వాయవ్యదిక్కునందును, భాండకోశమును ( ధనాలయమును ) ఉత్తరపుదిక్కునందును, దేవమందిరమును ఈశాన్యదిక్కునందును నిర్మింపవలసినదని నారదుఁడు చెప్పె. ఈశాన్యదిక్కునందు జలము చేయఁదగినది. " శ్లో ॥ ప్రాచ్యాదిదిక్షుసలిలే సుతహాని శ్శిఖిభయం రిపుభయంచ । స్త్రీకలహస్త్రీదౌష్ట్యం నైస్వ్యం చింతాత్మజవివృద్ధిః॥ " (=తూర్పుదిక్కున బావియుండెనేని పుత్త్రనాశమనియును, ఆగ్నేయమున అగ్నిభయమును, దక్షిణమున శత్రుభయమును, నిఋతిదిక్కున స్త్రీకలహమును, పశ్చిమదిశయందు స్త్రీదౌష్ట్యమును, వాయవ్యమున నిస్వత్వము, ఉత్తరమున విచారమును, ఈశాన్యమున పుత్త్రవృద్ధియును, కలుగును.) అని లల్లుఁడు చెప్పె. మఱియును, ఇప్పుడు చెప్పఁబడిన పదార్థములుగాక యితరపదార్థములను వాయవ్యదిక్కునందుంచవలయును. దక్షిణపుదిక్కునందు మూత్రస్థానమును నిర్మింపవలయును. స్థలము చాలకపోయినను, సామర్థ్యము లేకపోయినను తగిన స్థలమునందు యుక్తాయుక్తములను కనిపెట్టి నిర్మింపవలయును. మఱియును, తిరగలి, రోలు, మొదలగువానిని గృహముయొక్క దక్షిణభాగమునందుండునట్లు చేయవలయును. " శ్లో ॥ ఉలూఖలంపిష్టయంత్ర మగ్నిస్థానంజలాశ్రయం। వేశ్మనోదక్షిణేపార్శ్వే పితౄణాంపాదశౌచనమ్॥ " (=రోలు, తిరగలి,

అగ్నిస్థానము, జలస్థానము, పితృదేవతలయొక్క పాదప్రక్షాలనము, అనునవి గృహముయొక్క దక్షిణపార్శ్వమునందుండవలయును.) అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ అథముఖ్యగృహాత్కస్య గృహంకస్యాం దిశికర్తవ్య మిత్యాహ॥ స్నానేతి॥ స్నానంప్రసిద్ధం - అగ్నిః-ప్ర-స్వపిః- శయనం - వస్త్రాణి ప్రసిద్ధాని - భోజనం-ప్రసిద్ధం- పశవోగవాదయః - ద్రవ్యాణి - సువర్ణాదీని-అమరాః-దేవాః- ఏషాం ఓకాంసిగృహాణితేషాంస్థితిః - స్థాపనం-పూర్వాదౌదిశి-క్రమేణకార్యమిత్యధ్యాహారః - తథాచనారదః॥ శ్లో॥ స్నానాగారందిశిప్రాచ్యా మాగ్నేయ్యా మగ్నిమందిరం। యామ్యాయాంశయనాగారం నైరృత్యాంశస్త్రమందిరం॥ ప్రతీచ్యాంభోజనాగారంవాయవ్యాం పశుమందిరం। భాండకోశంతూత్తరస్యా మీశాన్యాందేవమందిరమితి॥ అథజలస్థానమాహ॥ ఈశేతురీశానస్యదిశిజలంకార్యం-నాన్యత్ర।తథాచల్లః॥ శ్లో॥ ప్రాచ్యాదిదిక్షుసలిలేసుతహాని శిఖిభయంరిపుభయంచ। స్త్రీకలహః స్త్రీదౌష్ట్యం నైస్వ్యం చింతాత్మజవివృద్ధిరితి॥ అథాన్యదప్యాహ॥ పరమితి॥ పరమనుక్తంపదార్థజాతం వాయోర్దిశికార్యం-అన్యనిహూరుత్యా మితిలల్లోక్తత్వాత్ - అవాగ్దక్షిణస్యాం దిశిమూత్రకంకార్యం - స్థలసంకోచేసతి- ఏతద్యత్ప్రోక్తం తద్గృహమధ్యేబాహ్యతశ్చ స్వస్వస్థానేతారతమ్యేనయోజ్యం॥ అథశక్తిభూమ్యోస్సంకోచేసతికర్తవ్యమిత్యాహ॥ అల్పేఇతి॥ శక్తిభూమ్యోరల్పేసతియథారుచికార్యం-గేహస్యదక్షేపార్శ్వే - ఆచార్యైఃఘరట్టాదికంసూచితే - ఘరట్టః-పిష్టయంత్రం-అంబు-ఉదకం-ఉలూఖలాదికం - ప్రసిద్ధం - తథాచోక్తంగ్రంథాంతరే॥ శ్లో॥ ఉలూఖలంపిష్టయంత్ర మగ్నిస్థానజలాశ్రయం। వేశ్మనోదక్షిణేపార్శ్వే పితౄణాంపాదశౌచనమితి॥

— అథకేషుకేషుఆయాదికంభావ్యం కేషునభావ్యం తృణగృహే విశేషంనిష్పన్నే గృహేప్రవేశంప్రవేశేమాసవిశేషంచాహ. —

మూ॥ ద్వాత్రింశాధిక హస్తవద్భి వదనం తార్ణం త్వళిందాదికం
నైషాంవాయాదికమీరితంతృణగృహంసర్వేషుమాస్సూదితం।
ఛన్నంవశ్యకవాటమర్చి తతమంవేశ్మోక్తరీత్యావిశేదారం
భోదితమాస్సునారదమతాన్మాఘోర్జశుక్రేషుతు॥ ౧౫॥

టీక॥ ద్వాత్రింశాధికహస్తమ్ = ముప్పదిరెండుహస్తములకంటె నధికమైనదియును, అబ్ధివదనమ్=నాలుగుదిక్కులయందును ద్వారములుగ



లదియును, తార్ణమ్=తృణసంబంధమైనదియును, అళిందాదికంతు=పట్టిశాలాదికము, (అనుపట్టి) ఏషు = ఈగృహములయందు, ఆయాదికమ్= ఆయముమొదలగునది, నేరితమ్=చెప్పఁబడలేదు. సర్వేషు = సమస్తములయిన, మాస్సు=మాసములయందు, తృణగృహమ్ = తృణగృహము, ఉదితమ్=చెప్పఁబడినది, ఆరంభోదితమాస్సు=గృహారంభమునకుఁ జెప్పఁబడినమాసములయందు, ఉక్తరీత్యా=శాస్త్రమునందుఁ జెప్పఁబడిన విధముచేత, ఛన్నమ్= (గోడలచేత) కప్పఁబడినదియును, వశ్యకవాటం=స్వాధీనమైనతలుపుగలదియును, అర్చితతమం=చక్కఁగాఁ బూజింపఁబడినదియును, (అయిన) వేశ్మ=గృహమును, విశేత్=ప్రవేశించుము. నారదమతాత్=నారదునియొక్క మతమువలన, మాఘోర్జశుక్రేషుతు=మాఘకార్తికజ్యేష్ఠమాసములయందు, గృహం=గృహమును, విశేత్=ప్రవేశింపవలయును.

తా॥ ఏయేగృహములయందు ఆయాదికము భావింపఁదగినదో ఏయేగృహములయందు ఆయాదికము భావింపఁదగినదికాదో ఆవిషయమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః—ముప్పదిరెండు హస్తములకంటె అధికమైన పరిమితికలదియును, నాలుగువైపులను ద్వారములుగలదియును, తృణసంబంధమైనదియును, పట్టిశాల అను నామధేయముకలదియును, అయిన గృహములయందు ఆయాదికమును భావనచేయనక్కఱలేదని యెఱుఁగవలయును. మఱియును, సర్వమాసములయందును తృణగృహమును నిర్మింపవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ అళిందనిర్వ్యూహవిసర్గమార్గా శ్చతుర్ద్విశంయే గృహభూషణాయ। ఆయాదికంతేషునచింతనీయం యతోనతేవాస్తుపరిగ్రహేస్యుః॥" (=అళిందము, నిర్వ్యూహము, విసర్గమము, చతుర్ద్వారము, అనుపట్టి గృహములయందు ఆయాదికమును విచారింపనక్కఱలేదు.) అని దైవజ్ఞవల్లభముగ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ యత్రదైర్ఘ్యంగృహాదీనాంద్వాత్రింశార్థంతతోధికం। నతత్రచింతయేద్ధీమాన్ గణనాయవ్యయాదికం" (=గృహములయొక్క దైర్ఘ్యము ముప్పదిరెండుచేతులకంటె నధికముగనున్నపుడు బుద్ధిమంతుఁడగువాఁడు గణనాయవ్యయాదికమును విచారింపనక్కఱలేదు.) అని చింతామణియను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ ఆయవ్యయామాసశుద్ధిం చింతయేన్నతృణాలయే" (=ఆయవ్యయములను మాసశుద్ధిని తృణములచేత గృహమునకు విచారింపనక్కఱ

లేదు.) అని రాజమార్తండమను గ్రంథమునందుఁ జెప్పఁబడె. మఱియును, తృణగృహమును సర్వమాసములయందును నిర్మింపవచ్చునని యెఱుఁగవలయును. మఱియును, గృహారంభమునకుఁ జెప్పఁబడిన మాసములయందు శాస్త్రమునందుఁ జెప్పఁబడిన విధముచేత గృహప్రవేశమును జేయవలయును. గృహప్రవేశకాలమునందు గృహము కుడ్యములచేతఁ గప్పఁబడినదియును, స్వాధీనమైన కవాటములుకలదియును, తోరణాదులచేత అలంకరింపఁబడినదియును నై యుండవలయును. "శ్లో॥ అకవాటమనాచ్ఛన్నమదత్తబలిభోజనం। గృహంనప్రవిశేదేవ విపదామాకరంహితత్॥" (=కవాటములులేనిదియును, కప్పఁబడనిదియును, బలిభోజనాదులులేనిదియును, అయిన గృహమునందుఁ బ్రవేశించినయెడల విపత్తులు గలుగును.) అని నారదుఁడు చెప్పె. "శ్లో॥ స్వయముద్ఘాటితేరోగోపిహితేచకులక్షయః। మానాధికోనదిగ్భాగే, ద్వారేనీచే సుఖక్షయః॥" (=స్వయముగా తెరవఁబడిన గృహమునందుఁ బ్రవేశించినయెడల రోగముకలుగుననియును, కప్పఁబడని గృహమునందుఁ బ్రవేశించినయెడల కులనాశమగుననియును, మానాధికోనదిగ్భాగమునందు ద్వారముగల గృహమునందు ప్రవేశించినయెడల సుఖనాశమగును.) అని చ్యవనుఁడు చెప్పె. నారదమునివరుఁడు మాఘకార్తిక జ్యేష్ఠమాసములయందు గృహమునుప్రవేశించవలయును. మఱియును, తృణగృహమునందు సకలమాసములయందును ప్రవేశింపవచ్చునని యెఱుఁగవలయును. "శ్లో॥ ప్రవేశోమధ్యమోజ్ఞేయః సౌమ్యకార్తికమాసయోః। మాఘఫాల్గునవైశాఖ జ్యేష్ఠమాసేషు శోభనం॥" (=సౌమ్యకార్తికమాసములయందు గృహప్రవేశము మధ్యమమనియును, మాఘఫాల్గున వైశాఖ జ్యేష్ఠమాసములయందు గృహప్రవేశమును జేయుటచేత శుభములు గలుగును.) అని నారదుఁడు చెప్పె. "శ్లో॥ గృహారంభోదితైర్మాసైర్ధిష్ణ్యైర్వారైర్విశేద్గృహం॥" (=గృహారంభమునకు చెప్పఁబడిన మాసములును నక్షత్రములును వారములును గృహప్రవేశమునకుఁగూడ శ్రేష్ఠములయినవి. అని జ్యోతిఃప్రకాశమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ విశేత్సౌమ్యాయనేహర్మ్యంతృణాగారంచసర్వదా॥" (=ఉత్తరాయణమున హర్మ్యమునందుఁ బ్రవేశింపవలయును. సర్వకాలములయందును తృణాలయములోపల ప్రవేశింపవచ్చును.) అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ సౌమ్యాయనేశ్రావణమార్గ పౌషేజన్మర్క్ష లగ్నోపచయోదయాంతే। వామంగ



తేర్కే గ్రహావాస్తుపూజాం కృత్వావిశేద్వేశ్మభకూటశుద్ధమ్॥" (=ఉత్తరాయణమునందును శ్రావణమార్గశీర్ష మాసములయందును జన్మర్క్ష లగ్నములకుపచయస్థానములయందు సద్గ్రహములుండగను సూర్యుఁడు వామభాగమునందుండఁగను వాస్తుపూజనుచేసి గృహప్రవేశమును జేయవలయును.) అనివ్యవహారసారతత్త్వమునందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ అథకేషుకేషుగృహేషు ఆయాదికంభావ్యంకేషు నభావ్యమిత్యాహ॥ ద్వాత్రింశేతి॥ ద్వాత్రింశేభ్యః- అధికాఃహస్తాయస్మిన్ గృహేప్రమాణంతత్- ద్వాత్రింశాధికహస్తం- అబ్ధివదనం- చతుర్ముఖం-తార్ణంతృణగృహం- అళిందాదికంఅళిందం పట్టిశాలేతిలోకేప్రసిద్ధం- ఆదిశబ్దేననిర్వ్యూహాది గృహంభూషణంగృహ్యతే- ఏషుఆయాదికంనేరితంనోక్తం॥ తథాచదైవజ్ఞవల్లభే॥ శ్లో॥ అళిందనిర్వ్యూహవినిర్గమాద్యాశ్చతుర్దిశంయెగృహభూషణాయ। ఆయాదికంతేషునచింతనీయం యతోనతేవాస్తుపరిగ్రహేస్యురితి॥ తథాచచింతామణౌ॥ యత్రదైర్ఘ్యంగృహాదీనాం ద్వాత్రింశార్ధంతతోధికం। నతత్రచింతయేద్ధీమాన్ గణనాయావ్యయాదికమితి॥ తథాచరాజమార్తండే॥ శ్లో॥ ఆయవ్యయామాసశుద్ధించిన్తయేన్నతృణాలయేఇతి॥ తథాచవసిష్ఠః॥ ఏకాదశయవాదూర్ధ్వం యావద్ద్వాత్రింశహస్తకం। తావదాయాదికంచిన్త్యం తదూర్ధ్వంనైవచిన్తయేదితి॥ అథతృణగృహేవిశేషమాహ॥ తృణగృహంసర్వేషుమాస్వాదితం। సర్వమాసేషుకర్తవ్యమిత్యర్థః - అథనిష్పన్నేగృహే ప్రవేశమాహ॥ ఆరమ్భోదితమాసేషు శాస్త్రరీత్యావేశ్మగృహంవిశేత్ - ఆరమ్భాయఉదితాః- ప్రోక్తాస్తేచతేమాసాశ్చ తేషుశాస్త్రరీత్యా- సూత్రోద్యుక్తవిధినా- గృహంప్రవిశేత్ - స్వామీత్యర్థః - కథంభూతంవేశ్మ - ఛన్నంకుడ్యైరాచ్ఛాదితం- పునఃకింలక్షణం- వశ్యకవాటం- వశ్యంఅధీనంకవాటంయస్యతత్తథా- తద్వశ్యమితి॥ చాలితఉద్ఘాటితేవాతస్థైవస్థిరంభవతి - పునఃకింలక్షణంఅర్చితతమం - తోరణమాలాద్యలంకృతం॥ తథాచ నారదః॥ అకవాటమనాచ్ఛన్నమదత్తబలిభోజనం। గృహంనప్రవిశేదేవ విపదామాకరంహితదితి॥ తథాచచ్యవనః॥ స్వయముద్ఘాటితేరోగోపిహితేచకులక్షయః। మానాధికోనదిగ్భాగే ద్వారేనీచేసుఖక్షయఇతి॥ అథప్రవేశేమాసవిశేషమాహ॥ నారదమతాత్ - మాఘోర్జశుక్రేషుమాసేషుగృహంప్రవిశేత్- మాఘః- ప్ర- ఊర్జఃకార్తికః - శుక్రోజ్యేష్ఠః ఏషు గృహంప్రవిశేదిత్యర్థః - ఆరంభోదితమాంస్త్వేవాస్యనేష తృణగృహస్యసర్వ

మాసేషువిహితత్వాత్- ప్రవేశోపిసర్వమాసేషువిహితః ॥ తథాచనారదః ॥ ప్రవేశోమధ్యమోజ్ఞేయస్సౌమ్యకార్తికమాసయోః । మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసేషుశోభనఇతి॥ తథాచజ్యోతిప్రకాశే॥ గృహారంభోదితైర్మాసైర్ధిష్ణ్యైర్వా రేవిశేద్గృహమితి ॥ తథాచగ్రంథాంతరే ॥ విశేత్సౌమ్యాయనేహర్మ్యం తృణాగారంతుసర్వదేతి ॥ తథాచవ్యవహారసారతత్త్వే ॥ సౌమ్యాయనేశ్రావణమార్గపౌషె జన్మర్క్షలగ్నోపచయోదయాంతే । వామంగతేరవిగ్రహవాస్తుపూజాం కృత్వావిశేద్వేశ్మభకూటశుద్ధమితి॥

అథఅపూర్వాదిప్రవేశాన్గృహకృత్యవిషయే దినరాత్రివిశేషనిర్ణయం కలశవాస్తుశుద్ధించాహ.

మూ॥ ప్రారంభోదితభైఃప్రవేశఉదితోఽపూర్వస్సపూర్వస్థిరై
ర్మైత్రైశ్చాచ్యుతమూలదస్రసహితైరారంభభైర్వ్యత్ర
కః। కృత్యంవేశ్మభవందివైవవిహితం రాత్రౌప్రవేశఃక్వచి
త్సూర్యర్క్షాదిభపంచకంమనుమితాదష్టప్రవేశేనసత్ ॥౨౦॥

టీక॥ ప్రారంభోదితభైః = గృహారంభమునకుఁ జెప్పఁబడిన నక్షత్రములచేత. అపూర్వః=క్రొత్తదైన. ప్రవేశః=ప్రవేశము. ఉదితః=చెప్పఁబడెను. స్థిరైః=రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనునక్షత్రములచేతను. మైత్రైః=అనూరాధ, రేవతి, మృగశీర్ష, చిత్త, అనునక్షత్రములచేతను. అచ్యుతమూలదస్రసహితైః=శ్రవణము, మూల, అశ్విని, అనునక్షత్రములతోఁగూడిన. ఆరంభభైః=గృహారంభ నక్షత్రములచేతను. వ్యత్రకః=యాత్రావసానసంబంధమైనదియును. అపూర్వః=నూతనముకానిదియును. (అయిన.) ప్రవేశః=ప్రవేశము. ఉదితః=చెప్పఁబడెను. వేశ్మభవమ్=గృహమువలనఁబుట్టిన. కృత్యమ్=కార్యము. దివైవ=పగటియందే. విహితమ్=చెప్పఁబడినది. క్వచిత్=ఒకానొకప్పుడు. రాత్రౌ=రాత్రియందు. ప్రవేశః=గృహప్రవేశము. ఉదితః=చెప్పఁబడెను. సూర్యర్క్షాదిభపంచకం=సూర్యస్థితనక్షత్రము మొదలుకొని యైదవనక్షత్రను. మనుమితాత్-పదునాల్గవనక్షత్రముకంటె. అష్ట=ఎనిమిదినక్షత్రములును. ప్రవేశే=ప్రవేశమునందు. సత్=యోగ్యమైనది. న=కాదు.

తా॥ ఇప్పుడు అపూర్వాదిప్రవేశములను, గృహకృత్యవిషయమై దినరాత్రివిశేషనిర్ణయమును, కలశవాస్తుశుద్ధియును, ఈ శ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనినః—గృహారంభమునకుఁ జెప్పఁబడిననక్షత్రములే



నూతనగృహప్రవేశమునకుఁ దగినవని యెఱుఁగవలయును. మఱియును, నూతనగృహప్రవేశమునందు గృహారంభమునకుఁ జెప్పఁబడిన నక్షత్రములేగాక గృహారంభమునకుఁ జెప్పఁబడిన తిథివారరాశ్యాదులనుగూడ గ్రహింపవలయును. మఱియును, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, మూల, అశ్విని, అనునట్టినక్షత్రములయందు యాత్రచేసివచ్చినప్పటి గృహప్రవేశము శ్రేష్ఠమైనదని యెఱుఁగవలయును. "శ్లో॥ అపూర్వఃప్రవేశోగృహారంభధిష్ణ్యైర్విధేయఃకరోమధ్యమోత్రేతి కేచిత్ । సపూర్వస్థిరైర్మిత్రభై రేవతుద్ధ్యై రతోన్యోఽశ్వి మూలాచ్యుతారంభధిష్ణ్యైః॥" (=నూతనగృహప్రవేశము గృహారంభమునకుఁ జెప్పఁబడిననక్షత్రములచేతఁ జేయవలయును. నూతనగృహప్రవేశమునకు అనూరాధ, రేవతి, మృగశీర్ష, కృత్తిక, విశాఖ, అశ్విని, మూల, శ్రవణము, గృహారంభనక్షత్రములు అనునక్షత్రములు శ్రేష్ఠములయినవని యెఱుఁగవలయును.) అనిజ్యోతిఃప్రకాశమునందుఁ జెప్పఁబడెను. "శ్లో॥ అపూర్వసంజ్ఞంప్రథమంప్రవేశం యాత్రావసానేచసపూర్వసంజ్ఞం । ద్వంద్వాహ్వయంచాగ్నిభయాదిజాతం గృహప్రవేశంత్రివిధంవదంతి॥" (=మొదటిగృహప్రవేశము అపూర్వప్రవేశమనియును, యాత్రావసానమందలి గృహప్రవేశము సపూర్వమనియును, అగ్నిభయాదులవలనఁగలిగినది ద్వంద్వమనియును, గృహప్రవేశము మూఁడువిధములు.) అనివసిష్ఠుఁడు చెప్పె. మఱియును, గృహసంబంధములయినకార్యములు పగటియందే చేయవలయుననియును, ఒకానొకప్పుడు అనఁగా, ముహూర్తాదులు దొరకనప్పుడు రాత్రియందుఁగూడ గృహారంభాదికార్యములను జేయవచ్చుననియును, తెలియవలయును. "శ్లో ॥ దివాప్రవేశశ్శుభదస్సుపుత్రపౌత్రాభివృద్ధ్యై నిశిభాస్కరేందోః । బలేనమత్స్యస్యజవాసరస్య రాత్రింవినాసూర్యతిథిశ్చరాత్రిమ్॥" (=పగటియందు గృహప్రవేశమును జేయుటచేత పుత్రపౌత్రాభివృద్ధికలుగును. రాత్రులయందయ్యేనేని చంద్రసూర్యులు బలవంతులైరేని గృహప్రవేశము శుభములనుగలిగించును.) అనివసిష్ఠుఁడు చెప్పె. మఱియును, సూర్యుఁడున్ననక్షత్రమునకు అయిదవనక్షత్రమును సూర్యనక్షత్రమునకు పదునాల్గవనక్షత్రమునకు పిమ్మట ఎనిమిదినక్షత్రములును గృహప్రవేశమునకు శుభకరములుగావని యెఱుఁగవలయును. మఱియును, ఇప్పుడుచెప్పఁబడిన నక్షత్రములుగాక మిగిలిననక్షత్రములు శుభకరములయినవని యెఱుఁగవలయును.

వ్యా॥ ఇదానీమపూర్వాదిప్రవేశానాహ ॥ ప్రారమ్భాదితస్థైరితి॥ ప్రారమ్భాదితస్థైః- గృహప్రారమ్భాదిస్థైఃనక్షత్రైఃఅపూర్వైః- ప్రవేశఃఉదితః- మునీంద్రైరిత్యధ్యాహారః - అత్రప్రారమ్భాదితస్థైరిత్యుపలక్షణం- తేనప్రారమ్భాదితతిథివారాదికంసర్వంగ్రాహ్యం - అపూర్వోనామనూతనగృహేప్రథమఃప్రవేశఉచ్యతే । స్థిరైరైక్త్రైశ్చనక్షత్రైః సపూర్వఃప్రవేశఉదితః- సపూర్వోనామయాత్రావసానేయఃక్రియతే ॥ తథాచజ్యోతిఃప్రకాశే ॥ అపూర్వఃప్రవేశోగృహారంభధిష్ణ్యైర్విధేయః కరోమధ్యమైత్రేతికేచిత్ । సపూర్వస్థిరైక్షిప్రమైత్రై రేవశుద్ధై రతోన్యైశ్చ మూలాచ్యుతారంభధిష్ణ్యైః ॥ వసిష్ఠః ॥ అపూర్వసంజ్ఞంప్రథమంప్రవేశంయాత్రావసానేచసపూర్వసంజ్ఞం । ద్వంద్వాహ్వయంచాగ్నిభయాదిజాతం గృహప్రవేశంత్రివిధంవదంతి ॥ అథగృహాకృత్యవిషయే దినరాత్రివిశేషనిర్ణయమాహ ॥ కృత్యంవేశ్మభవమితి ॥ వేశ్మభవం- గృహభవం యత్కించిత్కృత్యం - తద్దివైవవిహితంనరాత్రౌక్వచిద్దివా ముహూర్తాభావేసతి- రాత్రౌప్రవేశోవిహితః - నాన్యత్ ॥ తథాచవసిష్ఠః ॥ దివాప్రవేశశ్శుభదస్సు పుత్రపౌత్రాభివృద్ధ్యైనిశిభాస్కరేందోః ॥ అథకలశవాస్తుశుద్ధిమాహ ॥ సూర్యర్క్షాదితి ॥ సూర్యర్క్షాదిభపంచకం సూర్యనక్షత్రాదినక్షత్రపంచకం- తథా- సూర్యాదిమనుమితాన్నక్షత్రాదష్ట- నక్షత్రాష్టకంప్రవేశేనసత్- నశుభంస్యాత్- అన్యానిశుభానీత్యర్థాత్సిద్ధం- అత్రపూర్వోక్తానాం నక్షత్రాణాంశుభాశుభత్వం జ్ఞాతవ్యం॥

—— అథప్రవేశేలగ్నశుద్ధింవామసూర్యలక్షణంచాహ. ——

మూ॥ లగ్నేచోపచయస్థితేరవిముఖైః ప్రారంభవత్సంస్థితైస్సూర్యేవామగతేస్వదిగ్వదనభై ర్వేశ్మప్రవేశశ్శుభః । రంధ్రేషుద్విభవేభ్యఆసుతగత స్సూర్యోయదాస్యాత్తదాపూర్వాద్యాననమాలయంప్రవిశతాం స్యాద్వామగోస్యాత్క్రమాత్॥ ౨౧॥

టీక॥ ఉపచయస్థితే=జన్మలగ్నజన్మరాసులకంటె. ఉపచయస్థితే= ఉపచయస్థానమునందున్న. లగ్నేచ=లగ్నమునందును. ప్రారంభవత్సంస్థితైః=గృహారంభకాలమునందువలెనున్నట్టి. రవిముఖైః=సూర్యాదిగ్రహములచేత. సూర్యే=సూర్యుఁడు. వామగతేసతి = వామభాగమునందున్నవాఁడగుచుండఁగా. స్వదిగ్వదనభైః = గృహద్వారమునకుఅభిముఖములగునక్షత్రములచేత. వేశ్మప్రవేశః=గృహప్రవేశము. శుభః=శుభకరమైనది.



రంధ్రేషుద్విభవేభ్యః= (లగ్నమునకు) ఎనిమిది అయిదు రెండు పదునొకండు రాసులకంటె, సూర్యః=సూర్యుఁడు, యదా = ఎప్పుడు, ఆసుతగతః=పంచమస్థానమువఱకును పొందినవాఁడు, స్యాత్=అగునో, తదా=అప్పుడు, పూర్వాద్యాననమ్ = తూర్పుదిక్కు మొదలుగాఁగల దిక్కులయందు ద్వారముగల, ఆలయమ్=గృహమును, ప్రవిశతామ్ = ప్రవేశించుచున్నవారలకు, క్రమాత్=క్రమముగా, వామగః=వామదిక్కునుపొందినవాఁడు, స్యాత్=అగును.

తా॥ గృహప్రవేశకాలమునందలి లగ్నశుద్ధిని వామసూర్యలక్షణమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః—జన్మలగ్నజన్మరాసులకు ఉపచయస్థానమగు స్థిరలగ్నమునందు గృహప్రవేశము శ్రేష్ఠమైనదని యెఱుఁగవలయును. మఱియును, సూర్యుఁడు వామభాగమునందుండఁగను, సూర్యాదిగ్రహములు గృహారంభకాలమునందువలె నున్నవారగుచునుండఁగను గృహద్వారమునందు ముఖముగల నక్షత్రములుగల దినమునందు గృహప్రవేశమును జేయుటచేత మేలుగలుగునని యెఱుఁగవలయును. మఱియును, ప్రవేశకాలీనలగ్నము యొక్క ఎనిమిది అయిదు రెండు పదునొకండు స్థానములకు పంచమస్థానము వఱకునుగల సూర్యుఁడు క్రమముగా తూర్పుదిక్కు మొదలుగాఁగల దిక్కులయందు ద్వారములుగల గృహములయందుఁ బ్రవేశించుచున్నవారికి వామభాగమునందున్నవాఁడగునని యెఱుఁగవలయును. మఱియును, పూర్వాభిముఖమగు గృహమునందుఁ బ్రవేశించువారికి లగ్నాష్టమమునకు అయిదవస్థానము వఱకునుగల సూర్యుఁడు వామభాగమునందున్నవాఁడనియును, దక్షిణాభిముఖమగు గృహమునందు ప్రవేశించువారికి, లగ్నపంచమమునకు అయిదవస్థానమువఱకును నున్నసూర్యుఁడు వామభాగమునందున్నవాఁడగునని యును, పశ్చిమాభిముఖమయిన గృహమునందు ప్రవేశించుచున్నవారికి లగ్నద్వితీయస్థానమునకు అయిదవ స్థానమువఱకును నున్నసూర్యుఁడు వామభాగమందున్న వాఁడగుననియును, ఉత్తరాభిముఖమైన గృహమునందు ప్రవేశించువారికి లగ్నైకాదశమువఱకును పంచమస్థానమువఱకునుగల సూర్యుఁడు వామభాగమునందున్న వాఁడగుననియును, తెలియవలయును.

వ్యా॥ అథ ప్రవేశే లగ్నశుద్ధిమాహ॥ లగ్నేఇతి॥ ఉపచయస్థితేలగ్నేఇష్టర్క్ష జన్మలగ్నాభ్యాం ఉపచయావస్థితే లగ్నేవేశ్మప్రవేశ శ్శుభ

స్యాత్ - తైః-రహిముఖైః-సూర్యాద్యైః-ప్రారంభవత్సంస్థితైః - గృహారంభార్థముక్తం, తద్వత్సంస్థితైరిత్యర్థః - కస్మిన్ సతి-సూర్యే వామగతే సతి-పునః కైః - స్వదిగ్వదనభైః-యద్దిఙ్ముఖంగృహం - తద్దిఙ్ముఖైః ప్రవేశోదితైర్నక్షత్రైరిత్యర్థః॥ అథవామసూర్యలక్షణమాహ॥ రంధ్రఇతి॥ రంధ్రే౮ షు౫ ద్వి౨ భవే౧౧ భ్యః-లగ్నాది అష్టమపంచమ ద్వితీయైకాదశేభ్యస్సకాశాత్ - ఉసుతగతః- ఆపంచమగతః - సూర్యోయదాస్యాత్తదాపూర్వాద్యానమాలయం పూర్వాదిముఖం గృహంప్రవిశతాం - మనుష్యాణాం అసౌసూర్యః-క్రమాద్వామగః-స్యాత్ ఏతదుక్తంభవతి॥ అష్టమాత్పంచసువర్తమానోర్కః - పూర్వాభిముఖగృహేప్రవిశతాం - వామో భవతి-పంచమాత్పంచసుగతో దక్షిణాముఖే గృహేప్రవిశతాం-వామో భవతీత్యర్థః॥ ఇతి వాస్తుప్రకరణం సమాప్తమ్.

## అథయాత్రాప్రకరణమ్ - యాత్రాయాం శుభాశుభవారాదీనాహ.

మూ॥ వారేచోపచయావహస్యసుదశాస్విష్టం ప్రయాణంజగుః క
ర్ణాంత్యాదితితోద్వికేషుమృగమైత్రారేషునోజన్మభే।సా
ర్పార్ద్రాగ్నియమాజపాద పితృషుత్వాష్ట్రేత్రయేచాశు
భంరిక్తా ౪।౯-౧౪ పర్వ౧౫-౩౦ గుహా౬ష్టమీ౮హరి౧౨సి
తాస్యేషుజ్ఞశుక్రోన్ముఖమ్॥ ౧॥

టీక॥ సుదశాసు = శుభకరములయిన దశాంతర్దశావిదశలయందును, ఉపచయావహస్య=ఉపచయస్థానమును పొందినగ్రహముయొక్క, వారే=వారమునందును, ప్రయాణమ్=ప్రయాణమును, ఇష్టమ్=శుభమైనదానినిగా, జగుః=చెప్పుచున్నారు. కర్ణాంత్యాదితితోద్వికేషు =శ్రవణము, ధనిష్ఠ, రేవతి, అశ్విని, పునర్వసు, పుష్యమి, అనునట్టి నక్షత్రములయందును, మృగమైత్రారేషు=మృగశీర్ష, అనూరాధ, హస్త, అనునక్షత్రములయందును, ప్రయాణమ్=ప్రయాణమును, ఇష్టమ్=శుభమైనదానినిగా, జగుః=చెప్పుచున్నారు. జన్మభే = (ఇప్పుడు జెప్పఁబడిన నక్షత్రములలోఁగూడ) జన్మనక్షత్రమునందు, ప్రయాణమ్=ప్రయాణమును, ఇష్టమ్=శుభమైనదానినిగా, నోజగుః=చెప్పుచుండలేదు. సార్పార్ద్రాగ్నియమాజపాదపితృషు=ఆశ్రేష, ఆర్ద్ర, కృత్తిక, భరణి, పూర్వాభాద్రపద, మఖ, అను నక్షత్రములయందును, త్వాష్ట్రేత్రయేచ=చిత్త, స్వాతి, విశాఖ, అనునట్టి నక్షత్రములయందును, ప్రయాణం=ప్రయాణమును, అశుభం=



అశుభమైనదానినిగా, జగుః=చెప్పుచున్నారు. రిక్తాపర్వగుహాష్టమీహరిసితాస్యేషు=రిక్తతిథులు, పర్వతిథులు, షష్ఠి, అష్టమి, ద్వాదశి, శుక్లప్రతిపత్తు, అనునట్టి తిథులయందు, ప్రయాణం = ప్రయాణమును, అశుభం= అశుభమైనదానినిగా, జగుః=చెప్పుచున్నారు. జ్ఞశుక్రోన్ముఖం = బుధశుక్రులకు అభిముఖముగా, ప్రయాణం=ప్రయాణమును, అశుభం=అశుభమైనదానినిగా, జగుః=చెప్పుచున్నారు.

తా॥ ఇఁకను యాత్రాప్రకరణము చెప్పఁబడుచున్నది. యాత్రయందలి శుభాశుభవారాదులను జెప్పుచున్నాఁడు. శుభగ్రహముల యొక్క దశాంతర్దశావిదశలయందును ఉపచయస్థానమునందున్న శుభగ్రహములయొక్క వారములయందును, గోచారగ్రహములు శుభస్థానములయందున్న కాలమునందును, శ్రవణము, ధనిష్ఠ రేవతి అశ్విని పునర్వసు పుష్యమి మృగశీర్ష అనూరాధ హస్త అనునట్టి నక్షత్రములయందును ప్రయాణము శుభకరమైనదని పూజ్యులగువారు చెప్పుచున్నారు. మఱియును, ఇప్పుడు చెప్పఁబడిన నక్షత్రములలోఁగూడ జన్మనక్షత్రమునందు ప్రయాణము శుభకరమైనదికాదని యెఱుఁగవలయును. మఱియును, ఆశ్రేష, ఆర్ద్ర, కృత్తిక, భరణి, పూర్వాభాద్రపద, మఖ, చిత్త, స్వాతి, విశాఖ, అనునట్టి నక్షత్రములయందు ప్రయాణము శుభకరమైనదిగాదని యెఱుఁగవలయును. మఱియును, చవితి, నవమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, షష్ఠి, అష్టమి, ద్వాదశి, శుక్లప్రతిపత్తు, అను తిథులయందు ప్రయాణమును చేయుటవలన అశుభములు కలుగునని యెఱుఁగవలయును. మఱియును, బుధుఁడు శుక్రుడు అను నిరువురును అభిముఖముగనున్నపుడు ప్రయాణమును చేయుటచేత అశుభములు కలుగునని యెఱుఁగవలయును, మఱియును, ఇప్పుడు చెప్పఁబడిన శుభాశుభ నక్షత్రాదులుగాక ఇతరములగు తిథివార నక్షత్రాదులయందు ప్రయాణము అధమఫలమును కలుగఁజేయునని యెఱుఁగవలయును.

వ్యా॥ అథయాత్రాప్రకరణం వ్యాఖ్యాయతే॥ తత్రాదౌకస్మిన్ కాలే యాత్రాకర్తవ్యేత్యాహ॥ వారేచేతి॥ సుదశాసు-శోభనదశాంతర్దశావిదశోపదశాసు - ఉపచయావహస్య గ్రహస్యవారే - గోచరాష్టకవర్గాదౌ-శుభఫలగ్రహవారే ప్రయాణమిష్టంశుభం జగురాచార్యాః - కేషు-కర్ణాంత్యాదితి భద్వికేషు-కర్ణః-శ్రవణః - అంత్యం రేవతీ- అదితిభం పునర్వసుః-ఏషాంద్వికః - శ్రవణధనిష్ఠే - రేవత్యశ్విన్యౌ - పునర్వసుపుష్యౌ-

ఏష్విత్యర్థః-పునః కేషు-మృగమైత్రార్కేషు - మృగః ప్రసిద్ధః - మైత్రమనూరాధా-అర్కో-హస్తః - ఏషు నవనక్షత్రేషు - ప్రయాణం శుభమిత్యర్థః - తత్రవిశేషమాహ॥ నోజన్మభ ఇతి॥ జన్మభే-జన్మనక్షత్రే - శ్రవణాద్యన్యతమేపి - యానం శుభం నోజగుః- అథయేష్వశుభం తాన్యాహ॥ సార్పేతి॥ సార్పమాశ్లేషా-ఆర్ద్రా ప్రసిద్ధా - అగ్నిః కృత్తికా-యమో భరణీ- అజైకపాత్పూర్వాభాద్రపదా - పితరో మఘా ఏతేషు - త్వాష్ట్రత్రయే-చిత్రాత్రయేచ-ఏషు నవనక్షత్రేషు-యానమశుభంజగుః - అన్యానినవనక్షత్రాణి మధ్యమానీత్యర్థతస్సిద్ధం - అథయానుతిథిషు అశుభంతదాహ॥ చతుర్థీనవమీచతుర్దశ్యః-పర్వణీ-పూర్ణిమామావాస్యే - గుహష్షష్ఠీ - అష్టమీ-ప్రసిద్ధా-హరిర్ద్వాదశీ-సితాస్యం - శుక్లప్రతిపత్ - ఏషు ప్రయాణం యానమశుభంజగుః - అర్థాదన్యాసు తిథిషు శుభం - అన్యద్దుష్టమాహ॥ జ్ఞేతి॥ జ్ఞో బుధః-శుక్రః ప్రసిద్ధః - ఏతయోర్యారున్ముఖం సమ్ముఖం యానం ఉక్తేష్వపి తిథినక్షత్రాదిషు అశుభంజగుః- బుధశుక్రసన్ముఖం గమనం నకర్తవ్యమిత్యర్థః॥

——(*) అథశూలాన్ యోగినీశ్చాహ (*)——

మూ॥ ప్రాక్చంద్రాసిత శక్రభం వసుపరార్ధాత్పంచభేజ్యానపా
క్పశ్చాత్కారకసితానుదక్కుజ బుధార్యమ్ణస్త్యజేచ్ఛూ
లకాన్। త్రింశాష్టానవభూమయోగ్నిగిరిశా విశ్వేషవో
ర్కాబ్ధయష్షట్చక్రా స్తిథిపర్వతాదశ దృశోప్యేతాంస్తిథీ
నీశతః॥ ౨॥

టీక॥ ప్రాక్=తూర్పుదిక్కునందు. చంద్రాసితశక్రభమ్. సోమవారశుక్రవారములను జ్యేష్ఠానక్షత్రమును త్యజేత్=విడువవలయును. అవాక్=దక్షిణపుదిక్కునందు. వసుపరార్ధాత్=ధనిష్ఠోత్తరా నక్షత్రములలోన గమునక్షత్రములు మొదలుకొని. పంచభేజ్యాన్=అయిదునక్షత్రములను గురువారములను. త్యజేత్=విడువవలయును. పశ్చాత్=పడమటిదిక్కునందును. కారకసితాన్=రోహిణీనక్షత్రమును రవిశుక్రవారములను. త్యజేత్=విడువవలయును. కుజబుధార్యమ్ణః=మంగళబుధవారములను ఉత్తరాఫల్గునీనక్షత్రములను. త్యజేత్=విడువవలయును. ఏతాన్=ఇప్పుడు చెప్పఁబడినవానిని. శూలకాన్=శూలలనుగా. జానీయాత్=తెలియవలయును. ఈశతః=ఈశాన్యదిక్కు మొదలుకొని. త్రింశాష్టా=ముప్పదియవదియును, ఎనిమిదవదియును. (అయిన) తిథీన్=తిథులను. నవభూమయః=నవమీప్రతిపత్తులనియెడు. తిథీన్=తిథులను. అగ్నిగిరిశా=తృతీయ ఏకాదశిలనియెడు.



తిథీన్=తిథులను. విశ్వేషవః=త్రయోదశిపంచమిలనియెడు. తిథీన్=తిథులను. అర్కాబ్ధయః=ద్వాదశీచతుర్థీలనియెడు. తిథీన్=తిథులను. షట్చక్రాః=షష్ఠి, చతుర్దశిఅనియెడు. తిథీన్=తిథులను. తిథిపర్వతాః = పదునైదవది (పూర్ణిమ) సప్తమి అనియెడు. తిథీన్=తిథులను. దశదృశః + అపి=దశమి విదియఅనియెడు. తిథీన్=తిథులను. త్యజేత్=విడువవలయును.

తా॥ వారశూలలను యోగినులను ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః——సోమశనివారములయందును జ్యేష్ఠానక్షత్రమునందును, తూర్పుదిక్కునకు ప్రయాణమును జేయఁగూడదు. ధనిష్ఠానక్షత్రముయొక్కయును ఉత్తరానక్షత్రముయొక్కయును నగము మొదలుకొనిన్వైదునక్షత్రములయందును, బృహస్పతివారమునందును, దక్షిణదిక్కునకు ప్రయాణమును జేయఁగూడదు. రోహిణీనక్షత్రమునందును, భానువారశుక్రవారములయందును, పడమటిదిక్కునకు ప్రయాణమును చేయఁగూడదు. బుధమంగళవారములయందును ఉత్తరాఫల్గునీనక్షత్రమందును ఉత్తరదిక్కునకు ప్రయాణమును జేయఁగూడదు. అమావాస్యఅష్టమిఅనియెడుతిథులు ఈశాన్యదిక్కునందును, నవమి, పాడ్యమి, అనియెడుతిథులు తూర్పుదిక్కునందును, తదియ, ఏకాదశి, అనియెడుతిథులు ఆగ్నేయదిక్కునందును, త్రయోదశి పంచమిఅనియెడుతిథులు దక్షిణపుదిక్కునందును, ద్వాదశి చవితిఅనియెడుతిథులు నిఋతిదిక్కునందును, షష్ఠి చతుర్దశిఅనియెడుతిథులు పశ్చిమదిక్కునందును, పూర్ణిమాసప్తములు వాయవ్యదిక్కునందును, దశమీ ద్వితీయలు అనియెడు తిథులు నుత్తరదిక్కునందును ప్రయాణము చేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, ఇవిశ యోగినులనియును, తెలియవలయును.

వ్యా॥ అథశూలానాహ॥ ప్రాగితి॥ ప్రాక్పూర్వస్యాందిశి చంద్రాసితశక్రభంత్యజేత్- చంద్రః- సోమవారః - అసితశ్శనివారః- శక్రభం జ్యేష్ఠా- ఏతత్త్రియం- పూర్వదిశిత్యజేదిత్యర్థః- అవాక్ దక్షిణస్యాం- వసుపరార్ధాత్- ధనిష్ఠోత్తరార్ధాత్- పంచనక్షత్రాణి - ఇజ్యోబృహస్పతివారః ఏతాన్- దక్షిణస్యాంత్యజేత్ - పశ్చాత్పశ్చిమస్యాందిశి - కారకసితాంస్త్యజేత్- కః- రోహిణీ - అర్కో-రవిః - సితశ్శుక్రః - ఏతాన్పశ్చిమాయాంత్యజేదిత్యర్థః- ఉదక్- ఉత్తరస్యాందిశి - కుజబుధార్యమ్ణస్త్యజేత్ కజో మంగళవారః- బుధః- ప్రసిద్ధః-అర్యమనామోత్తరాఫల్గునీ- ఏతాన్ శూలకాన్- ఉత్తరస్యాంత్యజేత్- శూలపదస్యప్రత్యేకంసంబన్ధః అథయో

గనిమాహ ॥ త్రింశోష్టావితి ॥ ఏతాన్ ప్రత్యేకపదగతాన్ తిథీన్ - ఈశతః- ఈశాన్యాస్సకాశాత్- ప్రదక్షిణక్రమేణజహ్యాః- ఏతాం స్తిథీంస్త్యజేత్- ఏతేకే- త్రింశా-౩౦- ష్టా-౮- ఈశాన్యాం- నవ-౯- భూమయః-౧ ప్రాచ్యాం- అగ్ని-౩- గిరిశాః-౧౧ - ఆగ్నేయ్యాం- విశ్వేషవ-౧౩-౫-దక్షిణస్యాం- అర్కాబ్ధయః- ౧౨-౪- నైరృత్యాం- షట్-౬- శక్రాః-౧౪- పశ్చిమాయాం- తిథి-౧౫- పర్వతాః-౭- వాయవ్యాం- దశ-౧౦- దృశ-౨- ఉత్తరస్యాం- అత్రాంకన్యాసఏవవ్యాఖ్యానం॥

అథాన్యన్నింద్యం- అన్యప్రయోజనం- ఆవశ్యకేకృత్యే ప్రయోజనంచాహ.

మూ॥ ఐంద్ర్యాద్యగ్నిభసప్త సప్తభగణే వాయ్వగ్నికాష్ఠాస్థితో
నోల్లంఘ్యః పరిఘస్త్వవాగరుణభైః ప్రాచ్యైరుదఙ్నవ్ర
జేత్। సర్వాశాసురవీజ్యమిత్రతురగైర్యాయాదథావశ్య
కేహిత్వాశూలమనిష్టభైర్యదినిజాశేష్టాంగలబ్ధిర్వ్రజేత్ ॥౫

టీక॥ ఐంద్ర్యాద్యగ్నిభసప్తసప్తభగణే = తూర్పుదిక్కు మొదలు గాఁగలదిక్కులయందు కృత్తికానక్షత్రము మొదలుకొని యేడేసినక్షత్రము లగణమందు. వాయ్వగ్నికాష్ఠాస్థితః = వాయవ్యాగ్నేయ దిక్కులయందున్న. పరిఘః=పరిఘ. నోల్లంఘ్యః=అతిక్రమింపఁదగినది కాదు. వరుణభైః= ప్రతీచ్యములయిననక్షత్రముల చేత. అవాక్=దక్షిణపుదిక్కునందు. వ్రజేత్=పోవలయును. ప్రాచ్యైః=ప్రాగ్దిక్కునందలి నక్షత్రముల చేత. ఉదక్= ఉత్తరపుదిక్కునందు. నవ్రజేత్=పోఁగూడదు. సర్వాశాసు=సకలదిక్కులయందును. రవీజ్యమిత్రతురగైః=హస్త, పుష్యమి, అనూరాధ, అశ్విని, అనునట్టినక్షత్రముల చేత. యాయాత్=పోవలయును. అథ=పిమ్మట. అవశ్యకే=పోకతప్పనికార్యమునందు. శూలమ్=శూలను. హిత్వా=విడిచిపెట్టి. నిజాశేష్టాంగలబ్ధిః=యది=తానుపోఁదలఁచినదిక్కునం దిష్టమైన లగ్నము ప్రాప్తించెనేని. అనిష్టభైః=అనిష్టములయిన నక్షత్రముల చేత. వ్రజేత్= పోవలయును.

తా॥ నింద్యములయిన యితరనక్షత్రములను, ఇతరప్రయోజనములను, ఆవశ్యకమగుపనియందలిప్రయోజనమును, ఈశ్లోకము చేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—సప్తశలాకాచక్రమును నిర్మించి సప్తరేఖలయందును ఈశాన్యదిక్కునం దారంభించి కృత్తికానక్షత్రము మొదలుకొని యేడునక్షత్రములను వ్రాయవలయును. పిమ్మట దక్షిణదిక్కునుపొందిన రేఖల



యందు ఏడునక్షత్రములను వ్రాయవలయును. అనంతరమందు పశ్చిమోత్తరరేఖలయందుఁగూడ ఇటులనే వ్రాయవలయును. ఇట్లు వ్రాసినపిమ్మట ఆగ్నేయదిక్కు మొదలుకొని వాయవ్యదిక్కువఱకును ఒకరేఖనుగీయవలయును. ఈరేఖకే పరిఘయని నామము కలిగియుండును. పిమ్మట వాయవ్యాగ్నేయదిక్కులను పొందిన రేఖయగు పరిఘ అతిక్రమింపఁదగినది కాదు. వరుణదిగ్గతములయిననక్షత్రముల చేత ఆగ్నేయదిక్కునందు ప్రయాణమును చేయవలయును. ప్రాగ్దిక్కునందలినక్షత్రముల చేత ఉత్తరదిక్కునందు ప్రయాణమును చేయవలయును. మఱియును, సకలదిక్కులయందును హస్త పుష్యమి అనూరాధ అశ్విని అనునట్టినక్షత్రములు గమనమును చేయుటకుఁదగినవని తెలియవలయును. మఱియును, ప్రయాణము మిగుల నావశ్యకమైనదగుచునుండఁగా శూలను వదలి తానుపోఁదలఁచినదిక్కున కుచితమైనలగ్నము దొరకినపుడు నింద్యములగు నక్షత్రములయందుఁగూడఁ ప్రయాణమును చేయవచ్చునని యెఱుఁగవలయును.

వ్యా॥ అథాన్యన్నింద్యమాహ ॥ ఐంద్ర్యేతి ॥ ఐంద్ర్యాదిషుదిక్షు- అగ్నిభాత్ - కృత్తికాయాః-సకాశాత్ - సప్తభగణేభవేత్- ఏతదుక్తం భవతి-సప్తశలాకాచక్రంనిష్పాద్య - పూర్వగతం సప్తరేఖాసు - ఈశానతః-కృత్తికాదీని-సప్తనక్షత్రాణి - న్యసేత్- తత్పురస్థాని - సప్తదక్షిణగతరేఖాసున్యసేత్ - ఏవంపశ్చిమోత్తరంరేఖాసుక్రమేణన్యసేత్- తతో వాయవ్యాగ్నేయదిగ్గతాంరేఖాంకుర్యాత్ - అస్యారేఖాయాః - పరిఘఇతి సంజ్ఞా-ఏవంనిష్పాదితేచక్రే - ప్రయోజనమాహ ॥ వాయ్వగ్నికాష్ఠాస్థిత ఇతి॥ వాయుః-ప్రసిద్ధః-అగ్నిః - అనయోఃకాష్ఠే- దిశౌ - వాయవ్యాగ్నేయా-తత్రస్థితఃపరిఘోనోల్లంఘ్యః - అథాన్యప్రయోజనమాహ॥ అవాగితి॥ అవాగ్దక్షిణస్యాం వరుణభైః - ప్రతీచ్యైర్నక్షత్రైర్వ్రజేత్-ప్రాచ్యైర్నక్షత్రైః - ఉదక్ఉత్తరస్యాందిశిప్రజేత్ గచ్ఛేత్ - తత్తద్దిక్స్థితనక్షత్రైస్తత్తద్దిగ్గమనంసిద్ధమేవ-సర్వాసు - సర్వదిక్షు - రవీజ్యమిత్రతురగైర్యాయాత్ - రవిర్హస్తః - ఇజ్యఃపుష్యఃమిత్రమనూరాధా - తురగఅశ్వినీఏభిర్నక్షత్రైః-సర్వాసుదిక్షుగమనంశుభమిత్యర్థః - అథావశ్యకేకృత్యే ప్రయోజనమాహ॥ అథావశ్యకేఇతి ॥ ఆవశ్యకేకృత్యేసతినింద్యైః-అనిష్టభైః-యద్దిక్షుయానినింద్యాని-తైఃపూర్వోక్తైర్నక్షత్రైః తస్యాంతస్యాందిశి తదావ్రజేత్- తదాకదాయదానిజాశేష్టాంగలబ్ధిస్స్యాత్ - నిజాశాయాం నిజగమనదిశాయాం - ఇష్టాంగలబ్ధిః-ఇష్టలగ్నలాభః - స్యాత్- ఇష్టలగ్నం

వక్ష్యమాణలక్షణం- తద్యథోక్త - గుణసంపన్నంయదాస్యాత్తదాగచ్ఛేదిత్యర్థః - నోచేన్నేత్యర్థాత్సిద్ధంకిం కృత్వాశూలభంహిత్వా - పూర్వోక్తశూలనక్షత్రంత్యక్త్వా - శూలనక్షత్రేసతి - నిజాశేష్టాంగలబ్ధావపి నగచ్ఛేదిత్యర్థః॥

⸻ అథాన్యద్విశేషం-అభిజిల్లక్షణంతత్ఫలంచాహ. ⸻

మూ॥ మిశ్రాఖ్యైర్ధ్రువభైర్దినాదిమలవే తీక్ష్ణైర్ద్వితీయే న్త్రిమే
క్షిప్రైర్భైః క్రమశోమృదూగ్రచరభై రాత్రిత్రిభాగేష్వియా
త్ । శ్రుత్యర్కేజ్యమృగేష్వయంననియమో వైశ్వాన్త్య
పాదశ్రవస్త్ర్యంశస్త్వభిజిద్గమేసఫలదో యామ్యంవినా
పిక్షణః॥ ౪॥

టీక॥ దినాదిమలవే-పగటియొక్క మొదటిభాగమునందు, మిశ్రాఖ్యైః=మిశ్రములయినననక్షత్రములచేతను, ధ్రువభైశ్చ=ధ్రువనక్షత్రములచేతను, ఇయాత్ = ప్రయాణముచేయవలయును, ద్వితీయే=పగటియొక్క ద్వితీయభాగమునందు, తీక్ష్ణైః = తీక్ష్ణములగు నక్షత్రములచేతను, ఇయాత్=ప్రయాణమును చేయవలయును. రాత్రిత్రిభాగేషు=రాత్రులయందలిమూడుభాగములయందును, క్రమశః=క్రమముగా, మృదూగ్రచరభైః=మొదటిభాగమునందుమృదునక్షత్రములచేతను, రెండవభాగమునందుఉగ్రనక్షత్రములచేతను, మూడవభాగమునందు చరనక్షత్రములచేతను, నేయాత్=పోఁగూడదు, శ్రుత్యర్కేజ్యమృగేషు=శ్రవణము, హస్త, పుష్యమి, మృగశీర్ష, అనునట్టినక్షత్రములయందు, అయమ్=ఈ, నియమః=నియమము, న=లేదు, వైశ్వాన్త్యపాదశ్రవస్త్ర్యంశః=ఉత్తరాషాఢయొక్క కడపటిపాదముయొక్కయును, శ్రవణముయొక్క మొదటిపాదముయొక్కయును, మధ్యభాగము, అభిజిత్తు=అభిజిత్తనుముహూర్తము, స్యాత్=అగును, ఏషః తు క్షణః=ఈముహూర్తము, గమే=ప్రయాణమునందు, యామ్యంవినాపి=దక్షిణదిక్కునువదలి, సఫలదః=సఫలమునిచ్చునట్టిది, స్యాత్=అగును.

తా॥ సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమానకాలమువఱకునుఅయిన పగటికాలమును మూఁడుభాగములను జేసి యామూఁడుభాగములలో మొదటిభాగమునందు మిశ్రనక్షత్రములును ధ్రువనక్షత్రములును గలకాలమునందుప్రయాణమును జేయవలయును. రెండవభాగమునందుతీక్ష్ణములగు నక్షత్రములుగల కాలమునందుప్రయాణమును జేయవలయును.



తృతీయభాగమునందు క్షిప్రనక్షత్రములచేత ప్రయాణమును జేయఁగూడదు. మఱియును, ఇటులనే రాత్రికాలమునుగూడ మూఁడుభాగములను జేసి క్రమముగా మూఁడుభాగములయందు మృదునక్షత్రములును, ఉగ్రనక్షత్రములును చరనక్షత్రములుగలకాలమునందు ప్రయాణమును జేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, శ్రవణము హస్త పుష్యమి మృగశీర్ష, అనునట్టి నక్షత్రములుగల కాలమునందు ఇప్పుడు చెప్పఁబడిన నియమము అక్కఱలేదని యెఱుఁగవలయును. మఱియును, ఉత్తరాషాఢానక్షత్రముయొక్క యంత్యభాగముయొక్కయును శ్రవణనక్షత్ర ప్రథమపాదముయొక్కయును మధ్యకాలము అభిజిత్తని చెప్పఁబడుననియును, అభిజిన్ముహూర్తమునందు దక్షిణ దిక్కునకుఁదప్ప దక్కిన దిక్కులకుఁ బోవుటవలన సకలవిధములగు శుభములును గలుగునని యెఱుఁగవలయును.

వ్యా॥ అథాన్యదాహ॥ మిశ్రాఖ్యైరితి॥ దినాదిమలవేత్రిధావిభక్తస్యదినస్యాద్యం శేమిశ్రాఖ్యైః - సాధారణైర్నక్షత్రైః - ధ్రువభైశ్చనేయాత్-నగచ్ఛేత్-ద్వితీయభాగేతీక్ష్ణైః - అంతిమే-తృతీయభాగే - క్షిప్రైర్నక్షత్రైర్నేయాత్ - అథరాత్రిత్రిభాగేషు - క్రమశో మృదూగ్రచరభైర్నేయాత్ - రాత్రేః ప్రథమేభాగేమృదుభిః - ద్వితీయేభాగే ఉగ్రైః - తృతీయభాగే చరభైర్నేయాత్ - అథవిశేషమాహ ॥ శ్రుతీతి ॥ శ్రుత్యర్కేజ్యమృగేషు అయంనియమోన - శ్రుతిశ్శ్రవణః-అర్కోహస్తః-ఇజ్యః పుష్యః-మృగఃప్రసిద్ధః - ఏభిర్నక్షత్రైః - సర్వభాగేషు గంతవ్య మితిభావః॥ అథాభిజిల్లక్షణం తత్ఫలంచాహ॥ వైశ్వేతి॥ వైశ్వముత్తరాషాఢాం తస్యాన్త్యపాదశ్చతుర్థచరణః - శ్రవణస్యఆద్యస్త్ర్యంశః - ప్రథమఃపంచదశాంశః - ఏతత్ప్రమాణోఽభిజిత్స్యాత్ - సోఽభిజిద్యామ్యం- దక్షిణాం-దిశంవినా - సర్వదిక్షుఫలదః-క్షణోముహూర్తోపి - అభిజిద్యామ్యం వినాఫలదః - యాత్రాణా మభీష్టఫలదో భవతీత్యర్థః॥

—(*) అథాన్యద్విశేషం - అడలం - విడలంచాహ. (*)—

మూ॥ ఏకార్కేంద్వయనానుకూల మనిశంభేజేదివారాత్రయో
ర్భ్రామేషాక్షని చంద్రయోర్గతమవాక్పశ్చాదగుర్వోర్హి
తం । భృగ్వర్కాహ్న్యదగర్కభా ద్యభమగైస్త్రష్టం
ద్విసప్తాడల స్త్ర్యంగాభ్యాంవిడలోనయోర్న గమనంశ్రీ
దేవలోక్తాంహిహితమ్॥ ౫॥

టీక॥ ఏకార్కేంద్వయ నానుకూలమ్ = ఒకటియగు సూర్యచంద్రులయొక్క అయనములకుఁదగినదియగు, (గతమ్=గతము,) అనిశమ్=రాత్రింబగళులయందు, (శస్తమ్=ప్రశస్తమైనది.) స్యాత్ = అగును. భేదేసతి = ( సూర్యచంద్రాయనములకు ) భేదము కలుగుచునుండఁగా, దివారాత్రయోః = దివారాత్రములయందు, శస్తమ్=ప్రశస్తమైనది, స్యాత్=అగును. భౌమే=అంగారకవారమునందు, ప్రాక్=తూర్పుదిక్కునందు, గతమ్=గమనము, హితమ్=ఇష్టమైనది, స్యాత్ = అగును. శనిచంద్రయోః=శనిసోమవారములయందు, అవాక్=దక్షిణపుదిక్కునందు, గతం=గమనము, హితమ్=ఇష్టమైనది, స్యాత్=అగును. జ్ఞగుర్వోః=బుధగురువారములయందు, పశ్చాత్=పశ్చిమదిక్కునందు, గతం=గమనము, హితం=ఇష్టమైనది, స్యాత్=అగును. భృగ్వర్కాహ్నె = శుక్రరవివారములయందు, ఉదక్=ఉత్తరదిక్కునందు, గతమ్=గమనము, హితం = ఇష్టమైనది, స్యాత్=అగును. అర్కభాద్యుభం = సూర్యనక్షత్రము మొదలుకొని దిననక్షత్రమువఱకునుగల నక్షత్రములను, (ఎంచి) అగైః=ఏడుచేత, తష్టం=హరింపఁబడుచుండఁగా, ద్విసప్తాడలః=రెండును ఏడును మిగిలెనేని అడలము, స్యాత్=అగును. త్ర్యంగాభ్యాం = మూడును ఆఱును మిగులుటచేత, విడలః=విడలము, స్యాత్=అగును. అనయోః=ఈయడల విడలయందు, శ్రీదేవలోక్త్యా=శ్రీదేవలునియొక్క మాటచేత, గమనం = ప్రయాణము, హితం=హితమైనది, న=కాదు.

తా॥ ఇఁకను ఇతరమగు విశేషమును, అడలమును, విడలమును, ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—సూర్యుఁడు దినస్వామియనియును, చంద్రుఁడు రాత్రిస్వామియును, తెలియవలయును. ఈసూర్యచంద్రు లిరువురును ఉత్తరాయణమును పొందిరేని రాత్రింబగళులయందు ఉత్తరదిక్కునకుఁబోవుట ప్రశస్తమైనదియును, ఆయిరువురును దక్షిణాయనమును పొందిరేని రాత్రింబగళులయందు దక్షిణ దిక్కునకుఁబోవుట ప్రశస్తమైనదియును, అగును. రాత్రియందు చంద్రాయనదిక్కునకుఁబోవుట మిగులఁ బ్రశస్తమగును. ఇట్లు చెప్పుటచేత ఇతర దిక్కులయందు ప్రశస్తమైనదికాదు. మఱియును, ఉత్తరదిక్కునందుఁ బోఁదగిన కాలమునందు తూర్పుదిక్కునకుఁబోవుట యుచితమనియును, దక్షిణదిక్కునకుఁ బోఁదగినకాలమునందు పశ్చిమదిక్కునకుఁబోవుట యుచితమనియును, తెలియవలయును. మఱియును, అంగారకవారమునందు పూర్వదిక్కునకుఁబోవుట ప్రశస్తమనియును, శనిచంద్రవారములయందు దక్షిణదిక్కునకుఁబోవుట ప్రశస్తమనియును, బుధగురువారములయందు పశ్చిమపుదిక్కునకుఁబోవుట ప్రశస్తమనియును, శుక్రరవివారములయందు ఉత్తరదిక్కునకుఁబోవుట ప్రశస్తమనియును, తెలియవలయును. మఱియును, సూర్యస్థిత నక్షత్రము మొదలుకొని దిననక్షత్రమువఱకును లెక్కపెట్టి యేడుచేత భాగింపఁగా రెండుగాని యేడుగాని మిగిలెనేని యడలమనియును, మూడైనను ఆఱైనను మిగిలెనేని అప్పుడు విడలమనియును, ఈయడలవిడలములయందు ప్రయాణమును చేయుట దేవలఋషివాక్యానుసారముగ ప్రశస్తమనియును, తెలియవలయును.



వ్యా॥ అథాన్యదాహ॥ ఏకార్కేంద్వయనానుకూలమితి॥ అర్కశ్చ-ఇన్దుశ్చతయోరయనం - అర్కేంద్వయనం- ఏకంచతత్ - అర్కేంద్వయనంచతత్తథా - తస్యానుకూలంగతం గమనం అనిశం - అహర్నిశం హితంస్యాత్ - భేదేసతిదివారాత్రయోః - క్రమేణశస్తంస్యాత్ - అయమర్థః-సూర్యోదినస్వామీ - చంద్రోరాత్రిస్వామీ - ద్వౌచేదుత్తరాయణంస్యాతాం - తదాహర్నిశముదగ్గమనంశస్తం - ద్వౌచేద్దక్షిణాయనే భవతః-తదాఅహర్నిశం దక్షిణగమనంశస్తంస్యాత్ - రాత్రౌ చంద్రాయనదిశంప్రతిగమనంశస్తంస్యాత్ - అర్థాదన్యథానశస్తంస్యాత్- అత్రప్రాచీ ఉత్తరసంబంధినీజ్ఞేయా తస్మాద్యదుదగ్గమనంశస్తం - తథాప్రాగ్గమనమపిశస్తంభవతితదాప్రతీచీగమనమపిశస్తంస్యాత్ ॥ తథాచరత్నకోశే॥శ్లో॥ దినకరకరతప్తామకరాదావుత్తరాంచపూర్వాం । యాయాచ్చకర్కటాదౌయామ్యాశాస్యంప్రతీచీంచ॥ అథాన్యదాహ॥ భౌమేఇతి॥ భౌమే-ప్రాక్-పూర్వదిశిగతం గమనంహితంస్యాత్ - శనిచంద్రయోరవాక్ - దక్షిణస్యాం - జ్ఞగుర్వోః-బుధగుర్వోః - పశ్చాత్పశ్చిమాయాం - భృగ్వర్కాహ్నే-శుక్రరవిదినే-ఉత్తరస్యాంగతంహితంస్యాత్ ॥ అథాడలంవిడలంచాహ॥ అర్కభాదితి॥ సూర్యనక్షత్రాద్ద్యుభం - దిననక్షత్రం అగైః సప్తభిస్తష్టంశేషితంసత్- ద్విసప్త- ద్వౌవాసప్తవాయదాభవతి తదాఽడలస్స్యాత్-త్ర్యంగాభ్యాం - త్రిషట్సంఖ్యాకాభ్యాం విడలస్స్యాత్-అనయోరడలవిడలయోఃగమనంశ్రీదేవలోక్త్యా - దేవలర్షి వచనేన హితంస్యాత్॥

— { అథ వారశూలదోషాపవాదం - దిగ్ద్వారాషాపవాదం అ: తి సంభవే-అభక్షేచనిర్ణయం - లగ్నశుద్ధింసహేతుకంచాహ. } —

మూ॥ ఆస్యందుగ్ధగుడౌతిలాన్దధియవా న్మాషానినాత్ప్రాశ్యనో

శూలేయానమనిష్టమింద్ర కకుభోఽథాజ్యంతిలాన్నంతిమీన్ । దుగ్ధంప్రాశ్యచహస్త్యనోహయనరై ర్యానంసుయానంతయో ర్ధ్యానాద్వాభవతిబ్రువేథ హరిజంతిథ్యాదిలత్రాధికం॥ ౭॥

టీక॥ ఇనాత్=సూర్యవారము మొదలుకొని, ఆజ్యం=ఆజ్యమును, దుగ్ధగుడౌ=దుగ్ధగుడములను, తిలాన్=తిలలను, యవాన్=యవలను, మాషాన్=మాషములను, ప్రాశ్య=భుజించి, శూలే=శూలయోగమునందు, యానం=ప్రయాణము, అనిష్టం=అనిష్టమైనది, నో=కాదు. అథ=పిమ్మట, ఇంద్రకకుభః=తూర్పుదిక్కు మొదలుకొని, ఆజ్యం=ఆజ్యమును, తిలాన్నం=నువ్వులయన్నమును, తిమీన్=మత్స్యములను, దుగ్ధంచ=క్షీరమును, ప్రాశ్య=భుజించి, హస్త్యనోహయనరైః=ఏనుఁగు, శకటము, హయము, ఆందోళికవాహకులు, అనువానిచేత, యానం=యానము, సుయానం=మంచిప్రయాణము, స్యాత్=అగును. తయోః=ఆభృత్యవాహనములయొక్క, ధ్యానాద్వా=ధ్యానమువలన, యానం=ప్రయాణము, సుయానం=మంచిప్రయాణము, స్యాత్=అగును. అథ=పిమ్మట, హరిజం=సింహమును, తిథ్యాదిలత్రాధికం=తిథ్యాదులకంటె లక్షగుణము లధికమైనదానినిగా, బ్రువే=చెప్పుచున్నాను.

తా॥ వారశూలదోషాపవాదమును, దిగ్దోషాపవాదమును, సంభవింపనవుడును అభక్షమునందును నిర్ణయమును, లగ్నశుద్ధిని, సహేతుకముగఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—ఆదివారము మొదలుగాఁగలవారములలో వారశూలగలదిక్కునకుఁ బ్రయాణమైపోవునపుడు ఆదివారము మొదలగువారములయందు క్రమముగ ఆజ్యమును పాలను గుడమును తిలలను పెరుగును యవలను మాషములను ప్రాశనమును చేసి ప్రయాణమైన యెడల దోషమేమియును లేదని యెఱుఁగవలయును. మఱియును, ఘృతమును, తిలాన్నమును, మత్స్యములను పాలను ప్రాశనముచేసి ఏనుగు శకటము గుఱ్ఱము మానవులచేతఁ మోయఁదగిన యాందోళికాదికము అనునట్టి వానినెక్కి తూర్పుదిక్కు మొదలుగాఁగల దిక్కులయందు వారశూలకలిగియున్నను ప్రయాణమును జేయుట యుచితమని యెఱుఁగవలయును. మఱియును, ఇట్టివస్తువులు సంభవింపనవుడు ఆవాహనభృత్యములనుస్మరించి ప్రయాణమును జేయుటచేత శుభముకలుగునని యెఱుఁగవలయును. మఱియును, సింహ లగ్నము తిథ్యాదులకంటె లక్షగుణము లధికమని యెఱుఁగవలయును.



వ్యా॥ అథవారశూలదోషాపవాదమాహ ॥ సుగమం- ఇనాత్సూర్యవారాత్సకాశాత్- ఆజ్యాదీనిప్రాశ్య- ప్రాశయిత్వాశూలే- వారశూలేయానం- ప్రయాణం- అనర్థకృన్నోభవతి ॥ అథదిగ్దోషాపవాదమాహ॥ ఆజ్యమితి ॥ ఘృతాదికంప్రాశ్య- ఐంద్ర్యాదిషు - పూర్వాదిషు- హస్త్యాదిభిర్యానంసుయానంభవతీ- హస్తీ- ప్రసిద్ధః- అనశ్శకటః- హయోఽశ్వః- నరాః- శిబికావాహకజనాః - ఏతదుక్తంభవతి - ఘృతంప్రాశ్యహస్తినా ప్రాగ్గమనాత్సిద్ధిః- తిలాన్నంతిలోదనంప్రాశ్య- రథేనదక్షిణగమనాత్సిద్ధిః- మత్స్యాన్ప్రాశ్యఅశ్వేనపశ్చిమగమనాత్సిద్ధిః - దుగ్ధంప్రాశ్యనరైరుదగ్గమనాత్సిద్ధిః- స్యాదిత్యర్థః - అసతిసమ్భవేఅభక్షేచనిర్ణయమాహ ॥ తయోర్భృత్యవాహనయోర్ధ్యానాద్వాయానం సుయానంభవతి ॥ అథలగ్నశుద్ధింసహేతుకమాహ ॥ బ్రువేథహరిజమితి ॥ అథహరిజంలగ్నంబ్రువేవచ్మి- కథంభూతం - తిథ్యాదిలత్రాధికం - తిథ్యాదిభ్యోలత్రాధికంబలిష్ఠమిత్యర్థః॥

—— ✻ అథయాత్రాలగ్నేత్యాజ్యాని-దిక్పతీంచాహ. ✻ ——

మూ॥ స్వర్త్రానర్ధిఘటాస్తభాన్నృజుగ్రహాన్ షష్ఠంరిపోర్భాదన్యస్వత్రాంగేశరిపుంఖలంజనిబల త్యక్తంతథాసాంప్రతం । యాత్రాలగ్నగతంత్యజేదథదిశా మీశోర్క-శుక్రౌకుజో రాహుర్మందశశాంకసౌమ్యగురవః కేన్ద్రేదిగీశేవ్రజేత్॥ ౮॥

టీక॥ స్వర్త్రానర్ధిఘటాస్తభాన్నృజుగ్రహాన్=స్వరాశి, స్వరాశికి అనుపచయస్థానము, కుంభము, సప్తమస్థానము, వక్రగ్రహరాశి, అనురాసులను, రిపోః=వైరియొక్క, భాత్=రాశికంటె, షష్ఠమ్=ఆఱవస్థానమును, అన్య=పృష్ఠోదయరాశిని, స్వత్రాంగేశరిపుం=స్వనక్షత్రాధిపతికినిస్వరాశ్యధిపతికినిశత్రువగువానియొక్క-రాశిని, ఖలమ్=పాపగ్రహరాశిని, జనిబలత్యక్తమ్=జన్మకాలమునందు బలములేనిరాశిని, తథా=అటులనే, సాంప్రతమ్=ప్రస్తుతము, (బలహీనమైనరాశిని) యాత్రాలగ్నగతమ్=యాత్రాలగ్నమునుపొందినదానినిగా, (దృష్ట్వా=చూచి,) త్యజేత్=విడువవలయును, అథ=పిమ్మట, అర్క-శుక్రౌ=రవిశుక్రులు, కుజః=కుజుఁడు, రాహుః=రాహువు, మందశశాంకసౌమ్యగురవః=శని చంద్ర బుధ గురువులును, దిశామ్=దిక్కులకు, ఈశః=ప్రభువు, దిగీశే=దిగధిపతి, కేంద్రేసతి=కేంద్రమునం దున్నవాఁడగుచు నుండఁగా, ప్రజేత్=ప్రయాణమును చేయవలయును.

తా॥ స్వరాశియును, స్వరాశికి అనుపచయస్థానము కుంభము, సప్తమస్థానము, వక్రగ్రహరాశి, తనదురాశ్యధిపతియగువానికి శత్రువగు వాని రాశికిఆరవరాశి, పృష్ఠోదయరాశి, స్వనక్షత్రముయొక్కయును స్వరాశియొక్కయును అధిపతికిశత్రువగువానిరాశి, పాపగ్రహరాశి, జననకాలమునందు బలరహితమైనరాశి, తత్కాలమందు బలహీనమైనరాశి, అనురాసులు ప్రయాణలగ్నమయ్యెనేని ప్రయాణమును జేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ గోజాశ్వికర్కిమిధునా స్సమృగాని శాఖ్యా పృష్ఠోదయావిమిధునాఃకథితా స్తవ॥" (=వృషమేషధనుఃకర్కటకము మకరము అనునట్టిరాసులు పృష్ఠోదయములనఁబడును.) అనియెడుజాతకశాస్త్రమువలన పృష్ఠోదయరాసులను దెలిసికొనవలయును. మఱియును, రవి, శుక్రుఁడు, కుజుఁడు, రాహువు, శని, చంద్రుఁడు, బుధుఁడు, గురువు, అనువారు క్రమముగ తూర్పుదిక్కు మొదలుకొని యెనిమిదిదిక్కులకును అధిపతులనఁబడుదురు. మఱియును, దిగధిపతి కేంద్రమునందుండఁగా ప్రయాణమును చేయవలయును. మఱియును, ఆదిగధిపతిలలాటగతకేంద్రముతప్పఁ దక్కిన కేంద్రములయందుండఁగా ప్రయాణమును చేయవలసినదనియెఱుఁగవలయును. మఱియును, ఈలలాటాదివిషయమును అగ్రిమశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

వ్యా॥ స్వర్క్షేతి॥ స్వర్క్షానర్థిఘటాదికం - యాత్రాలగ్నగతంత్యజేత్- స్వర్క్షం-స్వరాశిః- అనర్థిః - స్వరాశేఃఅనుపచయభవనం- ఘటః- కుంభః- అస్తభం- అస్తగతగ్రహస్యరాశిః - అనృజుగృహం - వక్రగ్రహరాశిః- ఏతాక్షరిపోర్భాత్- వైరిరాశేఃషష్ఠం- అపృష్ఠోదయం॥ తథాచబృహజ్జాతకే ॥ గోజాశ్వికర్కిమిధునాస్సమృగానిజాఖ్యా పృష్ఠోదయావిమిధునాఃకథితాస్తవేతి ॥ వృషమేషధనకర్కటమకరాః- పృష్ఠోదయాః- పృష్ఠోదయంలగ్నంజాతకాజ్జన్మయం- స్వర్క్షాంగేశరిపుం- ఋక్షంచఅంగంచ- ఋక్షాంగం- స్వస్యఋక్షాంగంతస్యేశః స్వామీతస్యరిపుః- తంఖలః- ప్రసిద్ధః- జనిబలత్యక్తంజన్మనిబలహీనంగృహం - తథాసాంప్రతం- ప్రస్తుతంబలత్యక్తం- ఇత్యుక్తంసర్వంయాత్రాలగ్నగతంత్యజేత్ ॥ అథదిక్పతీనాహ॥ దిశామితి ॥ దిశాంపూర్వాదీనాం- ఈశాఃస్వామినః - అర్కశుక్రాదయః- పాలకాః క్రమాత్స్యుః- కేన్ద్రే దిగీశే- ౧- ౪- ౭- ౧౦- సతిప్రవ్రజేత్- గచ్ఛేత్- యస్మిన్ కేన్ద్రే- లలాటగత్వంభవతి- తత్కేన్ద్రంవర్జయిత్వా- అన్యకేన్ద్రే దిగీశేసతి- వ్రజేత్- ఇదమగ్రిమశ్లోకేవక్ష్యతి॥



— అథదిక్పతౌలలాటగేసతి - తద్దిగమననిషేధం లలాటలక్షణంచాహ. —

మూ॥ దిక్పేనప్రవసేల్లలాటగఇనః ప్రాచ్యాంతనౌఫాలగస్స్యాత్పశ్చాన్మదనే ౭ ర్కజోంబుగ - ౪-బుధస్సౌమ్యాంఖగోవాక్కుజః । ఐశ్యాంద్విత్రిగతోగురుర్జ్వలనదిశ్యాయ ౧౧ వ్యయ ౧౨ స్థోభృగుర్వాయావష్ట ౬ సుత ౫ గోవిధుర్నిఋతౌతా వష్టాంకసంస్థంతమః॥ ౮॥

టీక॥ దిక్పే=దిక్పతి, లలాటగేసతి=లలాటమును పొందినవాఁడగుచునుండఁగా, నప్రవసేత్=ప్రవాసమును చేయఁగూడదు, ఇనః=సూర్యుఁడు, తనౌ=లగ్నమునందు, స్థితస్సన్=ఉన్నవాఁడగుచు, ప్రాచ్యామ్=తూర్పుదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, అర్కజః=శని, మదనే=సప్తమస్థానమునందు, స్థితస్సన్=ఉన్నవాఁడగుచు, పశ్చాత్=పడమటిదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, బుధః=బుధుఁడు, అంబుగః=చతుర్థస్థానమును పొందినవాఁడగుచు, సౌమ్యామ్=ఉత్తరదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, కుజః=కుజుఁడు, ఖగస్సన్=దశమస్థానమునుపొందినవాఁడగుచు, అవాక్=దక్షిణదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, గురుః=గురుఁడు, ద్విత్రిగతస్సన్=రెండవమూఁడవస్థానమునుపొందినవాఁడగుచు, ఐశ్యామ్=ఈశాన్యదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, ఆయవ్యయస్థః=పదునొకండవపదిరెండవస్థానమునుపొందిన, భృగుః=శుక్రుఁడు, జ్వలనదిశి=ఆగ్నేయదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, షట్సుతగః=ఆఱవయైదవస్థానమునుపొందిన, విధుః=చంద్రుఁడు, వాయౌ=వాయవ్యదిక్కునందు, ఫాలగః=లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును, షష్ఠాంకసంస్థమ్=ఆఱవతొమ్మిదవస్థానమునుపొందిన, తమః=రాహువు, నిఋతౌ=నిఋతిదిక్కునందు, ఫాలగః = లలాటమునుపొందినవాఁడు, స్యాత్=అగును.

తా॥ దిక్పతిలలాటమునుపొందియున్నపుడు ఆదిక్కునందుగమనమునుచేయఁగూడదనియును, లలాటలక్షణమును ఈశ్లోకముచేతఁ దెల్పుచున్నాఁడు. ఎట్లనిన:—దిక్పతిలలాటమును పొందియుండఁగా ప్రయాణమును జేయఁగూడదు. మఱియును, లగ్నమునందున్నసూర్యుఁడు తూర్పు

నకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, ఏడవస్థానమునం దున్నశని పడమటిదిక్కునకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, నాల్గవస్థానమునందున్నబుధుఁడు ఉత్తరదిక్కునకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, దశమస్థానమునందున్నకుజుఁడు దక్షిణదిక్కునకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, రెండవమూడవస్థానమునందున్నగురుఁడు ఈశాన్యదిక్కునకుఁబోవువానికి లలాటమునుపొంది యున్నాఁడనియును, పదునొకండవపది రెండవస్థానమును పొందియున్న శుక్రుఁడు ఆగ్నేయదిక్కునకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, ఆఱవయైదవస్థానమునందున్నచంద్రుఁడు వయువ్యదిక్కునకుఁబోవువానికిలలాటమునందున్నాఁడనియును, ఎనిమిదవ తొమ్మిదవస్థానమునందున్న రాహువు నిఋఋతిదిక్కునకుఁబోవువానికి లలాటమునందున్నాఁడనియును, తెలియవలయును.

వ్యా॥ దిక్ష్వితి॥ దిక్షు-లలాటగే సతి - నప్రవసేత్ - ప్రవాసంనకుర్యాత్-తనౌ-లగ్నేవర్తమానఇనః - సూర్యః-ప్రాక్ - ప్రాచ్యాందిశి-ఫాలగః-లలాటస్థితఃస్యాత్ - మదనే-సప్తమే-వర్తమానోర్కజః - శనిః-పశ్చిమస్యాంలలాటస్థితస్స్యాత్ - అంబుగబుధః - చతుర్థగోబుధః - సౌమ్యాం ఉత్తరస్యాందిశి - లలాటస్థితస్స్యాత్ - ఖం - దశమం - తద్గతః కుజో భౌమః-అవాక్దక్షిణస్యాం - లలాటస్థితస్స్యాత్ - ద్విత్రిగతోగురుః-ఐశాన్యాం-ఈశాన్యాం-లలాటస్థితస్స్యాత్ - ఆయవ్యయస్థః - భృగుః-కవిః - జ్వలనదిశి- ఆగ్నేయస్యాం-లలాటగఃస్యాత్ - షట్సుతగోవిధుశ్చన్ద్రః - వాయోః-వాయవ్యాం-లలాటస్థితస్స్యాత్ - అష్టాంకసంస్థంతమః - అష్టమనవమస్థానస్థో రాహుః - నిఋఋతిదిశి - లలాటసంస్థస్స్యాదితి॥

అథవక్రిణోగ్రహస్య కేన్ద్రగత్వాదిత్యాజ్యత్వం
సూర్యాదీనాంజన్మనక్షత్రాణిచాహ.

మూ॥ వక్రీకేన్ద్రగతస్తదీయదివసో లగ్నేస్యవర్గోభవే ద్యాతు
ర్నాశకరశ్శుభోపితనుగో జన్మర్క్ష లగ్నేడ్రిపుః । ద్వీశా
గ్న్యంబ్వజభాగ్యభానిగురుభం పౌష్ణాంతకేసార్పభంజ
న్మర్క్షాణిరవేరుపప్లవగతః ఖేటస్తనౌహానికృత్॥ ౯॥

టీక॥ వక్రీ=వక్రగ్రహము, కేంద్రగతస్సన్ = కేంద్రమునుపొందిన వాఁడగుచు, యాతుః=ప్రయాణమునుచేయువానికి, నాశకరః=నాశమును జేయువాఁడు, స్యాత్=అగును, తదీయదివసోపి = ఆవక్రగ్రహముయొక్క



వారముకూడ, యాతుః=ప్రయాణమును జేయువానికి, నాశకరః=నాశమును జేయునది, స్యాత్=అగును. లగ్నే=లగ్నమునందు, అస్య = ఈవక్రగ్రహముయొక్క, వర్గోపి=వర్గముకూడ, యాతుః = ప్రయాణమునుచేయువానికి, నాశకరః=నాశమును జేయునది, స్యాత్=అగును. జన్మర్క్ష లగ్నేడ్రిపుః=జన్మరాశి జన్మలగ్నములకు అధిపతియగువారల శత్రువగువాఁడు, శుభోపి=శుభుఁడైనప్పటికిని, తనుగః=లగ్నమునుపొందినవాఁడగుచు, యాతుః=ప్రయాణమును జేయువానికి, నాశకరః = నాశమును జేయువాఁడు, స్యాత్=అగును. రవేః=సూర్యుఁడు మొదలుగాఁగల గ్రహసముదాయమునకు, ద్వీశాగ్న్యంబ్వజభాగ్యభాని=విశాఖ, కృత్తిక, పూర్వాషాఢ, శ్రవణము, పూర్వఫల్గుని అను నక్షత్రములును, గురుభమ్=పుష్యమి, పౌష్ణాంతకే=రేవతి భరణి, అను నక్షత్రములును, సార్పభమ్=ఆశ్లేషయును, జన్మర్క్షాణి=జన్మనక్షత్రములు, స్యుః=అగును. ఉపప్లవగతః=త్రివిధోత్పాతహతమైననక్షత్రమునుపొందిన, ఖేటః = గ్రహము, తనౌ=లగ్నమునందు, స్థితశ్చేత్=ఉండెనేని, హానికృత్=హానికలుగఁజేయువాఁడు, స్యాత్=అగును.

తా॥ వక్రగ్రహము కేంద్రమును పొందినవాఁడయ్యెనేని ప్రయాణమును జేయువానికి నాశముకలుగును. ఆవక్రగ్రహముయొక్క వారముకూడ ప్రయాణమును జేయువానికి నాశమును కలుగఁజేయును. జన్మరాశ్యధిపతికిని జన్మలగ్నాధిపతికిని అధిపతియగువానికి శత్రువగువాఁడు శుభుఁడైనప్పటికిని లగ్నమునందుండెనేని ప్రయాణమును జేయువానికి నాశమును కలుగఁజేయును. వక్రగ్రహముయొక్కవర్గము ప్రయాణలగ్నమునందుండెనేని ప్రయాణమును జేయువానికి నాశము కలుగునని యెఱుగవలయును. మఱియును, సూర్యునకు విశాఖానక్షత్రము, చంద్రునకు కృత్తికానక్షత్రము, కుజునకు పూర్వాషాఢానక్షత్రము, బుధునకు శ్రవణము, గురువునకు పూర్వఫల్గునీ నక్షత్రము, శుక్రునకు పుష్యమీనక్షత్రము, శనికి రేవతీనక్షత్రము, రాహువునకు భరణి, కేతువునకు ఆశ్లేష, అనునవి జన్మనక్షత్రములని యెఱుంగవలయును. మఱియును, ఏగ్రహముయొక్క జన్మనక్షత్రము త్రివిధములయిన యుత్పాతములచేత హతమైయుండునో ఆనక్షత్రమును పొందినగ్రహము లగ్నమునందున్న యెడల ప్రయాణమును జేయువానికి హానినికలిగించును.

వ్యా॥ వక్రీతి॥ వక్రీగ్రహః-కేంద్రగతస్సన్ - యాతుర్గమనకర్తుర్నా

శకరస్స్యాత్ తదీయదివసోపి వక్రగ్రహస్యదివసోపి - యాతుర్నాశకర
స్స్యాత్ లగ్నేస్యవర్గోపినాశకరస్స్యాత్ - జనర్క్షలగ్నేశ్వరః- శుభోపి
తనుగోయాతుర్నాశకరస్స్యాత్ - జన్మరాశిజన్మలగ్నే - తయోరీశా -
తయోఃరిపుః॥ అథసూర్యాదీనాంనక్షత్రాణ్యాహ ॥ ద్వీశేతి ॥ అర్కత
స్సూర్యాత్ - గ్రహాణాం-ద్వీశాదీని - జన్మర్క్షాణి - జన్మనక్షత్రాణిస్యుః-
ద్వీశం-విశాఖా-సూర్యస్య - అగ్నిః-కృత్తికా-చన్ద్రస్య-అంబు- పూర్వాషా
ఢా-భౌమస్య అజశ్శ్రవణోబుధస్య - భాగ్యం-పూర్వాఫల్గునీ - గురోః-
గురుభం-పుష్యఃశుక్రస్య - పౌష్ణం రేవతీ - శనేః - అంతకః - భరణీ-రా
హోః-సార్పభం-ఆశ్లేషా-కేతోః - ఉపప్లవగత ఇతి ॥ ఉపప్లవగతోనా
మ-యదీయభం - యస్యగ్రహస్యభంజన్మనక్షత్రంహతం - త్రివిధోత్పాత
హతంస్యాత్ అసౌగ్రహోలగ్నేస్థితోహానికృత్స్యాత్॥

మూ॥ వేశిస్సౌమ్యయుత స్తనౌజనుషి యేసద్భిర్యుతారాశయో
జన్మాబ్జోపచయస్థితా అపితనో స్స్వర్క్షోచ్చ మిత్రర్క్ష
గాః । పాపా అప్యతిశోభనాస్తనుగతాజన్మేశ్వరౌకేన్ద్ర
గౌ స్వారాత్యహ్నితనౌశుభోన ఫలదో మిత్రాహ్నిపా
పోర్థదః॥ ౧౦॥

టీక॥ సౌమ్యయుతః = శుభగ్రహములతోఁగూడిన, వేశిః= వేశిస్థానము, (అనఁగా సూర్యునకు రెండవస్థానము) అంగగః=ప్రయాణలగ్నమునుపొందినదై, అతిశోభనః=మిగులశుభకరమైనది, స్యాత్ = అగును. జనుషి=జన్మకాలమునందు, సద్భిః=సద్గ్రహములచేత, యుతాః=కూడిన, రాశయః= రాసులు, తనుగతాః = లగ్నమునుపొందినవై, అతిశోభనాః= మిగుల శుభకరములయినవి, స్యుః=అగును. జన్మాబ్జోపచయస్థితాః+అపి=జన్మలగ్న జన్మచంద్రులకు ఉపచయస్థానమును పొందినగ్రహములు, తనుగతాః=లగ్నమునుపొందినవారై, అతిశోభనాః= మిగులశుభకరులు, స్యుః=అగుదురు. తనోః=జన్మలగ్నమునకు, ఉపచయస్థితాః+అపి=ఉపచయస్థానమునందున్నవారుకూడ, అతిశోభనాః = మిగుల శుభకరులు, స్యుః=అగుదురు. స్వర్క్షోచ్చమిత్రర్క్షగాః=స్వక్షేత్ర ఉచ్చక్షేత్ర మిత్రక్షేత్రములను పొందినగ్రహములు, పాపాః+అపి = పాపులయినప్పటికిని, తనుగతాః=లగ్నమునుపొందినవారై, అతిశోభనాః=మిగుల శుభకరులు, స్యుః=అగుదురు. జన్మేశ్వరౌ = జన్మరాశిజన్మలగ్నాధిపతులు, కేంద్రగౌ=కేంద్రమునుపొందినవారు, స్యాతాంచేత్=అయిరేని, అతిశోభనౌ=మిగు



లశుభకరులు, స్యాతాం=అగుదురు. స్వారాత్యహ్ని = తనకుశత్రువగు గ్రహముయొక్క వారమునందు, తనౌ = లగ్నమునందు, వర్తమానః= ఉన్న, శుభోపి=శుభుఁడుకూడ, ఫలదః=ఫలమునిచ్చువాఁడు, న=కాఁడు, మిత్రాహ్ని=మిత్రగ్రహముయొక్క వారమునందు, తనౌ = లగ్నమునందు, వర్తమానః=ఉన్న, పాపోపి=పాపుఁడుకూడ, అర్థదః=ఫలమునిచ్చువాఁడు, స్యాత్=అగును.

తా॥ సూర్యునకు ద్వితీయస్థానము వేశియని చెప్పఁబడుననియును, అట్టివేశిస్థానము శుభగ్రహములతోఁ గూడుకొని లగ్నమునుపొందియుండెనేని మిగులశుభముకలుగుననియును తెలియవలయును. మఱియును,జన్మకాలమునందు శుభగ్రహములతోఁగూడిన రాసులులగ్నమునుపొందినవయ్యేనేని మిగుల శుభకరములయినవగును. జన్మకాలీన చంద్రలగ్నమునకు మూఁడు ఆఱు పదునొకండు స్థానములను పొందిన గ్రహములు లగ్నమును పొందియున్నయెడల మిగుల శుభమును కలుగఁజేయు వారగుదురు. జన్మలగ్నములకు మూఁడు ఆఱు పదునొకండుస్థానములయందున్నగ్రహములు ప్రయాణలగ్నమును పొందియున్నపుడుకూడ మిగుల శుభమును కలుగఁజేయువారగుదురు. స్వోచ్చమిత్ర స్వక్షేత్రములయందున్న గ్రహములు లగ్నమును పొందియుండిరేని వారు పాపగ్రహములయినను శుభమును కలుగఁజేయువారగుదురు. జన్మరాశియొక్కయును జన్మలగ్నముయొక్కయును అధిపతులు కేంద్రమును పొందియుండిరేని మిగుల శుభకరులు అగుదురు. శత్రుగ్రహముయొక్క వారమునందు లగ్నమునందున్న శుభగ్రహముకూడ శుభఫలము నిచ్చువాఁడగును. మిత్రగ్రహముయొక్క వారములయందున్న పాపగ్రహముకూడ లగ్నమునందుండెనేని శుభధనాదులనిచ్చువాఁడు అగును. "శ్లో॥ రక్షకావర్ధకాశ్చైవ యేస్యుర్జన్మనినాయకాః । తాన్పాపానపినిశ్శంకో యాత్రాలగ్నేనియోజయేత్॥" (=జన్మకాలమునందు రక్షకులును వర్ధకులును అయినవారు పాపులయినప్పటికిని ప్రయాణలగ్నమునందుండిరేని శుభములను కలుగఁజేయుదురు.) అని చ్యవనుఁడు చెప్పె.

వ్యా॥ వేశిరితి॥ సూర్యర్క్షాద్ద్వితీయోరాశిర్వేశిః - ససౌమ్యయుత స్సన్-అంగగోలగ్నగోఽతిశోభనస్స్యాత్ - జనుషి-జన్మకాలే-సద్భిగ్రహైర్యుతాయేరాశయ స్తనుగతా అతిశోభనాస్స్యుః-జన్మాబ్జోపచయస్థితాః - జన్మాబ్జౌజన్మచంద్రః - జన్మాదుపచయాని - త్రిషడేకాదశద

శమాని - క్షేమస్థితాగ్రహాస్తేతనుగతా అతిశోభనాః - తనోరపిజన్మలగ్నాదప్యుపచయస్థలగ్నగతా అతిశోభనాస్స్యుః - స్వక్షేత్రాచ్చ మిత్రర్క్షగాః-జన్మనియేస్వర్క్షగాః - ఉచ్చగాః - మిత్రర్క్షగాస్తే పాపా అపితనుగతాఅపిశోభనాస్స్యుః - జన్మేశ్వరౌ-జన్మరాశిజన్మలగ్నస్వామినౌ - కేంద్రగౌ అతిశోభనౌస్యాతాం - స్వారాత్యహ్నా - స్వవైరివారే - శుభః-శుభగ్రహః - తనౌలగ్నే వర్తమానోనఫలదోభవతి - మిత్రాహ్నాపాపః-తనౌవర్తమానోర్థదస్స్యాత్ - తథాచ్యవనః ॥ శ్లో ॥ రత్నకాపర్థకాశ్చైవమేస్యుర్జన్మనినాయకాః । తాన్పాపానపినిశ్శంకో యాత్రాలగ్నలగ్నేనియోజయేదిత్యాది॥

—※ అథయాత్రాలగ్నే ఇష్టాన నిష్టాంశ్చశ్లోకే నైకేనాహ. ※—

మూ॥ త్ర్యాయార్యన్యగతాఃఖలాఃఖే ఇనజోబ్జోంత్యాద్యషష్ఠగో భూయస్సోపచితోస్తఖాంబుసుతగశ్శుక్రోష్టేజ్యో
మృతౌ । సజ్ఞోవ్యయగోగ్రహాన్విత శశీయాతుర్మహావి
ఘ్నదా అన్యస్థానగతాజయార్థ సుఖదాస్త్యాజ్యం పురో
క్తంనచేత్॥ ౧౨॥

టీక॥ త్ర్యాయార్యన్యగతాః=మూడు పదునొకండు ఆఱు అనియెడుస్థానములకంటె ఇతరములగు స్థానములనుపొందిన, ఖలాః=పాపగ్రహములును, ఖే=పదియవస్థానమునందు, ఇనజః=శనియును, అంత్యాద్యషష్ఠగః=పదిరెండు ఒకటి ఆఱు ఎనిమిదిస్థానములనుపొందిన, అబ్జః=చంద్రుఁడును, భూయః=మరల, అపచితః క్షీణించినవాఁడై, అస్తఖాంబుసుతగః = ఏడవ పదియవ నాల్గవ అయిదవస్థానములనుపొందిన, సః=ఆచంద్రుఁడును, అస్తగః=సప్తమస్థానమునుపొందిన, శుక్రః=శుక్రుఁడును, మృతౌ=ఎనిమిదవస్థానమునందలి, ఇజ్యః=గురుఁడును, వ్యయగః=పదిరెండవస్థానమునుపొందిన, సజ్ఞః=అస్తమయమునుపొందినబుధుఁడును, గ్రహాన్వితశశీ=రెండుగ్రహములతోడను అనేకగ్రహములతోడను కూడియున్న, శశీ=చంద్రుఁడును, యాతుః = ప్రయాణమును చేయువానికి, మహావిఘ్నదాః=అధికమైనవిఘ్నమును చేయువారు, స్యుః=అగుదురు పురో-పూర్వమునందు, ఉక్తం=చెప్పఁబడిన, త్యాజ్యం=దోషము, నచేత్-లేకపోయెనేని, అన్యస్థానగతాః = ఇప్పుడు చెప్పఁబడిన స్థానములకంటె ఇతరములగు స్థానములను పొందినపాపగ్రహములు, జయార్థసుఖదాః = జయమును అర్థమును సుఖమును ఇచ్చువారు, స్యుః=అగుదురు.



తా॥ యాత్రాలగ్నమునందలి ఇష్టానిష్ట గ్రహములను ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనినః—మూఁడు ఆఱు పదునొకండు స్థానములకంటె ఇతరములగు స్థానములయందు అనఁగా ౧-౨-౪-౫-౭-౮-౯-౧౨-స్థానములను పొందిన పాపగ్రహములును, పదియవస్థానమునుపొందిన శనియును, (పాపగ్రహములనుటచేతనే శనికూడఁ జెప్పఁబడినను పదియవస్థానమునుపొందినశనిమిగుల పాపుఁడనఁబడెనని యెఱుఁగవలయును.) షష్ఠాష్టమ లగ్నద్వాదశములను పొందిన చంద్రుఁడును, సప్తమదశమ చతుర్థస్థానములనుపొందినక్షీణచంద్రుఁడును, సప్తమస్థానమునుపొందినశుక్రుఁడును, అష్టమస్థానమును పొందినగురుఁడును, ద్వాదశస్థానమునుపొంది యస్తంగతుఁడైన బుధుఁడును, రెండుగ్రహములతోఁగాని అనేకగ్రహములతోఁగాని కూడియున్న చంద్రుఁడును, అధికమైన విఘ్నమును కలుగఁజేయును. మఱియును, పూర్వమునందుఁ జెప్పఁబడిన దోషములేకపోయినయెడల ఇప్పుడు చెప్పఁబడిన స్థానములకంటె ఇతర స్థానములను పొందిన పాపగ్రహములు జయమును అర్థమును సుఖమును కలుగఁజేయుదురని తాత్పర్యము.

వ్యా॥ త్ర్యాయేతి॥ త్ర్యాయార్యన్యగతాః ఖలాః-త్రి-౩-యా-౧౧-రిభ్యః-౬-అన్యాని-౧-౨-౪-౫-౭-౮-౯-౧౨ తత్రగతాః ఖలాఃపాపగ్రహాః ఖేదశమే-ఇనజః-శనిః త్ర్యాయార్యన్యగతాః-ఖలా - ఇత్యనేనైవసిద్ధేపివిశేష దుష్టఫలజ్ఞాపనార్థంఖఇనజ ఇత్యుక్తం అంత్య-౧౨ - అద్య-౧ షష్ఠా-౬-ష్ట-౮-గోబ్జశ్చంద్రః భూయఃపునః - సచంద్రః-అపచితః-క్షీణచంద్రః-కృష్ణపక్షచంద్రః - అస్తం-౭-ఖ-౧౦-అంబు-౪-సుత - ౫-గః - అస్తే-౭-శుక్రః-ఇజ్యోగురుర్మృతౌ-౮-సజ్ఞోస్తమిత బుధోవ్యయ-౧౨- గతఃగ్రహాన్విత శ్శశీయేన కేనాపిగ్రహేణ గ్రహాభ్యాం గ్రహైర్వాయుక్తశ్చంద్రమాః ఏతేప్రత్యేకంయాతుర్మహావిఘ్నదాస్స్యుః - నానాప్రకారేణమరణభంగాదీన్ దదాతీత్యర్థః అన్యస్థానగతాః- ఉక్తేభ్యోన్యస్థానగతాస్సంతస్తదా జయార్థసుఖదాస్స్యు - తదాకదాచేత్యది పురోక్తం త్యాజ్యంనస్యాత్॥

——(※) అథప్రతిబుధశుక్రాపవాదమాహ. (※)——

మూ॥ స్వగాత్రైకపురగ్రామసద్మసు చతద్వత్రిపతుశ్శాలకే తథా
ద్వాహేషుపఘూప్రవేశే నృపభేదుగ్భిక్షు పీడాసుచ । తీర్థ
స్వామిని దేశభూర్భృగువసిష్ఠా త్ర్యంగిరంకాశ్యపేభ్యార

ద్వాజ జవాత్స్యయోర్హితకరం యానం సితజ్ఞోన్ముఖమ్॥ ౧౨॥

టీక॥ స్వగ్రామైకపురాత్మసద్మసు=స్వగ్రామమునందును ఏకపట్టణమునందును, ఆత్మగృహమందును, చతుర్వక్త్రే=నాలుగుముఖములుగల గృహమునందును, చతుశ్శాలకే - చతుశ్శాలయందును, ఉద్వాహేషు=బ్రాహ్మ్యాది వివాహములయందును, వధూప్రవేశ నృపభీదుర్భిక్ష పీడాసుచ=వధూప్రవేశము, రాజభయము, దుర్భిక్షపీడ, అనువానియందును, తీర్థస్వామిదేశయోః=తీర్థగమనము, రాజాజ్ఞ అనువానియందును, భృగువసిష్ఠాత్ర్యంగిరఃకాశ్యపే - భృగువు, వసిష్ఠుఁడు, అత్రి, అంగిరస్సు, కాశ్యపుఁడు, అనువారి గోత్రసముదాయమందు, భారద్వాజజవాత్స్యయోః = భారద్వాజవాత్స్యులయొక్క కులమునందును, సితజ్ఞోన్ముఖమ్=బుధశుక్రులకభిముఖమయిన, యానమ్=ప్రయాణము, హితకరమ్=హితమునుకలుగఁజేయునట్టిది, స్యాత్=అగును.

తా॥ ఈ శ్లోకముచేత అభిముఖ బుధ శుక్ర దోషాపవాదమును జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—స్వగ్రామమందును, ఏకనగరమునందును, ఆత్మగృహమందును, నాలుగుముఖములుగల గృహమునందును, చతుశ్శాలయందును, బ్రాహ్మ్యాదివివాహములయందును, నూతనవధూప్రవేశమందును, రాజభయమందును, దుర్భిక్షపీడయందును, తీర్థగమనమునందును, రాజాజ్ఞయందును, భృగువసిష్ఠాత్ర్యంగిరః కాశ్యపగోత్రములయందును, భారద్వాజవాత్స్యగోత్రములయందును, బుధశుక్రుల కెదురుగఁ బ్రయాణమును జేయుట శుభకరముకాదని తెలియవలయును. మఱియును, నూతనవధువైనను భర్తతోఁగూడఁబోక యొంటిగా గృహప్రవేశమును జేయునపుడు బుధశుక్రుల కెదురుగఁబోఁగూడదని తెలియవలయును. మఱియును, "శ్లో॥ స్వామినానీయమానాయాం ప్రతిశుక్రో నవిద్యతే" (భర్తచేతఁ దీసికొనిపోఁబడుచున్న నూతనవధువుకు అభిముఖ శుక్రబుధదోషములేదు.) అని భీమపరాక్రమమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. "శ్లో॥ నవోఢాయాస్తువంధ్యాత్వం యదుక్తం సమ్ముఖేభృగౌ। తదత్రవిబుధైర్జ్ఞేయం కేవలంతుద్విరాగమే॥" (=బుధశుక్రులకు అభిముఖముగఁ బ్రయాణమును జేయునట్టి నూతనవధువు వంధ్యయగును. కావున పండితులగువారు భర్తతోఁగూడ నూతనవధువు గృహప్రవేశమగునట్లు చూడవలయును.) మఱియును, "శ్లో॥ స్వభవనపురప్రవేశే దేశానాంవి



గ్రహే। నవవధ్వాగృహాగమనే ప్రతిశుక్రవిచారణానాస్తి" (=స్వభవనమునందును పట్టణమునందును ప్రవేశించునపుడును, దేశోపద్రవకాలమునందును, నూతనవధూగృహప్రవేశమందును, అభిముఖ బుధశుక్ర దోషములేదు.) అని లల్లాచార్యుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ చతుశ్శాలం చతుర్ద్వారమళిందైస్సర్వతోయుతం। నామ్నాతత్సర్వతోభద్రం నతత్రప్రతిశుక్రతా॥" (=చతుశ్శాలమును చతుర్ద్వారమును, తలవాకిటిప్రకోష్ఠములచేత అంతటను కూడియున్నదియును అయిన గృహము సర్వతోభద్రమని చెప్పఁబడును. ఇట్టిగృహమునందుఁ బ్రవేశించునపుడు బుధశుక్రాభిముఖదోషములేదు.) అని మత్స్యపురాణమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ కాశ్యపేషువసిష్ఠేషు భృగ్వత్ర్యంగిరసేషుచ। భారద్వాజేషువాత్స్యేషు ప్రతిశుక్రోనవిద్యతే॥" (=కాశ్యపగోత్రమువారియందును, వసిష్ఠగోత్రపువారియందును, భృగ్వత్ర్యంగిరోగోత్రములవారియందును, భారద్వాజగోత్రమువారియందును, వాత్స్యగోత్రపువారియందును, అభిముఖ బుధశుక్రదోషములేదు.) అనివసిష్ఠుఁడు చెప్పె.

వ్యా॥ స్వగ్రామేతి॥ స్వగ్రామః ప్రసిద్ధః ఏకపురంప్రసిద్ధం - ఆత్మసద్మఆత్మగృహం - చతుర్ముఖే చతుర్వక్త్రే చతుశ్శాలకంప్రసిద్ధం-ఉద్వాహాఃవివాహాః - బ్రాహ్మ్యాదయోవివాహాః - తేషువధూప్రవేశః - నవవధూప్రవేశః - నృపభీరాజభయం - దుర్భిక్షపీడాప్రసిద్ధా- తాసుతీర్థస్వామినిదేశయోః - తీర్థంతీర్థగమనం-స్వామినిదేశః - స్వామ్యాజ్ఞాతయోః - భృగువసిష్ఠాత్ర్యంగిరః కాశ్యపేభృగ్వాదిగోత్రసమూహే భారద్వాజవాత్స్యయోర్గోత్రయోః ఏషూక్తేషు సితజ్ఞోన్ముఖం శుక్రబుధ సమ్ముఖం యానంగమనంహితంస్యాత్ అత్రవధూప్రవేశే ప్రతిశుక్ర దోషోనోక్తః తత్తుభర్త్రాసహగమనవిషయం - భర్త్రావినాగమనేదోషోదృశ్యతే-నవోఢాయాస్తువంధ్యాత్వమితి॥ తథాచభీమపరాక్రమే॥ శ్లో॥ స్వామినానీయమానాయాం ప్రతిశుక్రోనవిద్యతఇతి॥ తథాచముహూర్తాంతరే॥ నవోఢాయాస్తువంధ్యాత్వంయదుక్తంసమ్ముఖేభృగౌ। తదత్రవిబుధైర్జ్ఞేయం కేవలంతుద్విరాగమేఇతి॥ తథాచల్లలః॥ శ్లో॥ స్వభవనపురప్రవేశే దేశానాంవిగ్రహే। నవవధ్వాగృహాగమనే ప్రతిశుక్రవిచారణానాస్తీతి॥ తథాచమత్స్యపురాణే॥ చతుశ్శాలం చతుర్ద్వారమళిందైస్సర్వతోయుతం। నామ్నాతత్సర్వతోభద్రంనతత్రప్రతిశుక్రతేతి॥ తథాచవసిష్ఠః॥ కాశ్యపేషువసిష్ఠేషుభృగ్వత్ర్యంగిరసేషుచ। భారద్వాజేషువాత్స్యేషుప్రతిశుక్రోనవి

అని బృహస్పతి చెప్పె. మఱియును, "శ్లో॥ సంతోష్య స్వాగతాన్విప్రాన్ జప్త్వా ఽప్రతిరథాదికం । శుచిశ్శుక్లాంబరోష్ణీషీ సత్వేష్టం సుమనా వ్రజేత్॥" (=తమయింటికి వచ్చిన బ్రాహ్మణులను జపించి రథాదికమును పూజించి పరిశుద్ధుండును తెల్లనివస్త్రములనుధరించి శిరోవస్త్రమును ధరించి ఇష్టదేవతలకు నమస్కారమునుజేసి స్వచ్ఛమైన మనస్సుకలవాఁడై ప్రయాణమును జేయవలయును.) మఱియును, "శ్లో॥ యాత్రాసమయే వృద్ధానుపరాగే గ్రహస్య వైషమ్యే । గోభూహిరణ్యవస్త్రైస్సంపూజ్య శ్రద్ధయా చ దైవజ్ఞమ్॥" (=యాత్రాసమయమందు గ్రహణము కలిగినను గ్రహవైషమ్యము కలిగినను వృద్ధులగువారిని దైవజ్ఞునిగోభూహిరణ్యవస్త్రములచేత చక్కఁగఁ బూజింపవలయును.) అని కశ్యపుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ స్నాతో భుక్తోనులిప్తశ్చ సర్వాలంకారభూషితః । శుక్లాంబరధరః స్రగ్వీ నర్వగస్సుఖమేధతే॥" (=ప్రయాణమును జేయువాఁడు స్నానభోజనాను లేపనములను జేసికొని సర్వాలంకారములచేత అలంకరింపఁబడినవాఁడై తెల్లనివస్త్రములనుధరించి బయలువెడలిన క్షేమముగ సుఖమునొందుచున్నాఁడు.) అని బృహద్యాత్రాగ్రంధమునందుఁ జెప్పఁబడినది. మఱియును, "శ్లో॥ బ్రాహ్మణానామవమన్యైవ కోపయేన్న నిజాంగనాం । యాత్రాం కృత్వా గృహం నైవ సిద్ధికామః ఇవిశేత్పునః॥" (=సిద్ధికాముఁడగువాఁడు బ్రాహ్మణులను అవమానింపకూడదు. తనభార్యను కోపింపఁగూడదు. బయలువెడలినపిమ్మట మరల గృహములోనికి రాఁగూడదు.) అని భూపాలవల్లభమను గ్రంథమునందుఁ జెప్పఁబడినది. మఱియును, "శ్లో॥ యాత్రాయాం ప్రస్థితో యో బ్రాహ్మణానవమన్యతే । తదంతం జీవితం తస్య నాసౌ ప్రతినివర్తతే॥" (=యాత్రకుఁబోవ నిశ్చయించినవాఁడు బ్రాహ్మణులను అవమానించెనేని యుదంతేటితో నతనియాయుష్యము సరిపోయినదనియును, కావున మరలిరాఁడనియును, తెలియవలయును.) అని లల్లాచార్యుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ యస్తు సంప్రస్థితో యాత్రాం స్వభార్యాం నాభినందతి । భార్యావిమానితం తేన నాస్య ప్రతినివర్తనమ్॥" (=యాత్రకుఁబోఁదలఁచినవాఁడు తనభార్యను సంతోషపఱచకపోయినను భార్యాసంతోషంపకపోయినను మరలఁదిరిగిరాక పరదేశమునందే మరణమును బొందును.) అని బృహద్యాత్రయను గ్రంథమునందుఁ జెప్పఁబడెను. మఱియును, "శ్లో॥ క్రోశమాత్రదినేయాయాత్ ప్రథమేహని శస్యతే । ద్వితీయే



యోజనం గత్వా నివసేత్ మహీపతిః । తృతీయే యోజనం సార్థం వసేదాక్రమ్య దూరతః । తతః పరం యథేష్టం తు యాయాన్మార్గం మహీశ్వరః॥" (=మొదటిదినమునందు క్రోసెడుదూరమైనను అర్ధక్రోసెడు దూరమైనను పోవలయును. రెండవదినమునందు యోజనదూరము పోవలయును. మూడవదినమునందు ఆరుక్రోసులదూరము పోవలయును.) అని రత్నావళియను గ్రంథమునందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ చంద్రేతి॥ చంద్రే పూర్వభమేషగే సతి - సితః-శుక్రః- అంధః స్యాత్ - తదా సమ్ముఖయానం సత్ శుభం స్యాత్॥ తథా చ గర్గః॥ శ్లో॥ పౌష్ణాదివహ్నిభాద్యంఘ్రౌ యావత్తిష్ఠతి చంద్రమాః । తావచ్ఛుక్రోంధ వేచ్ఛుక్రః ప్రవేశే నిర్గమే శుభ ఇతి॥ అథావశ్యకప్రవృత్తిమాహ॥ పరపూర్వయోః పశ్చిమపూర్వయోః - సితవిపర్యాసాత్ - శుక్రవిపర్యాసాత్ - అవశ్యకే కృత్యే సతి పశ్చిమాం గచ్ఛేత్ - పశ్చిమకపాలంగతే సతి పూర్వాంగచ్ఛేత్॥ తథా చ జ్యోతిః ప్రకాశే॥ శ్లో॥ అస్తంగతస్తు కేతుయాయాత్ ప్రాక్కపాలస్థో భృగుస్సువేత్ । తావత్ప్రతిదిశం గచ్ఛేత్ ప్రాచీం ప్రత్యక్స్థితే స్థితే॥ అథ ప్రయాణవిధిమాహ॥ రాజా త్రిదివసైః క్రోశద్విషట్ క్రోశకాన్ వ్రజేత్ - ఏతదుక్తం భవతి - ప్రథమే దినే క్రోశం గచ్ఛేత్ - ద్వితీయే దినే చతుఃక్రోశాన్ - తృతీయే షట్ క్రోశాన్ - అథాతఃపరతో యథేష్టం గచ్ఛేత్ - కథంభూతః రాజా-స్వరితవహ్నిభూసురసుహృత్ - వహ్నిరగ్నిః-భూసురాః-బ్రాహ్మణాః-సుహృదో బాంధవాః - తేతర్పితాః వహ్నిభూసుర సుహృదో యేన స తథా - అత్రాయం భావః - సమిచ్చరుతిలాదినా వహ్నిం తర్పయిత్వా దక్షిణాన్నాదిభిర్భూసురాం స్తర్పయిత్వా వస్త్రాలంకరణాదిభిస్సుహృదః కలత్రాదీం స్తర్పయిత్వా వ్రజేదితి॥ కింకుర్వన్ స్నేహానువృత్తిం త్యజన్ సన్ స్నేహేన అనువృత్తిం పునర్గృహాగమనం - అయంభావః - యాత్రార్థం బహిర్గత్వా తత్రాపి స్నేహవశాత్ తదవలోకనార్థం గృహం నాగచ్ఛేదితి కథంభూతః రాజా తృప్తః - బుభుక్షితో న గచ్ఛేదిత్యభిప్రాయః - పునః కిం లక్షణః-కార్యమనాః - కార్యాయ ఉత్కంఠితాంతఃకరణః॥ తథా చ రత్నమాలాయాం॥ స్వనికేతాత్సరభవనాత్ప్రస్థానాదాశ్రమాద్గురుగృహాద్వాపి యాయాత్ కృతాగ్నికార్యః ప్రాశ్యహవిష్యం ద్విజానుమతమితి॥ తథా చ బృహస్పతిః॥ శ్లో॥ దైవజ్ఞం పూజయిత్వా తు విధానః పూజ్యశక్తితః । ప్రదక్షిణా మహీంకృత్వా తిష్ఠన్ ధ్యాయేదుమాపతిమితి॥ తథా చ జ్యోతిఃప్రకాశే॥ సంతోష్య స్వాగతాన్ విప్రాన్ జప్త్వా ఽప్రతిరథా

దికం । శుచిశ్శుక్లాంబరోష్ణీషో నత్వేష్టం సుమనా వ్రజేదితి ॥ తథాచ కశ్యపః॥ యాత్రాసమయే వృద్ధాను పరాగే గ్రహస్య వైషమ్యే । గోభూహిరణ్యవస్త్రైః స్నాత్వా పూజ్యాశ్రద్ధయా చ దైవజ్ఞమితి॥ బృహద్యాత్రాయాం ॥ స్నాతో భుక్తో నులిప్తశ్చ సర్వాలంకారభూషితః । శుక్లాంబరధరస్స్రగ్వీమానధ్వగస్సుఖమథత ఇతి॥ భూపాలవల్లభే॥ బ్రాహ్మణాన్నైవమన్యేత కోపయేన్న నిజాంగనాం । యాత్రాం కృత్వా గృహం నైవ సిద్ధికామో విశేత్పునరితి॥ లల్లః॥ యాత్రాయాం ప్రస్థితో యశ్చ బ్రాహ్మణానవమన్యతే । తదంతం జీవితం తస్య నాసౌ ప్రతినివర్తత ఇతి॥ బృహద్యాత్రాయాం॥ స్త్రియస్తు సంప్రస్థితో యాత్రాం స్వభార్యాం నాభినందతి॥ భార్యా వా నాభినందేత నాస్య ప్రతినివర్తనమితి॥ తథాచ రత్నావల్యాం ॥ క్రోశం వా యది వాప్యర్ధం ప్రస్థమేవాభిశస్యతే । ద్వితీయే యోజనం గత్వా నివసేత మహీపతిః । తృతీయే యోజనం సార్ధం వసేదాక్రమ్య దూరతః । తతః పరం యథేష్టం తు యాయాన్మార్గం మహీశ్వర ఇతి ॥

——(*) అథయాతుర్నియమమాహ. (*)——

మూ॥ క్రోధక్షౌరరతిశ్రమామిషగుడద్యూతాశ్రుదుగ్ధాసవక్షౌ
రాభ్యంగభయాసితాంబరవమిస్తైలం కటూజ్ఝేద్గమే ।
క్షీరక్షౌరరతీః క్రమాత్త్రిశరసప్తాహం పరంతద్దినే రోగం
స్త్రీరత్వకంసితాన్యతిలకం ప్రస్థానకే పీతిచ॥ ౧౮॥

టీక॥ క్రోధక్షౌర...వమిః—క్రోధ=క్రోధమును, క్షౌర=క్షౌరమును, రతి=సంభోగమును, శ్రమ=క్లేశమును, ఆమిష = మాంసమును, గుడ=బెల్లమును, ద్యూత=ద్యూతమును, అశ్రు=కన్నీళ్లను, దుగ్ధ=క్షీరమును, ఆసవ = మద్యమును, క్షౌర = క్షౌరధాన్యము మాషాదికమును, అభ్యంగ=అభ్యంగమును, భయ=భయమును, అసితాంబర=నల్లనివస్త్రమును, వమిః=వమనమును, తైలమ్=తైలమును, గమే = గమనమునందు, ఉజ్ఝేత్=విడువవలయును. క్రమాత్=క్రమముగా, క్షీరక్షౌరరతీః= క్షీరపానము క్షౌరము సంభోగము అనువానిని, త్రిశరసప్తాహమ్ = మూఁడు, అయిదు, ఏడు, దినములను, ఉజ్ఝేత్=విడువవలయును. పరమ్ = ఇతరమగుదానిని, తద్దినే=ఆప్రయాణదినమునందు, ఉజ్ఝేత్ = విడువవలయును. రోగమ్=రోగమును, యావద్బాధమ్=బాధయున్నంతవఱకును, ఉజ్ఝేత్=విడువవలయును. స్త్రీరతకమ్=స్త్రీలయొక్క రజస్సును, బీజదానపర్యంతమ్=బీజదానమువఱకును, (త్యజేత్=విడువవలయును.) సితాన్యతిల



కమ్=నీలపీతాదివస్త్రములను తైలమును, ప్రస్థానకే పీతిచ = ప్రయాణముహూర్తసమయమునందును, ఉజ్ఝేత్=విడువవలయును.

తా॥ ప్రయాణము జేయువానియొక్క నియమమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—క్రోధము, క్షౌరము, మైథునము, క్లేశము, మాంసము, బెల్లము, ద్యూతము, అశ్రుమోచనము, పాలు, మద్యము, క్షౌరధాన్యమగు మాషాదికము, అభ్యంగము, భయము, అశుభ్రవస్త్రములు, వమనము, తైలము, మిరియములు మొదలుగాఁగల కటుపదార్థములు, అనువానిని ప్రయాణమును జేయఁబోవువాఁడు విడిచిపెట్టవలయును. మఱియును, క్షీరములను, మూఁడుదినములకుముందుగను, క్షౌరమును అయిదుదినములకు ముందుగను, సంభోగమును ఏడుదినములకుముందుగను విడిచిపెట్టవలయును. మిగిలినవానిని ప్రయాణదినమునందు విడువవలయును. రోగమును బాధలేకయుండువఱకును విడిచిపెట్టవలయును. స్త్రీలఋతుకాలమును బీజదానమువఱకును విడిచిపెట్టవలయును. అశుభ్రవస్త్రాదికమును తైలమును ఆముహూర్తకాలమందుమాత్రము విడువవలయును. మఱియును, ప్రయాణముహూర్తకాలమునందు బయలువెడలుట కేమైన అనుపపత్తులు కలిగియుండెనేని అభీష్టమగు వస్తుచాలనమును చేయవలయును. దీనినే సర్గమని చెప్పుదురు. "శ్లో॥ ఛత్త్రాయుధాద్యం మనసస్త్వభీష్టం ప్రచాలయేన్నైవ జయైకంజయార్థీ॥" (=మనస్సున కిష్టమైన ఛత్త్రము ఆయుధము మొదలగువానిలో నొకదానిని చాలనము చేయవలయును.) అని రత్నమాలయందు గ్రంథమునందుఁ జెప్పబడినది. ఈసర్గమనకార్యమును ప్రయాణమైనపిమ్మటఁ జేసినయెడల పూర్ణఫలము కలుగనేరదు. "శ్లో ॥ కార్యవశాత్స్వయమగమే భూభర్తుః కేచిదాచార్యాః । ఛత్త్రాయుధాద్యభీష్టం వైజయికం సర్గమేకుర్యాః॥" (=ప్రయాణమును జేయఁదలఁచిన ప్రభువు స్వయముగా బయలువెడలుటకు అసందర్భము కలిగియుండెనేని అతనియాచార్యులు అభీష్టమగు ఛత్త్రాయుధాదికమును కొనిపోయి గృహాంతరము మొదలగువానియందుఁ బెట్టవలయును. దీనినే వస్తుచాలనమనియును, సర్గమనమనియును, చెప్పుదురు.) అని రత్నకోశమను గ్రంథమునందుఁ జెప్పఁబడినది. మఱియును, " శ్లో ॥ స్వశరీరేణయదికశ్చిన్నిర్గచ్ఛన్సిద్ధయాన్వితః। తస్యయాత్రాఫలం సర్వం సంపూర్ణం పథసిద్ధ్యతి॥ " (=లోకములో నెవ్వఁడు శ్రద్ధతోఁగూడినవాఁడై స్వశరీరముతోడనే బయలువెడలిపోవు

వానికి మార్గమునందు యాత్రాఫలము సంపూర్ణముగ సిద్ధించును.) అని గర్గుఁడను మునివరుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ గృహాద్గృహాంతరం గర్గ ఆహ సీమాంతరం భృగుః । శరక్షేపాద్భరద్వాజో వసిష్ఠో నగరాద్బహిః॥" (=గృహమునుండి వేఱొక గృహమునకుఁ బోవలసినదని గర్గుఁడు చెప్పెననియును, గ్రామమునుండి వేఱొక గ్రామమునకుఁ బోవుట నిర్గమనమని భృగువు చెప్పెననియును, బాణమెంతదూరము పోవునో అంత దూరమునకుఁ బోవుట నిర్గమనమని భరద్వాజుఁడు చెప్పెననియును, వసిష్ఠమునివరుఁడు నగరమునుండి బయలునకుఁ బోవుట నిర్గమనమనియెనని యును, తెలియవలయును.) గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె. మఱియును, ఈవిధముగా నిర్గమనమును చేసినపిమ్మట మఱియొక్కటెయగు సుదినమునందు స్వయముగా ప్రయాణమును చేయవలయును. మఱియును, "శ్లో॥ ప్రస్థానే విక్రుతే నేయా స్మహాదోషాన్వితే దినే । గర్భయోగం వినా కాల వృష్ట్యాదౌ చాప్లుతే తథా ॥" (=నిర్గమనమును చేసినపిమ్మట మహాదోషములుగల దినమునందుఁగూడఁ బ్రయాణమును చేయవచ్చును. మఱియును, గర్భయోగము తప్పఁ దక్కినకాలవృష్ట్యాదులవలన దోషము లేదని తెలియఁగవలయును) అని జ్యోతిఃప్రకాశమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ వసేన్న చైకత్ర దశక్షితీశో దినాని నో సప్తచ మండలీకః । యః ప్రాకృతో సోపిచ పంచరాత్రం భద్రేణ యాత్రా పరతః ప్రయోజ్యా॥" (=రాజగువాఁడొకచోట నొకదినము నివసింపవలయును. మఱియును, పదిదినములు నివసింపఁగూడదు. మండలాధిపతియగువాఁడు ఐదుదినములకంటె నధికముగ నొక్కచోట నివసింపఁగూడదు. ప్రాకృతుఁడగు జనుఁడు ఐదుదినములకంటె నధికముగ నివసింపఁగూడదు.) అని రత్నమాలయను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, యాత్రకుఁబోవుచు మార్గమునందలి గ్రామములో కొన్నిదినములు నివసించి యక్కడనుండి బయలువెడలువాఁడుకూడ క్షౌరాదులను పైనచెప్పఁబడినవిధముగ విడిచిపెట్టవలయును. మఱియును, "శ్లో॥ క్రోధం క్షౌరం తథా వాన్తి తైలాభ్యంగాశ్రుమోక్షణం । ద్యూతం మాంసం గుడం తైలం యానే మద్యం పరిత్యజేత్॥" (=ప్రయాణదినమునందు క్రోధమును, క్షౌరమును, వాంతిని, తైలాభ్యంగమును, అశ్రుమోక్షణమును, ద్యూతమును, మాంసమును, గుడమును, తైలమును, మద్యమును, పరిత్యజింపవలయును.) అని గర్గుఁడను మునివరుఁడు చెప్పె. మఱియును,



"శ్లో॥ కాళీయకం హింగులకః కుంకుమం రక్తచందనం । పీతరక్తం చ వసనం యాతుర్నేష్టాని తత్క్షణాత్॥" (=మ్రానిపసుపు, ఇంగువ, కుంకుమము, రక్తచందనము, పీతరక్తవసనము, అనునవి ప్రయాణము చేయువానికి పనికిరావు.) అని రత్నప్రకాశమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ కటుతైలగుడక్షార పక్వమాంసాశనం తథా । భుక్త్వా యో యాతి మోహేన వ్యాధితస్స నివర్తతే॥" (=కారము, తైలము, బెల్లము, క్షారపదార్థము, పక్వమాంసమును, భుజించి ప్రయాణమును చేయువాఁడు వ్యాధిగ్రస్తుఁడై తిరిగివచ్చును.) అని బృహద్యాత్రయను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ ప్రమత్తో వ్యాధితో భీతశ్శాంతః క్రుద్ధో బుభుక్షితః । అధ్వానం న ప్రపద్యేత క్లీబవేషస్తథైవ చ॥" (=ప్రమత్తుఁడును వ్యాధితుఁడును, భీతుఁడును, శాంతుఁడును, క్రుద్ధుఁడును, ఆకలికలవాఁడును, క్లీబవేషముకలవాఁడును నై మార్గమును నడచుటకు ప్రయత్నమును చేయఁగూడదు.) అని లల్లాచార్యుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ స్వకీయాం పరకీయాం వా స్త్రియం పురుషమేవ వా । తాడయిత్వా తు యో గచ్ఛేత్తదంతం తస్య జీవితమ్ ॥" (=స్వకీయస్త్రీనినైనను, పరకీయస్త్రీనినైనను, స్త్రీనినైనను, పురుషునినైనను, కొట్టి యెవ్వఁడు ప్రయాణమగునో వానిజీవనమంతటితో సరియని గ్రహింపవలయును.) అని రత్నావళియను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ త్రిరాత్రం వర్జయేత్ క్షీరం పంచాహం తు క్షురకర్మ చ । యాత్రాయాం ప్రాక్చ సురతం సప్తాహం సంపరిత్యజేత్॥" (=క్షీరములను ప్రయాణదినమునకు మూఁడుదినములకు ముందుగను, క్షౌరమును ఐదుదినములకు ముందుగను, ఏడుదినములకుముందుగ సురతమును విడిచిపెట్టవలయును.) అని భృగువనువాఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ ముహూర్తసమయే ప్రాప్తే హంసచారం ఘ్రాణే త్యజేత్ । సైన్యైర్వా సహితో విప్రైర్వా పురోహితైస్స్వజనైర్వృతః । పూర్వం పక్షిగణ ధ్వనిశ్శ్య పాదం యాత్రాసు రాధిపః । ద్వాత్రింశత్పదం గత్వా యానమారుహ్య సంవ్రజేత్ । తతో నిగిరమేత్స్వస్య కృషహాంశ్చ శుభాశుభాన్ । తద్వైన సదసచ్ఛబ్దాన్నిమిత్తాని చ సంవ్రజేత్॥" (=ముహూర్తసమయము సంప్రాప్తమైనప్పుడు హంసయొక్క సంచారకలవంటి నడకలను విడిచిపెట్టి సైన్యములతోడను అమాత్యులతోడను, స్వజనులతోడను గూడకొనినవాఁడై ముందుగా దక్షిణపాదమును ఎత్తి నడువవలయును. మఱియును, పిమ్మట ముప్పది రెండడుగుల దూరము

పోయి పిమ్మట యానమునెక్కి పోవలయును. అనంతరమందు శుభాశుభశకునములను సదసచ్ఛబ్దములను పరీక్షింపవలయును.) అని యాత్రయందలి గమనలక్షణమును గర్గమునివరుండు చెప్పె.

వ్యా॥ క్రోధేతి॥ క్రోధః-ప్రసిద్ధః - క్షురం-ప్రసిద్ధం-రతిః-మైథునం-శ్రమః-క్లేశః - ఆమిషం-మాంసం-గుడః-ప్రసిద్ధః - ద్యూతం-ద్యూతరమణం-అశ్రు-అశ్రుమోచనం - దుగ్ధం-ప్రసిద్ధం -ఆసవో-మద్యం-క్షారం- క్షారధాన్యంమాషాది- అభ్యంగ స్తైలాభ్యంగః - భయం-శంకారిపుభయమిత్యర్థః-అసితాంబరాణి - అశుభ్రవస్త్రాణి-రక్తకృష్ణాదీని - వమిర్వమనం-తైలం-ప్ర-కటు-మరీచాది - ఇత్యేతద్గమే గమనే - ఉజ్ఝేత్-త్యజేత్- అథయత్రేషు కింకింకతిదినంత్యజేదిత్యాహ॥ క్షౌరేతి॥ క్షౌరక్షురరతీః క్రమాత్ - త్రి-౩-శర-౫-సప్తాహం-౭- త్యజేత్-క్షీరం దుగ్ధం త్ర్యహం - ౩-క్షురం శరాహం పఞ్చాహం-౫. రతింసప్తాహంత్యజేదిత్యర్థః - పరంఉర్వరితం - తద్దినే ప్రయాణాదినే త్యజేత్ - రోగం వ్యాధిం యావద్బాధం త్యజేత్ - స్త్ర్యార్తశంబీజదానపర్యంతంత్యజేత్ - సితాన్యతిలకం - శ్వేతవ్యతిరిక్తం తిలకం పీతకౌసుమాదికం - తద్దినే త్యజేత్ - ప్రస్థానకేపి ఇత్యేతత్త్యజేత్ - స్థానకం నామ ముహూర్తసమయే కించిదభీష్టవస్తుచాలనం ॥ తదుక్తం ॥ రత్నమాలాయాం ॥ శ్లో॥ ఛత్రాయుధాద్యం వసనస్త్వభీష్టం ప్రచాలయేద్ద్విజముఖంజయార్థీ॥ ఏతత్తు కార్యం పస్త్వక్షిపతే ప్రస్థానే సంపూర్ణఫలం నాస్తి॥ తథాచరత్నకోశే॥ కార్యవశాత్స్వయమగమే భూభర్తుః కేచిదాచార్యాః। ఛత్రాయుధాద్యభీష్టం వైజయికనిర్గమేమకుర్యురితి॥ తథా చగర్గః॥ శ్లో॥ స్వశరీరేణయఃకశ్చి న్నిర్గచ్ఛేచ్ఛ్రద్ధయాన్వితః। తస్యయాత్రాఫలంసర్వం సంపూర్ణంపథిసిద్ధ్యతీతి॥ తచ్చాలనావిధిర్గ్రంథాన్తరాత్॥ గృహాద్గృహాన్తరం గర్గ ఆహసీమాంతరంభృగుః। శరక్షేపాద్భరద్వాజో వసిష్ఠోనగరాద్బహిరితి॥ ఏవంప్రస్థానేకృతేపి స్వయంమనుష్యస్మిన్ సుదినేగచ్ఛేత్ - తథాచజ్యోతిఃప్రకాశే॥ ప్రస్థానేపికృతే నేయాః స్నిగ్ధా దోషాన్వితేదినే। గర్భాధానంవిధాకాల వృష్ట్యాదౌచాన్యకేతకే॥ రత్నమాలాయాం। వసేన్నచైకత్రదశక్షితీశో దినానిసప్తైవమండలీకః। సామాన్యకృత్సోపిచపంచరాత్రం భగ్నేముహూర్తేసరతఃప్రయోజ్యః॥ ఏవంవిధేప్రస్థానేపిక్రోధక్షురరత్యాదీన్వర్జయేదిత్యాహగర్గః॥ శ్లో॥ క్రోధంక్షురంతథాహన్తి తైలాభ్యంగాశ్రుమోచనం। ద్యూతంమాంసం గుడంతైలంయానేమద్యం పరిత్యజేదితి॥ రత్నప్రకాశే॥ కాలీయకంహింగులకః



కుంకుమంరక్తచందనం। పీతరక్తంచవసనం యాతుర్నేష్టానితత్క్షణాదితి॥ బృహద్యాత్రాయాం॥ కటుతైలగుడక్షౌర పక్వమాంసాశనంతథా। భుక్త్వాయోయాతిమోహేన వ్యాధితస్సనివర్తతే॥ అల్లః॥ ప్రమత్తోవ్యాధితోభీత శ్శాంతఃక్రుద్ధోబుభుక్షితః। అధ్వానంనప్రపద్యేత క్లీబవేషస్తథైవచ॥ రత్నవల్ల్యాం॥ స్వకీయాంపరకీయాం వాస్త్రియంపురుషమేవవా। తాడయిత్వాతుయోగచ్ఛే త్తదంతంతస్యజీవితమితి॥ భృగుః॥ త్రిరాత్రం వర్జయేత్క్షీరం పంచాహంక్షురకర్మచ। యాత్రాయాంప్రాక్చసురతం సప్తాహంసంపరిత్యజేత్। యాత్రీయాంగమనలక్షణం గర్గోక్తంజ్ఞేయం-ముహూర్తసమయేప్రాప్తే హంసచారాంఘ్రిణాత్యజేత్। దైవజ్ఞామాత్యవిప్రాద్య పురోగైస్స్వజనైర్వృతః। పూర్వదక్షిణముద్ధృత్య పాదం యాత్రానరాధిపః। ద్వాత్రింశతపదంగత్వా యానమారుహ్యసంవ్రజేత్। తతోనిరీక్షయేత్సమ్యక్ శకునాంశ్చశుభాశుభాన్। తత్రైవసదసచ్ఛబ్దాన్ నిమిత్తానిచసంవ్రజేదితి॥

——(*) అథశకునాన్యాహ. (*)——

ము॥ వస్త్రాలంకరణానిపూర్ణకలశ స్తౌర్యత్రధ్వనిఃపుత్రవాన్ శం
ఖాదర్శనృపాశ్వదంతిసురభి స్త్రీపుష్పధాన్యాదిచ। డో
లాదీపవిధూమవహ్నిసురభిద్రవ్యాణిశుభ్రోవృషో వేశ్యా
ఛత్రవితానచామరకుమారీ గ్మీనగోరోచనే॥ ౧౫॥

టీక॥ వస్త్రాలంకరణాని= శ్వేతవస్త్రములును సువర్ణాదినిర్మితములగుసొమ్ములును, పూర్ణకలశః = ఉదకముచేతనిండినకలశమును, తౌర్యత్రధ్వనిః= మంగళవాద్యములును, పుత్రవాన్ = పుత్రవంతుడగు పురుషుడును, (అనగా వర్తమానపురుషుడును) శంఖాదర్శనృపాశ్వదంతిసురభిస్త్రీపుష్పధాన్యాదిచ=శంఖము, అద్దము, అశ్వము, ఏనుగు, గోవు, సౌభాగ్యవతియగునాడుది, పుష్పములు, శ్వేతధాన్యములు, అనునవియును, డోలాదీపవిధూమవహ్నిసురభిద్రవ్యాణి = పల్లకిమొదలుగాగలది, దీపము, ధూమరహితమైనయగ్ని, పరిమళద్రవ్యములు అనునవియును, శుభ్రోవృషః= తెల్లని, వృషః=వృషభము, వేశ్యా=వారాంగన, ఛత్రవితానచామరకుమార్యః= ఛత్రము, వస్త్రనిర్మితమగుచాందిని, వింజామరము, పెండ్లిగానిపడుచులు అనునవియును, మీనగోరోచనే=జలములోనుండితేబడినచేపలు గోరోచనములును అనునవియును, (శకునాని= శుభశకునములని, ఉచ్యంతే= చెప్పబడుచున్నవి.

తా॥ ఈశ్లోకముచేత శకునములను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— తెల్లనివస్త్రములు, సువర్ణాదులచేతనిర్మింపఁబడినసొమ్ములు, పూర్ణకలశము, మంగళవాద్యములు, పుత్రవంతుఁడు అనఁగా వర్ధమానపురుషుఁడు, శంఖము, అద్దము, రాజు, అశ్వము, ఏనుఁగు, గోవు, సౌభాగ్యవతియగునాఁడుది, శ్వేతధాన్యములు, సువర్ణాదిధాతువులు, పల్లకిమొదలగునది, దీపము, పొగలేనినిప్పు, పరిమళద్రవ్యములు, అనఁగా కర్పూరచందనాదులు, శ్వేతవృషభము, ఛత్రము, వితానము, చామరము, పెండ్లిగానిపడుచులు, ఉదకమునుండి లేవఁదీయఁబడినమత్స్యము, గోరోచనము, మొదలగునవి శుభశకునములని తెలియవలయును.

వ్యా॥ వస్త్రాణీతి॥ వస్త్రాణి- శ్వేతవస్త్రాణి - అథాన్యపశుశకునమధ్యేపఠితాని- అలంకరణాని- సువర్ణాదినిర్మితాని భూషణానీత్యర్థః-పూర్ణకలశః- ప్రసిద్ధః- తౌర్యధ్వనిః- వాద్యధ్వనిః- పుత్రవాన్- వర్ధమానఃపురుషః- శంఖఃప్రసిద్ధః ఆదర్శోముకురః- నృపోరాజా- అశ్వఃప్రసిద్ధః- దంతీ- హస్తీ- సురభిర్గౌః- స్త్రీ- సౌభాగ్యవతీ- పుష్పాణి- శ్వేతాని- ధాన్యాని- అకృష్ణాని- కృష్ణాని- త్వపశకునమధ్యేపఠితాని - ఆదిశబ్దేన- సువర్ణాదిధాతవః- దోలా- ప్రసిద్ధా- దీపః- ప్ర - విధూమవహ్నిః - ధూమరహితోవహ్నిః- సురభిద్రవ్యాణి- సుగన్ధద్రవ్యాణి- కర్పూరచందనాదీని- శుభోవృషః శ్వేతవృషభః- వేశ్యా- ప్ర- ఛత్రం- ప్ర- వితానం- వస్త్రనిర్మితం- చామరం- ప్ర- కుమారీ- ప్ర- మీనో- మత్స్యః- జలాదుద్ధృతః- రోచనం- ప్ర॥

(*) అథసంకోచేనాహ. (*)

మూ॥ యద్యత్స్వాంతనితాన్తతోషకరణం కోరుద్ధృతంగోమయం
మృచ్చాప్యంభోర్థఘటాన్వితస్సహచరో ధౌతామ్బరో మైత్ర
కః। దూర్వాదర్భరథాః పలాస్రమదిరా వర్ణీగురుర్దైవవి
ద్విప్రౌమిత్రమృగావరోదనశవం సిద్ధార్థదుగ్ధాదిచ॥ ౧౬॥

టీక॥ యద్యత్=ఏదేది, స్వాంతనితాంతతోషకరణమ్=అంతఃకరణమునకు అత్యంతమును సంతోషమును జేయునో, కోః=భూమినుండి, ఉద్ధృతమ్=ఎత్తఁబడిన, గోమయమ్=గోమయము, కోః=భూమినుండి, ఉద్ధృతా=ఎత్తఁబడిన, మృచ్చ=మృత్తికయును, అంభోర్థఘటాన్వితః=ఉదకముకొఱకయినఘటముతోఁగూడిన, సహచరః=సహచరుఁడును, ధౌతాంబరః=ఉదుకఁబడినవస్త్రములుగల, మైత్రకః=రజకుఁడును, దూర్వాదర్భరథాః=గరికెదర్భరథములు అనునవియును, పలాస్రమదిరాః=మాంసము, ర



క్తము, మద్యము, అనునవియును, వర్ణీ=బ్రహ్మచారియును, గురుః=గురుఁడును, దైవవిత్=దైవజ్ఞుఁడగుజ్యోతిష్కుఁడును, విప్రౌ=ఇరువురుబ్రాహ్మణులును, మిత్రమృగౌ=మిత్రుఁడు, మృగము అనునవియును, అరోదనశవమ్=రోదనములేనిశవము, సిద్ధార్థదుగ్ధాదిచ=ఆవాలు పాలు మొదలగునదియును, (శకునాని=శుభశకునములు) ఇతి=ఇట్లని, జానీయాత్=తెలియవలయును.

తా॥ ఇంకను సంకోచమును జేసి చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— మనస్సునకు ఏదేది సంతోషకరమైనదో అయ్యది శుభశకునమని గ్రహింపవలయును. మఱియును, భూమినుండి యెత్తఁబడిన గోమయము భూమినుండి యెత్తబడిన మృత్తు అనునవి శుభశకునములనఁబడును. ఉదకముకొఱకుఁదీసికొనిపోఁబడుచున్న ఘటముతోఁగూడుకొనినవాఁడు ప్రయాణమును జేయువానికి సహచరుఁడయ్యెనేని సర్వోత్తమశకునమగును. ఈవిషయమునందు, "శ్లో॥ జలార్థీ రిక్తకుంభస్తు పథికేనసహవ్రజేత్। నివర్తతేయథాపూర్ణః కృతార్థఃపథికస్తథా" (=జలార్థియై నీళ్ళులేనికలశమును చేతఁబూనివచ్చువాఁడు పథికునకు సహచరుఁడయ్యెనేని ఆజలార్థి పూర్ణకలశుఁడై వచ్చునిధముగ పథికుఁడుకూడ కృతార్థుఁడై వచ్చును.) అని యమస్మృతివచనమును ప్రమాణమునుగా గ్రహింపవలయును. మఱియును, ధౌతవస్త్రములను దీసికొనివచ్చుచున్నరజకుఁడు, గరికె, దర్భ, రథము, మద్యము, బ్రహ్మచారి, గురుఁడు, దైవజ్ఞుఁడగుజ్యోతిష్కుఁడు, ఇరువురుబ్రాహ్మణులు, మిత్రుఁడు, మృగము, రోదనములేనిశవము, ఆవాలు, పాలు మొదలగునది, ఇవియన్నియును శుభశకునములని గ్రహింపవలయును. మఱియును, అయితే, మనస్సునకు సంతోషమును గలుగఁజేయునట్టివస్తువులు శుభశకునములనుటచేతనే మనస్సంతోషకరములయిన పాలు పెరుగు మొదలగునవికూడఁ జెప్పఁబడినట్లయ్యెగదా? అట్లుండఁగా మరలఁ బాలను జెప్పుటవలనఁ బ్రయోజనమేమనఁగా క్షీరపానము కూడదని చెప్పఁబడెను కనుక క్షీరము లెదురుగ రాఁగూడదని తలఁచుదురేమో యని తలఁచి అట్టిసందేహమును నివర్తించి పోవుటకొఱకు ఇక్కడ క్షీరాదికము చెప్పఁబడెనని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ దధ్యాజ్యదూర్వాక్షతపూర్ణకుంభసిద్ధాన్నసిద్ధార్థకచందనాని। ఆదర్శశంఖామిషమీనమద్య గోరోచనాగోమయముద్ధృతంగోః॥" (పెరుగు, నెయ్యి, గరికె, అక్షతలు, పూర్ణకుంభము, ఆవాలు, చందనాదిపరిమళద్రవ్యములు, అద్దము, శంఖము, మాంసము, మత్స్యము, మద్య

——(*) అథాశుభాన్యాహ. (*)——

మూ॥ కుర్వాక్ దక్షిణతస్సదైత దితరద్వామేప్ర కుర్వాక్ప్రజే ద్భ
స్మాస్థీంధనవిట్తుషాశ్మ లవణోపానత్తృణాయస్కరాః।
పిణ్యాకౌషధ కృష్ణధాన్య రుదనంతక్రం సధూమానలః
కార్పాసారుణపుష్పచర్మచగుడస్తైలాయసీకర్దమః॥ ౧౭॥

టీక॥ ఏతత్=ఇప్పుడు చెప్పఁబడిన పదార్థసముదాయము, దక్షిణతః = దక్షిణభాగమునందు, కుర్వాక్ = చేయుచు, సత్=శుభమైనది, భస్మ-భస్మము, అస్థి=ఎముక, ఇంధనవిట్తుషాశ్మలవణోపానత్తృణాయస్కరాః=కట్టెలు, పురీషము, ఊముక, పాషాణము, లవణము, చెప్పులు, తృణములు, లోహకార్యుఁడు, పిణ్యాకౌషధకృష్ణధాన్యరుదనమ్ = మర్దితములగుశిలలు, ఔషధము, కృష్ణధాన్యము, మాషాదికము, రోదనము, అనునవియును, తక్రమ్=మజ్జిగ, సధూమానలః = పొగతోఁగూడిన నిప్పు, కార్పాసారుణపుష్పచర్మచ-ప్రత్తి, ఎఱ్ఱనిపుష్పము, చర్మము, అనునవియును, గుడః=గుడము, తైలాయసీ=తైలములోహము, అనునవియును, కర్దమః=బురద, అనునట్టి పదార్థసముదాయమును, వామే=వామభాగమునందు, ప్రకుర్వాక్=చేయుచు, ప్రజేత్ = పోయెనేని, ఇతరత్=అశుభము, స్యాత్=అగును.

తా॥ ఇఁకను అశుభములయిన శకునములను చెప్పుచున్నాఁడు. ఎట్లనినః—పూర్వశ్లోకములయందుఁ జెప్పఁబడిన శుభశకునములు దక్షిణభాగమునందు అయ్యెనేని శుభశకునములగును. ఇఁకమీఁదటఁ జెప్పఁబడఁబోవుచున్న యపశకునములు వామభాగమునందయ్యెనేని యపశకునములేయగును. మఱియును, భస్మము, ఎముకలు, కట్టెలు, పురీషము, ధాన్యాదులయొక్క-పొట్టు, పాషాణము, లవణము, పాదరక్షలు, తృణము, లోహకారుఁడు, మర్దితములగుతిలలు, ఔషధము, కృష్ణధాన్యము, రోదనము, మజ్జిగ, పొగతోఁగూడిననిప్పు, ప్రత్తి, ఎఱ్ఱనిపుష్పము, చర్మము, గుడము, తైలము, లోహము, బురద, మొదలగునవి యపశకునములని తెలియవలయును.

వ్యా॥ ఏతత్-అనంతరోక్తం - సత్- శుభం దక్షిణతః దక్షిణభాగే కుర్వాక్ సక్ - ఇతరత్-అశుభం-పశ్యమానాం - వామేకుర్వాక్ సక్ ప్రజేత్ గచ్ఛేత్ ॥ అథాశుభాన్యాహ ॥ భస్మ౹ భస్మప్రసిద్ధం-అస్థి-ప్ర-ఇంధనం-ప్ర విట్-విష్ఠా- తుషం-ధాన్యాదీనాంత్వక్ - అశ్మ-పాషాణః-



లవణంసాముద్రికం - ఉపానసపాదా-ప్ర-తృణం-ప్ర - అయస్కరోలోహకరః-పిణ్యాకం - మర్దితతిలాః-ఔషధం- ప్ర-కృష్ణధాన్యం - మాషాది-రుదనం-రోదనాది-తక్రం-ప్ర-సధూమానలః - ధూమసహితోగ్నిః- కార్పాసః ప్ర-అరుణంపుష్పం-జపాది - చర్మ-ప్ర- గుడః-ప్ర-తైలం-ప్ర - అయోలోహం-కర్దమః-పంకః॥

మూ॥ మత్తోవాంత బుభుక్షితాంత కఖలా ముండీ జటీవ్యాధితః
ఖంజవ్యంగదిగంబరాయతిరరిః కాషాయముక్తాలకో ।
చోరాభ్యక్తమలావిలాశ్చ పతితః పాశ్యర్గళీగుర్విణీ వం
ధ్యాకృష్ణవృషాహిభేకసరటాగోధావరాహశ్శశః॥ ౧౮ ॥

టీక॥ మత్తః=పిచ్చివాఁడు, వాంతః = వమనమును జేసికొన్నవాఁడు, బుభుక్షితాంతకఖలాః = ఆకలిగొన్నవాఁడు, ప్రాణిహింసకుఁడు, దుర్జనుఁడు, అనువారలును, ముండీ=ముండితుఁడును, జటీ = జడలుగలవాఁడును, వ్యాధితః=రోగియును, ఖంజవ్యంగదిగంబరాః=కుంటివాఁడు, అంగహీనుఁడు, దిగంబరుఁడు, అనువారలును, యతిః = సన్న్యాసియును, అరిః=శత్రుఁడును, కాషాయముక్తాలకో = కాషాయవస్త్రములను ధరించినవాఁడును వెంట్రుకలను విరియఁబోసికొన్నవాఁడును, చోరాభ్యక్తమలావిలాశ్చ=దొంగ, తైలాభ్యక్తుఁడు, మలినుఁడు, అనువారలును, పతితః=జాతిభ్రష్టుఁడును, పాశీ = ప్రాణివధకొఱకు పాశములను ధరించినవాఁడును, అర్గళీ=అర్గళములుకలవాఁడును, గుర్విణీ=గర్భిణీస్త్రీయును, వంధ్యా=గొడ్డురాలును, కృష్ణవృషాహిభేకసరటాః = నల్లనియెద్దు, పాము, కప్ప, తొండ, అనునవియును, గోధా=ఉడుము, వరాహః = పంది, శశః=కుందేలు.

తా॥ పిచ్చివాఁడు, వమనమును చేసికొన్నవాఁడు, ఆకలిగొన్నవాఁడు, ప్రాణిహింసకుఁడు, దుర్జనుఁడు, ముండితుఁడు, జటలుకలవాఁడు, రోగి, కుంటివాఁడు, అంగహీనుఁడు, దిగంబరుఁడు, సన్న్యాసి, శత్రువు, గైరికరంజిత వస్త్రములను ధరించినవాఁడు, విరియఁబడునట్లు చేసికొన్నవెంట్రుకలుకలవాఁడు, చోరుఁడు, తైలాభ్యక్తుఁడు, మలినుఁడు, జాతిభ్రష్టుఁడు, ప్రాణివధకొఱకు పాశములను ధరించినవాఁడు, అర్గళముకలవాఁడు, గర్భిణీస్త్రీ, గొడ్డురాలు, నల్లయెద్దు, సర్పము, కప్ప, ఉడుము, పంది, కుందేలు, అనునవి యపశకునములని యెఱుఁగవలయును.

ఇవి, వామతః-వామభాగమునందు, గచ్ఛంతస్సంతః=పోవుచున్నవగుచు మనోభీష్టదాః = మనోరథసిద్ధినికలుగఁజేయునవి, స్యుః=అగును. కాళీ= మహిషము, కుక్కుటపుంప్రధానాశ్చ = కోడి, పురుషసంజ్ఞ కలకాకములు, సురభిః=గోవు, దక్షే=దక్షిణభాగమునందు, మనోభీష్టదాః = మనోరథసిద్ధినికలుగఁజేయునవి, స్యుః=అగును. భారద్వాజశిఖండిచాషనకులాః= భారద్వాజపక్షి, నెమలి, పాలపిట్ట, ముంగిస, అనునవి, హంసః=హంసము, అజః=మేకపోతు, ఏతే=ఇవి, దృశామ్ = దృక్కులకు, యాతాః= పొందినవై, ఇష్టఫలాః=ఇష్టమగుఫలముకలవి, స్యుః = అగును. రాసభరవః=గాడిదెయొక్కధ్వని, వామే=వామభాగమునందును, పృష్ఠేపి=పృష్ఠభాగమునందును, అర్థదః=అభీష్టమునుకలుగఁజేయునది, స్యాత్=అగును.

తా॥ ఇంకను కొన్నిశకునములను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— తుమ్మెద, వృశ్చికము, ఒంటె, మాటలాడుచున్నరాజశుకములు, గోళ్ళుకల కుక్కలుమొదలయినవియును, స్త్రీసంజ్ఞకల పిచ్చికలు మొదలగునవియును, వామభాగమునందుఁబోయెనేని మనోభీష్టమును కలుగఁజేయునవియగును. మఱియును, మహిషి, కుక్కుటము, పురుషసంజ్ఞకల కాకాదులు, గోవు, మొదలగునవి దక్షిణభాగముగఁబోయెనేని మనోరథమును నెరవేర్చునవియగును. మఱియును, భారద్వాజపక్షి, నెమలి, పాలపిట్ట, ముంగిస, హంస, మేక, అనునవి వామభాగమునందుఁగాని దక్షిణభాగమునందుఁగాని కనఁబడిన మాత్రముచేతనే యిష్టఫలమును కలుగఁజేయునవియగును. మఱియును, గాడిదెయొక్కధ్వని వామభాగమునందుఁగాని పృష్ఠభాగమునందుఁగాని వినఁబడెనేని యభీష్టార్థఫలసిద్ధియగును.

వ్యా॥ అథశకునాన్తరమాహ॥ భృంగో భ్రమరః - అళిర్వృశ్చికః- ఉష్ట్రః ప్ర-పఠచ్ఛుకాః - శబ్దంకుర్వాణా రాజశుకాః - సఖినః శ్వానాద యః-స్త్రీసంజ్ఞకాః - చటకాదయః ఏతేవామతః - మనోభీష్టదాస్స్యుః- కాళీమహిషీ-కుక్కుటః-ప్ర-పుంప్రధాః - పురుషసంజ్ఞికాః-కాకాదయః - సురభిర్గౌః ఏతేదక్షే మనోభీష్టదాః-స్యుః భారద్వాజః ప్ర-శిఖండీ - మయూరః-చాషః-ప్ర-నకులీ-బభ్రుః - హంసః ప్ర-అజోబస్తః - ఏతేభారద్వాజాదయః-దృశంయాతాస్సంతః - ఇష్టఫలాస్స్యుః- అయమర్థః - భారద్వాజాదయోవామేవా దక్షిణేవా (గేవాదృష్టమాత్రా) ఇష్టఫలాః - అభీష్టఫలదా భవంతీత్యర్థః - రాసభరవోగర్దభధ్వనిః వామేపృష్ఠేపిఅర్థదః - అభీష్టార్థ



దోఘనతి॥

## అథయేషుయేషుకృత్యేషు విపరీతశకునాః శుభాశ్చతానాహ.

మూ॥ నద్యుత్తారభయప్రవేశ సమరద్యూతేషు నష్టేక్షణే వ్యాధౌస్యుశ్శుభదా విలోమశకునా నాడ్యా ఇడాయాభరే।
ఆద్యేదుశ్శకునేనివృత్త్యచ శుచిర్భూత్వాష్టధాస్వాయమం కృత్వేయాదపరేష్టివారమపరే దత్వాసువర్ణంవ్రజేత్॥ ౨౧॥

టీక॥ నద్యుత్తారభయప్రవేశ సమరద్యూతేషు - నదీతరణము, రాజాదులభయము, సమరము, ద్యూతము, అనువానియందును, నష్టేక్షణే-నష్టవస్తుదర్శనమునందును, వ్యాధౌ=వ్యాధియందును, విలోమశకునాః-అపశకునములు, శుభదాః=శుభమునిచ్చునవి, స్యుః=అగును. ఇడాయాః=ఇడయనునట్టి, నాడ్యాః=నాడియొక్క, భరే - భారమునందు, (అనఁగా ఇడానాడి పూర్ణతనుపొందియున్నకాలమునందు) విలోమశకునాః=అపశకునములు, శుభదాః=శుభమునిచ్చునవి, స్యుః=అగును. ఆద్యే= మొదటిదగు, దుశ్శకునే = అపశకునమునందు, నివృత్యచ = మరలివచ్చి, శుచిః=కాలుచేతులనుకడిగికొనినవాఁడు, భూత్వా=అయి, అష్టధా=ఎనిమిదిపర్యాయములు, స్వాయమమ్=ప్రాణాయామమును, కృత్వా=చేసి, ఇయాత్=పోవలయును. అపరే = రెండవదగునపశకునమునందు, అష్టవారమ్=పదునారుపర్యాయములు ప్రాణాయామమును, కృత్వా=చేసి, ఇయాత్=పోవలయును. అపరే=మూఁడవయపశకునమునందు, సువర్ణమ్=సువర్ణమును, దత్వా=ఇచ్చి, వ్రజేత్=పోవలయును.

తా॥ ఏయేకార్యములయందు విపరీతశకునములు అనఁగా అపశకునములు శుభశకునములగునో వానిని ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—నద్యుత్తరణము, రాజాదులభయము, గ్రామాదిప్రవేశము, యుద్ధము, ద్యూతము, నష్టద్రవ్యముయొక్క దర్శనము, రోగోపచారము, అనునట్టి కృత్యములయందు ప్రయాణమునకుఁ జెప్పఁబడినయపశకునములు శుభశకునములగునని తెలియఁగవలయును. మఱియును, ఇడానాడి పూర్ణమగునపుడు అపశకునములు శుభశకునము లగునని తెలియఁగవలయును. మఱియును, "శ్లో॥ భవేదిడాయాం పరిపూరితాయాం సగోపివామ శ్శకునఃప్రశస్తః। స్యాత్పింగళాయాం పరిపూరితా

యాంసర్వోపసవ్యశ్శకునః ప్రశస్తః ॥ సంగేరణేకర్మణిచప్రవేశే శుక్లేగ్రహేనష్టవిలోకనేచ। వ్యాధౌసరిద్దుర్లవనాదికేషుశస్తః ప్రయాణౌ ద్విపరీతభావే॥" (=ఇడానాడి పరిపూరితమగుచుండఁగా వామభాగమునందు సమస్తములగు శకునములును శుభశకునములగును. పింగళానాడిపరిపూర్ణమైయుండఁగా సవ్యభాగమునందలి సకల శకునములును శుభశకునములగును. సంబంధమునందును, యుద్ధమునందును, ప్రవేశమునందును, శుక్లగ్రహమునందును, నష్టవిలోకమునందును, వ్యాధియందును, నదీప్లవనాదులందును, ప్రయాణమునందలి యపశకునములు శుభశకునములగును.) అని వసంతుఁడు చెప్పె. మఱియును "శ్లో॥ నద్యుత్తారేభయేయుద్ధే ప్రవేశేనష్టవీక్షణే । శకునాస్సవ్యగాశ్శస్తా నృపాలోకేప్రయాణవత్ ॥" నద్యుత్తరణమునందును, రాజభయమునందును, యుద్ధమునందును, ప్రవేశమునందును, నష్టద్రవ్యదర్శనమునందును, నృపాలోకమునందును, సవ్యభాగమునందలి శకునములు శుభశకునములగును.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. మొదట దుశ్శకునమయ్యేనేని మరల గృహములోనికిఁబోయి పరిశుద్ధమగు ప్రదేశమునందుఁ గూర్చుండి కడగఁబడిన కాలుసేతులుకలవాఁడై యాచమనమును జేసి పదునొకండు ప్రాణాయామములు జేసి బయలువెడలిపోవలయును. మరల రెండవపర్యాయముకూడ అపశకునమయ్యేనేని మరల గృహములోనికిఁబోయి పాదప్రక్షాళనమును జేసికొని పదునారుపర్యాయములు ప్రాణాయామములను జేసి బయలు వెడలిపోవలయును. మఱియును, మూఁడవపర్యాయముకూడ అపశకునమయ్యేనేని సువర్ణమును దానముచేసి మరల బయలువెడలిపోవలయును. మఱియును, ప్రాణాయామమందు అధికారము లేనివాఁడు ఆప్రాణాయామములను జేయఁదగినంతసేపు కూర్చుండి పిమ్మట బయలువెడలిపోవలయును. మఱియును, "శ్లో॥ విరుద్ధేశకునేపూర్వం ప్రాణాయామష్టకంచరేత్ । ద్వితీయేగుణవాన్కృత్వా తృతీయేనవ్రజేత్క్వచిత్।" (=మొదటిమాటు విరుద్ధమగుశకునమయ్యేనేని ఎనిమిది ప్రాణాయామములను ఆచరింపవలయును. రెండవదియైన యపశకునమునందు పదునారగు ప్రాణాయామములను జేసి పోవలయును. మూఁడవపర్యాయము మరల అపశకునమయ్యేనేని సువర్ణ దానమును జేయవలయును. మఱియును, శ్లో॥ జాతేవిరుద్ధేశకునేఽధ్వనోవ్యావృత్యకృత్వాకరపాదశౌచం । ఆచమ్యచక్షీరతరోరధస్తాత్ త్రిష్వప్రపశ్యేచ్ఛకు



నాంతరాణి" (=అపశకునమయ్యేనేని వెనుకకుదిరిగిపోయి కాలుసేతులు కడిగికొని యాచమనమును చేసి పాలచెట్టుక్రిందఁగూర్చుండి యుత్తరములగు శకునములను నిరీక్షించుచుండవలయును.) అని వసంతుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ యదాఽపశకునంపశ్యే ద్విపరీతముపస్థితం । సఘృతం కాంచనందత్వా నిశ్శంకస్సుఖంవ్రజేత్॥" (=అపశకునమయ్యేనేని నేతితోఁగూడ కాంచనమును దానముచేసి పిమ్మట నిస్సందేహముగ సుఖముగ బయలువెడలిపోవలయును.) అని యార్ద్రిషేణుఁడు చెప్పె.

వ్యా॥ నద్యుత్తారేతి॥ నద్యుత్తారో నద్యుత్తరణం - భయం నృపాదీనాం- ప్రవేశోగ్రామాదిప్రవేశః- సమరం- సంగ్రామః- ద్యూతం- నష్టేక్షణం నష్టవస్తునః- అవలోకనం- వ్యాధౌ- రోగోపచారే- ఏషుకర్మసు శకునావిపరీతశకునాశ్శుభదాస్స్యుః- అయమర్థః- గమనేయేఽపశకునాః- తే నద్యుత్తారాదిషుశుభదాస్స్యురిత్యర్థః - తథాఇడాయాం నాడ్యాం భేపూర్ణాయాం- విలోమశకునాశ్శుభదాస్స్యుః- తథాచవసంతః ॥ శ్లో ॥ భవేదిడాయాంపరిపూరితాయాం సర్వోపినామశ్శకునఃప్రశస్తః । స్యాత్పింగళాయాంపరిపూరితాయాం సర్వోపసవ్యశ్శకునఃప్రశస్తః॥ సంగేరణేకర్మణిచ ప్రవేశేశుక్లేగ్రహేనష్టవిలోకనేచ । వ్యాధౌసరిద్దుర్గవనాదికేషుశస్తః ప్రయాణాద్విపరీతభావఇతి ॥ అన్యచ్చ ॥ నద్యుత్తారేభయేయుద్ధే ప్రవేశేనష్టవీక్షణే । శకునాస్సవ్యగాశ్శస్తా నృపాలోకేప్రయాణవదితి ॥ అథ ప్రథమేఅపశకునే జాతేసతికిఁకర్తవ్యమిత్యాహ ॥ ఆద్యేతి ॥ ఆద్యేప్రథమే దుశ్శకునేజాతేసతి - నివృత్త్య నిజగృహం కృత్వా- తత్రశుచౌదేశేఉపవిశ్య- శుచిఃప్రక్షాళితపాణిపాదః - ఆచాన్తఃకృతాచమనః - అసకృత్ప్రాణాన్ షోడశయమప్రాణాయామాః- అష్టధా - అష్టవారంకృత్వాగచ్ఛేత్- గచ్ఛేత్- చేద్యది- పునఃదుశ్శకునస్స్యాత్తదానివృత్త్య- శుచిరాచాన్తఃఅష్టవారం షోడశవారం అసూన్ప్రాణాన్ స్యాయాత్ అపరేతృతీయేదుశ్శకునేజాతేసతిసువర్ణందత్వాఇయాత్- వీతదానశ్శక్తఃగచ్ఛేత్ప్రాణాయామానధికారీ తావత్కాలంస్థిత్వావ్రజేత్ ॥ తథాచజ్యోతిర్నిబంధే ॥ విరుద్ధేశకునేపూర్వం ప్రాణాయామాష్టకంచరేత్ । ద్వితీయేగుణవాన్కృత్వా తృతీయేనప్రజేత్క్వచిదితి ॥ తథాచవసంతరాజః ॥ జాతేవిరుద్ధేశకునేఽధ్వనోవ్యావృత్యకృత్వాకరపాదశౌచం । ఆచమ్యచక్షీరతరోరధస్తాత్ త్రిష్వప్రపశ్యేచ్ఛకునాంతరాణీతి ॥ తథాచఆర్ద్రిషేణః ॥ యదాఽపశకునంపశ్యే ద్విపరీతముపస్థితం । సఘృతంకాంచనందత్వా నిశ్శంక

స్సుఖం వ్రజేదితి॥ యాత్రాప్రకరణం సమాప్తం॥

— { అథ మిశ్రప్రకరణం వివక్షురాదౌ రాజాభిషేకం దేవస్థాపనం చ వృత్తేనైకేనాహ. } —

మూ॥ జన్మాంగర్క్ష దశేశసంగ్రహకుజైః స్సార్కైర్బలిష్ఠైర్మృ
దుక్షిప్రేంద్రధ్రువభైస్స్థిరర్క్షినృతనౌ వ్యారాహ్ని భూప
స్థితిః । స్వస్వర్క్షైస్సమృదుధ్రువర్క్ష చరభక్షిప్రైస్సుర
స్థాపనం ప్రోచుర్మాఘయుగే చ రాధయుగళే వ్యారాహ్ని
పూర్వాహ్ణకే॥ ౧॥

టీక॥ సార్కైః=సూర్యునితోఁగూడుకొనిన. జన్మాంగర్క్ష దశేశసంగ్రహకుజైః=జన్మరాశిజన్మనక్షత్ర జన్మదశేశులతోఁడను కుజునితోఁడను కూడుకొనినవియును. బలిష్ఠైః = బలవంతులును, అయినగ్రహములచేతను. మృదుక్షిప్రేంద్రధ్రువభైః = మృదుసంజ్ఞకలవియును, క్షిప్రసంజ్ఞకలవియును, ఇంద్రసంజ్ఞకలవియును, ధ్రువసంజ్ఞకలవియును, అయిననక్షత్రములచేతను. స్థిరర్క్షినృతనౌ=స్థిరరాసులయందును, ఉపచయస్థానములయందును, మనుష్యరాశియందును. వ్యారాహ్ని = అంగారకవారరహితములయినవారములయందు. భూపస్థితిః = రాజస్థితి. శుభా = శుభకరమైనది. స్యాత్=అగును. సమృదుధ్రువర్క్ష చరభక్షిప్రైః = మృదుసంజ్ఞలుగలవియును, ధ్రువసంజ్ఞలుగలవియును, చరసంజ్ఞలుకలవియును, అయిననక్షత్రములతోఁగూడిన. స్వస్వర్క్షైః=తమతమనక్షత్రములచేతను. మాఘయుగే=మాఘఫాల్గునమాసములయందును. రాధయుగే=వైశాఖజ్యేష్ఠమాసములయందును. వ్యారాహ్ని=అంగారకవారము గానివారములయందు. పూర్వాహ్ణకే=పూర్వాహ్ణమునందు. సురస్థాపనమ్=దేవస్థాపనను. ప్రోచుః=చెప్పుచున్నారు.

తా॥ ఇఁక మిశ్రప్రకరణమును విశదముచేయఁదలఁచినవాఁడై ముందుగా రాజాభిషేకమును దేవస్థాపనమును ఈశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు. ఎట్లనిన:—జన్మరాశి జన్మనక్షత్రము జన్మదశ వీనియధిపతులు సూర్యాదిగ్రహములును బలిష్ఠులయియున్నకాలమునందును, మృదుక్షిప్రఇంద్రధ్రువసంజ్ఞకలనక్షత్రములయందును, స్థిరములగు నుపచయస్థానములయందును, స్థిరలగ్నమునందును అంగారకవారముతప్పఁ దక్కినవారములయందును రాజుయొక్క స్థితి అనఁగా పట్టాభిషేకము శ్రేష్ఠమైనదని యెఱుఁగవలయును. మఱియును, మృదుసంజ్ఞకలవియును ధ్రువసంజ్ఞకలవి



యును చరసంజ్ఞకలవియును, అయిననక్షత్రములచేతను మఱియును అన్యదేవతలయొక్క నక్షత్రములచేతను మాఘఫాల్గునమాసమునందును, జ్యేష్ఠవైశాఖమాసములయందును, అంగారకవారముతప్పఁ దక్కినవారములయందలి పూర్వాహ్ణమునందును, దేవప్రతిష్ఠను జేయుటయుచితమని యెఱుఁగవలయును. మఱియును, లగ్నబలమును మునుపటివలెనే యెఱుఁగవలయును.

వ్యా॥ జన్మేతి॥ జన్మాంగర్క్ష దశేశాది భిర్బలిష్ఠైః తథా మృద్వాదిభైః స్థిరర్క్షితనౌ వ్యారాహ్ని భూపస్థితిః శస్తా స్యాదిత్యధ్యాహారః- అంగంచ ఋక్షంచ అంగర్క్షే జన్మని అంగర్క్షే జన్మాంగర్క్షే జన్మలగ్నజన్మరాశీ తే చ దశాశ్చ జన్మాంగర్క్ష దశాః - దశా వర్తమానా అస్యా ఈశాః తే చ సంగ్రహాశ్చ కుజశ్చ సూర్యశ్చ తే చ తైః స్సార్కైః అర్కేణ సహితైః - తేన సహ బలిష్ఠైః- స్థానాదిబలసమృద్ధైః సద్భిః - తథా మృదుక్షిప్రేంద్రధ్రువభైః- స్పష్టం- స్థిరర్క్షినృతనౌ- బుద్ధిగతా నృతనుః- బుద్ధిన్నృతనుః- స్థిరా చాసౌ బుద్ధిన్నృతనుశ్చ సా తథా తస్యాం జన్మరాశిజన్మలగ్నాభ్యాం స్థిరోపచయనృలగ్నే వ్యారాహ్ని- భౌమరహితదినే- భూపస్థితిః - రాజప్రతిష్ఠా- శుభా స్యాదిత్యర్థః- లగ్నబలం ప్రాగ్వత్- ప్రాయశ్చంద్ర్యంత్యజేత్యాద్యవలోకనీయం॥ అథ దేవస్థాపనముత్తరార్థేనాహ॥ స్వస్వర్క్షైరితి॥ స్వస్వర్క్షైః యస్య దేవస్య ప్రతిష్ఠా క్రియతే- తస్య నక్షత్రైః- సమృదుధ్రువర్క్ష చరభక్షిప్రైః- శేషం స్పష్టం- మాఘయుగే - మాఘఫాల్గునయోః - తథా రాధయుగళే- రాధో వైశాఖః- తస్మాద్ద్వయ్యం యుగళం తస్మిన్- వైశాఖజ్యేష్ఠయోరిత్యర్థః- తథా- వ్యారాహ్ని- విగతః ఆరో యస్మాత్ ఏవంవిధం అహః తస్మిన్- భౌమరహితదినఇత్యర్థః- పూర్వాహ్ణకే- అత్ర దినస్య ద్వౌ భాగౌ పూర్వభాగః- పూర్వాహ్ణః తస్మిన్ ఆచార్యాస్సురస్థాపనం ప్రోచుః- శేషం స్పష్టం- సర్వామరస్థాపనమితి శేషః- లగ్నబలం ప్రాగ్వత్॥

— { అథ వస్త్రపరిధానం తస్యాశోధనం- ఉందురాదిభక్షితఫలం- స్త్రీయా రక్తవస్త్రధారణం భూషణధారణం అనుక్త గ్రహాణాం కుత్ర కుత్ర ప్రాశస్త్యం తచ్చాహ. } —

మూ॥ ధార్యం వస్త్రదితీన పంచగురుభాశ్వ్యస్త్యధ్రువైర్జ్ఞత్రయే
జ్ఞార్కేజ్యాస్ఫుజితాం శుభక్షితమసన్మధ్యత్రిభాగేంబరే। స్త్రీర
క్తాంబర భూషణోత్రబిభృయాద్ద్వ్యాప్రదిష్టేచ్ఛయా పుష్యధ్రువై
శ్శ్వ్యర్కేబ్జారుణరుక్మయోః కుజరవీ ప్రష్ఠే శనిశ్చస్య తౌ॥ ౨॥

టీక॥ వస్వాదితీనపంచ గురుభాశ్వన్త్యధ్రువైః = ధనిష్ఠ, పునర్వసు, హస్తాదిగనైదునక్షత్రములు, పుష్యమి, అశ్విని, రేవతి, ధ్రువసంజ్ఞకలనక్షత్రములు, అనువానిచేత. జ్ఞత్రయే=బుధగురుశుక్రవారములయందు. అంబరమ్=వస్త్రము. ధార్యమ్=ధరింపదగినది. జ్ఞః=బుధుడు. నో=కూడదు. ఇహ=ఇప్పుడుచెప్పబడినవానియందే. క్షాళ్యమ్=క్షాళనముచేయదగినది. అంబరే=వస్త్రమునందు. మధ్యత్రిభాగే=మధ్యభాగమునకు మూడవభాగమునందు. ఆఖుభక్షితమ్ = ఎలుకచేతభక్షింపబడినదగుచు. అసత్=అశుభమైనది. స్యాత్=అగును. స్త్రీ=ఆడుది. అత్ర=ఇప్పుడుచెప్పబడిననక్షత్రాదులయందు. వ్యాదిత్యపుష్యధ్రువైః=ఆదిత్యవారము, పుష్యమి, ధ్రువనక్షత్రములునుదప్పదక్కినవానిచేత. రక్తాంబరం భూషణం=రక్తవర్ణవస్త్రములను, రక్తవర్ణభూషణములను. బిభృయాత్=ధరింపవలయును. శ్వేతే=తెల్లనివగువస్త్రాద్యాభరణములయందు. అబ్జః=సోమవారము. శుభః=శుభకరమైనది. స్యాత్=అగును. అరుణరుక్మయోః=అరుణవర్ణములును రుక్మవర్ణములునుగల వస్త్రాభరణములయందు. కుజగవీ=కుజరవివారములు. ప్రశస్తా=ప్రశస్తములయినవి. కృష్ణే=నల్లనివర్ణముకలవస్త్రాభరణములయందు. శనిః = శనివారము. శస్యతే = ప్రశస్తమైనదగుచున్నది.

తా॥ వస్త్రపరిధానము, వస్త్రప్రక్షాళనము, ఎలుకలుమొదలగువానిచేత భక్షింపబడినవస్త్రఫలము, స్త్రీకిరక్తవస్త్రధారణము, భూషణధారణము, చెప్పబడుగ్రహములకు ఏయేకార్యములయందు ప్రాశస్త్యముఅనునవి యీశ్లోకముచేతఁజెప్పబడుచున్నవి. ఎట్లనిన:—ధనిష్ఠ, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, పుష్యమి, అశ్విని, రేవతి, ధ్రువసంజ్ఞకలనక్షత్రములు బుధగురుశుక్రవారములును, వస్త్రధారణమునకు ప్రశస్తములయినవి. మఱియును, "శ్లో॥ రవౌజీర్ణంవిధౌక్లేదం జలార్ద్రిందుఃఖంభవేత్ । బుధేధనంగురౌజ్ఞానం శుక్రేసౌఖ్యం శనౌమలమ్॥" (=ఆదివారమునందుజీర్ణమగుననియును, సోమవారమునందుజలార్ద్రమగుననియును, మఱియును, దుఃఖమునుగలిగించుననియును, బుధవారమునందు ధనతకలుగుననియును, గురువారమునందు జ్ఞానముకలుగుననియును, శుక్రవారమునందు సౌఖ్యముకలుగుననియును, శనివారమునందు మలినతకలుగుననియును, తెలియవలయును.) అనిస్మృతియందుఁజెప్పబడెను. మఱియును, లగ్నబలమును ముహుర్తబలమును చూచు



కొనవలయును. మఱియును, ఈవస్త్రధారణమునకుఁ జెప్పబడినవస్త్రాదికమందే వస్త్రాదికము క్షాళనముచేయఁదగినదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో ॥ వస్త్రహేమాద్యలంకార ధారణోక్తైశ్చభాదిభిః । తత్సంహతిశ్చనిర్మాణం విదధ్యాత్క్షాళనాదికమ్॥" (=వస్త్రము, బంగారపుసొమ్ములు, మొదలగువానిని ధరించుటకుఁ జెప్పబడిన నక్షత్రములచేతనే వస్త్రాభరణనిర్మాణమును ఆవస్త్రాభరణ క్షాళనాదికమునుచేయవలయును.) అని చెప్పఁబడెనని యెఱుఁగవలయును. మఱియును, దేనికేదియంగమో దానికిని ఆయంగమునకును నక్షత్ర ముహూర్తాదులు సమానములేయయినప్పటికిని వస్త్రాభరణక్షాళనాదికమునకు బుధవారముకూడదని యెఱుఁగవలయును. "శ్లో॥ శనౌసోమసుతేశ్రాద్ధేషష్ఠ్యామావాస్యయోస్తథా । వస్త్రాణాంక్షాళనంచైవ దహత్యాసప్తమంకులమ్॥" (=శనివారమునందును, సోమవారమునందును, శ్రాద్ధమునందును, షష్ఠియందును, అమావాస్యయందును, వస్త్రక్షాళనముమొదలగువానిని చేసినయెడల సప్తపురుషపర్యంతమును కులమును కాల్చివేయును.) అనిస్మృతియందుఁ జెప్పబడెను. వస్త్రాదులయొక్కనగములోని మూఁడవభాగమునందు ఎలుకలుకొఱికెనేని యశుభముకలుగునని యెఱుఁగవలయును. అనఁగా వస్త్రమును మూడుభాగములుచేయఁగా మధ్యభాగమునందు ఎలుకకొఱికినను, అగ్నితగిలినను, గోవుకొఱికినను, పష్యాదులచేత పూయఁబడినను, అశుభముకలుగునని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ దగ్ధంవా స్ఫుటితంచగోమయ మషీపంకైర్విలిప్తం తథాదష్టంమూషకపూర్వకైరశుభదంమధ్యత్రిభాగేంశుకమ్॥" (=వస్త్రమును మూడుభాగములనుజేయఁగా మధ్యభాగమునందు కాలినను, బ్రద్దలయినను, గోమయమషీపంకములచేత మలినముగఁ జేయఁబడినను అమంగళమగును.) అని వృత్తశతమను గ్రంథమునందుఁ జెప్పబడెను. మఱియును, వస్త్రధారణమునకుఁ జెప్పబడిననక్షత్రాదులయందే స్త్రీలు రక్తవర్ణముకలవస్త్రాభరణాదులను ధరింపవలయును. మఱియును, రక్తవర్ణవస్త్రాభరణాదులను ధరించుటకు హస్తానక్షత్రము, పుష్యమీనక్షత్రము, ధ్రువసంజ్ఞకల నక్షత్రములును, యుక్తములయినవికావని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ పుష్యాదిత్యధ్రువైర్హిత్వైస్స్వర్ణరక్తాంబరాదికం । నవీనంభూషణంధార్యం నార్యాదయితురాయుషే ॥" (=భర్తదీర్ఘాయుష్యమును కోరెడుస్త్రీలు పుష్యమి, ధ్రువనక్షత్రములు, అనువానిని

నూతనములగు రక్తవస్త్రాభరణాదులను ధరింపఁగూడదు.) అని యెఱుఁగవలయును. మఱియును, ఈవిషయములయందు లగ్నబలమును మునుపటివలెనే విచారించుకొనవలయును. మఱియును, రౌప్యముక్తాఫలాదికమునందు సోమవారము ప్రశస్తమైనదనియును, అరుణరుక్మవర్ణముకల వస్త్రాభరణాదిధారణమునకు కుజరవివారములు ప్రశస్తములయినవనియును, నీలవస్త్రాదికమునందు శనివారము ప్రశస్తమైనదనియును, తెలియవలయును.

వ్యా॥ ధార్యమితి॥ వసుర్ధనిష్ఠా అదితిః - పునర్వసుః - ఇనపంచహస్తపంచకం-గురుభం-పుష్యః - అశ్వి-అశ్వినీ అంత్యం-రేవతీ-ధ్రువాణి-పూర్వోక్తాని ఏతైర్నక్షత్రైః-జ్ఞత్రయే-బుధగురుశుక్రవారే - అంబరంవస్త్రం ధార్యం-నాన్యత్ర-యతఉక్తం॥ రవౌజీర్ణం విధౌక్లేద్యం జలార్ద్రం దుఃఖదం కుజే । బుధేఘనం గురౌజ్ఞానం శుక్రేసౌఖ్యం శనౌమలమితి॥ లగ్నబలంప్రాగ్వత్॥ అథక్షాళనమాహ ॥ ఇహాస్మిన్వస్త్రధారణోక్త నక్షత్రాదౌక్షాళ్యం ప్రక్షాళనీయం - కథంభూతే॥ ఉక్తంచ॥ వస్త్రహేమాద్యలంకారధారణోక్తైశ్చ నాడిభిః । తస్యసంహతిశ్చ నిర్మాణం విదధ్యాత్క్షాళనాదికమితి ॥ యద్యపి యస్యాంగం యదదోంగినోంగదితభేకుర్యాదితి పూర్వమేవ అంగభూతంకర్మోక్తం - తథాపి క్షాళనేబుధవర్జనార్థం - జ్ఞోనేఇహక్షాళ్యమిత్యుక్తం బుధనిషేధశ్రవణాత్ - ఉక్తంచ॥ శనౌసోమసుతే శ్రాద్ధే షష్ఠ్యాం మావాస్యయోస్తథా । వస్త్రాణాంక్షాళనంచైవ దహత్యాసప్తమం కులమితి॥ అథోందురాదిభక్షితఫలమాహ॥ ఆఖుభక్షితమితి - అఖురుందురః-తేనఅంబరం మధ్యత్రిభాగే భక్షిత అసత్- దుష్టఫలంస్యాత్-ఏతదుక్తంభవతి॥ వస్త్రం త్రిగుణంకృత్వా యది భక్షితభాగో మధ్యత్రిభాగే పతతి తదాతద్దుష్టమిత్యర్థః - ఆఖురిత్యుపలక్షణం - తేనాగ్నిదగ్ధంగవాదిభక్షితం మష్యాదిలిప్తం జ్ఞేయం తథాచోక్తం వృత్తశతే॥ దగ్ధంవాస్ఫుటితంచగోమయమషీపంకైర్విలిప్తంతథాదష్టం మూషకపూర్వకైర శుభదం మధ్యత్రిభాగేంశుకమితి॥ అథస్త్రియాః రక్తవస్త్రధారణం భూషణధారణం అనుక్తగ్రహాణాం కుత్రకుత్ర ప్రశస్త్యం తదుత్తరార్ధేనాహ ॥ స్త్రీతి ॥ స్త్రీ-అత్రఉక్తేవస్త్రధారణభాదౌ అంబరంభూషణం సువర్ణాదిభూషణంబిభృయాత్ - ధారయేత్-కథభూతే - వ్యాదిత్యపుష్యధ్రువే-విగతానిఆదిత్యపుష్యధ్రువాణి యస్మాత్ తత్తథాతస్మిన్ యతోత్ర స్త్రియారక్తవస్త్రభూషణధారణేదోషోదృశ్యతే॥ తథాచోక్తం॥ పుష్యాదిత్యధ్రువైర్ధి



ష్ణ్యైః స్వర్ణరక్తాంబరాదికం । నవీనంభూషణంధార్యంనార్యాదయితురాయుషేతః॥ లగ్నంప్రాగ్వత్ । అథచంద్రాదీనాంప్రశస్త్యమాహ॥ శ్వేతేవస్తునిరౌప్యముక్తాఫలాదికే - అబ్జశ్చంద్రోహితః - సోమవారే శ్వేతవస్తుధార్యమిత్యర్థః - కుజరవీ-అరుణరుక్మయోః-శస్యతే-శనిః-కృష్ణే వస్తుని నీలవస్త్రాదికే శస్యతే - శనౌతద్ధార్యమితిభావః - జ్ఞత్రయేతుసర్వంధార్యమితిపూర్వమేవోక్తం॥

అథనరాణాం భూషణధారణం విశేషంపణ్యానాం
క్రయవిక్రయాంచాహ.

మూ॥ వస్త్రోక్తైర్వ్యనిలద్వయాశ్విభిరగేంగేనుర్విభూషాహితా
విప్రాజ్ఞారాజ్యోత్సవలబ్ధిషూదితమనుక్తేప్యిష్టకృద్ధారణం । మై
త్రార్కానిలమూలదస్రహరిభేంద్వీజ్యాజపాదోత్తరే
పణ్యానాంక్రయవిక్రయౌ ఘటపరత్యంగేస్వ శుద్ధౌ
తను॥ ౩॥

టీక॥ వ్యనిలద్వయాశ్విభిః=స్వాతీ, విశాఖ, అశ్విని, అను నక్షత్రములు తప్పఁదక్కిన, వస్త్రోక్తైః=వస్త్రధారణమునకుఁ జెప్పఁబడిననక్షత్రములచేత, నుః=మనుష్యునకు, అగే=స్థిరమైన, అంగే=లగ్నమునందు, విభూషా=ఆభరణము, హితా=హితమైనది, అనుక్తేపి = వస్త్రాభరణాదిధారణకు చెప్పఁబడనినక్షత్రలగ్నాదులయందుఁగూడ, విప్రాజ్ఞారాజ్యోత్సవలబ్ధిషు=బ్రాహ్మణానుమతము, వివాహోత్సవము, అనునవి ప్రాప్తించినకాలములయందు, ధారణం=వస్త్రాభరణాదిధారణము, ఇష్టకృత్=ఇష్టమును కలుగఁజేయునట్టిదై, ఉదితం=చెప్పఁబడెను. మైత్రార్కానిలమూలదస్రహరిభేంద్వీజ్యాజపాదోత్తరే = అనూరాధ, హస్త, స్వాతి, విశాఖ, అశ్విని, శ్రవణము, మృగశీర్ష, పుష్యమి, పూర్వాభాద్రపద, ఉత్తర, అనునట్టినక్షత్రములయందును, ఘటపరత్యంగే=కుంభరాశికంటె నితరములగు నుపచయలగ్నములయందును, స్వశుద్ధౌసత్యాం=ధనస్థానశుద్ధికలుగుచునుండఁగా, పణ్యానాం=విక్రయింపఁదగిన పూగీఫలకర్జూరాదులయొక్క, క్రయవిక్రయౌ = క్రయవిక్రయములను, తను = వృద్ధినిపొందింపుము.

తా॥ మనుష్యులు ఆభరణములను ధరించుటకు యుక్తములగు నక్షత్రాదులును, ఆవస్త్రాభరణాది ధారణయందు విశేషమును, విక్రయింపఁదగిన పూగీఫలాదులయొక్క క్రయవిక్రయములను ఈ శ్లోకము

చేతఁ దెలియఁజేయుచున్నాఁడు. ఎట్లనిన:— వస్త్రధారణముఁ జెప్పఁబడిన నక్షత్రములలో స్వాతి, విశాఖ, అశ్విని, అను నక్షత్రములుతప్పఁ దక్కిననక్షత్రములయందును, స్థిరలగ్నములయందును, మానవుఁడు ఆభరణములను ధరింపవలసినదని యెఱుఁగవలయును. మఱియును, బ్రాహ్మణానుమతము, వివాహాదులు, అనువానియందు శాస్త్రోక్తనక్షత్రములు లభింపకపోయినను, వస్త్రధారణాదికము శ్రేష్ఠమైనదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ లబ్ధంరాజప్రసాదేనవిప్రాదేశాత్కరగ్రహే। దత్తంప్రీత్యోత్సవేవస్త్రంధార్యంనింద్యేపిభాదికే॥" (=రాజానుగ్రహముచేతను, బ్రాహ్మణాదేశమువలనను ప్రాప్తమైన వస్త్రాభరణాదికమును, వివాహకాలమునందీయఁబడిన వస్త్రాభరణాదికమును, ఉత్సవాదులయందు ప్రీతిచేత నీయఁబడిన వస్త్రాభరణాదికమును, నింద్యములగు లగ్ననక్షత్రాదులయందుఁగూడ ధరింపవచ్చునని తెలియవలయును.) అని వ్యాసునిచేతఁ జెప్పఁబడియె. మఱియును, అనూరాధ, స్వాతి, విశాఖ, అశ్విని, శ్రవణము, మృగశీర్ష, పుష్యమి, పూర్వాభాద్ర, ఉత్తర, అనునట్టినక్షత్రములయందును, కుంభముతప్పఁదక్కిన యుపచయస్థానములయందును, పూగీఫల ఖర్జూరాది ద్రవ్యములయొక్క క్రయవిక్రయములను వృద్ధినిపొందింపవలయును. అనఁగా, పూగీఫలాదులవర్తకమును జేయవలయును. మఱియును, వర్తకప్రారంభలగ్నమునకు ద్వితీయస్థానమునందు పాపగ్రహములుండఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ దశమైకాదశేలగ్నేవిత్తకేంద్రత్రికోణగైః। శుభైఃపణ్యస్యకర్మోక్తం వర్జయిత్వాఘటోదయం॥" (=వర్తకమును చేయుటకు ప్రారంభించినకాలమునందలి లగ్నమునకు పదిపదునొకండు ఒకటినాలుగు ఏడు అయిదు తొమ్మిదిస్థానములయందు శుభగ్రహములుండవలసినదనియును, వర్తకమునకు కుంభలగ్నముతగినది కాదనియును, గ్రహింపవలయును.) అనిస్మృతులయందుఁ జెప్పఁబడెనని యెఱుఁగవలయును.

వ్యా॥ వస్త్రేతి॥ వస్త్రోక్తైః భాదిభిర్వస్త్రాదీనిత్యత్రోక్తై-అంగేస్థిరలగ్నేనుః - నరస్య - అలంకృతిరలం కరణంహితంస్యాత్ - కింలక్షణైర్వస్త్రోక్తైః-వ్యానిలద్వయాశ్వభిః - అనిలద్వయంస్వాతీ - విశాఖేతి-అశ్వినీప్రసిద్ధే-అనిలద్వయాశ్వినాయేభ్యస్తానితధానస్మిక్ - స్వాతీవిశాఖాశ్వినీరహితైరిత్యర్థః - లగ్నబలంప్రాగ్వత్॥ అథస్వేతియచరణేప విశేషమాహ॥ విప్రాజ్ఞేతి విప్రాజ్ఞా బ్రాహ్మణాజ్ఞా ఉత్సవోవివాహాదికః - లబ్ధ్వా



భః- ఆసుసత్సు- అనుక్తేపిభాదౌ- ధారణం - వస్త్రాదిధారణం ఇష్టకృత్స్యాత్ ॥ తథాచోక్తంవ్యాసేన ॥ లబ్ధంరాజప్రసాదేన విప్రాదేశాత్కరగ్రహే। దత్తంప్రీత్యోత్సవేవస్త్రం ధార్యంనింద్యేపిభాధికేఇతి। అథోత్తరార్ధేనపణ్యానాం క్రయవిక్రయావాహ ॥ మైత్రేతి ॥ మైత్రమనూరాధా- శేషంసుగమం- ఘటపరధ్యంగే- ఘటఃకుంభః- తస్మాత్పరమన్యత్తమంతచ్చతత్- బుద్ధ్యాంగంచ- బుద్ధ్యంగం ఉపచయలగ్నం తస్మిన్కుంభవ్యతిరిక్తోపచయ లగ్నేపణ్యానాంపూగీఫల ఖర్జూరాదీనాం క్రయవిక్రయౌతను- విస్తారయ. కుర్విత్యర్థః- కస్యాంసత్యాంస్వశుద్ధౌ సత్యాంస్వధనభావః- తస్యశుద్ధిః- పాపరాహిత్యం- తస్యాంసత్యాం- శేషంప్రాగ్వత్- తథాచోక్తం॥ దశమైకాదశేలగ్నే విత్తకేంద్రత్రికోణగైః। శుభైః పణ్యస్యకర్మోక్తం వర్జయిత్వాఘటోదయమితి॥

అథధనిష్ఠాపంచకేవర్జ్యంసేవాంసన్న్యాసంచాహ.

మూ॥ ప్రేతజ్వాలనశయ్యకావితననే స్తంభోచ్ఛ్రియంయామ్యది
గ్యానంకాష్ఠతృణోచ్చయంపరిహరేత్కుంభద్వయస్థేవి
ధౌ। సేవేష్టాధ్రువవారుణాంత్యవసుభైః స్వాన్యేరవౌవా
కుజేసన్న్యాసస్థిరభేఖలైర్గతబలైష్షష్ఠాంత్యగేభార్గవే॥ ౪॥

టీక॥ విధౌ=చంద్రుఁడు, కుంభద్వయస్థేసతి=కుంభమీనములయందుండఁగా, ప్రేతజ్వాలనశయ్యకాః=శవదహనము, శయ్య, యజ్ఞము, అనువానిని, వితననే=మేలుకట్టును (లేక) యజ్ఞమును, స్తంభోచ్ఛ్రియమ్=స్తంభప్రతిష్ఠను, యామ్యదిగ్యానమ్=దక్షిణదిగ్గమనము, కాష్ఠతృణోచ్చయమ్=కట్టెలయొక్కయును తృణములయొక్కయును ఔన్నత్యమును, పరిహరేత్=పరిహరింపవలయును, ధ్రువవారుణాంత్యవసుభైః=ధ్రువనక్షత్రములు, వారుణనక్షత్రములు, రేవతి, ధనిష్ఠ, అనువానిచేతను, రవౌవా=సూర్యుఁడయినను, కుజేవా=కుజుఁడైనను, స్వాన్యేసతి=పదియవస్థానమునందైనను, పదునొకండవస్థానమునందైననుఉండఁగా, సేవా = రాజసేవాదికము, ఇష్టా=ఇష్టమైనది, స్యాత్=అగును, ఖలైః=పాపగ్రహములు, గతబలైః=బలరహితులైయుండఁగా, భార్గవే=శుక్రుఁడు, షష్ఠాంత్యగేసతి=ఆఱుపదిరెండుస్థానములయందుండఁగా, స్థిరభే=స్థిరలగ్నమునందు, సన్న్యాసః=సన్న్యాసము, శ్రేష్ఠః=శ్రేష్ఠమైనది, స్యాత్=అగును.

తా॥ ధనిష్ఠాపంచమునందు విడువఁదగినవానిని, సేవను, సన్న్యాసమును, ఈశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— చంద్రుఁడు కుంభ

కోణములయందుండఁగా శవదహనము, శయ్యా, యజ్ఞము, (లేక) మేలుకట్టు; స్తంభప్రతిష్ఠను, దక్షిణదిక్ప్రయాణమును, కట్టెలయొక్కయును తృణములయొక్కయును పోగును, పరిహరింపవలయును. మఱియును, ధ్రువనక్షత్రములు, వరుణదేవతాకనక్షత్రములు, రేవతి, ధనిష్ఠ, అనునట్టి నక్షత్రములయందును, కుజుఁడుగాని సూర్యుఁడుగాని పదియవస్థానమునందుగాని పదునొకండవస్థానమునందుఁగాని ఉన్నకాలమునందును రాజసేవాదికమును ప్రారంభింపవలసినదని యెఱుఁగవలయును. మఱియును, పాపగ్రహములు బలరహితులై యుండఁగను, శుక్రుఁడు షష్ఠాంత్యస్థానములయందుండఁగను, స్థిరలగ్నమునందు సన్న్యాసమును అవలంబించుట యుచితమని తెలియవలయును. మఱియును, "శ్లో॥ త్రిషడేకాదశేసౌరి ర్వ్యయేషష్ఠేచభార్గవః । సబలేధర్మపేజీవే కేంద్రేదీక్షావిరక్తికృత్ ॥" (=శని మూఁడు ఆఱు పదునొకండగు స్థానములయందును, శుక్రుఁడు షష్ఠవ్యయములయందుండఁగను, ధర్మాధిపతిబలిష్ఠుఁడై యుండఁగను, బృహస్పతి కేంద్రమునందుండఁగను, సన్న్యాసదీక్షవిరక్తిని కలుఁగఁజేయునట్టిదియగును.) అని స్మృత్యంతరమునఁ జెప్పఁబడినది.

వ్యా॥ అథవృత్తార్ధేనధనిష్ఠాపంచకేవర్జ్యమాహ॥ కుంభద్వయస్థే విధౌసతి- కుంభమీనగేసతిపరిహరేత్- సర్వథా నాచరేత్- స్పష్టం- అథోత్తరార్ధేనచరణేనసేవామాహ ॥ సేవేతి ॥ ధ్రువాదిభిర్నక్షత్రైః- సేవా ఇష్టాస్యాత్- సుగమం- కస్మిన్సతి- భౌమేరవౌ- సతి- వా ఇత్యథవా- కుజేసతి- ఖందశమం- ఆయుఃఏకాదశం - అనయోరన్యతమే- రవిభౌమయోరన్యతమే- సతీత్యర్థః - యస్మిన్లగ్నే సేవాక్రియతే- తస్మాల్లగ్నాద్దశమే ఏకాదశేవారవౌ భౌమేవాసతి- సేవాఇష్టాహితకరాస్యాదిత్యర్థః - శేషం ప్రాగ్వత్- అథచతుర్థచరణేన- సన్న్యాసమాహ ॥ సన్న్యాసఇతి ॥ స్థిరనక్షత్రేస్థిరలగ్నేసన్న్యాసః ఇష్టస్స్యాత్- కైః - ఖగైర్గతబలైః - పాపగ్రహైః హీనబలైరిత్యర్థః- సప్తమ్యర్థేతృతీయా- కస్మిన్సతి- భార్గవేశుక్రేషష్ఠాంత్యగే- ౬- ౧౨- సతిశేషంలగ్నబలంప్రాగ్వత్ ॥ ఉక్తంచ ॥ త్రిషడేకాదశేసౌరిర్వ్యయేషష్ఠేచభార్గవః। సబలేధర్మపేజీవే కేంద్రేదీక్షావిరక్తికృదితి॥

——(*) అథవృత్తద్వయేనకృషికర్మాహ. (*)——

మూ॥ ఉద్వాహర్క్షచరద్విపేన్ద్రలఘుభత్వాష్ట్రైశ్శుభాస్యా
త్కృషిర్వ్యర్కిజ్ఞారఖగాహ్నియుగ్మఝషగోకన్యా
విలగ్నేతిథౌ । వ్యంకాజేనదిశిప్రణమ్యఖగభూముఖ్యా



న్సితాచ్ఛాదనస్స్వర్ణోఘ్నప్తహలంసముష్కసువృషైః
స్సౌమీంపటుస్త్రీర్నమేత్॥ ౫॥

టీక॥ ఉద్వాహర్క్షచరద్విపేంద్రలఘుభత్వాష్ట్రైః = వివాహమునకు చెప్పఁబడిన మూల రేవతి హస్త మఘ రోహిణి ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర మృగశీర్ష స్వాతి శ్రవణము ధనిష్ఠ శతభిషము పునర్వసు స్వాతి విశాఖ జ్యేష్ఠ అశ్విని హస్త అభిజిత్తు పుష్యమి చిత్త అనునట్టి నక్షత్రములచేత, వ్యర్కిజ్ఞారఖగాహ్ని = శని బుధ భౌమరహితవారములయందు, యుగ్మఝషగోకన్యావిలగ్నే = మిథున మీన వృషభ కన్యాలగ్నములలో నొకలగ్నమునందును, నదిశి = దశమితోఁగూడుకొననిదియును, వ్యంకాజే = నవమితప్పఁ దక్కిన విషమసంఖ్యగల, తిథౌ = తిథియందు, సితాచ్ఛాదనః = తెల్లనివస్త్రమును ధరించినవాఁడును, పటుః = సమర్థుఁడును, (అయినకర్త) ఖగభూముఖ్యాన్ = గ్రహములు భూమి అగ్ని మొదలుగాఁగలదేవతలను, ప్రణమ్య = నమస్కరించి, స్వర్ణోఘ్నప్తహలమ్ = బంగారపుకొనకలనాగేటిని, సముష్కసువృషైః = వృషణములతోఁగూడియున్న చక్కనియెద్దులచేత, సౌమీమ్ = ఉత్తరదిక్కునుగుఱించి, త్రిః = మూఁడుపర్యాయములు, నమేత్ = పొందింపవలయును.

తా॥ ఈశ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచేత కృషికర్మమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన: —— పూర్వమునందనఁగా వివాహప్రకరణమునందుఁ వివాహమునకుఁదగినవని చెప్పఁబడిన రేవతి హస్త మఖ రోహిణి ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, మృగశీర్ష స్వాతి, శ్రవణము ధనిష్ఠ శతభిషము పునర్వసు స్వాతి విశాఖ జ్యేష్ఠ అశ్విని హస్త అభిజిత్తు పుష్యమి చిత్త అనునట్టి నక్షత్రములయందును, శని బుధ భౌమవారములు తప్పఁ దక్కినవారములయందును, మిథున మీన వృషభ కన్యాలగ్నములయందును, నవమి తప్పఁ దక్కినతిథులయందును, సమతిథులలో దశమియందును, తెల్లనివస్త్రములను ధరించినవాఁడును సమర్థుఁడును అయిన కృషీవలుఁడు గ్రహములు భూమి అగ్ని మొదలుగాఁగల దేవతలకు నమస్కారమును చేసి బంగారపుకొనకల నాగేటిని చక్కనివృషణములు గలదియును అందమైనదియును వయస్సుకలదియును రోగరహితమైనదియును అయినవృషభములచేత ఉత్తరదిక్కునకు మూఁడు రేఖలనుగీయవలయును. మఱియును, "శ్లో॥ దశమ్యేకాదశీచైవ తృతీయాచత్రయోదశీ। సప్తమీపంచమీచైవ ప్రతిపచ్చసుఖావహా। హంత్యష్టమీబలీవర్దాన్ సవ

మీనస్యఘాతినీ । చతుర్థీకీటజననీ హతింహంతిచతుర్దశీ । రవౌబృహస్పతౌ చంద్రే శుక్రేకుర్యాద్విశేషతః । బుధార్కిభూమిపుత్రాశ్చ నభవంతిఫలప్రదాః॥" (=దశమి, ఏకాదశి, తృతీయ, త్రయోదశి, సప్తమి, పంచమి, ప్రతిపత్తు, అనునట్టితిథులు కృషికర్మయందు సుఖకరములయినవని తెలియవలయును. మఱియును, అష్టమి యెద్దులనుచంపును. నవమి సస్యములను పాడుచేయును. చవితి కీటములనుకలిగించును. చతుర్దశి యజమానునిచంపును. రవి గురు చంద్ర శుక్రవారములయందు విశేషముగ కృషికర్మమును ప్రారంభింపవలయును. బుధ శని కుజవారములయందు కృషికర్మమును ఆరంభించినయెడల చక్కనిఫలము కలుగనేరదు.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ చంద్రేశుభేశుభతిథౌ శుభవారయోగేవారే గురౌశశిజశుక్రగభస్తివారే । లగ్నేవృషేమిథునకే ఝషకన్యకాయాంశస్తం కృషిప్రకరణంప్రవసేన్నిధానే॥" (=శుభచంద్రుఁడైనకాలమునందును, శుభతిథులయందును, శుభవారయోగమునందును, గురు బుధ శుక్ర సూర్యవారములయందును, వృషభ మిథున మీన కన్యా లగ్నములయందును, కృషికర్మమును బీజావాపమును చేయవలయును.) అనియును స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. మఱియును, ఉత్తరదిక్కునకు మూఁడు రేఖలను గీసినయెడల అయిదు రేఖలగును. ఎట్లనిన:—మొదటపోవునపుడు ఒక రేఖ కలుగును. తిరిగివచ్చునపుడు మఱియొక్క రేఖ అనఁగా రెండవ రేఖపడును. రెండవపర్యాయము ఉత్తరదిక్కునకుఁబోవునపుడు మూఁడవ రేఖపడును. మరలఁ దిరిగివచ్చునపుడు నాల్గవ రేఖసంభవించును. మూఁడవపర్యాయము ఉత్తరదిక్కునకుఁ బోవునపుడు అయిదవ రేఖపడును. ఈ రేఖలు వంకరగానుండఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ శస్తాసుచంద్రతారాసు శుచిశ్శుక్లేనవాససా । స్నాత్వా గంధైశ్చపుష్పైశ్చ పూజయిత్వావిశేషతః । పృథివీంగ్రహసంయుక్తాం పూజయిత్వాప్రజాపతిం । అగ్నింప్రదక్షిణీకృత్య దాతవ్యాచైవదక్షిణా। కృష్ణౌవృషౌనియోక్తవ్యౌ జీవనశ్చేయుతేనవా । విబలంభిన్నలాంగూలం కపిలంవృషభంత్యజేత్ । హలప్రవాహసంకార్యం నిరుగ్భిఃకర్షకోవృషైః । హలాదిభిర్దృఢైఃక్షేమం కుదృఢైరశుభంభవేత్ । వృషభౌయది యుధ్యేయుస్తస్యవిఘ్నంసదాభవేత్ । హేమశృంగహలాగ్రేణఛిన్నరేఖాంనకారయేత్ । ఉత్తరాభిముఖోభూత్వా క్షీరేణార్ఘ్యంప్రదాపయేత్ । తస్యసర్వప్రకారేణ నిర్విఘ్నంకారయేత్తథా । ఏకాజయకరీరే



ఖాతృతీయాంచార్థవృద్ధిదా । పంచమీచభవేద్రేఖా బహుసస్యఫలప్రదా । అతఊర్ధ్వంనకర్తవ్యా మహాదోషస్తతోభవేత్ । స్మర్తవ్యావసవశ్శుక్రః పృథునామాసచంద్రమాః । పరాశరోహలీచైవ సర్వవిఘ్నోపశాంతయే॥" (=చంద్రతారలు ప్రశస్తములైయుండఁగా పరిశుద్ధుఁడై తెల్లనివస్త్రములనుధరించి గంధపుష్పాక్షతాదులచేత గ్రహములతోఁగూడభూమికిని ప్రజాపతికిని అగ్నికిని ప్రదక్షిణనమస్కారములనుచేసి దక్షిణనిచ్చి నల్లనియెద్దులను ఉపయోగించవలయును. మఱియును, బలరహితమైనదియును త్రెంపఁబడిన తోకకలదియును నల్లనిదియును అయినవృషభమును పరిత్యజింపవలయును. మఱియును, రోగరహితములును దృఢములును అయినవృషభములను నాగేటికిఁగట్టవలయును. దృఢతలేనివియును రోగముకలవియును అయినవృషభములను ఉపయోగించినయెడల అశుభములుకలుగును. వృషభములు రెండును యుద్ధముచేసినయెడల ఆకృషీవలునకు సర్వకాలములయందును విఘ్నములుకలుగును. మఱియును, బంగారపుకొనగల నాగేటిచేత అచ్ఛిన్నమయినరేఖను గీయవలయును. మఱియును; కృషీవలుఁడు ఉత్తరాభిముఖుఁడై క్షీరముచేత అర్ఘ్యదానమును జేయవలయును. ఈవిధముగాఁ జేసినయెడల నిర్విఘ్నముగ కృషికర్మము నెరవేరును. మఱియును, మొదటిరేఖ జయమును కలుగఁజేయుననియును, మూఁడవరేఖ అర్థవృద్ధియగుననియును, అయిదవరేఖ విశేషముగ సస్యధాన్యములనువృద్ధిచేయుననియు నెఱుఁగవలయును. అయిదు రేఖలకంటె నధికముగ రేఖలనుకలిగించినయెడల మహాదోషముకలుగును. మఱియును, కృషీవలుఁడగువాఁడు నిర్విఘ్నముగఁగృషికర్మము నెరవేరుటకొఱకు వసువులను శుక్రునిపృథువును చంద్రుని పరాశరునిబలరాముని ప్రార్థింపవలయును.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ హలేప్రవాహ్యమాణేతు కూర్మఉత్పద్యతేయది । గృహిణీపతయేతస్య తతోగ్నేశ్చభయంభవేత్ । ఈషాభంగోయదాకృష్ణస్సంశయోజీవితస్యచ । సుతనాశోయుగేభగ్నే సమానేమ్రియతేశిశుః । యోక్త్రేఛేదేతువ్యాసంగస్సస్యహానిశ్చజాయతే । హలేప్రవాహ్యమాణేతు గౌరేకః ప్రపతేద్యది । ప్రపతేద్యుక్తమాత్రస్తు బంధనంచప్రయచ్ఛతి । జ్వరాతిసారరోగేణ కృషిభంగంవినిర్దిశేత్ । ప్రవహేద్యుక్తమాత్రస్తు తతోగాః ఖనతేయది । వహేనయుక్తమాత్రస్తు తదాసస్యంచతుర్గుణమ్॥" (=నాగేటిని వృషభములచేత లాగించుటకు ప్రారంభమునుచేసినపుడు కూర్మ

ముపుట్టినయెడల కృషీవలునకు అగ్నిభయము కలుగును. నాగలియొక్క-వేడికోలవిరిగెనేని కృషీవలునిజీవితమునందు సందేహముకలుగును. నాగలియొక్క-కాడి భంగమయ్యెనేని కృషీవలునిపుత్త్రుఁడు మరణమును పొందును. కన్నెత్రాఁడు (మోకు) తెగినేని వ్యాసంగమును సస్యహానియును అగును. నాగలిని తోలునపుడు ఎద్దుక్రిందఁబడెనేని కృషీవలునకు బంధనముకలుగును. మఱియును, జ్వరాతిరోగముచేత కృషిభంగమగును. ఎద్దుకాలితో భూమినిత్రవ్వెనేని చతుర్గుణాధికముగ సస్యవృద్ధియైవిశేషమగుఫలముకలుగును ) అనిదుశ్శకునములు గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ ఉద్వాహేతి॥ ఉద్వాహర్క్షాణిపూర్వోక్తాని-మూలాంత్యోత్తరా-త్యాదీని-ఏకాదశసంఖ్యాకాని-చరాణిప్రసిద్ధాని - ద్విపంవిశాఖా-ఇందోఃజ్యేష్ఠా-లఘుభాని-ప్ర- త్వాష్ట్రంచిత్రా - వ్యారిక్షా రఖగాహ్నిఅరిక్తాః-శనిః-జ్ఞైగాబుధః-ఆగోభామః-విగతా ఆరిక్తా రాః యేభ్యస్తేతథా-తేచతేఖగాశ్చ తేషాం అహాః-దినంతస్మిన్ శనిబుధభౌమ రహితవారేఇత్యర్థః - యుగ్మఝషగోకన్యావిలగ్నే-యుగ్మంమిథునం- ఝషోమీనః-గౌర్వృషః-కన్యా-ప్ర-ఏషామన్యతమవిలగ్నేతిథౌ - వ్యంకౌజే-విగతః అంకః-నవమీయస్మాత్ - అసౌవ్యంకఃసచాసౌ ఓజశ్చ ఓజోవిషమస్తస్మిన్ - నవమీవ్యతిరిక్తవిషమతిథావిత్యర్థః - కింలక్షణే-వ్యంకౌజేతిథౌ - సదిశి-దిక్-దశమీ-తయాసహావర్తమానే-౧-౩ ౫-౭-౧౧-౧౫ - ౧౩-౧౦ - కృషిఃశుభాస్యాత్॥ తథాచోక్తం॥ చంద్రేశుభేశుభతిథౌ శుభవారయోగేవారేగురౌశశిజశుక్రగభస్తివారే। అగ్నేవృషేమిథునకేఝషకన్యకాయాంశస్తం కృషిప్రకరణంప్రవదన్తిధానేఇతి॥ అన్యచ్చ॥ దశమ్యేకాదశీచైవ తృతీయాచత్రయోదశీ। సప్తమీపంచమీచైవ ప్రతిపచ్చసుఖావహా। హంత్యష్టమీబలీవర్దాన్ నవమీసస్యఘాతినీ। చతుర్థీకీటజననీపతింహంతిచతుర్దశీ।రవౌబృహస్పతౌచంద్రే శుక్రేకుర్యాద్విశేషతః। బుధార్కి-భూమిపుత్రాశ్చనభవంతఫలప్రదాఇతి॥ అథవిధిమాహ॥ సితాచ్ఛాదనోశ్వేతవస్త్రధరః - పటుః-కుశలః-కర్తా - ఖగభూముఖ్యాన్ దేవాన్సంపూజ్య- కృష్యారంభః-పూర్వోక్తః-సితయజ్ఞః - క్రియతేతత్రపూజితాన్ ఖచభూముఖ్యాన్ గ్రహభూమ్యగ్న్యాదీన్ - ప్రదక్షిణపూర్వకంప్రణమ్య - మనోవాక్కాయకర్మభిర్నమస్కృత్వా - స్వగోష్ఠఘృష్టహాలం-సువర్ణఘర్షితాగ్రం- హాలంసుముహుర్తేసువృషైః ముష్కా-వృషణౌస్తైస్సహావర్తమానాః-సముష్కా-శోభనాఃవృషాః-సువృషాః-గుణావయవపూర్ణాః-నిరోగాః - సముష్కా-



శ్చతేసువృషాశ్చతథాతైఃకృత్వా - సోమింఉత్తరాందిశం ప్రతిత్రివారంనయేత్ - హలేనపద్ధతిఃకుర్యాదితిభావః - ఉత్తరదిశంప్రతిత్రివారంనయనేనపంచరేఖా ఉత్పద్యంతే - తద్యథా - ప్రథమగమనేనైకా-ఆవర్తనేద్వితీయా-పునరుత్తరాంప్రతిద్వితీయగమనేన తృతీయా - పునరావర్తనేనచతుర్థీ పునరుత్తరాంప్రతితృతీయగమనేన పంచమీరేఖా ఉత్పద్యతే అధికానకార్యా ఇతిభావః - సోమింపటుస్త్రిర్నయేదిత్యత్ర - పటుపదగ్రహణం-అఖండభూమౌరేఖాకరణార్థం॥ తథాచోక్తం ॥ శస్తానుచంద్రతారాసుశుచిశ్శుక్లవాససా। స్నాత్వాగంధైశ్చపుష్పైశ్చ పూజయిత్వాపికేశవః। పృథివీంగ్రహసంయుక్తాం పూజయిత్వాప్రజాపతిం। అగ్నింప్రదక్షిణీకృత్యదాతవ్యాచైవదక్షిణా। కృష్ణాన్ వృషాన్‌కాంక్షత్ర్యాజీవనశ్చయుతేనవా। విబలంఛిన్నలాంగూలం కపిలంవృషభంత్యజేత్। హాలప్రవాహనంకార్యం నిరుగ్భిఃకర్షకోవృషైః। హాలాదిభిర్దృఢైఃక్షేపం కుద్రైరశుభంభవేత్। వృషఘాయదియుద్ధ్యేయు స్తస్యవిఘ్నంసదాభవేత్। హేమమధుఘృతహాలాగ్రేణ ఛిన్నరేఖాం నకారయేత్। ఉత్తరాభిముఖోభూత్వా క్షురేణాధ్యక్షంప్రదాపయేత్। తస్యసర్వప్రకారేణ నిర్విఘ్నం కారయేత్తదా। ఏకాజయకరీరేఖా తృతీయాచార్థవృద్ధిదా। పంచమీచభవేద్రేఖాబహుసస్యఫలప్రదా। అతఊర్ధ్వంనకర్తవ్యా మహాదోష స్తతోభవేత్। స్వర్తవ్యావసవశ్శుక్రఃపృథునామాసచంద్రమాః। పరాశరోహలీచైవ సర్వవిఘ్నోపశాంతయఇతి। అత్రదుర్నిమిత్తానితత్రోక్తాని॥ హలేప్రవాహ్యమానేతుకూర్మఉత్పద్యతేయది। గృహిణఃపతయేత్‌స్యతతోగ్నేశ్చభయంభవేత్। ఈషాభంగోయదాకృష్టౌ గృహ-శయోఃజీవితస్యచ। సుతనాశోయుగేభగ్నేసమానేమ్రియతేశిశుః। యోక్త్రఛేదేతువ్యాసంగఃసస్యహానిశ్చజాయతే। హలేప్రవాహ్యమానేతు గౌరేకః ప్రపతేద్యది। ప్రపతేద్యుక్తమాత్రస్తుబంధనంచప్రయచ్ఛతి। జ్వరాతిసారరోగేణకృషిభంగంవినిర్దిశేత్। ప్రవహేద్యుక్తమాత్రస్తు తతోగాఃఖనతేయది। వహేనయుక్తమాత్రస్తు తదాసస్యంచతుర్గుణమితి॥

అథకృషివిషయేలాంగలచక్రం బీజోప్తిం బీజావాపవిషయే ద్వివిధంఫణిచక్రం - ధాన్యచ్ఛేదనంచాహ.

మూ॥ త్రిత్రిత్రివ్యసలార్కరామహుతభుగ్భేష్వరా భుక్తాదసత్సద్భ్యాయఃకృషిభైస్వాదుణ హాలిభైర్జవాపశ్శుభః।
సూర్యర్క్షాదత్రితయత్రితనృతిరశ్చేష్టాష్టభైస్సఫలఃపో

క్రోన్యైఃఫణిసప్తమాద్ర విమిత్రైస్తచ్ఛేదనంవాపభైః॥ ౬॥

టీక॥ అర్కభుక్తాత్=సూర్యుఁడున్ననక్షత్రముకంటె, త్రిత్రిత్రిష్వనలార్థరామహుతభుగ్భేషు = మూఁడు, మూఁడు, మూఁడు, అయిదు, అయిదు, మూఁడు, మూఁడు, సంఖ్యలుగలనక్షత్రములయందు, భూయః=క్రమముగా, అసత్ = అశుభము, సత్=శుభమును, స్యాత్ = అగును. విహారుణహరీంద్రైః=శతభిషము, శ్రవణము, జ్యేష్ఠ, అను నక్షత్రములు తప్పఁదక్కిన, కృషిభైః=కృషికర్మమునకుఁ జెప్పఁబడిన నక్షత్రములచేత, బీజావాపః=విత్తనములనుచల్లుట (లేక) నాటుట, శుభః=శుభకరమైనది, స్యాత్=అగును. సూర్యర్క్షాదిత్రితయతః=సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని మూఁడునక్షత్రములకంటె, అతిధృతితః=ఇరువదొక్కటవనక్షత్రముకంటె, అష్టాష్టభిః=ఎనిమిదేసినక్షత్రములచేత, బీజావాపః=విత్తనములనునాటుట (లేక) చల్లుట, సత్ఫలః = చక్కనిఫలముకలది, స్యాత్=అగును. అన్యైః=ఇతరులగు నాచార్యులచేత, ఫణిసప్తమాత్=రాహువున్ననక్షత్రమునకు ఏడవనక్షత్రముకంటె, రవిమితైః=పదిరెండగు నక్షత్రములచేత, బీజావాపః=విత్తనములనునాటుట, (లేక) చల్లుట, శుభః = శుభమైనది, (ఇతి=ఇట్లని, ఉక్తః=చెప్పఁబడెను.) తచ్ఛేదనమ్=ఆధాన్యచ్ఛేదనము, వాపభైః=బీజావాపమునకుఁ జెప్పఁబడిననక్షత్రములచేత, శుభః=శుభకరమైనది, స్యాత్=అగును.

తా॥ కృషివిషయమై లాంగలచక్రము, బీజావాపము, బీజావాపవిషయముగ ద్వివిధమగుఫణిచక్రము, ధాన్యచ్ఛేదనము, అనువిషయములు ఈశ్లోకముచేత చెప్పఁబడుచున్నవి. ఎట్లనిన:—సూర్యుఁడున్ననక్షత్రముకంటె పరమందున్న మూఁడునక్షత్రములు శుభకరములయినవి కావనియును, పిమ్మట మూఁడునక్షత్రములు శుభకరములయినవనియును, పిమ్మట మూఁడునక్షత్రములు అశుభములయినవనియును, పిమ్మటఅయిదునక్షత్రములు శుభములయినవనియును, పిమ్మట మూఁడునక్షత్రములు అశుభకరములయినవనియును, పిమ్మట అయిదునక్షత్రములు శుభకరములయినవనియును, పిమ్మట మూఁడునక్షత్రములు శుభకరములు గావనియును, పిమ్మట మూఁడునక్షత్రములు శుభకరములయినవనియును, తెలియవలయును. మఱియును, కృషికర్మమునకుఁ జెప్పఁబడిననక్షత్రములలోపల శతభిషము శ్రవణము జ్యేష్ఠ తప్పఁ దక్కిననక్షత్రములయందు బీజావాపమును జేయుటవలన శుభములుగలుగునని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥



మూషకాణాంభయంభౌమే మందేశలభకీటయోః। నవపేచ్ఛతిథౌరిక్తే క్షీణసోమేవిశేషతః। వృషలగ్నేధవామీనే కన్యాయాంమిథునేతథా। వాపయేత్సర్వసస్యాని యదీచ్ఛేత్సస్యసంపదః॥" (=అంగారకవారమునందు మూషకములయొక్క భయముకలుగుననియును, శనివారమునందుశలభకీటములయొక్క భయముకలుగుననియును, రిక్తతిథియందుబీజావాపమును చేయఁగూడదనియును, క్షీణచంద్రుఁడుకలరిక్తయందు బీజావాపమును జేయుటవలన విశేషముగఁగీడుకలుగుననియును, సకలసస్యములను వృషభమీన కన్యా మిథునలగ్నములయందు నాటవలసినదనియును, తెలియవలయును.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియె. మఱియును, బీజావాపమునందు సూర్యుఁడున్ననక్షత్రమునకు మూఁడవనక్షత్రముకంటె పరమందు ఇరువదొక్కనక్షత్రముకంటె పరమందలినక్షత్రములు ఎనిమిది శ్రేష్ఠములయినవని యెఱుఁగవలయును. మఱియును, కొందఱాచార్యులు రాహువున్ననక్షత్రముకంటె పరమందలి పదిరెండునక్షత్రములు బీజావాపమునకు శ్రేష్ఠములయినవని చెప్పిరని యెఱుఁగవలయును. మఱియును, వరాహమిహిరాచార్యుఁడు రాహుస్వరూపవికల్పములను దెలిపె. ఎట్లనినః—"శ్లో॥ అమృతాస్వాదవిశేషాచ్ఛిన్న మపిశిరఃకిలాసురస్యేదం। ప్రాణైరపిపరిత్యక్తం గ్రహతాంయాంతంవదంత్యేకే। ఇంద్వర్కమండలాకృతిరసితత్వాత్కిలనదృశ్యతేగగనే। అన్యత్రపర్వకాలాద్వరప్రదానాత్కమలయోనేః। ముఖపుచ్ఛవిభక్తాంగం భుజంగమాకారముపదిశంత్యన్యే॥" (=అమృతపానకాలమునందు ఛేదింపఁబడినశిరస్సుకలవాఁడై ప్రాణములనువిడిచిన రాక్షసుఁడు గ్రహత్వమును బొంది రాహువనఁబడియె. ఆరాహువు సూర్యచంద్రుల మండలములయొక్క యాకృతులవంటి యాకృతులుగలవాఁడయ్యును నల్లనివాఁడగుటచేత ఆకాశమునందుఁగనఁబడుచుండలేదు. పర్వకాలములయందుమాత్రము బ్రహ్మదేవునివరమువలనఁగనఁబడుచుండును. ఆరాహువు ముఖపుచ్ఛములచేత విభజింపఁబడి సర్పాకారమునుపొందియున్నాఁడని యెఱుఁగవలయును.) అని వరాహమిహిరుఁడు చెప్పెనని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ రాహుభాదష్టభంయావ ద్బీజోప్తింపరివర్జయేత్" (రాహువున్ననక్షత్రమునకెనిమిదవనక్షత్రమునందు బీజావాపమునుచేయఁగూడదు.) అనియాగమాంతరమందుఁజెప్పఁబడియె. మఱియును, ధాన్యచ్ఛేదనము బీజావాపనక్షత్రములయందుఁ జేయఁదగినదని యెఱుఁగవలయును. మఱియును, కృషినక్ష

త్రములకును బీజావాపనక్షత్రములకును కొంచెముభేదముకలదు. అయినను రెండును కృష్యంగములగుటవలన ఏనక్షత్రములయందుఁ జేయవచ్చునో యనియెడుసందేహమును పోఁగొట్టుటకొఱకు ధాన్యచ్ఛేదనము బీజావాపనక్షత్రములయందుఁ జేయవలసినదని చెప్పఁబడియెనని యెఱుఁగవలయును.

వ్యా॥ అథకృషివిషయేలాంగలచక్రమాహ ॥ తీతి ॥ అర్కభుక్తాత్సూర్యనక్షత్రాత్సకాశాత్- త్రిత్ర్యాదిషుస్థాపితేషు- నక్షత్రేషు- అసత్సదిత్యేతత్ఫలద్వయం- భూయఃవారంవారంస్యాత్- ఏతదుక్తంభవతి॥ సూర్యాక్రాంతనక్షత్రస్య ఆదిభాన్నక్షత్రాత్సకాశాత్- త్రిషుఅసత్- దుష్టఫలంస్యాత్- తదనంతరం- త్రిషుసత్- శుభంస్యాత్- తతస్త్రిషుఅసత్- తతఃఇషుషు పంచసు- సత్- తతోనలేషు - త్రిషుఅసత్- తతః- అర్కే షపంచసు- సత్- తతోరామేషుత్రిషు- అసత్- తతో - హుతభుక్షు- త్రిషుసత్స్యాదిత్యర్థః ॥ అథబీజోప్తిమాహ ॥ కృషిభైరితి ॥ కృషిభైః- కృషినక్షత్రైః- ఉద్వాహర్క్ష చరద్విషేత్యాదిభిర్బీజావాపఃశుభఃప్రోక్తః- కింలక్షణైః- కృషిభైః- విహారుణహరీంద్రైః- వారుణం- శతతారకా- హరిః- శ్రవణః- ఇంద్రః జ్యేష్ఠా- విగతాఃవారుణహరీంద్రాఖ్యే భ్యస్తానితథాతైః- శతతారకాశ్రవణజ్యేష్ఠారహితైరిత్యర్థః- కృషిభైరిత్యుపలక్షణం- తస్మాత్కృష్యుక్తంసర్వతిథివారాదికంజ్ఞేయం॥ తథాచోక్తం॥ మూషకానాం భయంబామేమంఛేశలభకీటయోః । నవమేచ్ఛతిథౌరిక్తేహీనసోమవిశేషతః । వృషలగ్నేథవామీనే కన్యాయాంమిథునేతథా । వాపయేత్సర్వసస్యాని యదీచ్ఛేత్సస్యసంపద ఇత్యాదిలగ్నబలంప్రాగ్వత్ ॥ అథబీజావాపవిషయే ద్విభేదంఫణిచక్రమాహ ॥ సూర్యర్క్షాదితి ॥ సూర్యయుక్తనక్షత్రాదితృతీయం తస్మాదతిధృతిరేకోనవింశంతిస్స్యాత్ - అష్టాష్టభిః- ఏకోనవింశాదష్టభిర్నక్షత్రైర్బీజావాపః - సత్ఫలః ॥ అథద్వితీయభేదమాహ ॥ అన్యైరితి ॥ అన్యైరాచార్యైః- ఫణిసప్తమాత్- రాహుసప్తమాత్- సకాశాత్- రవిమిత్రైర్ద్వాదశభిర్నక్షత్రైర్బీజావాపః - శుభఃప్రోక్తఃఏతదుక్తంభవతి ॥ రాహుర్యస్మిన్నక్షత్రేభవతి- తస్మాద్యత్సప్తమంనక్షత్రం తత్ఫణిసప్తమముచ్యతే । తస్మాత్సకాశాత్ద్వాదశభిరిత్యర్థః - రాహోస్తుఫణీతినామగ్రంథాంతరేప్రసిద్ధం - వరాహమిహిరాచార్యేణ రాహుస్వరూపవికల్పాః గ్రన్థాంతరగోక్తాఉద్ఘాటితాః ॥ స్వకృతసంహితాయాం ॥ అమృతాస్వాదం విశేషాచ్ఛిన్నమపిశిరఃకిలాసురస్యేదం । ప్రాణైరపరిత్యక్తం గ్రహతాంయాతంవదంత్యేకే । ఇంద్వర్కమండలాకృతిరసితత్వాత్కిలనదృశ్యతేగగనే । అన్యత్రపర్వకాలాద్వరప్రదానాత్కమలయోనేః । ముఖపుచ్ఛవిభక్తాంగంభుజంగమాకారముపదిశంత్యన్యే ఇతి- భుజంగమాకారికథనాత్ఫణీత్యభిధానంప్రసిద్ధం ॥ రత్నమాలాయామపి ॥ ఫణిభాద్బీజోప్తికాలేస్ఫుటమితి ॥ తథాచాగమాంతరే ॥ రాహుభాదష్టమంయావద్బీజోప్తింపరివర్జయేదితి ॥ అథధాన్యచ్ఛేదనమాహ ॥ తచ్ఛేదనంవాపభైరితి ॥ తేషాంధాన్యానాంఛేదనం తచ్ఛేదనంవాపభైః బీజావాపనక్షత్రైః- ప్రోక్తం- నను యస్యాంగంయదదోంగినో గదితభేకుర్యాదితిపూర్వైరుక్తం ॥ తత్కథంపునర్ముకం తచ్ఛేదనంవాపభైరితి. సత్యం కృషినక్షత్రాణాం బీజావాపనక్షత్రాణాంచ కించిద్భేదోస్తి - ద్వయోఃకృష్యంగత్వాత్ కైః కార్యమితిసందేహనివారణార్థం తచ్ఛేదనంవాపభైరిత్యుక్తం॥

అథనిష్పన్నేధాన్యేక్రమప్రాప్తంమేధిరోపణం- నవధాన్యప్రసంగేననవాన్నకర్మ-నృత్యసంగీతయోరారంభంచాహ.

మూ॥ మేధింక్షీరతరోరుఘానురహితైరుద్వాహభైరోపయే ద
న్నప్రాశనవద్వసంతశరదోః ప్రోక్తంనవాన్నంబుధైః ।
మైత్రాదిత్యవసూత్తరేజ్యవరుణైః సంభైర్నృ
త్యంనర్తనం లగ్నేజ్ఞేగురువీక్షితేహిబుకగైః సౌమ్యైశ్చ
సంగీతకం॥ ౮॥

టీక॥ ఉఘానురహితైః=ఉత్తరాఫల్గుని అనూరాధతప్పఁ దక్కిన, ఉద్వాహభైః=వివాహోక్త నక్షత్రములచేత, క్షీరతరోః=వటవృక్షాదుల యొక్క, మేధిం=కట్టుగొఱ్ఱును, ఆరోపయేత్ = పాతిపెట్టవలయును. బుధైః = విద్వాంసులచేత, అన్నప్రాశనవత్ = అన్నప్రాశనమునకువలె (అనఁగా అన్నప్రాశనమునకుఁ జెప్పఁబడిన లగ్నతిథినక్షత్ర వారాదుల యందు) వసంతశరదోః=వసంతకాలశరత్కాలములయందు, నవాన్నం=నవాన్నకర్మము, ప్రోక్తం=చెప్పఁబడెను. నర్తనం=నృత్యము, సంగీతకంచ=సంగీతకము (అనునవి) మైత్రాదిత్యవసూత్తరేజ్యవరుణైః=అనూరాధ, హస్త, ధనిష్ఠ, ఉత్తర, పుష్యమి, శతభిషముఅను నక్షత్రములచేత, జ్ఞే=బుధుఁడు, లగ్నేసతి=లగ్నమునందున్నవాఁడగుచునుండఁగా, లగ్నే=లగ్నము, గురువీక్షితేసతి=బృహస్పతిచేతఁ జూడఁబడినదగుచునుండఁగాను, సౌమ్యైః=శుభగ్రహములు, హిబుకగైఃసద్భిః=చతుర్థస్థానమునఁ బొం

దినవారగుచునుండఁగా, శుభం=శుభకరమైనది, స్యాత్=అగును.

తా॥ ధాన్యముపండినపిమ్మటఁ జేయఁదగినకట్టుగొఱ్ఱును పాతిపెట్టుట, నవధాన్యప్రసంగమూలకముగ నవాన్నకర్మము, నృత్యసంగీతములయొక్కయారంభకాలము అనువానిని ఈశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఉత్తరాఫల్గుని, అనూరాధ, అనునక్షత్రములుతప్పఁ దక్కినవివాహోక్తనక్షత్రములచేత వటవృక్షాదులచేతఁ జేయఁబడిన కట్టుగొఱ్ఱును స్థాపనచేయవలయును. మఱియును, "శ్లో॥ రేవతీరోహిణీమూలాస్వాతీహస్తోమృగస్తథా। ఆషాఢోత్తరహస్తశ్చ తథాభాద్రపదామతా। బంధనేసర్వబీజానాం తథాశాలాప్రవేశనే। దుఃఖదావనదాచైషానురాధోత్తరఫల్గునీ। వటశ్చసప్తపర్ణశ్చ భృంగారీశాల్మలీతథా। ఔదుంబరీతథాధాత్రీ యాచాన్యాక్షీరవాహినీ। స్త్రీనామ్నీకర్షకైర్నిత్యం మేధిః కార్యాఫలప్రదా॥" (=రేవతి, రోహిణి, మూల, స్వాతి, హస్త, మృగశీర్ష, ఉత్తరాషాఢ, ఉత్తర, హస్త, పూర్వాభాద్ర, అనునక్షత్రములు సర్వబీజములయొక్కయును బంధనమునందును అటులనే శాలాప్రవేశమందును, శ్రేష్ఠములైనవని తెలియవలయును. మఱియును, అనూరాధ, ఉత్తరఫల్గుని, అనునక్షత్రములు దుఃఖమునిచ్చునవియగును. మఱియును, వటవృక్షము, సప్తపర్ణవృక్షము, భృంగారీవృక్షము, శాల్మలీవృక్షము, ఔదుంబరవృక్షము, ఉసిరికచెట్టు, మఱియునితరములగు క్షీరవృక్షములు అనువానిచేత కట్టుగొఱ్ఱును నిర్మింపవలయును.) అనిస్మృత్యంతరమందుఁజెప్పఁబడియె. మఱియును, అన్నప్రాశనమునకు జెప్పఁబడిన నక్షత్రతిథివారాదులయందు నవాన్నకర్మమును జేయవలసినదని యెఱుఁగవలయును. మఱియును, అగ్నిహోత్రములతోఁ గూడియున్నవాఁడునవాన్నకర్మమును జేయక నవధాన్యములగు వ్రీహ్యాదులనుభుజించుట కుపయోగించుకొనఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, శరత్కాలమునందు వ్రీహ్యాగ్రయణమును, వసంతకాలమునందు యవాగ్రయణనమును జేయవలయును. మఱియును, "శ్లో॥ వ్రీహయోయవగోధూమానీవారాఃకంగువైణకాః। శాలయోముద్గమాషాశ్చ నవధాన్యానిచక్రమాత్॥" (=వడ్లు, యవలు, గోధుమలు, నెవ్వరిధాన్యము, కొఱ్ఱలు, వెదురుధాన్యము, అరువదిదినములకు పండునట్టి రాజనధాన్యము, పెసలు, మినుములు, అనునవి నవధాన్యములని) ఈస్మృతిప్రమాణముచేతఁ దెలియవలయును. మఱియును, అనూరాధ, హస్త, రేవతి, ధనిష్ఠ, ఉత్తర ఉత్త



రాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, శతభిషము, జ్యేష్ఠ, అనునక్షత్రములు సంగీతనృత్యములను శ్రేయస్కరములయినవని తెలియవలయును. మఱియును, సంగీతనృత్యములను ఆరంభించెడులగ్నమునందు బుధుఁడుండవలసినదనియును, ఆలగ్నమునందు గురుఁడు చూడవలసినదనియును, ఆలగ్నమునకు నాల్గింట శుభులుండవలసినదనియును, తక్కిన గుణదోషములను అన్నికార్యములకును చూచువిధముగఁ జూడవలసినదనియును, తెలియవలయును.

వ్యా॥ అథనిష్పన్నే క్రమప్రాప్తం మేధిరోపణం వృత్తచరణేనాహ॥ మేధిమితి॥ క్షీరతరోర్వటవృక్షాదేర్మేధిం ఉద్వాహభైర్వివాహనక్షత్రైర్మూలాంత్యార్కేత్యాదిభిరారోపయేత్ - నిఖనేత్-మేధిర్నామఖలే ధాన్యమర్దనార్థంవృషపఙ్క్తియోజనార్థం కాష్ఠమారోప్యతే - మేథ్యంతే సంగమ్యంతేవృషభాఅస్మిన్నితిమేధిః॥ ని॥ పుంసిమేధిః ఖలేదారున్యస్తంయత్పశుబంధనే॥ఇత్యమరః॥ కింలక్షణైరుద్వాహభైః- ఉఫానురహితైః-ఉఫా ఉత్తరాఫల్గునీ అనుః-అనూరాధా - తాభ్యాంరహితైః॥ ఉక్తంచ॥ రేవతీరోహిణీమూలం స్వాతీహస్తోమృగస్తథా। ఆషాఢోత్తరహస్తశ్చతథా భాద్రపదామతా। బంధనేసర్వబీజానాం తథాశాలాప్రవేశనే। దుఃఖదావనదాచైషానురాధోత్తరఫల్గునీ। వటశ్చసప్తపర్ణశ్చభృంగారీశాల్మలీ తథా। ఔదుంబరీతథాధాత్రీ యాచాన్యాక్షీరవాహినీ। స్త్రీనామ్నీకర్షకైర్నిత్యంమేధిః కార్యాఫలప్రదేతి॥ అథనవధాన్యప్రసంగేన నవాన్నకర్మద్వితీయచరణేనాహ॥ అన్నప్రాశనభైః - నవాన్నంనవాన్నకర్మబుధైః ప్రోక్తం - అన్నప్రాశనభైరిత్యుపలక్షణం - తస్మాదన్నప్రాశనోక్తంతిథివారాదికమత్రగ్రాహ్యం - సాగ్నికస్యనవాన్నకర్మణావినావ్రీహ్యాదీనాం నవనవమితానాం ధాన్యానాం భక్షణేదోషప్రసంగాదావశ్యకంకర్మైతత్॥ నవధాన్యానీమాని॥ వ్రీహయోయవగోధూమానీవారాఃకంగువైణకాః। శాలయోముద్గమాషాశ్చనవధాన్యానిచక్రమాత్ - ఏషాంమధ్యే శరత్సంభవానివ్రీహ్యాగ్రయణేన వినావభక్షణీయాని - వసంత సంభవాని యవాగ్రయణేనవినానభక్షణీయానీతి నియమాది కర్మశరద్వసంతయోః క్రియతఇతి॥ తత్ అన్నప్రాశనోక్తైస్తిథిభాదిభిః మాసేష్వేష్టమేవేత్యతోప్రోక్తైర్నవాన్నంకర్తవ్యమిత్యర్థః॥ అథోత్తరార్థేన నృత్యసంగీతయోరారంభమాహ॥ మైత్రార్కాంత్యేతి॥ మైత్రమనూరాధా - అర్కోహస్తః- అంత్యంరేవతీ-వసవోధనిష్ఠా - ఉత్తరాస్త్రిస్రః-ఇజ్యఃపుష్యః-వరుణః- శతతా

రకా- ఇందోర్జ్యేష్ఠా- తైర్మృగనమారభేత్ - సంగీతకంచఆరభేత్- కస్మిన్ సతి- లగ్నేవర్తమానే జ్ఞేగురువీక్షితేసతి - కైః- హిబుకైః - సౌమ్యైశ్చతుర్థస్థానస్థితైః సౌమ్యగ్రహైః- శేషంప్రాగ్వత్ ॥

—* అథ నానాపశూనాం కర్మతద్వర్జ్యంచవృత్తేనైకేనాహ. *—

మా॥ ద్వీశార్కేంద్వదితీజ్యవాసవశివాశ్వ్యంత్యాగ్నిపాశీంద్ర
భైఃపూర్వాభిశ్శుభదావిసింహభతనౌ నానాపశూనాం
క్రియా । వారేష్వర్కచతుర్ఘ్నకోత్తరహరిత్వాష్ట్రేష్వ
మారిక్తయో రష్టమ్యాంనహితోదితాస్వభగభేనస్యాద్భ
దోషఃకిల॥ ౮॥

టీక॥ ద్వీశార్కేంద్వదితీజ్యవాసవశివాశ్వ్యంత్యాగ్నిపాశీంద్రభైః= విశాఖ, హస్త, మృగశీర్ష, పునర్వసు, పుష్యమి, ధనిష్ఠ, ఆర్ద్ర, అశ్విని, రేవతి, కృత్తిక, శతభిషము, జ్యేష్ఠ, అను నక్షత్రములచేతను, పూర్వాభిః= పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలచేతను, విసింహభతనౌ= సింహముతప్ప దక్కిన లగ్నములయందును, నానాపశూనామ్= అనేకవిధములయిన పశువులయొక్క, క్రియా= క్రయవిక్రయవ్యవహారము, శుభదా= శుభమును కలుగఁజేయునదియై, ఉదితా= చెప్పఁబడినది, అర్కచతుర్ఘ్న= సూర్యుఁడు మొదలుకొని నలుగురివగు, వారేషు= వారములయందును, కోత్తరహరిత్వాష్ట్రేషు= రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, చిత్త, అనునట్టినక్షత్రములయందును, అమారిక్తయోః= అమావాస్యయందును రిక్తతిథులయందును, అష్టమ్యామ్= అష్టమియందును, నానాపశూనామ్= నానావిధపశువులయొక్క, క్రియా = క్రయవిక్రయవ్యాపారము, శుభదా= శుభమునిచ్చునదియై, నవిహితా= చెప్పఁబడలేదు. స్వభగభే= స్వభగభమందు, భదోషః = నక్షత్రదోషము, నస్యాత్ = లేకపోవును.

తా॥ నానావిధ పశువులకర్మమును చేయఁదగినకాలము ఆకర్మమును విడిచిపెట్టఁదగిన కాలము అనువానిని ఈ శ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— విశాఖ, హస్త, మృగశీర్ష, పునర్వసు, ధనిష్ఠ, ఆర్ద్ర, అశ్విని, రేవతి, కృత్తిక, శతభిషము, జ్యేష్ఠ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, అనునట్టినక్షత్రములును, సింహలగ్నముతప్పదక్కిన లగ్నములును, నానావిధపశువులయొక్క క్రయవిక్రయవ్యాపారమునకు శుభకరములయినవని తెలియవలయును, మఱియును, భానుసోమమంగళబుధవారములును, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, చిత్తఅనునక్షత్రములును, అమావాస్య, చవితి, నవమి, చతుర్దశి, అనునట్టితిథులును నానావిధపశువులయొక్క క్రయవిక్రయవ్యవహారమునకుఁ దగినవి కావని యెఱుఁగవలయును. మఱియును, స్వభగభమందు నక్షత్రదోషము లేదని యెఱుఁగవలయును. మఱియును, లగ్నబలమును మునుపటివలెనే చూడవలయును. మఱియును, "శ్లో॥ చాన్ద్ర్యాదిత్యద్వివసూవాస్యంత్యార్కేంద్రద్విశైఃక్రయాదిగైః । దర్శభూతాష్టమీచిత్రాధ్రువకర్ణారమాద్యసత్ । సోమార్కవైధృతేపాతే లగ్నేపంచాననే బుధే । భద్రాసంక్రాంతిరిక్తాసు పశుకర్మవివర్జయేత్ ॥" (= ఇదివఱకుఁ జెప్పఁబడిన తిథివారనక్షత్రములేకాక అష్టమి, వైధృతి, వ్యతీపాత, అనునవికూడ పశువులయొక్క క్రయవిక్రయములకుఁదగవని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ శుభగ్రహోదయేశుద్ధనైధనేస్వర్క్షయోనిషు। రక్షావృద్ధిక్రియాశస్తా పశూనాంమునిభిస్స్మృతా॥" (= శుభగ్రహములయొక్క రాసులయందును, శుద్ధమగు నైధనతారయందును, స్వర్క్షయోనులయందును, పశువులయొక్క క్రయవిక్రయ వ్యాపారమును రక్షాబంధమును శ్రేష్ఠమైనదని మునులచేతఁ జెప్పఁబడెను.) అని స్మృత్యంతరమునఁ జెప్పఁబడెను. మఱియును, "శ్లో॥ సోమేభౌమేబుధేగావోనచాల్యాస్తురగాశ్శనౌ॥" (= సోమ కుజ బుధవారములయందు పశువులను అన్యగ్రామాదులకుఁ దోలఁగూడదు. గుఱ్ఱములను శనివారమునందు అన్యగ్రామాదులకుఁ దోలఁగూడదు.) అని యోగమాంతరమందుఁ జెప్పఁబడెను. మఱియును, "శ్లో॥ పూర్వాత్రయాస్మృతమయూఖహుతాశనేషుశాక్రాగ్నివాజివసువారుణశాంకరేషు । ఏతేషు గోమహిషదంతితురంగమాది నానాప్రకారపశుజాతిగతిఃప్రశస్తా॥" ( = పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర, మృగశీర్ష, కృత్తిక, జ్యేష్ఠ, ధనిష్ఠ, శతభిషము, ఆర్ద్ర, అనునట్టినక్షత్రములయందు గోవులు, మహిషములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, మొదలగువానియొక్క క్రయవిక్రయాదివ్యాపారము శ్రేష్ఠమైనది.) అని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడెను.

వ్యా॥ ద్వీశేతి ॥ ద్వీశంవిశాఖా - అర్కః హస్తః- ఇందుర్మృగః- అదితిః పునర్వసుః- ఇజ్యః పుష్యః- వసవో ధనిష్ఠా- శివః- ఆర్ద్రా- అశ్వినీ- ప్రసిద్ధా- అంత్యం రేవతీ- అగ్నిః కృత్తికా- పాశీశతతారకా ఇందో ర్జ్యేష్ఠా- తైః పూర్వాభి స్తిసృభిః- విసింహభతనౌ- విగతః- సింహోయేభ్యస్తాని- వి

సింహాని- తానిచ-వ్రిసింహభాని - సింహారహితరాశయః- తేషాంతనః- లగ్నంతస్మిన్నానాపశూనాంక్రియా - శుభదాఉదితా- పశూనాంక్రయ విక్రయాదికర్మశుభదంప్రోక్తమిత్యర్థః ॥ అథోత్తరార్ధేనవర్జ్యమాహ ॥ అర్క-చతుర్థవారేషు- రవిచంద్రభౌమబుధవారేషు- క్రోత్తరహరిత్వాష్ట్రే షు- కః- రోహిణీ- ఉత్తరాస్త్రిస్రః - ఆసాంసమాహారః- క్రోత్తరః హరిః శ్రవణః- త్వాష్ట్ర ) చిత్రాఏషుఆమారిక్తయోః- అమా- అమావాస్యా- రిక్తాశ్చతుర్థీనవమీచతుర్దశీనామన్యతమా - తయోః- అష్టమీ- ప్ర- తస్యాం- నానాపశూనాంక్రియానహితానోదితా ॥ అపవాదమాహ ॥ స్వభగభే సతి- భదోషోనక్షత్రదోషఃక్వచిత్పశుకర్మణినస్యాత్ - లగ్నబలంప్రాగ్వత్ ॥ ఉక్తంచ ॥ ద్వ్యాదిత్యద్విపసూదాస్య్రంత్యా ర్కేంద్రద్వీశైఃక్రయాదిగైః । దర్శభూతాష్టమీచిత్రా ధ్రువకర్ణైఃకరమాద్యసత్ । సోమార్క వైధృతేపాతే లగ్నేపంచాననేబుధే । భద్రాసంక్రాంతిరిక్తాసుపశుకర్మవివర్జయేత్ ॥ శుభగ్రహోదయేశుద్ధనైధనేస్వర్క్షయోనిషు । రక్షావృద్ధిక్రియాశస్తా పశూనాంమునిభిస్స్మృతేతి ॥ తథాచాగమాంతరే ॥ సోమే శౌమేబుధేగావోనచాల్యాస్తురగాశ్శనావితి ॥ అన్యచ్చ ॥ పూర్వాత్రయామృతమయాఖహుతాశనేషు శాక్రాగ్నివాజివసువారుణనాంకరేషు । ఏతేషుగోమహిషదంతితురంగమాది నానాప్రకారపశుజాతిగతిఃప్రశస్తేతి॥

—— (*) అథాశ్వకర్మ వృత్తేనైకేనాహ. (*) ——

మూ॥ ద్వ్యాదిత్యద్విపసుస్థిరాశ్విభ మృదుస్వాత్యర్క బైర్జ్ఞత్రయార్కారాహ్నీజ్యభృగూదయేద్వికమదేష్వేందౌక్రియాశ్వీహితా । తత్రాప్యర్క భతఃక్రమాత్తిథిమితైఃపశ్చాత్త్రిభిస్సాభిజిచ్ఛస్తాయాన్నృసమా తదుక్తభముఖైఃకార్యాపరైభిర్బుధైః॥ ౯॥

టీక॥ ద్వాదిత్యద్విపసుస్థిరాశ్విభమృదుస్వాత్యర్క-భైః=పునర్వసు, పుష్యమి, ధనిష్ఠ, శతభిషము, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, రేవతి, మృగశీర్ష, చిత్త, స్వాతి, హస్త, అనునట్టి నక్షత్రములచేతను, జ్ఞత్రయార్కారాహ్నా = బుధగురుశుక్రరవికుజవారములయందును, ఇజ్యభృగూదయే = గురుశుక్రులుగల లగ్నమునందును, ఇందౌ=చంద్రుఁడు, ద్వికమదేషు=రెండునాలుగు ఏడుస్థానములయందు, స్థితేసతి=ఉన్నదగుచునుండఁగా, అశ్వీ=అశ్వసంబంధమైన, క్రియా=క్రయవిక్రయణాదివ్యాపారము, హితా=ఇష్టమైనది, తత్రాపి=ఆపునర్వసుమొదలుగాఁగల నక్షత్రములలోపలగూడ, అర్క-భతః=సూర్యుఁడున్ననక్షత్రము మొదలుకొని, క్రమాత్=క్రమముగా, తిథిమితైః=పదునైదు సంఖ్యకల నక్షత్రములచేత, పశ్చాత్=పృష్ఠభాగమునందు, సాభిజిత్=అభిజిత్తుతోఁగూడిన, త్రిభిః=మూడునక్షత్రములచేతను, అశ్వీ = అశ్వసంబంధమైన, క్రియా=క్రయవిక్రయాదివ్యాపారము, శస్తా=ప్రశస్తమైనది, స్యాత్=అగును. యా=ఏయశ్వక్రియ, నృసమా=మనుష్యులతోసమానమైనదో, సా=అది, తదుక్తభముఖైః=ఆమనుష్యులకుఁ జెప్పఁబడిననక్షత్రములుమొదలగువానిచేత, కార్యా=చేయఁదగినది, స్యాత్=అగును. యా=ఏయశ్వక్రియ, పరా=మనుష్యసమానమైనది,న=కాదో, సా=అది, ఏభిః=ఈపునర్వసుమొదలయిన నక్షత్రములచేత, కార్యా=చేయఁదగినది, ఇతి=ఇట్లని, బుధైః=విద్వాంసులచేత, ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ ఇంకను అశ్వకర్మవృత్తాంతమును ఈశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—పునర్వసు, పుష్యమి, ధనిష్ఠ, శతభిషము, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అశ్విని, అనూరాధ, రేవతి, మృగశీర్ష, చిత్త, స్వాతి, హస్త, అనునట్టి నక్షత్రములయందును, బుధ గురు శుక్ర రవి కుజులవారములయందును, గురు శుక్రులుగల లగ్నమునందును, ద్వితీయ చతుర్థ సప్తమస్థానములయందు చంద్రుఁడుకలలగ్నమునందును, అశ్వములయొక్క క్రయవిక్రయాది వ్యాపారము శ్రేష్ఠమైనదగును. మఱియును, ఆపునర్వసు నక్షత్రము మొదలుగాఁగల నక్షత్రములలోపల సూర్యనక్షత్రముకంటె క్రమముగా పదునైదుకల నక్షత్రములయందును, సూర్యనక్షత్రమునకు పశ్చాద్భాగమునందలి మూడవసంఖ్యకల నక్షత్రములయందును అభిజిన్నక్షత్రమునందును, అశ్వములయొక్క క్రయవిక్రయవ్యాపారము మిగులశ్రేష్ఠమైనఫలమును కలుగఁజేయును. మఱియును, అశ్వములయొక్క క్రియ మనుష్యవ్యాపారముతో సమానమైనదైనప్పుడు మనుష్యనక్షత్రమునట్టి చెప్పఁబడిన నక్షత్రములు మొదలగునక్షత్రములయందు ప్రశస్తమైనదగును. మనుష్యులక్రియతో సమానముగాని యశ్వవ్యాపారము ఇప్పుడు చెప్పఁబడిన పునర్వసు మొదలుగాఁగలనక్షత్రములు ప్రశస్తములయినవని యెఱుఁగవలయును. లగ్నబలమును మునుపటివలెనే చూచికొనవలయును. మఱియును, "శ్లో॥ వివిష్ణుచరభేక్షిప్రే మృదుభేస్థిరభేషుచ । వాజికర్మాఖిలంసూర్యవారేకార్యంవిశేషతః॥" (=చర నక్షత్రములలో శ్రవణముతప్పఁ దక్కిన నక్షత్రములయందును క్షిప్రసం

ప్రేతకార్యాణిసర్వాణి వ్రతస్నానజపాదికం । వర్జ్యంశుక్రేజ్యయోరస్తే గయాంగోదావరీంవినేతి ॥ మిశ్రప్రకరణంసమాప్తమ్॥

——(*) అథశాంతిప్రకరణంఅనధ్యాయానాహ. (*)——

మూ॥ పర్వాగ్రాదియుగాష్టమీతిథయో మధ్వాదిపక్షద్వయే ఽ
నధ్యాయాశ్చర సంక్రమాఅథమధౌ వహ్నిశ్చశుక్రేయ
మః । రాధేగ్నిస్త్వసితోయమశ్శుచిదృగాశారాస్త్ర
యోదశ్యథో మార్గేకృష్ణనగగ్రహావిషదృగం కాశాగ్న
యఃకీర్తితాః॥ ౧॥

టీక॥ పర్వాగ్రాదియుగాష్టమీ = ప్రతిపచ్చతుర్దసులతోఁగూడిన పూర్ణిమావాస్యలు. మధ్వాదిపక్షద్వయే = చైత్రమాసము మొదలుగాఁగలమాసములయందలి శుక్లకృష్ణపక్షములయందలి. అష్టమీతిథయః=అష్టమియునుసట్టితిథులును. చరసంగ్రమాః=చరసంక్రాంతులును. అథ=పిమ్మట. మధౌ=చైత్రమాసమునందలి. వహ్నిశ్చ=తృతీయయును. శుక్రే=జ్యేష్ఠమాసమునందు. యమః=విదియయును. రాధే=వైశాఖమాసమునందు. అగ్నిః=తృతీయ. అసితః=కృష్ణపక్షపుదైన. యమః=విదియ. శుచిదృగాశారాః=ఆషాఢమాసముయొక్క ద్వితీయ, దశమి, ద్వాదశి, అనుతిథులును. అథః=పిమ్మట. మార్గే=మార్గశీర్షమునందు. కృష్ణనగగ్రహాః=కృష్ణపక్షపుసప్తమినవమి, అనునట్టితిథులును. ఇషదృగంకాశాగ్నయః=ఆశ్వయుజమాసమునందలివిదియ, నవమి, దశమి, తదియ, అనునట్టితిథులును. అనధ్యాయాః=అనధ్యాయములని. కీర్తితాః=చెప్పఁబడినవి.

తా॥ ఇఁకను శాంతిప్రకరణమును జెప్పుచున్నాఁడు. ముందుగా అనధ్యాయములను జెప్పుచున్నాఁడు. ఎట్లనినః — "శ్లో॥ ఛిద్రాణ్యేతానివిప్రాణాం యేనధ్యాయాఃప్రకీర్తితాః । ఛిద్రేభ్యస్స్రవతిబ్రహ్మ బ్రాహ్మణేనయదార్జితం ॥ తత్రాలేతస్యరక్షాంసి శ్రియంబ్రహ్మయశోబలం। సర్వమాదాయగచ్ఛంతి వర్జయంతీప్సితంఫలమ్॥" (=ఛిద్రములనియెడుతిథులు అనధ్యాయములని చెప్పఁబడియె. ఛిద్రతిథులవలన బ్రాహ్మణులచేత ఆర్జింపఁబడిన వేదమును సంపదను కీర్తిని బలమును రాక్షసులు గ్రహించిపోదురు. మఱియును, కోరఁబడినఫలమునుగూడ రాక్షసులుఅపహరించుదురు.) అనుప్రమాణమునందు అనధ్యాయతిథులయందు పఠనాదికముపనికిరాదనియును, మౌంజీబంధనాదికమును జేయఁగూడదనియును, తెలియవలయును. మఱియును, అమావాస్య, పూర్ణిమ, ప్రతిపత్తు, చతుర్దశి



అనునట్టితిథులును, చైత్రాదిమాసములయందలి శుక్లకృష్ణపక్షగతములయినయష్టములును అనధ్యాయములని విద్వాంసులచేతఁ జెప్పఁబడెను. మఱియును, మేషకర్కటతులామకరసంక్రాంతులును, చైత్రమాసమునందలిశుక్లపక్షతృతీయయును, జ్యేష్ఠమాసమునందలి శుక్లపక్షద్వితీయయును, వైశాఖమాసమునందలితృతీయయును, వైశాఖకృష్ణపక్షద్వితీయయును, ఆషాఢమాసమునందలి ద్వితీయాదశమీత్రయోదసులును, మార్గశీర్షమాసమునందలి కృష్ణపక్షసప్తమీనవములును, ఆశ్వయుజమాసమునందలినవమి, దశమి, తృతీయ, అనునట్టితిథులును, అనధ్యాయతిథులని తెలియవలయును.

వ్యా॥ అథానంతరం శాంతిప్రకరణమారభ్యతే ॥ శ్లో ॥ ఛిద్రాణ్యేతానివిప్రాణాం యేనధ్యాయాఃప్రకీర్తితాః । ఛిద్రేభ్యస్స్రవతిబ్రహ్మ బ్రాహ్మణేనయదార్జితం ॥ తత్రాలేతస్యరక్షాంసి శ్రియంబ్రహ్మయశోబలం । సర్వమాదాయగచ్ఛంతివర్జయంతీప్సితం ఫలమిత్యనధ్యాయేపఠనాద్యాప్రసంగాత్ మౌంజ్యాదినిషేధాచ్చప్రవృత్తద్వయేనానధ్యాయానాహ॥ పర్వేతి ॥ పర్వఅమా- పూర్ణిమా - కింలక్షణంపర్వ - అగ్రాదియుక్- అగ్రంప్రతిపత్- ఆదిశ్చతుర్దశీ- తాభ్యాంయుక్ యుక్తం- అష్టమీ- ప్ర- ఇతి తిథయశ్చతస్రస్తిథయః- మధ్వాదిపక్షద్వయే - మధుశ్చైత్రః - తదాదిషుమాసేషుపక్షద్వయం- శుక్లకృష్ణాఖ్యంతస్మిన్ - అనధ్యాయాస్స్యుః- కీర్తితాఃకథితాః - బుధైరిత్యధ్యాహారః - అథాన్యానాహ ॥ చరసంక్రమాః- చరరాశిసంక్రాంతయః - మేషకర్కటతులామకరసంక్రాంతయ ఇత్యర్థః - మధుశ్చైత్రస్తస్మిన్వహ్నిః వహ్నిసంఖ్యాకాతిథిః తృతీయేత్యర్థః- శుక్రేమాసే- జ్యేష్ఠేమాసే- యమః- ద్వితీయా- అత్రప్రకరణేశుక్లకృష్ణపక్షనిర్దేశోనదృశ్యతే । తత్రశుక్లపక్షజస్తిధిర్జ్ఞేయః - రాధే - వైశాఖే- అగ్నిస్తృతీయా- శుక్లేతుపునః - అసితఃకృష్ణేయమః ద్వితీయా- శుచిదృగాశారాః- శుచిరాషాఢః- తస్యదృగ్ద్వితీయా- ఆశాదశమీ- అర్కాః- ద్వాదశీ- త్రయోదశ్యపి- ఆషాఢశుక్లద్వితీయా- దశమీద్వాదశీత్రయోదశీత్యర్థః- అథమార్గేమార్గశీర్షే- కృష్ణనగగ్రహాకృష్ణసప్తమీనవమ్యౌ- ఇషదృగంకాశాగ్నయః- ఇషః- ఆశ్వినః - తస్యదృగ్ద్వితీయా - అంకోనవమీ- ఆశాదశమీ - అగ్నిస్తృతీయా - ఆశ్వినశుక్లద్వితీయా - నవమీదశమీస్తృతీయేత్యర్థః॥

మూ॥ పౌషేశ-౧౧- స్త్వసితాద్య-౨- గంకే-౯-మునయో-౭-స్త్వే

కృష్ణఖేటాద్రిదృఙ్మాఖేరాబ్ధి-౧౧-బ్ధి-౮-దృ-౨-గద్రయ-౭-
స్త్వసితజాబాహ్వ-౨-ంక-౯-పృథ్వీధరాః-౭। ఊర్జేద్వ్య-
౨-ంక-౯-రవి ౧౨-శ్వరా-౧౧-అసితజాదృ-౨-గ్విశ్వ-౧౩-
సూర్యో-౧౨-నభస్యేగ్నిః-౩ - కృష్ణదృగద్రివిశ్వనవమీచైత్రం
యమోఽన్యశ్శ్రవాః॥ ౨॥

టీక॥ పౌషేశః=పుష్యశుక్లైకాదశి, అసితాదృగంకమునయః = కృష్ణపక్షమునందలి ద్వితీయానవమీసప్తములును, అంత్యే=ఫాల్గునమాసమునందలి, కృష్ణఖేటాద్రిదృక్=కృష్ణపక్షపు నవమి సప్తమి ద్వితీయ అనునట్టితిథులును, మాఖే = మాఘశుక్లపక్షమందలి, అర్కాబ్ధిదృగద్రయః= ద్వాదశి, చవితి, ద్వితీయ, అనునట్టి తిథులును, అసితజాః = మాఘకృష్ణపక్షమునందలి, బాహ్వంకపృథ్వీధరాః=ద్వితీయ, నవమి, సప్తమి, అనునట్టితిథులును, ఊర్జే=కార్తికశుక్లపక్షమునందలి, ద్వ్యంకరవీశ్వరాః=ద్వితీయ, నవమి, ద్వాదశి, ఏకాదశి, అనునట్టితిథులును, అసితజాః=కృష్ణపక్షమునందలి, దృగ్విశ్వసూర్యాః=ద్వితీయ, త్రయోదశి, ద్వాదశి, అనునట్టితిథులును, నభస్యే=భాద్రపదశుక్లపక్షమునందు, అగ్నిః=తృతీయయును, కృష్ణదృగద్రివిశ్వనవమీచైత్రమ్=కృష్ణపక్షమునందలి ద్వితీయసప్తమి త్రయోదశినవమి మఘానక్షత్రము అనునవియును, యమః = భాద్రపదకృష్ణపక్షమునందలి, యమః=భరణియును, అన్యః = శుక్లపక్షమునందలి, శ్రవాః= శ్రవణనక్షత్రమును, (అనునవి) అనధ్యాయాః=అనధ్యాయములని, నిగదితాః=చెప్పఁబడినవి.

తా॥ పుష్యమాసమునందలి శుక్లైకాదశి కృష్ణపక్ష ద్వితీయానవమీసప్తములును, ఫాల్గునమాసమునందలి కృష్ణపక్షనవమీ సప్తమీద్వితీయలును, మాఘమాసమునందు శుక్లపక్ష ద్వాదశీ చతుర్థీ ద్వితీయాసప్తములును, మాఘమాసమునందు కృష్ణపక్ష ద్వితీయా నవమీ సప్తములును, కార్తికమాసమునందు ద్వితీయానవమీ ద్వాదశ్యేకాదసులును, కార్తికమాసమునందు కృష్ణపక్ష ద్వితీయా త్రయోదశీ ద్వాదసులును, భాద్రపదమాసమునందు శుక్లపక్షతృతీయయును, కృష్ణపక్షమునందలి ద్వితీయాసప్తమీ త్రయోదశీనవములును, భాద్రపదమాసమునందలి మఘాభరణులును భాద్రపదమాసమునందు శుక్లపక్షమునందలి శ్రవణ నక్షత్రమును, అనునవి అనధ్యాయములని చెప్పఁబడును.

వ్యా॥ పౌషేతి॥ పౌషేశః - పౌషస్యఈశః - ఏకాదశీ-శుక్లాతు-



పునఃఅసితా-కృష్ణా-దృగంకమునయః- ద్వితీయానవమీసప్తమ్యః - అంత్యే ఫాల్గునేకృష్ణఖేటాద్రిదృక్ - ఖేటోనవమీ - అద్రిస్సప్తమీ - దృగ్ద్వితీయా-ఏషాంసమాహారః ఖేటాద్రిదృక్ - కృష్ణంచతత్- ఖేటాద్రిదృక్చ - తథా కృష్ణనవమీసప్తమీద్వితీయా ఇత్యర్థః-మాఘేరాబ్ధిదృగద్రయః - అర్కో-ద్వాదశీ - అబ్ధిశ్చతుర్థీ-దృగ్ద్వితీయా-అద్రిస్సప్తమీ - ఏతేశుక్లాఃతు పునః-అసితజా - బాహ్వంకపృథ్వీధరాః-అసితజాః-కృష్ణపక్షజాః - బాహ్వంకపృథ్వీధరాః - బాహుర్ద్వితీయా - అంకోనవమీ - పృథ్వీధరః - ఊర్జే - కార్తికేద్వ్యంకరవీశ్వరాః - ద్వి - ద్వితీయా-అంకః-నవమీ- రవిర్ద్వాదశీ-ఈశ్వరఏకాదశీ-ఏతేశుక్లాః-తు-పునః-అసితజాః - కృష్ణపక్షజాః - దృగ్విశ్వసూర్యాః- దృగ్ద్వితీయా-విశ్వే-త్రయోదశీ - సూర్యోద్వాదశీ-నభస్యే-భాద్రపదే - అగ్నిస్తృతీయా - శుక్లాకృష్ణాదృగద్రివిశ్వ నవమీచైత్రం - దృగ్ద్వితీయా-అద్రిస్సప్తమీ-విశ్వే - త్రయోదశీనవమీ-చైత్రం - మఘా యమోభరణీ - అన్యశ్శుక్లః-శ్రవాః-శ్రవణః-భాద్రపదశుక్లశ్రవణఇత్యర్థః॥

——(*) అనధ్యాయనిర్ణయమాహ. (*)——

మూ॥ యోఽనధ్యాయతిథిస్సపూర్వదివసేఽస్తాత్ప్రాఙ్ముహూ-
ర్తోన్మితోఽన్యస్మిన్నోదయతః క్షణత్రయగతోబ్రహ్మాప
నైవాభ్యసేత్ । పర్వాగాదియుగష్టమీతిచతిథీః స్త్యక్త్వే-
షుశాస్త్రస్మృతివేదాంగాని సమభ్యసేచ్చాఖిలేషూక్తం
పఠేన్నైత్యకమ్॥ ౩॥

టీక॥ అనధ్యాయః=అధ్యాయయోగ్యముకాని, తిథిః=తిథి, యః= ఏది, అస్తి=కలదో, సః=అటువంటితిథి, పూర్వదివసే = పూర్వదినమునందు, అస్తాత్=అస్తమయముకంటె, ప్రాక్ = పూర్వమునందు, ముహూర్తోన్మితః=ముహూర్తమాత్రపరిమితికలదీ, స్యాత్ =అయ్యేనేని, బ్రహ్మ= వేదమును, నైవాభ్యసేత్=అభ్యసింపఁగూడదు. అన్యస్మిన్ = పరదినమందు, ఉదయతః=సూర్యోదయానంతరమందు, అనధ్యాయః = అధ్యయనయోగ్యముకానితిథి, క్షణత్రయగతః=మూఁడుక్షణములవఱకును వ్యాపించియున్నది. స్యాచ్చేత్=అయ్యేనేని, బ్రహ్మ=వేదమును, నైవాభ్యసేత్ = అభ్యసింపఁగూడదు. పర్వాగాదియుగష్టమీతిచతిథీః=చతుర్దశిపూర్ణిమప్రతిపత్తుచతుర్దశి అమావాస్యప్రతిపత్తు అనునట్టితిథులను, త్యక్త్వా=విడిచి, ఏషు=ఇప్పుడుచెప్పఁబడిన యితరానధ్యాయములయందు, శాస్త్రస్మృతి=శాస్త్రస్మృతులను, వేదాంగాని = వేదాంగములను, సమభ్యసే

త్ = అభ్యసింపవలయును. నిఖిలేషు = సమస్తమైన యనధ్యాయములయందును, ఉక్తమ్ = చెప్పఁబడిన వేదాదికమును, పఠేత్ = పఠింపవలయును. నైత్యకమ్ = సంధ్యాహోమజపాదికమును, పఠేత్ = పఠింపవలయును.

తా॥ అనధ్యాయనిర్ణయమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన:— ఇదివఱకుఁ జెప్పఁబడిన యనధ్యయనతిథులలో నేదియైనను పూర్వదినమునందు అస్తమయము కాకమునుపు ముహూర్తకాలము వ్యాపించియుండినను పరదినమందు అనధ్యయనతిథి రెండుక్షణములవఱకును వ్యాపించియున్నను ఆతిథులనుగూడ అనధ్యయనములనుగా గ్రహింపవలయును. మఱియును, ఇదివఱకు చెప్పఁబడిన చతుర్దశి పూర్ణిమ ప్రతిపత్తు చతుర్దశి అమావాస్య ప్రతిపత్తు అనునట్టియనధ్యయనములుదప్పఁ దక్కినయనధ్యాయములయందు శాస్త్రస్మృతులను అనఁగా వేదాంగములను అభ్యసింపవలయును. మఱియును, సకలానధ్యాయములయందును చెప్పఁబడిన వేదాదికమును పఠింపవలయును. మఱియును, నిత్యములగు సంధ్యాహోమబ్రహ్మయజ్ఞాదికమును పఠింపవలయును. మఱియును, అమావాస్యయందు భుజించుచు ప్రణవవ్యాహృతులతోఁ గూడుకొనిన గాయత్రిని ఒక్కపర్యాయమైనను మూఁడుపర్యాయములైనను పఠింపవలయును. మఱియును, రాక్షసులను సంహరించునవియును, పితృదేవతాకములును, పవిత్రములైన యితరఋక్కులును నిత్యములగు సంధ్యాహోమబ్రహ్మయజ్ఞాదికమును సర్వకాలములయందును పఠింపవలయును. మఱియును, "శ్లో॥ వేదోపాకరణేచైవ స్వాధ్యాయే చైవనైత్యకే । ననిరోధస్త్వనధ్యాయే హోమమంత్రజపేషుచ॥" (= వచ్చిన వేదములకును వేదాంగములకును, నిత్యమంత్రములకును, హోమమంత్ర జపములకును అనధ్యయనదోషములేదు.) అని మనువుచెప్పెనని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ నిత్యేజపేచనాంగేచ క్రతౌపారాయణేపిచ । నానధ్యాయోస్తివేదానాం గ్రహణేగ్రహణేస్మృతః । దేవతార్చనమంత్రాణాంనానధ్యాయస్స్మృతస్సదా॥ నానధ్యాయేజపేద్వేదాన్రుద్రాంశ్చవిశేషతః । పౌరుషంపావమానంచ గృహీతనియమాద్వ్రతే॥" (= నిత్యజపమునందును, వేదాంగములయందును, క్రతువునందును, పారాయణమందును, అనధ్యయనదోషములేదని యెఱుఁగవలయును. మఱియును, వేదములను గ్రహించుటయందు అనధ్యయనదోషములేదు. మఱియును, దేవతార్చనమంత్రములకు అనధ్యయనదోషములేదు. అనధ్యాయ తిథుల



యందు వేదములను రుద్రములను పఠింపఁగూడదు. నియమములేక పావమానబుగాదులను పఠింపఁగూడదు.) అని స్మృతిరత్నావళియందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ చతుర్దశ్యష్టమీపర్వప్రతిపద్వర్జితేషుచ॥ వేదాంగన్యాయమీమాంసా ధర్మశాస్త్రాణిచాభ్యసేత్ ॥" (= చతుర్దశి, అష్టమి, పర్వము, ప్రతిపత్తు, తప్ప తక్కినతిథులయందు వేదాంగములు న్యాయశాస్త్రము మీమాంసము ధర్మశాస్త్రములు అనువానిని పఠించుటవలన దోషములేదు.) అనిస్మృత్యర్థసారమందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ ఇందౌవృద్ధింక్షయంప్రాప్తే బ్రహ్మయజ్ఞంనకారయేత్ । నజపేద్వైదికంమంత్రం గాయత్ర్యాష్టోత్తరంశతమ్॥" (= చంద్రుఁడు వృద్ధిక్షయములను పొందుచుండఁగా బ్రహ్మయజ్ఞమును జేయఁగూడదు. మఱియును, వైదికమంత్రములను జపింపఁగూడదు. గాయత్రీ మంత్రమును నూటయెనిమిది పర్యాయములు జపింపఁగూడదు.) అని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ అల్పంజపేదనధ్యాయే పర్వణ్యల్పతరంజపేత్॥" అనధ్యాయమునందు అల్పముగను పర్వమునందు మిగుల నల్పముగను జపింపవలయును.) అనిస్మృతిరత్నావళియందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ అథైషాంనిర్ణయంవృత్తేనైకేనాహ ॥ యఃకశ్చిదనధ్యాయస్తిథిః-సపూర్వదివసే అస్తాత్ప్రాక్ముహూర్తోన్మితఃస్యాత్ - అత్రపూర్వదివసేబ్రహ్మవేదంనోపఠేత్ - వా ఇత్యథవా - అన్యస్మిన్దివసేపరదివసేక్షణత్రయగతోభవతి- అత్రాస్మిన్దివసేబ్రహ్మనోసంపఠేత్ - పర్వాగ్రాదియుగ్మస్థవిధా - పూర్వవత్పదవిభాగః - ఇతిచతుస్తిథీస్త్యక్త్వా ఏషు అనంతరోక్తేషు అనధ్యాయేషు శాస్త్రస్మృతివేదాంగాని - సమభ్యసేత్ - సుగమం-నిఖిలేషుసర్వేష్వనధ్యాయేషు ఉక్తంపఠేత్ - నైత్యకంచ పఠేత్ - ఉక్తమితి॥ యథా-అమావాస్యాయాం - అశ్నంస్తుజపేత్-వ్యాహృతిపూర్వికాంగాయత్రింసప్రణవాం సకృత్త్రిర్వారక్షోఘ్నాః-మిత్రమంత్రాన్-పురుషసూక్తమప్రతిరథమన్యానిచ పవిత్రాణీతి-నైత్యకంసంధ్యాహోమబ్రహ్మయజ్ఞాది॥ తథాచమనుః ॥ వేదోపాకరణేచైవ స్వాధ్యాయేచైవనైత్యకే । ననిరోధస్త్వనధ్యాయే హోమమంత్రజపేషుచేతి వేదోపాకరణాని - అంగాని ॥ స్మృతిరత్నావల్యాం॥ నిత్యేజపేచనాంగేచక్రతౌపారాయణేపిచ । నానధ్యాయోస్తివేదానాం గ్రహణేగ్రహణేస్మృతః । దేవతార్చనమంత్రాణాం నానధ్యాయస్స్మృతస్సదా। నాన

ధ్యాయేజపేద్వేదాన్ రుద్రాంశ్చైవ విశేషః । పౌరుషం పావమానంచ గృహీతనియమాద్వృత ఇతి॥ స్మృత్యర్థసారే ॥ చతుర్దశ్యష్టమీపర్వ ప్రతిపద్వర్జితేషుచ । వేదాంగన్యాయమీమాంసా ధర్మశాస్త్రాణి చాభ్యసేత్-ఇతి॥ కూర్మపురాణే ॥ ఇందౌవృద్ధింతుయంప్రాప్తే బ్రహ్మయజ్ఞం నకారయేత్ । నజపేద్వైదికంమంత్రం గాయత్ర్యాష్టోత్తరంశతమితి ॥ స్మృతిరత్నావల్యాం॥ అల్పంజపేదనధ్యాయే పర్వణ్యల్పతరంజపేదితి ॥

※ అథ నైమిత్తికానధ్యాయాన్వృత్తద్వయేనాహ. ※

మూ॥ బభ్రోత్వేణ ఖరాగ్న్యజాంబ్వహిగజాశ్వోష్ట్రాంత్యమూ
కోన్మత్తోఽనోయానాంతరితేత్ర్యహం ప్లవఖగాద్యై
ర్నాచసజ్యోతిషం । స్త్రీగోస్వంతరితేహరుత్సవనిశీథా
శౌచమార్గేషుచ ఛాయాయాంనకపిత్థశాల్మలి మధుశ్లే
ష్మాతకాదేఃపఠేత్॥ ౪॥

టీక॥ బభ్రోత్వేణ..తరితేసతి—బభ్రు=నకులము, ఓతుః=మార్జారము, ఏణః=జింక, ఖర=గాడిదె, అగ్ని=అగ్నిహోత్రము, అజ=మేషము, అంబు=ఉదకము, అహి=సర్పము, గజ=ఏనుఁగు, అశ్వ=గుఱ్ఱము, ఉష్ట్ర=ఒంటె, అంత్య=చండాలుఁడు, మూక=మూగవాఁడు, ఉన్మత్త=పిచ్చివాఁడు, అనః=బండి, యాన=శిబికాదికము, (అనునవి) అంతరితే=(గురుశిష్యులకు మధ్యమందువచ్చినవగుచుండఁగా, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్-చదువఁగూడదు. స్యాత్=అగును, ప్లవఖగాద్యైః=కప్ప, పక్షి, ఉడుము మొదలగుజంతువులచేత, సజ్యోతిషమ్=పగలయినయెడల సూర్యాస్తమయమువఱకును రాత్రియైనయెడల సూర్యోదయమువఱకును, నపఠేత్-చదువఁగూడదు, స్త్రీగోస్త్వంతరితేసతి=స్త్రీ, గోవు, ప్రాణ్యంగము, (అనునవి గురుశిష్యులకు) మధ్యమందు వచ్చినవగుచునుండఁగా, అహః=ఒకదినము, నపఠేత్=చదువఁగూడదు, నిశీథాశౌచమార్గేషుచ=అర్ధరాత్రమునందును, ఆశౌచమందును, మార్గమందును, నపఠేత్=పఠింపఁగూడదు, కపిత్థశాల్మలిమధుశ్లేష్మాతకాదేః = వెలగచెట్టుయొక్కయును, బూరుగుచెట్టుయొక్కయును, ఇప్పచెట్టుయొక్కయును, విరిగిచెట్టుయొక్కయును, ఛాయాయామ్=నీడయందు, నపఠేత్-పఠింపఁగూడదు.

తా॥ నైమిత్తికాధ్యాయములను ఈశ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచేతఁ జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—నకులము, మార్జారము, జింక, గాడిదె, అగ్ని, మేక, ఉదకము, సర్పము, ఏనుఁగు, అశ్వము,



ఒంటె, అంత్యజాతి, మూకవాఁడు, పిచ్చివాఁడు, బండి, శిబికాదికము అనునవి గురుశిష్యులకు మధ్యమందు వచ్చినవగుచునుండఁగా మూఁడుదినములాశౌచముకనుక పఠింపఁగూడదు. మఱియును, కప్ప, పక్షి, ఉడుము, మొదలగునవి గురుశిష్యులకు మధ్యమందువచ్చెనేని పగలయినయెడల పగలంతయును, రాత్రియైనయెడల రాత్రియంతయును, పఠింపఁగూడదని తెలియవలయును. మఱియును, స్త్రీలు, గోవులు, ప్రాణ్యంగములు, అనునవి గురుశిష్యులకు మధ్యమందు వచ్చినవగుచునుండఁగా ఒక్కదినము పఠింపఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, వివాహాద్యుత్సవములయందును, అర్ధరాత్రమునందును మార్గమునందును, పఠింపఁగూడదు. మఱియును, వెలగచెట్టుయొక్కయును, బూరుగుచెట్టుయొక్కయును, ఇప్పచెట్టుయొక్కయును, విరిగిచెట్టుయొక్కయును, నీడయందు పఠింపఁగూడదని యెఱుఁగవలయును.

వ్యా॥ బభ్రురితి॥ బభ్రుర్నకులః-ఓతుర్మార్జారః- ఏణోహరిణః-ఖరః-ప్ర-అగ్నిః-ప్ర-అజోమేషః - అంబు-ఉదకం-అహిస్సర్పః - గజః-ప్ర-అశ్వః-ప్ర-ఉష్ట్రః అంత్యః-అంత్యజజాతిః - రజకచర్మకారాదయః - మూకః-ప్ర-ఉన్మత్తోమత్తః - అనశ్శకటః - యానంశిబికాది - ఏభిరంతరితేగురౌసతి - త్ర్యహం-త్రిరాత్రమనధ్యాయః - ప్లవోమండూకః-ఖగః-పక్షీ-ఆదిశబ్దాత్ గోధాది - ఏభిరంతరితే-సజ్యోతిషఅనధ్యాయః - అయమర్థః-ఏభిరంతరితేసతి - సూర్యాస్తమయపర్యంతం అనధ్యాయఇత్యర్థః - స్త్రీగోస్వంతరితే-అహః-స్త్రీ-ప్రసిద్ధా-గౌః- ప్ర-అస్థిప్రాణ్యంగం - ఏభిరంతరితే-అహః-దినంఅహోరాత్రం - అనధ్యాయః - ఉత్సవో మహోత్సవోవివాహాదికః-నిశీథంమధ్యరాత్రం - ఆశౌచంసూతకం- మార్గేచ ఉధ్వాపిచనపఠేత్-చ-పరం - కపిత్థశాల్మలి మధుశ్లేష్మాతకాదేశ్ఛాయాయాంనపఠేత్ - సుగమం-ఆదిశబ్దాత్ - కోవిదారవిభీతకైరండాదీనాంగ్రహణం॥

మూ॥ గ్రామాంతఃకుణపేశ్వశూద్ర. నికటేశ్రాద్ధాశనేవర్త్రిగే
తాంబూలేగ్రహణాద్గురుక్షితి పతిప్రాంతా దుపోత్సర్గ
తః । ఘూకంపాశ నిపాతతఃపురదహే ఉరిష్టావలోకా
త్ర్యహంగర్జేవార్తవకేత్ర్యహం సమయజేసజ్యోతిరం
తేసతిః॥ ౫॥

టీక॥ గ్రామాంతఃకుణపేసతి = గ్రామమధ్యమందుశవమున్నదగుచుండఁగా, నపఠేత్=పఠింపఁగూడదు. శ్వశూద్రనికటే=కుక్కలయొక్క

యును శూద్రులయొక్కయును సన్నిధియందు, నపఠేత్=పఠింపఁగూడదు. శ్రాద్ధాశనే=శ్రాద్ధభోజనము, (కృతేసతి=చేయఁబడినదగుచునుండఁగా,) నపఠేత్=పఠింపఁగూడదు. తాంబూలే=తాంబూలము, వక్త్రగే సతి=నోటనిపొందియుండఁగా, నపఠేత్ = పఠింపఁగూడదు. గ్రహణాత్=గ్రహణదినము మొదలుకొని, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. గురుక్షితిపతిప్రాంతాత్=గురువుయొక్కయును, రాజుయొక్కయును, మరణమువలన, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. ఉపోత్సర్గతః=ఉపాకర్మము చేసినదినము మొదలుకొనియును, వేదోత్సర్గము మొదలుకొనియును, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు, భూకంపాశనిపాతతః=భూకంపముకలిగినదినము మొదలుకొనియును, పిడుగుపడినదినము మొదలుకొనియును, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. పురదహేసతి=నివసించియున్నగ్రామము దహనమైనదగుచునుండఁగా, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. అరిష్టావలోకాత్=గంధర్వనగరభూతాదిదర్శనము మొదలుకొని, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. అనార్తవకే=అకాలమందలి, గర్జేసతి=ఉరుముకలుగుచునుండఁగా, త్ర్యహమ్=మూఁడుదినములు, నపఠేత్=పఠింపఁగూడదు. సమయజేసతి=సకాలగర్జనము కలుగుచునుండఁగా, సజ్యోతిః=రాత్రియైనయెడల సూర్యోదయమగువఱకును, పగలయినయెడల సూర్యాస్తమానమువఱకును, నపఠేత్=పఠింపఁగూడదు. సతః = స్వశాఖిసత్పురుషునియొక్క, అంతేసతి=నాశముకలుగుచునుండఁగా, సజ్యోతిః=రాత్రియైనయెడల సూర్యోదయమగువఱకును, పగలయినయెడల సూర్యాస్తమానమువఱకును, నపఠేత్=పఠింపఁగూడదు.

తా॥ గ్రామమధ్యమందు శవమున్నదగుచుండఁగను, కుక్కలయొక్కయును, శూద్రులయొక్కయును సన్నిధియందును, శ్రాద్ధాన్నము భుజించియున్నదినమునందును, తాంబూలము నోటియందున్నకాలమునందును, వేదమును పఠింపఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, గ్రహణదినము మొదలుకొనియును, గురువుయొక్కయును రాజుయొక్కయును మరణకాలము మొదలుకొనియును, ఉపాకర్మదినము మొదలుకొనియును, వేదోత్సర్గదినము మొదలుకొనియును, భూకంపము కలిగిన దినము మొదలుకొనియును, పిడుగు పడినదినము మొదలుకొనియును, నివసించియున్న



గ్రామము కాలిన దినము మొదలుకొనియును, గంధర్వ నగర భూతాది దర్శనము అయిన దినము మొదలుకొనియును, మూఁడుదినములు వేదమును పఠింపఁగూడదు. మఱియును, అకాలమందు మేఘగర్జనము కలిగెనేని మూఁడుదినములు వేదమును పఠింపఁగూడదు. సకాలమందలి గర్జనము కలిగెనేని పగలయినయెడల పగలంతయును, రాత్రియయ్యేనేని రాత్రియంతయును, వేదమును పఠింపఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, స్వశాఖి సత్పురుషుఁడు మరణమును పొందెనేని పగలయిన యెడల పగలంతయును, రాత్రియయ్యేనేని రాత్రియంతయును, వేదమును పఠింపఁగూడదని యెఱుఁగవలయును.

వ్యా॥ గ్రామేతి॥ గ్రామాంతఃకుణపే - గ్రామమధ్యే ప్రేతే సతి న పఠేత్ - శ్వశూద్రసనికటే - శ్వాపశూద్రసన్నిధౌ న పఠేత్ - శ్రాద్ధాశనే - శ్రాద్ధభోజనే కృతే సతి - జీర్ణావధి న పఠేత్ - వక్త్రగే - ముఖగతే తాంబూలే సతి న పఠేత్ - గ్రహణాత్సకాశాత్త్ర్యహం న పఠేత్ - తథా గురుక్షితిపతిప్రాంతాన్మరణాత్త్ర్యహం - ఉపోత్సర్గతస్త్ర్యహం - ఉప-ఉపాకర్మ - ఉత్సర్గశ్ఛందసాముత్సర్గః - తథా - ఉపోత్సర్గతః సకాశాత్త్ర్యహం - భూకంపాశనిపాతతస్త్ర్యహం భూకంపః - ప్ర- అశనిపాతో విద్యుత్పాతః - తాభ్యాం త్ర్యహం - పురదహే - పురదాహాత్ - స్వవసతిగ్రామదాహాదిత్యర్థః - త్ర్యహం - అరిష్టావలోకాత్ - గంధర్వ నగరభూతాదిదర్శనాత్ - త్ర్యహం న పఠేత్ - గర్జే చార్తవకే త్ర్యహం - ఋతౌ భవః - ఆర్తవః - న ఆర్తవః - అనార్తవః - అనార్తవ ఏవ అనార్తవకః తస్మిన్ అకాలగర్జనే జాతే సతి త్ర్యహం న పఠేత్ - సమయజే ఋతుజే గర్జే - సతి సజ్యోతిర్యథా స్యాత్తథా న పఠేత్ - దివా గర్జే సతి - సూర్యాస్తపర్యంతం - రాత్రౌ గర్జే సతి సూర్యోదయపర్యంతం న పఠేదిత్యర్థః - సతః - అంతే స్వశాఖసత్పురుషస్య మృతౌ జాతే సతి సజ్యోతిర్న పఠేత్॥

——(*) అనధ్యాయాంతరమాహ. (*)——

ము॥ వాద్యోలూకఖరార్తజంబుకరవే సామ్నాంచవా తేజలే నీ
హారే పతితాభిశస్తనికటే ధావజ్జనాలోకనే । గ్రామాం
తే పితృకాననే పథిసతానూనస్త్రిణే తేదివం తద్వత్సర్వ్రి
తిని త్ర్యహం న చ పఠేద్భుక్త్వార్ద్రపాణిర్నచ॥ ౬॥

టీక॥ వాద్యోలూకఖరార్తజంబుకరవే = వాద్యములయొక్కయును, గుడ్లగూబలయొక్కయును, గాడిదెలయొక్కయును, ఋతుకాలము

నందలియురుములయొక్కయును, నక్కలయొక్కయును ధ్వని, (శ్రూయమాణేసతి=వినఁబడుచుండఁగను,) సామ్నాంచ = సామములయొక్క, రవే-ధ్వని, శ్రూయమాణేసతి-వినఁబడినదగుచునుండఁగను,) జలే-ఉదకమందును, నీహారే-ధూమరూపమైన యుత్పాతమందును, పతితాభిశస్తనికటే = కులభ్రష్టులయొక్కయును, మిథ్యాభిశస్తులయొక్కయును, సమీపమందును, ధావజ్జనాలోకనే-పరుగెత్తుచున్న మనుష్యులయొక్కయాలోకమందును, గ్రామాంతే=గ్రామముయొక్క పొలిమేరయందును, పితృకాననే=శ్మశానమందును, నపఠేత్ = వేదమును చదువఁగూడదు. అథ=పిమ్మట, సతానూనప్త్రిణి=ఋత్విక్కు, దివం=స్వర్గమును, ఇతే సతి=పొందినవాఁడగుచుండఁగను, తద్వత్ = అవిధముగానే, సద్వ్రతిని-వేదవ్రతాచరణముకలవాఁడు, (మృతేసతి=మరణమును పొందినవాఁడగుచునుండఁగను,) త్ర్యహం=మూఁడుదినములు, నపఠేత్-చదువఁగూడదు. భుక్త్వా=భుజించి, ఆర్ద్రపాణిస్సన్-కడిగినచేయి తడికలదైయున్నవాఁడగుచును, నచపఠేత్-చదువఁగూడదు.

తా॥ ఈ శ్లోకముచేత ఇతరములయిన యనధ్యాయములను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—వాద్యములయొక్కయును, గుజ్జగుఁబలయొక్కయును గాడిదెలయొక్కయును, ఋతుకాలమునందలి యురుములయొక్కయును, నక్కలయొక్కయును, ధ్వనివినఁబడుచుండఁగను, సామములయొక్క ధ్వనివినఁబడుచుండఁగను, జలమధ్యమందును, ధూమరూపమైన యుత్పాతమునందును, కులభ్రష్టులయొక్కయును, మిథ్యాభిశస్తులయొక్కయును, సన్నిధియందును, పరుగెత్తుచున్న జనులయొక్కయాలోకమందును, గ్రామముయొక్క పొలిమేరయందును, శ్మశానమందును, వేదమును పఠింపఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, ఋత్విక్కు మరణమును పొందినపుడును, వేదవ్రతాచరణమును చేయువాఁడు మరణమును పొందినపుడును మూఁడుదినములు వేదమును పఠింపఁగూడదు. మఱియును, భోజనము చేసినపిమ్మటఁ గడిగినచేతియొక్క తడియాఱకమునుపు వేదమును పఠింపఁగూడదని తాత్పర్యము.

వ్యా॥ వాద్యమితి ॥ వాద్యాదీనాంరవేశబ్దే శ్రూయమాణే - సామ్నాంచరవేశ్రూయమాణే- వాతే - వాతస్యసర్వదావిద్యమానత్వాదతివాతే- జలే- జలమధ్యే- నీహారే ధూమరూపోత్పాతే- పతితోజాతిభ్రష్టః - అభిశస్తోమిథ్యాభిశాపీతత్సమీపే - ధావజ్జనాలోకనే - ధావన్మను



ష్యాలోకనేగ్రామాంతే- గ్రామసీమాసమీపే- పితృకాననే- శ్మశానే- నపఠేత్- సతానూనప్త్రిణీతే- దివంస్వర్గంఇతేగతే మృతేసతిత్ర్యహంనపఠేత్- తానూనప్త్రంనామఘృతం- యాగేయేనయేనఋత్విజాసహ స్పృష్టస్స సతానూనప్త్రింతస్మిన్ మృతేసతిత్ర్యహంనపఠేత్- తద్వత్ సద్వ్రతినిమృతేసతి- సద్వ్రతంవేదవ్రతం- చరితంయేనససద్వ్రతీ- తస్మిన్మృతే- త్ర్యహంనపఠేత్ - భుక్త్వాయావదార్ద్రపాణిస్తావన్నపఠేత్- అన్యేనధ్యాయామాలగ్రంథతోవగంతవ్యాః॥

——(*) అథప్రదోషానధ్యాయానాహ. (*)——

మూ॥ రాత్ర్యర్థే మదనోమునిర్దశయుతే యామేచతుర్థ్యాద్యకే
ప్రాగ్రాత్రౌపఠనంత్వుపాకరణతో మాసంనిశాప్రాగ్దళే । శ్వోఽనధ్యాయఇతీహరాత్రిపఠనం వర్జ్యంసదాసంధ్యయో శ్చోరోపద్రవయామకైస్త్రిదివసం దుర్భుక్ప్రతిగ్రాహయోః॥ ౭॥

టీక॥ (యస్మిన్దినే=ఏదినమందు, మదనః-త్రయోదశి, రాత్ర్యర్థే=రాత్రియొక్కసగమునందు, (స్యాత్=అగునో.) మునిః=సప్తమి, (యస్మిన్దినే=ఏదినమందు, రాత్రేః=రాత్రియొక్క, దశయుతే=అర్ధయామముతోఁగూడిన, యామే=యామమునందు, (స్యాత్ = అగునో.) చతుర్థీ=చవితి, (రాత్రేః=రాత్రియొక్క.) ఆద్యకే=మొదటియామమునందు, (స్యాత్ = అగునో.) తస్మిన్దినే=ఆదినమందు, ప్రాగ్రాత్రౌ = పూర్వరాత్రియందు, పఠనమ్=వేదపాఠము, (వర్జ్యమ్=విడువఁదగినది.) ఉపాకరణతః=ఉపాకర్మమయినదినముమొదలుకొని, మాసమ్ = ముప్పదిదినములు, నిశః=రాత్రియొక్క, ప్రాగ్దళే=మొదటియర్థభాగమందు, (అనఁగా పూర్వార్థరాత్రమందు.) పఠనమ్=వేదపాఠము, వర్జ్యమ్ = విడువఁదగినది, శ్వః=రేపు, అనధ్యాయఇతీహ = అనధ్యాయదినమైయున్నదినమునందు, (అనఁగా అనధ్యాయదినమునకుపూర్వదినమున) రాత్రిపఠనమ్=రాత్రులయందు వేదపఠనము, వర్జ్యమ్=విడువఁదగినది, సంధ్యయోః=సంధ్యాకాలములయందు, సర్వదా=ఎల్లప్పుడును, పఠనమ్=వేదపఠనము, వర్జ్యమ్=విడువఁదగినది, చోరోపద్రవయామకైః = దొంగలయుపద్రవముకలజామునందు, పఠనమ్=వేదపఠనము, వర్జ్యమ్=విడువఁదగినది, దుర్భుక్ప్రతిగ్రాహయోః=దుష్టాన్నభోజనమందును, దుష్ప్రతిగ్రహమునందును, త్రిదివసమ్=మూఁడుదినములు, పఠనమ్=వేదపాఠము, వర్జ్యమ్=విడువఁదగినది.

తా॥ ఈశ్లోకముచేత ప్రదోషానధ్యాయములను జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—త్రయోదశి అర్ధరాత్రమునఁగలిగిన దినమందును సప్తమి రాత్రికాలమున సార్ధయామమువఱకును వ్యాపించినదినమందును, చతుర్థి మొదటియామమువఱకును వ్యాపించినదినమునందును పూర్వరాత్రియందు వేదాధ్యయనమును జేయఁగూడదు. ఉపాకర్మమైన దినము మొదలుకొని నెలదినములవఱకు పూర్వరాత్రియందు వేదాధ్యయనమును జేయఁగూడదు. రేపుఅనధ్యాయదినమైయుండఁగా ఈదినమునరాత్రియందు వేదాధ్యయనమును జేయఁగూడదు. ఎల్లపుడును సంధ్యాకాలములయందు వేదాధ్యయనమును జేయఁగూడదు. భూరోపద్రవము కలుగఁదగినయామములయందు వేదాధ్యయనమును జేయఁగూడదు. మఱియును, దుష్టాన్నమును భుజించినదినము మొదలుకొనియును, దుష్ప్రతిగ్రహమును చేసినదినము మొదలుకొనియును మూఁడుదినములు వేదాధ్యయనమును జేయఁగూడదు. అని తాత్పర్యము. మఱియును, "శ్లో॥ అష్టమ్యాశ్చచతుర్దశ్యోః పంచదశ్యోశ్చ పూర్వకే। కాలేప్రతిపదోర్వ్యాత్రభయేచైవమహోత్సవే। రాగేయుద్ధవివాదేచ ద్యూతేపధినిశీథకే। నాధీయీతాశుచిశ్చాపి నస్నాతశ్చనతంద్రితః। ఉపాకర్మణిచోత్సర్గే గ్రహణేచంద్రసూర్యయోః। త్రిరాత్రంస్యాదనధ్యాయో మృతేభూమిపగురావపి। ఫాల్గున్యాంపౌర్ణమాస్యాంతు చైత్ర్యాంతుత్ర్యహమిష్యతే। అనధ్యాయస్తథాషాఢ్యాం శ్రావణ్యాంకార్తికేతథా। తద్వైవమార్గశీర్షస్య పూర్ణిమాయాంనసంచరేత్॥ అశన్యాఃపతనేకంపె భూమేర్దాహేపురస్యచ। మృగస్యసర్పమార్జార నకులాద్యశ్వదంతినాం। అంతరాగమనేఽజోష్ట్రఖరాణాంచత్ర్యహంస్మృతం। పక్షికాకోరగాణాదర్శ రథయానజలాగ్నినాం। మూర్ఖోస్మత్రాదిశూద్రాణా మంతరాగమనేత్ర్యహం। నారీణామపిసర్వాసాం గవాంచైవాంతరాగమే॥ అహోరాత్రమనధ్యాయో గర్జనేరాత్రిసంభవే। ద్యుగర్జనేచరాత్రౌచా పరరాత్రేదివంస్మృతం। దినంతూభయసంధ్యాయా మథాప్యాచాంతరాగమే। పక్షిమండూకగోధాసు నరాణాంచాంతరాగమే। దినేదివసశేషస్య రాత్ర్యాంరాత్ర్యాశ్చతద్భవేత్। శ్వసృగాలశవేన్యాణాం శ్రోత్రియాగమనేధ్వని। తాత్కాలికోప్యనధ్యాయ స్తాంబూలస్యచభక్షణే। శ్రాద్ధనిమంత్రితోయస్తు భుక్త్వానాధ్యయనంచరేత్। కరిష్యంశ్చతథావిప్రః ప్రాగ్విప్రాణాంవిసర్జనాత్। ఏతేప్రోక్తామహానధ్యాయా వైదికాస్తాంత్రికాస్తతః। ప్రవత్స్యంతేష్టమీద్వంద్వే శ్చతుర్దశ్యాశ్చకేవలైః। విషువద్వితయేచైవ మయనాద్విశవేతథా। సపక్షత్వారమేద్ధీమా న్పురాణమపిసత్తమః। అష్టమ్యాంచచతుర్దశ్యాం యావచ్ఛస్త్రమితేరవౌ। దినశేషమనధ్యాయ వైదికంపరికీర్తితం। తథోదితేదివారాత్రం తత్కాలముదితేతయోః। ప్రతిపద్యపిసంక్రాంతౌ తత్కాలమఖిలాసుచ। నభోనభస్యయోఃకృష్ణే మాసయోస్త్రిదినంద్విజః। నసప్తమ్యామధీయీత త్రయోదశ్యాంచపైత్ర్యయోః। సదాత్రయోదశీయావత్త్ర్యాజ్ఞేశీఘ్రాత్రిధిగ్భవేత్॥ ప్రోక్తదహన్యాపరాహ్ణాంతా దధీయీతనచద్విజః। అష్టమ్యాంచచతుర్దశ్యాం ప్రతిపత్సువవర్జయేత్। ధర్మశాస్త్రపురాణైశ్చ శాస్త్రంతాత్కాలికంబుధః। విమిశ్రితాసుకర్తవ్యం సప్తమ్యాదిషుయత్నతః। పురాణాభ్యసనాదీని పంచదశ్యోశ్చవానవా। నాంతరాగమనేదోషః పురాణాదిషువిద్యతే। నశంస్యతేచతత్కాలే ఘృతంసంప్రోక్ష్యావాబుధః। నీయమానంశవందృష్ట్వా మహీస్థంవాద్విజోత్తమః। అకాలగర్జితాదౌచ పర్వస్యాశౌచకాదిషు। అనధ్యాయంబుధైఃకార్యా ఉపరాగాదికేషుచ। శ్వోనధ్యాయేచశర్వర్యాం నాధీయీతకదాచన॥"

(=శుక్లకృష్ణపక్షములయందలి యెనిమిదిపదునాలుగు పదునైదుసంఖ్యలుగలదినములయందును జాతాశౌచమృతాశౌచములయందును ప్రతిపత్తులయందును మహోత్సవమునందును, రాగమునందును, యుద్ధమునందును, వివాదమునందును, ద్యూతమునందును, మార్గమునందును, అర్ధరాత్రమునందును, అధ్యయనమును జేయఁగూడదు. అపరిశుద్ధుఁడును, స్నానమును చేయనివాఁడును, తంద్రతనుపొందినవాఁడును, వేదాధ్యయనమును జేయఁగూడదు. ఉపాకర్మమునందును, వేదోత్సర్గమునందును, చంద్రసూర్యుల గ్రహణములయందును, మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును. మఱియును, రాజమరణమునందును, గురుమరణమునందును, మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును. మఱియును, ఫాల్గునమాసమునందలి పౌర్ణమాస్యయందును, చైత్రమాసగత పౌర్ణమాస్యయందును మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును. మఱియును, ఇటులనే ఆషాఢ శ్రావణ కార్తిక మార్గశీర్ష మాసములయందలి పౌర్ణమాస్యలయందుఁగూడ వేదాధ్యయనమును జేయఁగూడదు. మఱియును, పిడుగుపడుటయందును, భూకంపమందును, తానునివసించిన పట్టణమును కాలినపుడును, వేదాధ్యయనమును జేయఁగూడదు. మఱియును, గురుశిష్యులమధ్యయందు మృగములు సర్పము మార్జాలము నేన్ను

లము గుఱ్ఱములు ఏనుఁగులు మేకలు, ఒంటెలు, గాడిదెలు అనునవిపోవునేని మూఁడుదినములు అధ్యయనము చేయఁగూడదు. పతాకములు, తోరణములు, అశ్వములు, రథములు, యానములు, ఉదకము, అగ్ని మూకవాఁడు, పిచ్చివాఁడు, శూద్రుఁడు, గురుశిష్యులకు నడుమునఁ బోయినేని మూఁడుదినములు అధ్యయనము జేయఁగూడదని యెఱుఁగవలయును. స్త్రీలును గోవులును గురుశిష్యులకు మధ్యభాగమునందుఁ బోయినేని యొక్కదినము అధ్యయనమును జేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, పగటియందు చదువుచుండఁగా మేఘగర్జనము కలిగెనేని పగలంతయును, రాత్రియందు మేఘగర్జనము కలిగెనేని రాత్రియంతయును అధ్యయనము చేయఁగూడదని యెఱుఁగవలయును. పక్షులు, మండూకములు, ఉడుములు, అనునవి గురుశిష్యులకు నడుమునఁ బోయెనేని పగలైనయెడల పగలంతయును, రాత్రియైనయెడల రాత్రియంతయును అధ్యయనమును జేయఁగూడదు. వేదాధ్యయనమును జేయుచుండఁగా పగటియందు కుక్కలయొక్కయును నక్కలయొక్కయును, ధ్వనివినఁబడినను, శ్రోత్రియుడు వచ్చినను అట్టికాలమునందు, అధ్యయనమును జేయఁగూడదు. తాంబూలమును భక్షించుచు అధ్యయనమును జేయఁగూడదు. శ్రాద్ధమందుని మంత్రితుఁడై శ్రాద్ధాన్నమును భుజించినదినమందు వేదాధ్యయనమును జేయఁగూడదు. మఱియును, శుక్లకృష్ణపక్షాష్టములయందును, చతుర్దశులయందును, మేషతులాసంక్రమణదినములయందును, దక్షిణోత్తరాయణదినములయందును, వేదాధ్యయనమును చేయఁగూడదనియును, పురాణమును గూడ జెప్పఁగూడదనియును, తెలియవలయును. మఱియును, త్రయోదశి రాత్ర్యర్థమువఱకును వ్యాపించియుండెనేని యానాటిపూర్వరాత్రియందు వేదాధ్యయనమును జేయఁగూడదు. మఱియును పురాణాదులను జెప్పునపుడు చెప్పెడువానికిని వినువారికిని నడుమ ఎవ్వరుపోయినను దోషములేదని యెఱుఁగవలయును. మఱియును, మోసికొనిపోఁబడుచున్న శవమును గాని భూమియందున్న శవమును గాని చూచినబ్రాహ్మణుఁడు తత్కాలాశౌచముకలవాఁడగును కనుక స్నానాచమనములను జేసి ఘృతప్రాశనమును చేసినయెడల పరిశుద్ధుఁడగును. మఱియును, అకాలగర్జితాదులయందును పర్వములయందును ఆశౌచములయందును గ్రహణములయందును అధ్యయనమును జేయఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, రేపు అనధ్యాయనదినమైయుండఁగా ఈదినరాత్రియందు పఠింపఁ



గూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ ప్రదోషే చ త్రయోదశ్యాం నాధ్యేయం ప్రతిపత్స్వపి॥" (=ప్రదోషమందును త్రయోదశియందును ప్రతిపత్తులయందును పఠింపఁగూడదు.) అని స్మృత్యంతరమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ షష్ఠీ చ ద్వాదశీ చైవ హ్యర్ధరాత్రోననాడికా । ప్రదోషే న త్వధీయీత తృతీయా నవనాడికా॥" ( = షష్ఠియును త్రయోదశియును, అర్ధరాత్రమునకు పూర్వము ఒకగడియవఱకును వ్యాపించియుండెనేని అయ్యది అనఁగా ఆషష్ఠియును త్రయోదశియును సాయంకాలమందు ప్రదోషసంజ్ఞకలవియగును.) అనునట్టి స్మృతిప్రమాణానుసారముగ ప్రదోషమిదియని గ్రహింపవలయును. మఱియును, శ్రావణపౌర్ణమాస్యమొదలుకొని ముప్పదిదినములు ప్రదోషసంజ్ఞకలవి కనుక ప్రదోషసంజ్ఞకల దినములుకనుక ప్రదోషదినములయందలి పూర్వరాత్రియందుఁ జదువఁగూడదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ అనధ్యాయముపాకర్మ శ్రావణ్యాం శ్రవణేన వా । యావన్మాసం పూర్వరాత్రే నాధీయీత కదాచన॥" (=శ్రావణ శ్రవణనక్షత్రమునందుఁగాని శ్రావణపౌర్ణమాస్యయందుఁగాని చేయఁబడుచున్న యుపాకర్మము మొదలుకొని నెలదినములవఱకును ప్రదోషముకలదు కనుక ఆదినములలో పూర్వరాత్రియందు వేదాధ్యయనమును చేయఁగూడదని యెఱుఁగవలయును.) అని గర్గమునివరుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ అయనే విషువే చైవ శయనే బోధనే హరేః । అనధ్యాయం ప్రకుర్వీత మన్వాదిషు యుగాదిషు ॥" (=మేషతులాసంక్రమణములయందును, విష్ణువుయొక్క శయనైకాదశీబోధనైకాదసులయందును, మన్వాదులయందును, యుగాదులయందును, అధ్యయనమును జేయఁగూడదు.) అని నారదుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ ఆశ్వయుక్శుక్లనవమీ కార్తికే ద్వాదశీ సితా । తృతీయా చైత్రమాసస్య తథా భాద్రపదస్య చ । ఫాల్గునస్య త్వమావాస్యా పౌషస్యైకాదశీ సితా । ఆషాఢస్యాపి దశమీ మాఘమాసస్య సప్తమీ ॥ శ్రావణస్యాష్టమీ కృష్ణా ఆషాఢస్యాపి పూర్ణిమా । కార్తికీ ఫాల్గునీ చైత్రీ జ్యైష్ఠీ పంచదశీ సితా । మన్వంతరాదయశ్చైతే దత్తస్యాక్షయకారకాః ॥" (=ఆశ్వయుజశుద్ధనవమి, కార్తికశుక్లద్వాదశి, చైత్రశుక్లతృతీయ, భాద్రపదశుక్లతృతీయ, ఫాల్గునామావాస్య, పుష్యశుద్ధైకాదశి, ఆషాఢశుక్లదశమి, మాఘశుక్లసప్తమి, శ్రావణకృష్ణాష్టమి, ఆషాఢపూర్ణిమ, కార్తిక ఫాల్గున చైత్ర జ్యేష్ఠమాసములయందలి పూర్ణిమలు, మన్వాదులనఁబడును.) అని

మత్స్యపురాణమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ వైశాఖమాసస్యతుయాతృతీయా నవమ్యసౌకార్తికశుక్లపక్షే । నభస్యమాసస్యచకృష్ణపక్షేత్రయోదశీపంచదశీచమాఘే । ఉపాకర్మణిచోత్సర్గే త్రిరాత్రంక్షపణంస్మృతం । అష్టకాసుత్వహోరాత్రంమృతంతాసుచరాత్రిషు। మార్గశీర్షేతథాపౌషే మాఘేమాసేతథైవచ । తిస్రోష్టకాస్సమాఖ్యాతాః కృష్ణపక్షేతుసూరిభిః॥" (=వైశాఖ శుక్లతృతీయ, కార్తికశుక్లనవమి, భాద్రపదకృష్ణత్రయోదశి, మాఘశుక్లపూర్ణిమ, ఉపాకర్మము, ఉత్సర్గము, అనువానియందు మూఁడుదినములయందు క్షపణమని చెప్పఁబడును. అనఁగా మూఁడుదినములు అధ్యయనమును జేయఁగూడదనుట. అష్టకాతిథుల యందు రాత్రింబగళ్ళు అధ్యయనమును చేయఁగూడదు. మార్గశీర్షపుష్యమాఘమాసముల కృష్ణపక్షములయందు తిస్రోష్టకములు చెప్పఁబడినవి.) అని విష్ణుపురాణమునందు యుగాదులు చెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ చతుర్దశ్యాంయదాపర్వ ప్రాగస్తాద్దృశ్యతేరవేః । అనధ్యాయం ప్రకుర్వీత త్రయోదశ్యాంతుధర్మవిత్ । విద్యుత్స్తనితవర్షేతు మహోల్కానాంతుసంప్లవే । అకాలికమనధ్యాయమేతేషుమనురబ్రవీత్॥ అనూరాధర్క్షమారభ్య షోడశర్క్షేతుభాస్కరః । యావచ్చరతివైతావదకాలం మునయోవిదుః । కాలేవృష్టౌచ తత్కాలమకాలేచత్రిరాత్రకం । అతిమాత్రాధవావృష్టిర్యాదీయాతదినత్రయం । అకాలవర్షణేజాతే జలౌఘశ్చప్రవర్తతే । ఏకరాత్రమనధ్యాయ ఇతికాత్యాయనోబ్రవీత్॥ మేషేచవృషభేచైవ తృణాగ్రాత్స్రవతేజలం । భూమిద్రావమనధ్యాయంకుర్వీతవృషకుంభయోః । అతఊర్ధ్వంద్విపాదేషు తృణప్రచ్యవనంజలం । చోరైరుపద్రుతేయామే సంగ్రామేచాగ్నికారితే। అకాలికమనధ్యాయం విద్యాత్సర్వాద్భుతేషుచ । ప్రాదుష్కృతేష్వగ్నిషు విద్యుత్స్తనితనిస్వనే।సజ్యోతిస్స్యాదనధ్యాయశ్శేషరాత్రౌతథాదివా॥" (=చతుర్దశియందు పర్వము సూర్యాస్తమయమునకు పూర్వమునందే వ్యాపించియుండెనేని త్రయోదశిని అనధ్యాయమునుగా గ్రహింపవలయును. అకాలమునందు మెఱుములతోను ఉరుములతోడనుగూడ వర్షము కలిగినను. అధికముగ ఉల్కాపాతమైనను ఆదినము అనధ్యాయదినమగునని మనువు వచించె. మఱియును, అనూరాధానక్షత్రము మొదలుకొని పదునాలుగు నక్షత్రములలో సూర్యుఁడుండుకాలము వర్షమునకు అకాలమని మునులుచెప్పుచున్నారు. సకాలమందు వర్షము కలిగెనేని తత్కాలముమాత్రము



త్రము అనధ్యాయ కాలమనియును, అకాలమందు వర్షము కలిగెనేని మూఁడుదినములు అనధ్యాయములనియును, తెలియవలయును. సకాలమందుఁగూడ అతివృష్టికలిగెనేనిమూఁడుదినముల నధ్యాయములని యెఱుఁగవలయును. అకాలవర్షముచేత జలప్రవాహము కలిగెనేని ఒక్కదినము అనధ్యాయమని కాత్యాయనుఁడు చెప్పెనని తెలియవలయును. మఱియును, మేషవృషభమాసములయందలి వర్షోదకము తృణములనుండి జారెనేని అనధ్యాయమగును. వృషకుంభమాసములయందలి వర్షోదకము భూమియందుఁ గాలువఁగట్టి ప్రవహించెనేని యాదినమంతయును అనధ్యాయమని యెఱుఁగవలయును. మఱియును, చోరోపద్రవము కలుగఁదగినయామమునందును, సంగ్రామమందును, అగ్నికారితమందును అనధ్యాయమని యెఱుఁగవలయును. మఱియును, మెఱుములు ఉరుములు మొదలుగాఁగల యుత్పాతములు రాత్రియందుఁగలిగెనేని రాత్రియంతయును, పగటియందుఁగలిగెనేని పగలంతయును అనధ్యాయమని యెఱుఁగవలయును.) అని స్మృతిరత్నావలియను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ నిర్ఘాతేభూమిచలనే జ్యోతిషాంచోపసర్జనే। ఏతానకాలికాన్విద్యాదనధ్యాయానృతావపి॥"(=పిడుగుపడినను,భూకంపముకలిగినను, జ్యోతిర్దర్శనమైనను, ( చంద్రసూర్యపరివేషము కలిగినను,) తాత్కాలికానధ్యాయమని యెఱుఁగవలయును.) అని మనువు వచించె. మఱియును, "శ్లో॥ ప్రతిగృహ్యద్విజోవేదానేకోద్దిష్టస్యకేతనం। త్ర్యహంతేకీర్తయేద్బ్రహ్మ రాహోహారన్యత్రసూతకే॥" (=ఏకోద్దిష్టమునందు నిమంత్రితుఁడైనప్పుడును, రాహుగ్రస్త కేతుగ్రస్తములయందును సూతకమునందును మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును.) అని యాపస్తంబుఁడు చెప్పె. మఱియును, "శ్లో॥ సమానవిద్యేతుమృతేతథాసబ్రహ్మచారిణి । ఆచార్యేసంస్థితేచాపి త్రిరాత్రంక్షపణంస్మృతమ్॥" (=సమానవిద్యుఁడు మృతినిపొందినను, సబ్రహ్మచారి మరణమునుపొందినను, మూఁడుదినములు అశౌచము) అని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ త్ర్యహంప్రేతేష్వనధ్యాయశ్శిష్యర్త్విగ్గురుబంధుషు । ఉపాకర్మణిచోత్సర్గే స్వశాఖాశ్రోత్రియేమృతే।సంధ్యాగర్జితనిర్ఘాత భూకంపోల్కానిపాతనే । సమాప్యవేదంద్యునిశమారణ్యకమధీత్యచ । పశుమండూకనకుల శ్వాహిమార్జారమూషకైః। కృతేంతరేత్వహోరాత్రం శక్రపాతేతథోచ్ఛ్రయే॥" ( = శిష్యులు

ఋత్విక్కులు గురువులు బంధువులును మృతినిపొందినవారగుచునుండఁగా మూఁడుదినము లనధ్యాయములు. ఉపాకర్మమునందును, ఉత్సర్గమునందును, స్వశాఖాశ్రోత్రియుని మరణమునందును, సంధ్యాకాలమునందలి గర్జితమునందును, పిడుగుపడినపుడును, భూకంపము కలిగినపుడును, ఉల్కలుపడుటయందును, మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును. మఱియును, పశువులు, మండూకములు, నకులము, కుక్క, సర్పము, మార్జాలము, మూషకము, అనునవి గురుశిష్యులకు నడుమపోయెనేని ఒక్కదినము అనధ్యాయమని యెఱుఁగవలయును.) అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పె. మఱియును, “శ్లో॥ సర్పస్యనకులస్యాథ అజమార్జారయోస్తథా । మూషకస్యతథోష్ట్రస్య మండూకస్యచయోషితః।పురుషస్యైళకస్యాపి శునోశ్వస్యఖరస్యచ । ఏషాంయోవితతశ్చైవ అంతరాగమనేక్షతే । త్రిరాత్రముపవాసశ్చ త్రిరాత్రమభిషేచనం ॥” (=సర్పము, నకులము, మేక, మార్జాలము, మూషకము, ఒంటె, మండూకము, స్త్రీ, పురుషుఁడు, అశ్వము, గాడిదె, అనునవి గురుశిష్యులకు నడుమనఁబోయెనేని మూఁడుదినములు అనధ్యాయములని యెఱుఁగవలయును.) అని పారాశరుఁడు చెప్పెను. మఱియును, “శ్లో॥ ఖరోష్ట్రగర్దభోలూకసామబాణార్తనిస్స్వనే । అమేధ్యశవశూద్రాంత్యశ్మశానపతితాంతికే। దేశేశుచావర్త్మనిచవిద్యుత్స్తనితసంప్లవే । భుక్త్వార్ద్రపాణిరంభోంతరర్ధరాత్రేతిమారుతే । పాంసువర్షేదిశాందాహేసంధ్యానీహారభీతిషు । ధావంతఃపూతిగంధేచ శిష్టేచగృహమాగతే । ఖరోష్ట్రయానహస్త్యశ్వనౌవృక్షరథరోహణే । సప్తత్రింశదనధ్యాయానేతాంస్తాత్కాలికాన్విదుః॥” (=గాడిదె, ఒంటె, గర్దభము, ఉలూకము, సామము, బాణము, ఆర్తధ్వని, అమేధ్యము, శవము, శూద్రుఁడు, అంత్యజాతివాఁడు, శ్మశానము, పతితసామీప్యము, అపరిశుద్ధప్రదేశము, మార్గము, మెఱుపులు, ఉరుములు, ప్రవాహము, భోజనము చేసినపిమ్మట కడుగుటచేతఁ దడిసినచేయి, ఉదకమధ్యము, అర్ధరాత్రము, అధికవాయువు, పాంసువర్షము, సంధ్యాకాలము, నీహారభయము, పరుగిడుట, పూతిగంధము, శిష్టుఁడు గృహమునకువచ్చుట, ఖరము, ఉష్ట్రము, ఆందోళికాదియానము, ఏనుఁగు, అశ్వము, ఓడలమీఁదను వృక్షములమీఁద నెక్కుట, అనునవి తాత్కాలికానధ్యాయము లనఁబడును.) అని యీ స్మృతిప్రమాణముచేత తాత్కాలికానధ్యాయములను దెలిసి



వలయును. మఱియును, “శ్లో॥ వేదోపాకరణేచైవస్వాధ్యాయేచైవనైత్యకే । ననిరోధోస్త్యనధ్యాయే హోమమంత్రజపేషుచ॥” (=వేదోపాకరణమందును, నిత్యస్వాధ్యాయమందును, హోమమంత్రజపములయందును, అనధ్యాయనదోషములేదు.) అని మనువువచించె.

వ్యా॥ రాత్రీతి॥ రాత్ర్యాస్త్రై-మదనత్రయోదశీ-యస్మిన్దినేస్యాత్-మునిస్స్పష్టవిరా-రాత్రేర్దశయుతే యామేసార్ధప్రహరే - యద్దినేస్యాత్-చతుర్థీ-ఆదిమేప్రథమే ప్రహరేయద్దినేస్యాత్ - అత్రదినేపాత్రిగాత్రౌపూర్వరాత్రౌపఠనంవర్జ్యంతత్పునః - ఉపాకరణతః - ఉపాకర్మతః - సకాశాత్ మాసరాత్రంరాత్రౌ ప్రాగ్దోషపఠనంవర్జ్యం- సదాసంధ్యయోరుభయోఃపఠనంవర్జ్యం- చోరోపద్రవేణఉపలక్షితోయామఃప్రహరః తస్మిన్ పఠనంవర్జ్యం - త్రిదివసం - దుర్భుక్రతిగ్రహయోః - దుష్టాఘక్రతిగ్రహశా- దుర్భుక్రతిగ్రహౌ - తయోఃదుష్టభోజనదుష్టప్రతిగ్రహయోః- త్రిదివసంపఠనంవర్జ్యం- తథాచశ్రీధర్యాంస్మృతివచనాని ॥ అష్టమ్యాంచచతుర్దశ్యాఃపంచదశ్యాశ్చసూతకే। శ్రావేప్రతిపదోర్యత్ర భయేచైవమహోత్సవే । రాగేయుద్ధేవివాదేచమృతేపథిఃశిథకే । నాధీయీతాశుచిశ్చాపినస్నాతశ్చాతంద్రితః। ఉపాకర్మణిచోత్సర్గే గ్రహణేచంద్రసూర్యయోః। త్రిరాత్రంస్యాదనధ్యాయో మృతేభూపేగురావపి। ఫాల్గున్యాంపౌర్ణమాస్యాంతు చైత్ర్యాంతుత్ర్యహమిష్యతే । అనధ్యాయస్తథాషాఢ్యాం శ్రావణ్యాంకార్తికేతథా। తథైవమార్గశీర్షస్య పూర్ణిమాయాంనసంచరేత్ । అశన్యాఃపతనేకంపే భూమేర్దాహేపురస్యచ। మృగస్యసర్పమార్జారనకులాద్యశ్వదంతినాం । అంతరాగమనేజోష్ట్రఖరాణాంచత్ర్యహంస్మృతం। పతాకాతోరణాదర్శరథయానజలాగ్నినాం। మూకోన్మత్తాదిశూద్రాణామంతరాగమనేత్ర్యహం । నారీణామపిసర్వాసాం గవాంచైవాంతరాగమే । అహోరాత్రమనధ్యాయో గర్జనేరాత్రిసంభవే । ద్యుగర్జనేచరాత్రౌచా పరరాత్రేదినంస్మృతం। దినంతూభయసంధ్యాయామథాస్వాంతరాగమే। పక్షిమండూకగోధాసు నరాణాంచాంతరాగమే। దినేదివసశేషస్య ద్రాత్ర్యాంరాత్ర్యాశ్చతద్భవేత్ । శ్వసృగాలరవేప్రాణాం శ్రోత్రియాగమనేధ్వని। తాత్కాలికోప్యనధ్యాయస్స్యాత్ బాలస్యచభక్షణే శ్రాద్ధనిమంత్రితోయస్తు భుక్త్వానాధ్యయనంచరేత్ । కరిష్యంచతథావిప్రః ప్రాగ్విప్రాణాంసర్జనాత్। ఏతేప్రోక్తాహ్యనధ్యాయా వైదికా[illegible]ంత్రికాస్తతః । ప్రవక్ష్యంతేష్టమీద్వాదశ్య శ్చతుర్దశ్యశ్చకేవలైః । పిషావ

ద్వితయేచైవమయనాద్ద్వితయేతథా।నపఠేత్ప్రతమేద్ధీమాన్పురాణమపిస
త్తమః।అష్టమ్యాంచచతుర్దశ్యాంయావదష్టమితెరవా। దినశేషమనధ్యాయ
వ్యాదికంపరికీర్తితం। తద్వోదితేదివారాత్రంతత్కాలముదితేతయోః। ప్రతిప
ద్యపిసంక్రాంతౌ తత్కాలమఖిలాసుచ । నభోనభస్యయోఃకృష్ణే మాస
యోస్త్రీనిద్విజః। నసప్తమ్యామధీయీత త్రయోదశ్యాంచమైత్ర్యయోః।
సదాత్రయోదశీయావత్ ప్రాగ్జ్ఞేశీథాత్తిథిర్భవేత్। ప్రాక్తదహ్నాపరా
హ్ణంతా దధీయీతనచద్విజః । అష్టమ్యాంచచతుర్దశ్యాం ప్రతిపత్సునవ
ర్జయేత్ । ధర్మశాస్త్రపురాణైశ్చ శాస్త్రంతాత్కాలికంబుధః । విమిశ్రి
తాసుకర్తవ్యంసప్తమ్యాదిషుయత్నతః।పురాణాభ్యసనాదీనిపంచదశ్యోశ్చ
వానవా।నాంతరాగమనేదోషఃపురాణాదిషువిద్యతె। నశంస్యతేచతత్కా
లేష్విత్యంసుప్రాశ్నవాబుధః। నీయమానంశవందృష్ట్వా మహీస్థంవాద్విజో
త్తమః । అకాలగర్జితాదౌచ పర్వస్వాశౌచకాదిషు । అనధ్యాయంబుధైః
కార్యా ఉపరాగాదికేషుచ। శ్వోనధ్యాయేచశర్వర్యాం నాధీయీతకదా
చన॥ స్మృత్యంతరే॥ ప్రదోషేచత్రయోదశ్యాం నాధ్యేయంప్రతిపత్స్వపి॥
ప్రదోషలక్షణం॥షష్ఠీచద్వాదశీచైవహ్యర్ధరాత్రోననాడికా। ప్రదోషేనత్వ
ధీయీతతృతీయానవనాడికా । అర్ధరాత్రోననాడికా- అర్ధరాత్రాద్ఘటి
కయా - ఏకయోనేత్యర్థః - అత్రనైమిత్తికప్రదోషమాహ ॥ అపస్తంబః॥
శ్రావణ్యాంపౌర్ణమాస్యా మధ్యయనముపాకృత్య మాసంప్రదోషేనాధీ
యీతేతి- ప్రదోషః - పూర్వరాత్రః ॥ తథాచగర్గః ॥ అనధ్యాయము
పాకర్మశ్రావణ్యాంశ్రవణేనవా । యావన్మాసంపూర్వరాత్రౌ నాధీయీత
కదాచనేతి ॥ నారదః ॥ అయనేవిషువేచైవ శయనేబోధనేహరేః । అన
ధ్యాయంప్రకుర్వీతమన్వాదిషుయుగాదిషు ॥ మన్వాదయోమత్స్యపురాణే
భిహితాః॥ అశ్వయుక్శుక్లనవమీకార్తికీద్వాదశీసితా। తృతీయాచైత్రమాస
స్య తథాభాద్రపదస్యచ। ఫాల్గునస్యత్వమావాస్యా పౌషస్యైకాదశీసితా।
ఆషాఢస్యాపిదశమీ మాఘమాసస్యసప్తమీ । శ్రావణస్యాష్టమీకృష్ణా ఆ
షాఢస్యాపిపూర్ణిమా। కార్తికీఫాల్గునీచైత్రీ జ్యైష్ఠీపంచదశీసితా । మ
న్వంతరాదయశ్చైతెదత్తస్యాక్షయకారకాః॥యుగాదయోవిష్ణుపురాణేద
ర్శితాః॥ వైశాఖమాసస్యతుయాతృతీయానవమ్యసౌకార్తికశుక్లపక్షే। నభ
స్యమాసస్యచకృష్ణపక్షే త్రయోదశీపంచదశీచమాఘే ॥ ఉపాకర్మణిచో
త్సర్గే త్రిరాత్రంక్షపణంస్మృతం । అష్టకాసుత్వహోరాత్రంమృతంతాసు
చరాత్రిషు । మార్గశీర్షేతథాపౌషే మాఘమాసేతథైవచ। తిస్రోష్టకా



స్సమాఖ్యాతాః కృష్ణపక్షేతుసూరిభిః॥ స్మృతిరత్నావల్యాం॥ చతుర్దశ్యాం
యదాపర్వ ప్రాగస్తాద్దృశ్యతెరవేః । అనధ్యాయంప్రకుర్వీత త్రయోద
శ్యాంతుధర్మవిత్ । విద్యుత్స్తనితవర్షేషు మహోల్కానాంతుసంప్లవే ।
అకాలికమనధ్యాయ మేతేషుమనురబ్రవీత్ ॥ స్తనితంమేఘగర్జితం ॥ అ
సూరాధర్క్షమారభ్య షోడశర్క్షేతుభాస్కరః । యావచ్చరతివైతావ ద
కాలంమునయోవిదుః । కాలేవృష్టౌచతత్కాల మకాలేచత్రిరాత్రకం। అ
తిమాత్రాథవావృష్టి ర్నాధీయీతదినత్రయం। అకాలవర్షణేజాతే జలౌఘ
శ్చప్రవర్తతె । ఏకరాత్రమనధ్యాయ ఇతికాత్యాయనోబ్రవీత్। మేషేచ
వృషభేచైవ తృణాగ్రేష్వతేజలం । భూమిద్రావమనధ్యాయం కుర్వీత
వృషకుంభయోః । అతఊర్ధ్వంద్విపాదేషు తృణప్రచ్యవనంజలం॥ తృణప్ర
చ్యవనంతృణప్రవాహః॥ చోరైరుపద్రుతెయామే సంగ్రామేచాగ్నికారితే।
అకాలికమనధ్యాయం విద్యాత్సర్వాద్భుతేషుచ । ప్రాదుష్కృతేష్వగ్ని
షువిద్యుత్స్తనితనిస్స్వనే। సజ్యోతిస్స్యాదనధ్యాయ శ్శేషరాత్రౌయథాది
వా॥మనుః॥ నిర్ఘాతేభూమిచలనేజ్యోతిషాంచోపసర్జనే। ఏతానకాలికాన్వి
ద్యాదనధ్యాయానృతావపి॥ నిర్ఘాతఅంతరాళికోధ్వనివిశేషః॥ జ్యోతిషాం
చోపసర్జనం చంద్రసూర్యయోఃపరివేషః ॥ ఆపస్తంబః ॥ ప్రతిగృహ్యద్వి
జోవేదా నేకోద్దిష్టస్యకేతనం । త్ర్యహంనకీర్తయేద్బ్రహ్మ రాహూరస్య
త్రసూతకే॥ కేతనంనిమంత్రణం॥ కూర్మపురాణే- సమానవిద్యేతుమృతె త
థాసబ్రహ్మచారిణి। ఆచార్యేసంస్థితేచాపి త్రిరాత్రంక్షపణంస్మృతం॥ యా
జ్ఞవల్క్యః॥ త్ర్యహంప్రేతెష్వనధ్యాయ శ్శిష్యర్త్విగ్గురుబంధుషు। ఉపాక
ర్మణిచోత్సర్గే స్వశాఖాశ్రోత్రియేమృతె। సంధ్యాగర్జితనిర్ఘాతే భూకంపో
ల్కానిపాతనే। సమాప్యవేదంద్యునిశమారణ్యకమధీత్యచ। పశుమండూ
కనకులశ్వాహిమార్జారమూషకైః। కృతేంతరేత్వహోరాత్రం శక్రపా
తెతథోచ్ఛ్రయే ॥ పారాశరః ॥ సర్పస్యనకులస్యాథ అజమార్జారయోస్త
థా । మూషకస్యతథోష్ట్రస్య మండూకస్యచయోషితః । పురుషస్యైకశ
స్యాపిశునోశ్వస్యఖరస్యచ। ఏషాంయోవితతశ్చైవ అంతరాగమనేకృతె।
త్రిరాత్రముపవాసశ్చత్రిరాత్రమభిషేచనం॥ అథతాత్కాలికాః॥ ఖరోష్ట్ర
గర్దభోలూకసామబాణార్తనిస్స్వనే। అమేధ్యశవశూద్రాంత్యశ్మశానప
తితాంతికే । దేశేశుచౌచాత్మనిచ విద్యుత్స్తనితసంప్లవే । భుక్త్వార్ద్ర
పాణిరంభోంతరర్ధరాత్రేతిమారుతె। పాంసువర్షేదిశాందాహేసంధ్యానీ
హారభీతిషు। ధావంతఃపూతిగంధేచ శిష్టేచగృహమాగతే। ఖరోష్ట్రయా

సహస్త్యశ్వనౌపృక్షురథరోహణే. సప్తత్రింశదనధ్యాయానేతాంస్తాత్కాలికాన్విదురితి॥ అథానధ్యాయాపవాదః॥ మనుః॥ వేదోపాకరణేచైవస్వాధ్యాయేచైవనైత్యకే । ననిరోధోస్త్యనధ్యాయే హోమమంత్రజపేషుచేతి॥ అనధ్యాయప్రకరణంసమాప్తం॥

— { అథపల్లీసరటయోః ప్రకరణం అథపల్లీసరటయోఃఫలంవృత్తేనైకేనాహ. } —

మూ॥ దక్షాంగోదరనాభిహృత్సుపతితాపల్లీవరాంగేహనుం ము
క్త్వానుశ్శుభదాస్త్రియాఃఫలమిదంవామేతరవ్యత్యయాత్।
ఇత్యాహుస్సరటప్రరోహణఫలంపాతేన్యథైకేవృథా ప
ల్యారోహణకేపివస్త్రసహితం స్నాత్వాచరేచ్ఛాంతికం॥

టీక॥ దక్షాంగోదరనాభిహృత్సు=దక్షాంగమందును, ఉదరమందును, నాభియందును, హృదయమునందును, పతితా=పడిన, పల్లీ=బల్లి, తథా=అటులనే, హనుమ్=దవుడను, ముక్త్వా=విడిచిపెట్టి, వరాంగే=ఉత్తమాంగమందు, పతితా=పడిన, పల్లీ=బల్లియును, నుః=మనుష్యునకు, (అనఁగాపురుషునకు) శుభదా=శుభమునుకలుగఁజేయునది, స్యాత్=అగును, ఇదమ్=ఇప్పుడుపురుషునకుఁజెప్పఁబడినఫలము, స్త్రియాః=స్త్రీకి, వామేతరవ్యత్యయాత్=వామభాగమునందును ఇతరభాగమునందును వ్యత్యయముగ, ఫలమ్=ఫలము, స్యాత్=అగును, ఇతి=ఇట్లని, సరటప్రరోహణఫలమ్=తొండయెక్కుటవలనిఫలమును, ఆహుః=చెప్పుచున్నారు, పాతే=పడుటయందు, ఫలమ్=ఫలమును, అన్యథా=వేరువిధముగా, ఆహుః=చెప్పుచున్నారు, ఏకే=కొందఱు, పల్ల్యారోహణకేపి=బల్లిపాకుటయందు, వృథా=వ్యర్థమని, ఆహుః=చెప్పుచున్నారు, (అస్మిన్=ఈవిషయమునందు) వస్త్రసహితమ్=వస్త్రములతోఁగూడ, స్నాత్వా=స్నానమునుచేసి, శాంతికమ్=శాంతిని, చరేత్=ఆచరింపవలయును.

తా॥ బల్లిశరీరముయొక్క-దక్షిణభాగమునందలి యుదరమునందును, నాభియందును, హృదయమునందును పడినను, దౌడయందుఁదప్పఁ దక్షిణశిరోభాగమునందు పడినను, పురుషునకు శుభఫలముకలుగునని యెఱుఁగవలయును. మఱియును, ఇప్పుడు చెప్పఁబడినభాగములయందుఁ దప్పఁ దక్షిణభాగములయందు బల్లిపడెనేని అశుభఫలములుకలుగును. మఱియును, స్త్రీలకు ఇప్పుడుచెప్పఁబడిన దక్షిణభాగములయందు బల్లిపడెనేని అశుభఫలములుకలుగుననియును, వామభాగమునందు శుభఫలములు



కలుగుననియును, తెలియవలయును. తొండపాకినపుడుకూడ ఇటులనే ఫలమును జెప్పవలయును. తొండపడెనేని విపరీతఫలములు కలుగును. కొందఱు బల్లిపాకెనేని ఫలమేమియును లేదని చెప్పుచున్నారు. మఱియును, బల్లిపడినను, తొండపాకినను సచేలస్నానమునుచేసి శాంతిని చేయవలసినదని యెఱుఁగవలయును. మఱియును, "శ్లో॥ పల్లీస్పర్శఫలంవక్ష్యే యదుక్తంబ్రహ్మణాపురా । బ్రహ్మస్థానేభవేద్రాజ్యం స్థానేలాభోలలాటకే ॥ కర్ణయోర్భూషణావాప్తి ర్నేత్రయోః ప్రియదర్శనం । నాసికాయాంసుగంధాప్తి ర్ముఖేమృష్టాన్నభోజనం ॥ కపోలయోర్భవేత్సౌఖ్యం హనుదేశేమహద్భయం । భ్రుకుట్యాంవిగ్రహశ్చైవ కంఠేవావ్యసనాగమః ॥ కవిర్వంశేసుఖంపృష్ఠ్యాం దక్షేవామేగదాదయః । దక్షాంసేవిజయోనిత్యం వామాంసేశత్రుజంభయం ॥ ఇష్టలాభో భుజేసవ్యే కూర్పరే మణిబంధకే । దక్షేకరతలేద్రవ్యం తత్పృష్ఠేసద్వ్యయోభవేత్ ॥ వామేభుజేకూర్పరేచ మణిబంధేధనక్షయః । వామేకరతలేహాని స్తత్పృష్ఠేచార్థనాశనం ॥ హృదయేరాజసన్మానం సౌభాగ్యందక్షిణేస్తనే । దక్షపార్శ్వేచభోగాప్తి స్తనేవామేయశోధనం ॥ వామపార్శ్వేభవేత్పీడావామకుక్షౌశోకస్తథా । దక్షకుక్షౌసుతావాప్తి రుదరేచవిశేషతః ॥ వస్త్రాప్తిర్దక్షకట్యాంచ వామకట్యాంసుఖక్షయః । నాభ్యాంవనోరధావాప్తిర్వస్త్రాగర్భచ్యుతిర్భవేత్ ॥ గుహ్యేమృత్యుర్గుదేరోగో దక్షోరౌప్రీతివర్ధనం। వామోరౌమృత్యుతోదుఃఖం దక్షజానౌసుఖావహం ॥ పశుహానిర్వామజానౌదక్షిణేజఘనేసుఖం । క్లేశస్స్యాద్వామజంఘాయాం స్ఫిజిదక్షేగ్ధవృద్ధికృత్ ॥ స్ఫిజివామేస్త్రీవియోగో దక్షేగుల్ఫేప్రియాగమః । ఉపప్లవో వామగుల్ఫే పాదయోర్గమనంభవేత్॥ " (=బల్లిబ్రహ్మరంధ్రస్థానమునఁబడెనేని రాజ్యము, లలాటమునందు లాభము, కర్ణములయందు భూషణావాప్తియును, నేత్రములయందు ప్రియదర్శనమును, నాసికయందు సుగంధాప్తియును, ముఖమందు మృష్టాన్నభోజనమును, కపోలములయందు సౌఖ్యమును, హనుదేశమందు మహాద్భయము, భృకుటియందు విగ్రహమును, కంఠమునందు వ్యసనాగమమును, వెన్నెముకయందు విరోధమును, దక్షిణపృష్ఠభాగమునందు సుఖమును, వామపృష్ఠభాగమునందు రోగాదులును, దక్షిణాంసమందు శత్రుజయమును, వామాంసమందు శత్రుజన్యమగు భయమును, దక్షిణపు కరతలమునందు ద్రవ్యమును, సవ్యభుజమునందు ఇష్టలాభమును, దక్షిణపు కూర్పర మణిబంధకే

ములయందును, ఇష్టలాభమును, కూర్పరమణిబంధకముల పృష్ఠభాగమునందు సద్వ్యయమును, వామభుజమందును వామకూర్పరమునందును వామమణిబంధమునందును ధనక్షయము కలుగుననియును, వామకరతలమందు హానికలుగుననియును, వామపృష్ఠమునందు అర్థనాశనమగుననియును, హృదయమునందు రాజసన్మానము కలుగుననియును, దక్షిణస్తనమునందు సౌభాగ్యముకలుగుననియును, వామపార్శ్వమునందు పీడకలుగుననియును, వామకుక్షియందుఁగూడ పీడకలుగుననియును, దక్షిణకుక్షియందు సుతావాప్తికలుగుననియును, ఉదరమునందు విశేషముగ సంతానము కలుగుననియును, దక్షిణకటియందు వస్త్రాప్తికలుగుననియును, వామకటియందు సుఖక్షయము కలుగుననియును, నాభియందు మనోరథావాప్తియును, వస్తియందు గర్భచ్యుతియగుననియును, గుహ్యమునందు మృత్యువుకలుగుననియును, గుదమునందు రోగముకలుగుననియును, ఊరువుయొక్క దక్షిణభాగమునందు ప్రీతివృద్ధిని పొందుననియును, ఊరువుయొక్క వామభాగమునందు మృత్యువువలన దుఃఖముకలుగుననియును, దక్షిణజానువునందు సుఖావహము కలుగుననియును, వామజానువునందు పశుహానియగుననియును, దక్షిణజఘనమునందు సుఖముకలుగుననియును, వామజంఘయందు క్లేశము కలుగుననియును, దక్షిణస్ఫిజియందు వృద్ధికలుగుననియును, వామస్ఫిజియందు స్త్రీవియోగము కలుగుననియును, దక్షిణగుల్ఫమునందు ప్రియాగమము కలుగుననియును, వామగుల్ఫమునందు ఉపప్లవము కలుగుననియును, పాదములయందుగమనము కలుగుననియును, తెలియవలయును.) అనిజ్యోతిర్నిబంధమునందుఁ జెప్పఁబడియె. మఱియును, పాదములయందనుటచేత సామాన్యముగా రెండుపాదములని చెప్పఁబడినను దక్షిణపాదమునందు గమనమువలన లాభముకలుగుననియును, వామపాదమునందు గమనమువలన హానికలుగుననియును, తెలియవలయును. మఱియును, "శ్లో॥ పురోభాగేచదుర్వార్తానష్టవార్తాచపృష్ఠతః। వామేహానిర్ధనందక్షే పరితో భ్రమణేక్షితః॥ వామదక్షిణభాగేచ యత్ఫలంకథితంనృణాం। విపర్యయేణతత్స్త్రీణాం జ్ఞేయం శేషంద్వయోస్సమం॥ ఇత్థంపల్ల్యాఃప్రపతనేఫలంజ్ఞేయంవిచక్షణైః। ఏతదేవఫలంవిద్యాత్సరటస్యప్రరోహణే॥ పల్ల్యాఃప్రరోహణేచైవ పతనే సరటస్యచ। తయోఃఫలస్యవ్యత్యాసో త్వద్వజేపహిజాయతే॥ పల్ల్యాః ప్రరోహణంరాత్రౌ సరటస్యప్రపాతనం। నాతిదుష్టఫలంవిద్యాద్వ్యాధిముగ్రంవిపర్యయే॥ పతనానంతరంయస్య రోహణంయదిజాయతే। పతనేఫలముత్కృష్టం రోహణేస్వల్పఫలంభవేత్॥ మృత్యుయోగేచ జన్మర్క్షే విష్ట్యాంపాతేచవైధృతౌ। చంద్రేష్టమేచసక్రూరే లగ్నేవిఘ్నంప్రజాయతే॥ అంగందక్షిణమారుహ్య వామేనోత్తరతేస్ఫుటం। తదాహానికరీజ్ఞేయావ్యత్యయేనతుహానిదా॥ చరణాదూర్ధ్వగోభూయ స్వపోర్యోరోహతి శీర్షణం। ప్రాప్తంరాజ్యంతదాదత్తే పల్లీశ్వేతావిశేషతః॥ చింతితాభ్యధికంలాభం స్థితాభోజనభాజనే। పాతాంగుళీషుసంపాతా ద్ధానిశ్చమహతీభవేత్॥ పల్ల్యాస్సరటయోర్వాపి యుగ్మమంగేశుభేపతేత్। దంపత్యోర్జాయతేప్రీతి ర్భిన్నద్వభాగేవియోగతా॥ శీర్షస్యోపరిపతితాశుభాయపల్లీసితానాన్యా। సితగ్రహగోధాస్పర్శే సర్వేష్వంగేషుశోభనాజ్ఞేయేతి॥ కృకలాసఃపతేద్యస్య మూర్ధ్నితద్విఘ్నశాంతయే। మృతసంజీవనీంవిద్యాం జపేన్మండితమస్తకః॥" (=పాదములయొక్క పురోభాగమునందు బల్లిపడెనేని దుర్వార్తవినఁబడుననియును, పాదముల పృష్ఠభాగమునందుఁబడెనేని నష్టవార్త వినఁబడుననియును, వామభాగమునందు హానికలుగుననియును, దక్షిణభాగమునందు నిధనమగుననియును, తెలియవలయును. మఱియును, పురుషులకు వామదక్షిణభాగములయందే ఫలము చెప్పఁబడినదో యాఫలమును స్త్రీలకువిపరీతముగఁ జెప్పవలయును. ఈవిధముగానే బల్లిప్రరోహణమునందుఁగూడ ఫలమును దెలియవలయును. మఱియును, తొండయొక్క పతనమునందుఁగూడ ఫలమును దెలియవలయును. బల్లిప్రాకుటయందును తొండయొక్క పతనమునందును ఫలములను వ్యత్యయముగఁ దెలియవలయును. రాత్రియందు బల్లి ప్రాకినను తొండపడినను అత్యధికమగు దుష్టఫలము కలుగనేరదనియును, మిగుల భయంకరమైన వ్యాధికలుగుననియును, తెలియవలయును. మఱియును, పడినపిమ్మట ప్రాకెనేని పతనమువలన అధికఫలముకలుగుననియును, ప్రాకుటవలన ఆఫలము స్వల్పమగుననియును, తెలియవలయును. మఱియును, మృత్యుయోగమునందును, జన్మనక్షత్రమందును, విష్టియందును, వ్యతీపాతయందును, వైధృతియందును, చంద్రుఁడష్టమస్థానమునఁ గలిగినదినమునందును, క్రూరగ్రహములుగల లగ్నమునందును, విఘ్నములు విశేషముగఁ గలుగునని యెఱుఁగవలయును. మఱియును, పల్లిసరటములు దక్షిణాంగమునుండి యుత్తరాంగమునకుఁ బోయెనేని హానికలుగుననియును, వ్యత్యయముగనయ్యెనేని హాని కలుగదనియు

ను, తెలియవలయును. మఱియును, కాళ్ళయందుఁబడి నెత్తికెక్కినేని రాజ్యహానిఁగలుగుననియును, భోజనభాజనమందుఁ బడెనేని చింతితఫలముకంటె నధికముగ ఫలముకలుగుననియును, తెలియవలయును. పాదాంగుళులయందుఁ బడుటవలన నధికమగు హానికలుగును. పల్లీసరటములు దంపతుల శుభాంగమందుఁబడెనేని అధికముగఁ బ్రీతికలుగుననియును, నింద్యభాగమందు పడెనేని వియోగము కలుగుననియును, తెలియవలయును. తెల్లనిబల్లి శిరస్సునందుఁబడెనేని శుభముకలుగునని యెఱుఁగవలయును. తెల్లనితొండ స్పృశించెనేని శుభములు కలుగునని తెలియవలయును. మఱియును, కృకలాసము ఎవ్వనిశిరస్సునందుఁ బడునో వానికి విఘ్నములు కలుగునుకనుక అట్టివిఘ్నములు నశించుటకు శాంతికర్మమును చేయించుకొని మృతసంజీవినీవిద్యను జపింపవలయును.) అని గ్రంథాంతరమందుఁజెప్పఁబడియె. మఱియును, "శ్లో॥ పల్లీసరటయోస్స్పర్శే సచేలంస్నానమాచరేత్ । పంచగవ్యంప్రాశయిత్వా కుర్యాదాజ్యావలోకనం ॥ శస్త్రేవాప్యథవాఽశస్త్రే యదీచ్ఛేదాత్మనస్సుఖం । పుణ్యాహవాచనం కృత్వా శాంతికర్మసమాచరేత్ ॥ ప్రతిరూపంసువర్ణేనకుర్యాద్విత్తానుసారతః । రక్తవస్త్రేణసంవేష్ట్య గంధపుష్పైః ప్రపూజయేత్ ॥ తదగ్రేమృణ్మయంరమ్యం కలశంజలపూరితం । వస్త్రమాల్యైరలంకృత్య స్థాపయేత్తండులోపరి ॥ పంచామృతంపంచగవ్యం పంచరత్నానిశక్తితః । పంచవృక్షకషాయాంశ్చ నిక్షిప్యావాహయేత్తతః ॥ పూజయేద్గంధపుష్పాద్యైర్లోకపాలాన్క్రమేణచ । అగ్నిసంస్థాపనంకృత్వా హోమకర్మసమాచరేత్ ॥ మృత్యుంజయేనమంత్రేణ సమిద్భిఃఖాదిరైశ్శుభైః । తిలైర్వాప్యాహుతిభిర్హోమ మష్టోత్తరసహస్రకం ॥ అష్టోత్తరశతంవాపి కుర్యాద్విత్తానుసారతః । అభిషేకంతతఃకృత్వా పావమానైశ్చసద్ద్విజైః ॥ పుణ్యావారుణసూక్తైశ్చ దోషశాంత్యైద్విజోత్తమః । ధౌతాంబరాణిధృత్వాథ స్వర్ణవస్త్రతిలాన్దదేత్ । బ్రాహ్మణాన్భోజయేదిత్థం శాంతికర్మకరోతియః । తస్యాయుర్విజయోలక్ష్మీః కీర్తిర్బుద్ధిశ్శుభంభవేత్ ॥ పల్లీసరటయోశ్శాంతిః కథితాభృగుణాపురా । శౌనకాయమునీంద్రాయ లోకానుగ్రహకారిణే॥" (=బల్లియును తొండయును స్పృశించెనేని సచేలస్నానమును చేయవలయును. పిమ్మట పంచగవ్యమును ప్రాశనమునుచేసి యాజ్యమునుచూడవలయును. మఱియును, శస్త్రాశస్త్రములయందు ఆత్మసుఖమునుకలిగినేని పుణ్యాహవాచనమును చేయించి శాంతికర్మమును



ఆచరింపవలయును. మఱియును, తనదుశక్తికిఁదగినట్లు సువర్ణముచేతఁ బ్రతిమను జేయింపవలయును. అంతట నాప్రతిమకు రక్తవర్ణముకలవస్త్రమునుజుట్టి గంధపుష్పములచేతఁ బూజింపవలయును. పిమ్మట ఆప్రతిమకెదుట మిగులరమ్యమగు మృణ్మయకలశమును జలపూరితమునుగాఁజేసి దానినివస్త్రమాల్యాదులచేత నలంకరించి తండులములమీద నుంచవలయును. అనంతరమందు పంచామృతమును పంచగవ్యమును పంచరత్నములను పంచవృక్షకషాయములను ఉంచి యావాహనమును జేయవలయును. మఱియును, గంధపుష్పాదులచేత లోకపాలులను పూజింపవలయును. అంతట అగ్నిసంస్థాపనమునుచేసి హోమకర్మమును ఆచరింపవలయును. పిమ్మట మృత్యుంజయమంత్రము నుచ్చరించుచు చంద్రసమిత్తులచేతను హోమమునుజేయవలయును. ఈవిధముగ వేయిపర్యాయములు హోమమును జేయవలయును. ఇట్లుచేయుటకు శక్తిలేకపోయెనేని నూటయెనిమిది పర్యాయములయినను హోమమును చేయవలయును. అనంతరమందు పావమానఋక్కులచే అభిషేకమును జేయవలయును. దోషశాంతికొఱకు పుణ్యకరములయిన వారుణసూక్తములను పఠింపవలయును. అంతట ధౌతవస్త్రములను తిలపుష్పాక్షతాదులను ధరించి బ్రాహ్మణులకుభోజనమును పెట్టవలయును. ఈవిధముగఁజేసినయెడల ఆయుఃకీర్తిధనబుద్ధులుకలుగును. మఱియును బల్లియును తొండయును స్పృశించినపుడు చేయఁదగినశాంతికర్మము ఈవిధముగా మునులచేతఁజెప్పఁబడెనని యెఱుఁగవలయును.) అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడియె.

వ్యా॥ దక్షేతి॥ దక్షాంగోదరనాభిపృష్ఠేషుపతితా పల్లీతథాహానుంస్యాత్ వరాంగే- ఉత్తమాంగేపతితాపల్లీ- నుః- నరస్య- శుభదాస్యాత్- ఉత్తమాంగేహానుంవినా సర్వత్రశుభేత్యర్థః - అర్థాదన్యత్రనశుభా - అన్యాంగేతు- పురఃపార్శ్వపృష్ఠేషు- నశుభాస్యాత్ ॥ అథస్త్రియాఃవిశేషమాహ ॥ స్త్రియాఃఇదంపురుషోక్తంవామేతరవ్యత్యయాజ్జ్ఞేయం- వామం- వామాంగం- ఇతరందక్షిణాంగం - తయోర్వ్యత్యయోవైపరీత్యం- తస్మాత్పురుషస్యదక్షాంగే యత్ఫలముక్తంతత్స్త్రియాః - వామాంగేజ్ఞేయం - పురుషస్యవామాంగేయదుక్తం తత్స్త్రియాదక్షాంగేజ్ఞేయ మిత్యర్థః - అర్థాద్యత్రాంగేవామేతరవిభాగా భావస్తత్రపురుషతుల్య ఫలంజ్ఞేయం- వరాంగేతూభయోస్సమానమేవఫలం వామదక్షిణఫలవిశేషాత్॥ సరటఫలమాహ ॥ ఇత్యాహుఃసరటప్రరోహణఫలమితి ఏవమేవాహుర్మ

